# గాంధిమహాత్ముని సమగ్ర చరిత్ర

## (అనేకాంగ్ల గ్రంథావలోకన ఫలితము)



గ్రంథకర్త:

వెలిదండ శ్రీనివాసరావు

# గాంధిమహాత్ముని సమగ్ర చరిత్ర

## (అనేకాంగ్ల గ్రంధావలోకన ఫలితము)



గ్రంధకర్త:

పెలిదండ శ్రీనివాసరావు




1957

[వెల: అయిదు రూపాయిలు.

# గ్రంథకర్త ఉపోద్ఘాతము

మహాత్ముని పావనచరిత్రనుగూర్చి అనేక యుద్గ్రంథము లాంగ్లములో గలవు. అవియన్నియు ఆంధ్రులకందరి కందుబాటులో నుండమిచే, అందలి ముఖ్యాంశముల నన్నిటిని సేకరించి, పూసగుచ్చినట్లు కాలక్రమానుసారముగ చేర్చి, మృదువైన శైలిలో ముప్పదియారు ప్రకరణముల ముత్యాలసరముగా గూర్చగలిగితి ననుకొనుచున్నాను. మఱియు, సాధారణముగా నందఱకును సంపూర్ణముగా దెలియని సంగతులెన్నియో ఇందు వివరముగా బొందుపరుపబడియున్నవి. మహాత్ముడు ఆయా సందర్భములలో తన యనుభవమునుబట్టి వెలిబుచ్చిన ధర్మసూత్రములు పాఠకులమనములను నిశితముగా హత్తుకొనునట్లు వ్యక్తపరుపబడినవి. నూతనభారతముతోబాటు ఆంధ్రప్రదేశముకూడ నవయుగకర్తయైన మహాత్ముని ఆదేశములపై ఆధారపడవలసియున్నందున, ఆరాష్ట్ర భావిభాగ్యకర్తలు కానున్న వివిధతరగతులలోని విద్యార్థులకు, ఈ యుద్గ్రంథములోని వివిధభాగములు పఠనీయగ్రంథములుగా నుండదగినవని భావించుచున్నాను.

ఈగ్రంథమును మహాత్ముని అడుగుజాడలలో నడయాడ గంకణము కట్టుకొనిన భారతప్రధాని శ్రీ జవహరులాలు నెహ్రూ మహాశయునికి అత్యంత భక్తిపురస్సరంబుగా అంకిత మొనర్చుచున్నాడను.

## FOREWORD

*by*

SRI TENNETI VISWANATHAM.

Sri Velidanda Srinivasarao is already well known to the Telugu country thrcugh his book "Bharata Swarajya Samara Charitra". His prose style follows smooth paths, and is easily understandable both to scholars as well as to the school children. The details, which have been collected together, show great care in the author. Events have been described in greater detail, wherever their importance has warranted narration. Whatever the number of books that may have been written on Gandhi's life, one would feel that something more has yet to be written. Therefore this book written by Sri Srinivasarao, fulfils a need for the reading public. It is greatly useful also to the historian.

I am glad to say that the book meets the wishes of all those that love Gandhiji.

| | కాలము | ప్రకరణము | శీర్షికలు |
|---|---|---|---|
| ప్రథమ భాగము | 1869-93 | 1 | బాల్యము, విద్య, వివాహము, ఉద్యోగము. |
| | 1893-96 | 2 | దక్షిణాఫ్రికాలో వృత్తి. |
| | 1896 | 3 | తిరిగి ఇండియాలో. |
| | 1896-1901 | 4 | తిరిగి దక్షిణాఫ్రికాలో రెండవసారి. |
| | 1902 | 5 | తిరిగి ఇండియాలో రెండవసారి. |
| | 1903-1908 | 6 | తిరిగి దక్షిణాఫ్రికాలో మూడవసారి. |
| | 1908-1914 | 7 | దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహ విజయము. |
| | 1914 | 8 | ఇండియాకు ప్రయాణము – ఇంగ్లాండులో యుద్ధారంభము. |
| | 1915 | 9 | ఇండియాలో తుదిసారి : ఆరంభ దినములు. |
| | 1915-18 | 10 | కాంగ్రెసుతో సంబంధము, మహాత్ముని విజయము. |
| | 1918 | 11 | దేశములో నూతన పరిస్థితులు. |
| | 1919 | 12 | పంజాబు దురంతములు. |
| ద్వితీయ భాగము | 1919 | 13 | కాంగ్రెసు చర్చలో మొదటిసారి పాల్గొనుట. |
| | 1920 | 14 | మహాత్మునిలో మార్పు. |
| | 1920-21 | 15 | మహాత్ముని అసహాయోద్యమము, రామరాజ్యము, త్రివర్ణ పతాకము. |
| | 1921 | 16 | అలీ సోదరులు, అసహాయోద్యమము. |
| | 1921-22 | 17 | శాసనోల్లంఘనోద్యమము. |
| | 1922-24 | 18 | రాజద్రోహ నేరము, శిక్ష, విడుదల. |
| | 1924-26 | 19 | హిందూముస్లిము కలతలు, కాంగ్రెసుఅధ్యక్షత, గౌహతికాంగ్రెసు |
| | 1927-29 | 20 | ఇర్విను ఆహ్వానము, సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము. |
| | 1930-31 | 21 | సంపూర్ణ స్వాతంత్ర్య ప్రయత్నము. |
| | 1931-33 | 22 | రౌండుటేబిలు కాన్ఫరెన్సులు. |
| | 1933-35 | 23 | వ్యక్తి సత్యాగ్రహము. |
| | 1935-37 | 24 | మహాత్ముని యితర వ్యాపకములు. |
| | 1937-39 | 25 | కాంగ్రెసు మంత్రిత్వముల కాలము. |
| తృతీయ భాగము | 1939-42 | 26 | యుద్ధము, ప్రభుత్వముతో సంప్రదింపులు. |
| | 1942-43 | 27 | క్రిప్సురాయబారము, ఆగస్టుతీర్మానము, నిర్బంధము. |
| | 1944 | 28 | కస్తూరిబాయిఅస్తమయము, మహాత్మునివిడుదల, జిన్నాతోసంభాషణ |
| | 1944-45 | 29 | వేవెలుతో వ్యవహారము. |
| | 1945-46 | 30 | మహాత్ముని దేశసంచారము. |
| | 1946 | 31 | కాబినెటు మిషను. |
| | 1946 | 32 | తాత్కాలిక ప్రభుత్వకాలము. |
| | 1947 | 33 | మహాత్ముని 1947 కార్యక్రమము. |
| | 1947-48 | 34 | భారత స్వాతంత్ర్యానంతరము. |
| | 1948 | 35 | మహాత్ముని చివరి పదిరోజులు. |
| | | 36 | మహాత్ముని నూతన సందేశములు. |

# గాంధి మహాత్ముని సమగ్ర చరిత్ర

## మొదటి ప్రకరణము

## బాల్యము - విద్య - వివాహము - ఉద్యోగము

### 1869 — 1893

1. మహాత్మా మోహనదాసు కరంచందు గాంధి శుక్లనామ సంవత్సర భాద్రపద బహుళ ద్వాదశీ శనివారము, ఉదయము సుమారు 7 గంటల 42 నిముషములకు, బొంబాయిరాష్ట్రములో చేరిన కధియావాడు సంస్థానములోని పోరుబందరు పురమున జననమందెను. ఇంగ్లీషు కాలమాన ప్రకారము గాంధీజీ జననము, ఆన 1869 వ సంవత్సరము అక్టోబరు 2 వ తేదీ పోరుబందరుపురము. పూర్వము సుదామపురమని పేరు వడసియుండెను. గాంధీజీ తల్లి పేరు శ్రీమతి పుత్తలీబాయి; తండ్రిపేరు శ్రీయుత కాబాగాంధి యను మారుపేరుగల కరంచందు గాంధి. గాంధి యను పదము వారి ఇంటిపేరు. ఆయనకు తల్లిదండ్రులు పెట్టినపేరు మోహనదాసు. ఆప్రాంతపు మామూలునుబట్టి ఒక్కొక్కని పూర్తిపేరు, అసలుపేరు, తండ్రిపేరు, ఇంటిపేరు కలిసిన వరుసలో నుండును. ఉదాహరణకు : గోపాలరావు- కృష్ణారావు, గోఖలే, గోఖలేగారి పూర్తిపేరు; బల్వంతరావు- గంగాధరరావు- తిలకు, తిలకు మహాశయుని పూర్తిపేరు. గాంధీజీ, గుజరాతులోని వైష్ణవసాంప్రదాయానుసారులైన వైశ్యకులమునకు చెందియుండెను. ఆరోజులలో నక్కడ అహింసకు ప్రాధాన్యమిచ్చుచుండిన జైనమతముకూడ వ్యాప్తిలో నుండెను. గాంధీజీ పూర్వులు తమ కులవృత్తియైన పచారుదినుసులను అమ్మట నవలంబించి యుండినను, చివరి మూడు నాలుగు తరములుగ కధియావాడునందలి కొన్ని చిన్న సంస్థానములకు మంత్రులుగా నుండిరి. గాంధీజీ తల్లి మిగుల దైవచింతను గలిగి, హైందవమతనియమములగు చాతుర్మాస్య, చాంద్రాయణాది వ్రతములను బాలించుచుండెను. గాంధీజీ తన శైశవమున పోరుబందరునందే అక్షరాభ్యాసమును బొందినను, సప్తవర్షప్రాయమున తనతండ్రి యుద్యోగము రాజకోటకు మార్పబడుటచే ఆయన మొదట అచ్చటి ప్రైమరీ స్కూలులో జేరవలసివచ్చెను. అప్పుడే ఆయనకును, ఆయన తండ్రి స్నేహితుడైన గోకులదాసు మాకంజీగారి పుత్రికయగు అదే వయస్సుగల కస్తూరిబాయికిని ప్రధానము మాత్రము జరిగెను. తరువాత గాంధీజీ తన పన్నెండవయేట అచ్చటి హైస్కూలులో ప్రవేశించెను. మొదటి సంవత్సరపు పరీక్ష సందర్భమున గవర్నమెంటు పరీక్షాధికారి వచ్చి ఇంగ్లీషు డిక్టేషను చెప్పుచుండగా, గాంధీజీ 'కెటిల్' అను ఇంగ్లీషు

పదమునకు వర్ణక్రమము తప్పుగా వ్రాయుచుండుటను కనిపెట్టిన పాఠశాల ఉపాధ్యాయుడు ప్రక్కనున్న వానిపలకను జూచి సరిగా వ్రాయుమని సైగచేసెను. పూవు పుట్టగనే పరిమళించునట్లు గాంధీజీ అపని తప్పు అని గ్రహించి అటుల జేయకుండెను. అట్టి చిన్నవయస్సునందే గాంధీజీ మనస్సులో రెండు గొప్ప ఆదర్శములు చిరస్థాయిగా పాదుకొనెను. అవి: శ్రవణుని పితృభక్తి, హరిశ్చంద్రుని సత్యనిరత. ఆ ఆదర్శములు ఆయన ఆయా నాటకములను బహుశ్రద్ధతో జూచియుండుటవలననే గాఢముగా నాటుకొనెను. ఆకారణమున గాంధీజీకి చిన్నతనమునుండియు, రాత్రియందు తన తండ్రిగారికి పరిచర్య చేయనిదే తాను నిదురించకుండుటయు, తన జీవితాంతమువరకు సత్యమునందంత పట్టుదల గలిగియుండుటయు సహజమయ్యెను.

2. గాంధీజీకి, హైస్కూలులో చదువుకొనురోజులలోనే తన పదమూడవ యేటనే, ఆవరకే ప్రధానమైన కస్తూరిబాయితో వివాహము జరిగెను. ఆరోజులలో బాల్యవివాహములు సాధారణములై యుండినను, ఖర్చు కలిసివచ్చునను కారణమున తండ్రిగారు జరుపవలసియుండిన మూడు వివాహములను ఒకేసారి జరుపవలసివచ్చెను. గాంధీజీ చిన్నతనముచే తన భార్యయెడల అమిత విషయాసక్తుడగుటయేగాక తన భర్త్రధికారమునుగూడ చలాయించుచుండెను. ఇటుల విద్యాభ్యాసముతోబాటు గృహస్థధర్మమునుకూడ నిర్వర్తించుచుండెను. అప్పుడప్పుడు దుష్టస్నేహితుల సహవాసముచే కొన్ని చెడ్డపనులు చేయవలసివచ్చుచుండెను. ఆరోజులలో బాలురలో కూడ పరప్రభుత్వమును పారదోలవలయునను భావము ఏర్పడియుండెను. ప్రభుత్వము చేయు దొరలు మాంసభక్షణముచేతనే బలముకలిగి మనలను పాలింపగలుగుచుండిరని వారి నమ్మకము. బడిపిల్లలాకాలములో ఈక్రిందిఅర్థముగల పద్యమును గుజరాతు భాషలో బాహాటముగా పాడుచుండెడివారు:-

> "తెల్లవాడు నేడు, నల్లవారినెల్ల, నాయనమ్ములను జేసినాడు. ఎందువలననగా, వాడుమాంసమును దినును. అందువల్లనేవాడు ఐదడుగుల పొడవైగూడనున్నాడు".

ఊహాప్రివాహములో పడిపోయిన కొందరు బాల్యస్నేహితుల ప్రోద్బలముచే గాంధీజీ ఒకదినమున మాంసభక్షణము చాటుగా జేయవలసి వచ్చెను. అయినను నెను వెంటనే మేల్కొనగలిగెను. మాంసపు విందునందు పాల్గొన్న రాత్రి, ఇంటియందు అన్నము సరిగాతినకుండుటచే కారణమడిగిన తల్లికి బొంకవలసివచ్చెను. బొంకుట తగనిపనియని రాత్రియంతయు తన మనస్సాక్షి శోధించుచుండెను. మరియు విందునకై చంపబడిన గొఱ్ఱెపిల్ల తనకడుపులో నేడ్చుచుండునట్లు కలలు కనుచుండెను. గాంధీజీ తరువాత నెప్పుడును మాంసమును ముట్టలేదు. వేరొక చెడ్డస్నేహితుడు గాంధీజీని

ఆచిన్నతనముననే వ్యభిచారమునకు దింపప్రయత్నించి విఫలుడయ్యెను. మరియొక స్నేహితునివలన సిగరెట్లనుకాల్చుదురభ్యాసమునకు లోనుగావలసివచ్చెను. వాటిని గొనుటకు డబ్బు కావలసియుండుటచే, తనయింటిలోనిడబ్బును దొంగిలించవలసివచ్చెను. కాని కొలదిదినములకే చౌర్యముచేయుట మిగుల అసహ్యముగా దోచి, తప్పును ఒప్పుకొనిన గాని తనకు మనశ్శుద్ధి కలుగదని తెలిసికొని, తనతప్పును తండ్రికి తెలియపరచుచు, తగినశిక్ష విధింపవలయునని కోరుచు, ఒకచీటినివ్రాసి తానే స్వయముగా ఆయనచేతి కిచ్చెను. అప్పుడు జబ్బుతో మంచముపట్టియున్న ఆతండ్రిలేచి, దానినంతనుచదివి మిక్కుటమైన ప్రేమవలన జనించిన కన్నీటిధారలచే ఆచీటిని తడిపివేసి, మారు మాటాడక శయనించెను. తండ్రి యొక్క ఉదారగుణమును గ్రహించిన కుమారుడు లోలోన సిగ్గుచే పశ్చాత్తప్తుడయ్యెను. గాంధీజీకి పదునారవఏడు వచ్చుసరికి ఒక కుమారుడు కలిగి పురిటిలోనే చనిపోయెను. ఆరోజులలోనే తండ్రికి జబ్బుఎక్కువగ నుండెను. ఒకరోజురాత్రి మామూలుగనే తండ్రికి కాళ్లుపట్టి, ప్రక్కనున్న పిన తండ్రి 'చాలు, పోయిపరుండుము' అనగా, భార్యయున్న తనగదిలోనికి బోయి పరుండెను. అంత గొంతసేపటికి నౌకరొకడు తనగదితలుపు తట్టగా గభాలున మంచమునుండి దుమికి, బయటికివచ్చిచూడగా తండ్రి మరణించినట్లు కనబడెను. అప్పుడాయనకు కలిగిన దుఃఖమునకు సిగ్గుకు మేరలేకుండెను. మృగప్రవృత్తి తనను కామాంధుని చేయకుండినయెడల ఆఖరుక్షణమున తన తండ్రిగారి మరణవేదనలో తాను పాలుగొని యుందునుగదా యని చాల విలపించెను.

3. గాంధీజీ 1887వ సం॥న అనగా తన పదునెనిమిదవ ఏట, అహమ్మదాబాదు సెంటరులో మెట్రిక్యులేషన్ పరీక్ష నిచ్చెను. తదుపరి భావానగరమునకు బోయి అచ్చటి శ్యామలదాసు కాలేజీలో ఆరు నెలలు మాత్రము చదివి, విసుగు జెంది తన రాజకోటకు మరలిపోయెను. అక్కడ వారికుటుంబ మిత్రుడైన "మావ్జీ దవే" యను బ్రాహ్మణ శ్రేష్ఠుడు, గాంధీజీ తెలివితేటలను తెలిసికొన్నవాడగుటచే, ఆయన ఇంగ్లాండులో బారిష్టరు బరీక్ష నిచ్చివచ్చి, తండ్రితాతల ఉద్యోగమగు దివానుగిరిలో ప్రవేశించుట మంచిదని తల్లిగారికిని పెద్దన్నగారికిని సలహా నిచ్చెను. అయినను, పెద్దన్నగారు అందుకు కావలసిన ధనమును సమకూర్చు విషయమునను తల్లిగారు ఆతని నొంటరిగ వదలియుండు విషయమునను అనుమానించుచుండిరి. చిట్ట చివరకు అన్నగారు ద్రవ్యమును సమకూర్తునని వాగ్దాన మిచ్చినను, అమ్మగారు మాత్రము గాంధీజీ ఇంగ్లండులో మకారత్రయమును, అనగా మద్యము, మాంసము, మహిళ, అను మూటిని ముట్టనని గట్టిగా ఒట్టు పెట్టించుకొనియే అనుజ్ఞ నిచ్చెను. అప్పటికి ఆవరకు పురిటిలో జనిపోయిన కుమారిని వెనుక కస్తూరీబాయికి మరియొక

బాలు డుదయించి యుండెను. కావున గాంధీజీ భార్యను పుత్రుని ఇంటికడనునిచి, పెద్దల ఆశీర్వాదములతో అన్నగారు వెంటరాగా రాజకోటనుండి బయలుదేరి స్టీమరెక్కుటకై బొంబాయి చేరెను. ఆ 1888 జూలై మాసములో సముద్రము ఒడుదుడుకులుగా గనపడుటచే, నవంబరు నెలలో నావప్రయాణము చేయదలచి బొంబాయిలో నుండిపోయెను. అన్నగారంతవర కక్కడ ఉండిపోవుటకు వీలులేనందున, ఆయన తన తమ్మునికి అచట తన స్నేహితు నొకనియింట బసనేర్పాటుచేసి ప్రయాణపు ఖర్చులకు గాను తెచ్చిన పైకమును అప్పుడా యూరిలోనే కాపురమున్న తన సోదరి భర్తవద్ద దాచి ఉద్యోగతొందరచే రాజకోటకు తిరిగిపోయెను. గాంధీజీ సముద్రయానము చేయబోవుచున్నాడను వార్త బొంబాయిలోని ఆయనకులమువారిలో కలవరమును కలిగించెను. అచ్చటి కులపెద్దలు ఆయనను వెలివేయదలచి ఒక పెద్ద సభను జరిపి ఆయన నాహ్వానించి, సీమలో ఆహారవిహారములను గూర్చిన, కులాచారములను సరిగా పాటించుటకు వీలుండదు గావున, అచటి కేగుటతగదని వారించిరి. అందులకు గాంధీజీ జవాబిచ్చుచు తాను తన కులాచారములను తప్పక పాటింతునని తనతల్లి కావరకె మాట ఇచ్చియుండినట్లు తెలియపరచెను. అయినను ఆ కులపెద్దలు ఆతనిని వెలివేయుటకును ఆతనికి సహాయము చేయువారికి పాలగ్రావదానమునకు సరియైన ఒక రూపాయపావలా చొప్పున జరిమానా విధించుటకును తీర్మానించిరి.

4. మొదట నవంబరు నెలలో ఓడ ప్రయాణము చేయదలచి యుండియు, గాంధీజీ ఆ 1888 సెప్టెంబరులోనే 4వ తేదీన బొంబాయినుండి బయలుదేరబోవు స్టీమరుపై తనకు ఎఱుకగల, జునగడు వాస్తవ్యుడు, త్ర్యంబకరావు మజుందారు అను వకీలొకడు బారిష్టరు పరీక్షకు చదువుటకై సీమకు బోనున్నాడని తెలిసికొని, ఆయనతో గలిసి పోదలచెను. తన బావగారివద్ద తన అన్నగారు తనకొరకై దాచియుంచిన పైకమును అడుగబోగా, ఆయన కులపెద్దల తీర్మానమునకు భయపడి, మాట్లాడుటకే నిరాకరించెను. కావున గాంధీజీ, కాలవ్యవధి లేమిచే, అక్కడ నొక తన కుటుంబ మిత్రునికడ చేబదులు పుచ్చుకొని, తరువాత తన అన్ననుండి వసూలు చేసికొనుమని నచ్చజెప్పి, వెంటనే బయనమైపోయెను. ఓడ ప్రయాణములో తాను తన వెంట తెచ్చుకొనిన చిరుతిండ్లను, పండ్లను, దినుచు, ఆ సెప్టెంబరు నెలాఖరునకు ఒక శనివారమున సౌతాంప్టనురేవు చేరెను. గాంధీజీ తనతో, లండనులోని అప్పటి భారతీయ నాయకులగు డాక్టరు మెహతా, దళపతిరాం శుక్లా, దాదాభాయి నౌరోజీ మున్నగువారలకు సిఫారసు ఉత్తరములను దెచ్చుకొని యుండెను. కావున ఆరేవు చేరినవెంటనే, ముందుగా మెహతాగారికొక తంతినంపి, తాను, తనవెంట వచ్చిన మజుందారుగారితో కలసి, లండను నగరమునకరిగి, అచ్చటి విక్టోరియా హోటలులో

బలచేసెను. తంతినందుకొనిన మెహతాగారు మరునాడు ఆదివారము రాత్రి ఆహోటలులో గాంధీజీని కలిసికొని, ఆదరించి ఇంగ్లండులో ఆయన అనుసరించవలసిన యున్న కొన్ని హితవులను తెలిపెను. అవి : ఇతరుల వస్తువులను తాకకుండుట, ప్రథమ పరిచయమున యెవరిని ప్రశ్నలు వేయకుండుట, బిగ్గరగామాట్లాడకుండుట, ఇండియాలోవలె ప్రతివారిని "సార్"అని సంబోధించకుండుట : ఏలననగా 'సార్'అను పదమును ఇంగ్లాండులో తాబేదారులు మాత్రమే అధికారులయెడల ఉపయోగింతురు. మరియు, హోటలులలో అధికవ్యయమగును గాన, యేదోయొక సామాన్య కుటుంబములో ఖర్చునిచ్చు అతిథిగా ప్రవేసింపుమనికూడ సలహానిచ్చెను. అట్టి ఆచారమచట గలదు. ఆ సలహా ప్రకారము గాంధీజీ అమరునాడు సోమవారమున హోటలుబస విడిచి, మజుందారుగారితో కలిసి వేరొకచోట యిద్దరును చెరియొక అద్దెగదిని మాత్రమే తీసికొన గలిగిరి. ఆరాత్రి మెహతాగారు మరలవచ్చి, గాంధీజీని తన ఆంగ్లేయ మిత్రునికుటుంబములో బసచేయుటకు తీసికొనిపోయిరి. అక్కడ గాంధీజీ తన శాకాహారము ననుసరించి ఉదయమున ఓటుపిండి జావ, మధ్యాహ్నము, సాయంకాలము మురబ్బా, ఆకుకూర రొట్టె మాత్రము భుజించుచుండెను. ఆకుటుంబ యజమాని మాంసాహారమును ప్రోత్సహింప మొదలిడెను. కాని, గాంధీజీ లాంగక ఒకనెలరోజులైన వెనుక తాను అక్కడనున్న దళపతిరాం శుక్లాగారికికూడ ఒక సిఫారసు ఉత్తరమును దెచ్చుకొని యున్నందున ఆయనను సమీపించి, ఆయన సహాయమున లండనుకు చేరువుగానున్న వెస్టుకెన్ సింగ్టన్ లోని యొక ఆంగ్లో ఇండియను కుటుంబములో బసను సంపాదించుకొనగలిగెను. అచ్చట శుక్లాగారు తనకు బంపుచుండిన వార్తాపత్రికలను జదువుకొనుచు బారిష్టరుకోర్సు మొదలుపెట్టులోపల కాలము వెళ్ళబుచ్చుకొనుచుండెను. మరియు, మాంసములేని దుకాణములకై అందందు వెదకుచు నొకదినమున ఫారింగ్ డన్ వీధిలో నొక శాకాహారాలయమును కనుగొనెను. అచట బయట నమ్మబడుచుండిన "సాల్టు"దొరగారు వ్రాసిన 'ప్లీ ఫర్ వెజిటేరియానిజం' అను గ్రంథమునుకొని లోనికిబోయి మొదటిసారి తృప్తిగా భోజనము చేయగలిగెను. అతరువాత కొలది దినములకు 'హోవర్డు విలియమ్సు'గారు వ్రాసిన 'ఎథిక్సు ఆఫ్ డయటు' అను గ్రంథమును డాక్టరు 'అనాకింగ్సుఫర్డు' అను నామెవ్రాసిన 'ది పర్ ఫెక్టు వే ఇన్ డయటు' అను గ్రంథమును, డాక్టరు 'అల్లిసన్'గారు ఆరోగ్యమునుగూర్చి వ్రాసిన గ్రంథములను, బాగుగా జదివెను.

5. ఇట్లు సుమా రొకనెల గడచినవెనుక నవంబరు 6 వ తేదీన విద్యార్థి దశను ప్రారంభించెను. బారిష్టరు పట్టాను మాత్రమే గాక మరియొకదానినిగూడ సంపాదింప దలచి, దానితోబాటు లండను మెట్రిక్యులేషన్ కు కూడ చదివి, అందు ముందుగ

కృతార్థు డయ్యెను. గాంధీజీ తన విద్యావ్యాసంగముతోబాటు ఇతర వ్యాసంగము లనుగూడ గలిగియుండెను. అవి: ఆర్థికదృష్టికి, ఆరోగ్యదృష్టికిని సంబంధించినవి. ఆయన కొంతకాలమునకు తానాసమయమున నివసించుచుండిన బేసువాటర్ పేటలో శాకాహారక్లబ్బును స్థాపించెను. దాని కచ్చటి 'వెజిటేరియను' పత్రికాధిపతిని అధ్యక్షునిగను, భగవద్గీతను గేయరూపమున ఆంగ్లానువదించిన సర్ ఎడ్విన్ ఆర్నాల్డు గారిని ఉపాధ్యక్షునిగను జేసి తాను కార్యదర్శిగ నుండెను. మరియు అక్కడ నావరకుండిన శాకాహార సంఘ కార్యనిర్వాహకసభలో గాంధీజీ ఒక సభ్యుడుగా కూడ నెన్నుకొనబడెను. ఒకనా డాసంఘ పుసభలో నొక క్లిష్టసమస్య చర్చకు వచ్చెను. అది: ఆ కార్యనిర్వాహక సభ్యులలో నొకరు ఆ సంఘోద్దేశములతో నేమాత్రము సంబంధములేని సంతాననిరోధక పద్ధతులనుగూర్చి తనకుగల అభిప్రాయములను పాటకపుజనులకు బోధించుచుండెను. అట్టి పద్ధతులు నీతిమూలచ్ఛేదకరము లని ఆ సంఘాధ్యక్షుని నమ్మకము. ఆకారణమున ఆసభ్యుని ఆసంఘమునుండి వెడలగొట్టవలయునని ఆయన పట్టుబట్టెను. కాని గాంధీజీ అభిప్రాయము: ఆసంఘోద్దేశమునకు సంబంధించని విషయమునందుగల అభిప్రాయభేదమును పురస్కరించుకొని ఆసభ్యుని వెడలగొట్టదలచుట సబబుకాదనుట. మిగిలినవారు తన యభిప్రాయముతో నేకీభవించనందున తానే తన సభ్యత్వమును వదలుకొనెను. గాంధీజీ సీమలోనున్న ద్వితీయ సంవత్సరాంతమున అనగా 1889 అఖరున అచటి 'థియసాఫికలు సొసైటీ' సభ్యు లిరువురు తనకు పరిచితులైరి. వారికి సంస్కృతమురాదు. వారు భగవద్గీత ఇంగ్లీషు అనువాదమును జదివియుండిరి. సంస్కృతమూలమునకును, ఆంగ్లానువాదమునకును భేద మెచ్చటనైన కలదేమోనని తెలిసికొనుటకై వారు గాంధీజీని మూలమును చదువుచు తెలుపుమని కోరిరి. ఆయన ఇండియాలో మెట్రిక్యులేషను పరీక్ష అఖరువరకు సంస్కృతమునే ద్వితీయభాషగా పఠించియుండినను ఆ జ్ఞానము చాలదేమో యని మొదట సందేహించి, చివరకు వారి కోర్కెను నెరవేర్చెను. ఆ చదువునప్పుడు గాంధీజీకి రెండవ అధ్యాయములోని 62, 63 శ్లోకములు మనసున గట్టిగా నాటుకొనెను. వాటిధ్వని అనునిమేషము, అంత్యకాలమువరకు ఆయన చెవిలో ఝుమ్మని మారుమ్రోగుచుండెను. ఆశ్లోకములు మానవుని అథఃపతితమున కీడ్చు సప్త అధస్సోపానములను వ్యక్తపరచుచుండెను. ఆశ్లోకములు:

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః । సంగ స్తేషూపజాయతే
సంగాత్ సంజాయతేకామః । కామాత్ క్రోధోభిజాయతే
క్రోధాద్భవతిసమ్మోహః । సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో । బుద్ధినాశా, త్ప్రణశ్యతి॥

అనగా, మానవుడు మొదట తన త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, అను పంచజ్ఞానేంద్రియములద్వారా సృష్టిలోని పృథివ్యాది పంచభూతములయొక్క గుణములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచవిషయములను సదా ధ్యానించుచున్నచో మొదటవాటియందు ఆసక్తికలుగును; ఆఆసక్తివలన దానిని పొందవలయునను కోరిక పుట్టును. కోరిక సఫలము కానప్పుడు కోపమువచ్చును. కోపమువలన వివేకముపోవును. అట్టి అవివేక స్థితివలన మఱపు ఏర్పడును. మఱపువలన బుద్ధినాశన మేర్పడును. బుద్ధిపోవుటతో మానవుడు పూర్తిగా చెడిపోయి అథఃపతితుడగును. భగవద్గీతను ఆంగ్లానువదించిన ఆర్నాల్డుదొరగారు 'లైటు ఆఫ్ ఏషియా' యను బుద్ధభగవానుని చరిత్రనుకూడ వ్రాసియుండిరి. ఆయన గాంధీజీని లండనులోని బ్లావటుస్కీ భవనమునకు గొనిపోయి, మాడంబ్లావటుస్కీ ఆనెబిసెంటుగారలకు పరిచయ మొనరించెను. ఆరోజులలోనే గాంధీజీ బైబిలునుగూడ జదివి, జీససుబోధించిన సెర్మనుఆన్‌దిమౌంటుకు ముగ్ధుడయ్యెను. మఱియు, 'కార్లైలు' వ్రాసిన "హీరోస్ అండ్ హీరోవర్షిప్" గ్రంథమును జదివి మహమ్మదు ప్రవక్తయొక్క ప్రజ్ఞానమును గ్రహించెను. అంత గొంతికాలమున కొకసారి పారిసునగరమున నొక గొప్పసంత జరుగునని తెలిసి అచటికేగెను. అచటి 'ఏఫిలుటవరును దిలకించినప్పుడు, దానిని ఆకాశసౌధమని తృణీకరించి, ఆసందర్భమున మత్తుపదార్థమగు పొగచుట్టను త్రాగువారు తమమనస్సులలో అట్టి ఆకాశసౌధములను నిర్మించుకొన జూతురని బల్కిన టాల్‌స్టాయి వాక్యములు ఆయనకు జ్ఞప్తికి వచ్చెను.

6. గాంధీజీ ఇంగ్లండులో మూడుసంవత్సరముల బారిష్టరు విద్యను ముగించి 1891 జూను 10 వ తేదీన పట్టాను బొంది, మరునాడు ఇంగ్లాండు హైకోర్టులో తన పేరు రిజిష్టరీ చేయించుకొని, ఆ మరునాడు అనగా 12 వ తేదీన ఇండియాకు తిరుగు ప్రయాణమై జూలై నెలమధ్య బొంబాయి చేరెను. ఓడ బొంబాయిరేవులో దిగినవెంటనే, అన్నగారచ్చటికిరాగా గాంధీజీ అమ్మ సెప్పుడు జూతునాయని తన మనస్సువ్విళ్ళూరుచున్నట్లు ఆతురతతో దెలిపెను అన్న తాను సీమలో నున్నపుడే మన్నైపోయెనని చెప్పినవెంటనే కడుదుఃఖించి, వెంటనే మైలస్నానము చేసెను. తరువాత అన్నదమ్ము లిరువురు అప్పుడు బొంబాయిలో నుండిన డాక్టరు మెహతాగారి కోరికపై ఆయన గృహమున అతిథ్యమొందిరి. అప్పుడే మెహతాగారి బంధువును సుప్రసిద్ధ సంస్కారియునైన రాజచంద్ర కవిగారితో గాంధీజీకి పరిచయము కలిగెను. గాంధీజీ అన్నగారితో గలిసి, రాజకోటకు బోయిన వెనుక, ఆయన వకీలు ప్రాక్టీసుకు గావలసిన ఏర్పాట్లనన్నియు, అన్నగారే చేయుచుండెను. ఇంతలో సముద్రయానమును జేసినందుకై గాంధీజీకి, కులపెద్దల బహి

ష్కారము అమలులోనికి వచ్చెను. అకులము వారప్పుడు రెండు పక్షములై ఒక పక్షమువారు గాంధీజీ 'నాసిక' వద్ద గోదావరిలో స్నానము చేసినవెంటనే కలుపుకొనిరి. తనను కలుపుకొనని రెండవపక్షము వారిపై గాంధీజీ కిసుమంతయు ఈసుజనించలేదు. క్రమక్రమముగా బహిష్కారము సమసిపోయెను. గాంధీజీ మొట్టమొదటనే రాజకోటలో ప్రాక్టీసు పెట్టుటకు సంకోచించి, ముందుగా బొంబాయి హైకోర్టులోని పెద్దలాయర్లవద్ద కొంత అనుభవమును సంపాదించుకొని రాదలచెను. ఆ ప్రకారము ఆయన ఆరునెలలు బొంబాయిలో గడపెను. అక్కడనుండగా నొకదినమున స్మాలుకాజు కోర్టులో ప్రతివాది తరపున వాదించుటకు తనకొక కేసువచ్చెను. ఎదుటిపక్షపు సాక్షులను క్రాసుపరీక్ష చేయుట చేతగాక, ఆకేసును అప్పుడక్కడ వకీలుగనున్న పటేలుగారికి వప్పజెప్పుమని తన క్లయింటుతో జెప్పి, తనకిచ్చిన ఫీజును పూర్తిగా తిరిగి ఇచ్చివేసెను. ఇటుల ఆరునెలలు బొంబాయి హైకోర్టులో గడపి, ఆవెనుక రాజకోటకుబోయి అక్కడ ప్రాక్టీసు నారంభించెను. ఆరోజులలో తన అన్నగారిపై అన్యాయముగా ఇతరుల మాటలను నమ్మి, ఆ సంస్థానముల పొలిటికలు ఏజంటుగానున్న దొరగారు, ఆగ్రహమును వహించియుండిరి. ఆదొరగారు తనకు ఇంగ్లండులో పరిచితుడై యుండియుండుటచే, గాంధీజీ నిజస్థితిని తెలుపదలచి అన్నగారి తరఫున, ఆయనను చూడబోయెను. ఆ దొరగారు పూర్వమైత్రిని మరచి, అధికారమత్తతచే అగౌరవముగ బ్రవర్తించి గాంధిజీని తన నౌకరుచే మెడబట్టి గెంటించెను. అప్పుడు అకస్మాత్తుగా పనిమీద రాజకోటకు వచ్చియుండిన సర్ ఫిరోజిషా మెహతాగారి కీసంగతిని గాంధీజీ స్వయముగా దెలుపగా, ఆయన ఇంగ్లాండులోని స్నేహితులు ఇండియాకు ప్రభుత్వాధికారులుగ వచ్చినపుడు మారిపోదురని ఎఱుకపరచెను.

---o---

## రెండవ ప్రకరణము

# దక్షిణాఫ్రికాలో వృత్తి

## 1893 — 96

7. రాజకోటలో గాంధీజీ ప్లీడరీవృత్తి సాగించుచుండగా, ఆయన అన్నగారికి పోరుబందరు కాపురస్తుడు, మహమ్మదీయ వ్యాపారస్తుడొకడు తనకు దక్షిణాఫ్రికాలో వ్యాపారమున్నదనియు, ఆసందర్భమున అచటి కోర్టులో, పెద్దదావా యొకటి కలదనియు, బారిష్టరు ప్యాసయియున్న ఆయన తమ్ముని తన తరఫున అక్కడికి పంపించవలసినదనియు కోరుచు ఉత్తరము వ్రాసెను. ఆకారణమున అన్నగారి సలహాపై గాంధీజీ దక్షిణాఫ్రికాకు పోదలచియుండెను. అప్పటికి ఆయనకు మరి యొక కుమారుడుకూడ జనించియుండెను. కావున తన ఇరువురు పుత్రులను, భార్యను వదలి, మరల నొక సంవత్సరములో కలియుదమని వారల నూరడించి, 1893 సంవత్సరము ఏప్రిలు మాసములో బయనమయ్యెను. ఆయన బొంబాయిలో ఎక్కిన ఓడ, దోవలో 'లామూ' అను రేవులో నాలుగుగంటలాగగా, గాంధీజీ కొందరు ప్రయాణీకులతో గలిసి ఊరు చూడబోయెను. తిరిగి వచ్చుసరికి రేవు అల్లకల్లోలముగ నుండెను. అందువలన పెక్కు ప్రయాణికులొక్కసారి ఒక చిన్ననావను కుదుర్చుకొని ఎక్కి ఓడనిచ్చెనను జేరబోవుసరికి టైము అయిపోవుటచే, ఆ నిచ్చెన ఎత్తివేయబడెను. అంత ఓడపైనున్న ఒక మిత్రుని సలహాపై గాంధీజీ వేరొక తేలికైన చిన్ననావ నెక్కి, ఓడమోకును సమీపించి దానిని బట్టుకొని పైకి ప్రాకెను. ఆవెంటనే ఆయోడ బయలుదేరెను. ఆఓడ చివరకు మే నెలాఖరున 'నేటాలు' రేవుపట్టణమైన 'దర్బాను' నగరమును జేరెను.

8. దర్బానులో, పోరుబందరు మహమ్మదీయ వ్యాపారస్తుని ఏజంటు, అబ్దుల్లా సేటుగారు, రేవుకు వచ్చి గాంధీజీని తనబసకు తీసుకొని వెళ్ళెను. ఆ వ్యాపారస్తుని వ్యవహారపు దావా, 'ట్రాన్సువాలు'లోని 'ప్రిటోరియా' కోర్టునందుండెను. కావున గాంధీజీ అక్కడికి బోవలసియుండెను. ఈలోపున, ఆ అబ్దుల్లా సేటుగారు, గాంధీజీని, ఆయన ధరించియుండిన కోటు, తలపాగా దుస్తులతో దర్బాను మేజస్ట్రీటు కోర్టును జూపుటకై తీసికొనివెళ్ళి, కోర్టులోని వకీళ్ళమధ్య కూర్చుండబెట్టెను. ఆ మేజస్ట్రీటు గాంధీజీని నఖశిఖ పర్యంతము పారజూచి, తలపాగాను తీసివేయమని యాజ్ఞాపించెను. కారణమేమనగా, దక్షిణాఫ్రికాలోని హిందువులు మొదట కూలికి వలసవచ్చిన వారగుటచేత, అట్టి కూలిజాతికి జెందిన వారెవరును, మర్యాద సూచకమైన తలపాగాను ధరించుట కనర్హులని అక్కడి తెల్లదొరల అభిప్రాయము. మహమ్మ

దీయులు, పారశీకులు, క్రిస్తవులు, హిందూమతేతరులగుటచే, అట్టివారు మాత్రము ధరించవచ్చును. గాంధీజీ మేజస్ట్రీటు అజ్ఞను నిరాకరించి, బయటికి వెడలిపోయెను. ఇది ఆయనకు దక్షిణాఫ్రికా అధికారులతో ఆరంభమైన మొదటి తగవు. అచ్చటి హైందవ కూలీలు 1860 వ సంవత్సరము మొదలు అప్పుడప్పుడు ఇండెంచర్డు కూలీలుగా అయిదేండ్ల యగ్రిమెంటుతో, నెటాలు ప్రదేశమున, అక్కడి తెల్లదొరల బంగారు గనులలోను, చెఱకు మొదలగు తోటలలోను పనిచేయుటకు గాను కుదుర్చుకొనబడిన వారగుటచే, ఆ 'యగ్రిమెంటు' పదము 'గిర్మిటియా' యని ఆ భాసమొంది, ఆ కూలీలు గిర్మిటియాలని కూడ పిలువబడుచుండిరి. దర్బాను మేజస్ట్రీటు కోర్టులో గాంధీజీ తలపాగాను గురించి జరిగిన యుదంతమంతయు నలుగడల వ్యాపించెను. ప్రఖ్యాత పత్రికలు సంపాదకీయములు వ్రాసెను.

9. దర్బాను చేరిన వారము దినములలో 'ప్రెటోరియా' లోని అబ్దుల్లా కంపెనీ వారి వకీలుకద్ద నుండి గాంధీజీ అక్కడికి రావలసినదని, వారి ఏజంటుకు జాబు వచ్చెను. వెంటనే గాంధీజీ మొదటి తరగతి టిక్కెట్టు కొని, రైలుపై బయనమయ్యెను. ఆ రైలు నెటాలు, ముఖ్యపట్టణమగు 'మేరిట్సుబర్గు' స్టేషనును, రాత్రి తొమ్మిదిగంటలకు జేరెను. రాత్రిళ్ళు పరుండుటకు, రైలు అధికారులు, ప్రత్యేక ఛార్జిపై, పరుపులనిత్తురు. అందుకై ఆ రైలు అధికారులు ప్రయాణస్థుల కోరికలను తెలిసికొనుటకై వారిని ప్రశ్నింతురు. ఆ అధికారి యొకడు వేసిన ప్రశ్నకు, గాంధీజీ తనకు పరుపు అక్కరలేదని చెప్పుచుండగా, ఆరైలులోనే ప్రయాణము చేయుచుండిన తెల్లబాటసారి యొకడు, గాంధీజీని ఎగాదిగా చూచి, ఆయన నల్లవాడగుటచే ఓర్వలేక, బండిదిగి, ఇద్దరు రైల్వే ఉద్యోగస్థులను దెచ్చి, వారిచే ఆయనను మూడవ క్లాసు బండిలోనికి బంపివేయ బ్రయత్నించెను. గాంధీజీ, తనకు ఫస్టుక్లాసు టిక్కెట్టు కలదనియు, కాన తాను బోననియు పట్టుపట్టెను. అంతనా రైల్వే ఉద్యోగస్థులు పోలీసు నొకనిని తెచ్చి, అతనిచే గాంధీజీని బయటకు లాగించి, ఆయన సామానులను గూడ క్రిందబడవేయించిరి. గాంధీజీ చేయునదేమియు లేక, ఆరాత్రినంతను చలిలో ఆస్టేషనులో గడపెను. మరునాడుదయమున, తనకు రాత్రి జరిగియుండిన చర్యను గురించి, రైల్వే జనరలు మేనేజరుకు ఒక పెద్ద టెలిగ్రామును బంపెను. ఆమేనేజరు 'గాంధీగారికి ప్రయాణసౌకర్యమును చూడుము' అని స్టేషను మాస్టరుకు అజ్ఞను బంపి, ఆరాత్రి రైలులో ఒక ప్రత్యేక ఫస్టుక్లాసు బెర్తును కూడ సిద్ధము చేయించెను. అంత గాంధీజీ ఆ బండిలో నెక్కి, పరుండుటకు పరుపు టిక్కెట్టును గూడ గొని సుఖముగా నిద్రబోయి, మరునాడుదయమగు సరికి ఛార్లెసు టౌనుస్టేషను జేరెను. ఆ స్టేషను నుండి జోహాన్సుబర్గు స్టేషను వరకు, రైల్వేకంపెనీ గుఱ్ఱపుకోచి బండిపై

బోవలసియుండెను. గాంధీగారివద్ద నున్న ఫస్టుక్లాసు టిక్కెట్టు దానికిని అన్వయించును. అయినను, అకోచి ఉద్యోగస్థుడైన తెల్లదొరగారు, గాంధీజీకి బండిలోపల చోటునీయక, ఆయన కూలీజాతికి చెందినవాడని, బయట బండితోలువాని పక్క సీటులో కూర్చొనబెట్టెను. బండి మరియొక స్టేషను జేరినవెంటనే, ఆ దొరగారు చుట్టగాల్చుకొనుటకై, బండిలోనుండి బయటికి వచ్చి, తాను కూర్చుండుటకై గాంధీజీని లెమ్మని, బండితోలువాని కాళ్లకడ నొక చింకిగోనెను బరచి, దానిపై అయనను గూర్చొనుమనెను. గాంధీజీ నిరాకరించుటచే ఆ ఉద్యోగస్థుడు ఆయన గూబపై గట్టిగా గొట్టి ఆయనను బలవంతముగా లాగజొచ్చెను. ఈ దుండగీడు తనమును గనుచుండిన బండిలోని బాటసారులు కొందరు ఆ దొరగారిని నిందింపగా ఆయన విధిలేక బండితోలు వాని రెండవ ప్రక్క సీటుపై గూర్చున్న వారి తాలూకు నౌకరును ఆ చింకిగోనెపై గూర్చుండబెట్టి తానాసీటుపై గూర్చుండి చుట్టగాల్చుకొనవలసి వచ్చెను. ఆ సాయంతనమున కౌ గుఱ్ఱపుబండి 'స్టాండర్టన్' స్టేషను మజిలీచేరి అక్కడ ఆగిపోయెను. తరువాత ప్రయాణమునకు వేరొక గుఱ్ఱపు కోచిబండి మరునాడుదయమున నే బయలుదేరును. ఆస్టేషనులో అబ్దుల్లా సేటుగారి మనుష్యులు గాంధీజీకి స్వాగతమిచ్చిరి. గాంధీజీ గత గుఱ్ఱపుబండి ప్రయాణములో తనకు జరిగియుండిన అవమానమును గూర్చి ఆ బండ్లకంపెనీ యధికారికి పెద్ద ఉత్తరమొకటి వ్రాసిపంపెను. ఆ యధికారి వెంటనే జవాబు వ్రాయుచు ఆస్టేషను నుండి మరునాడు బయలుదేరు బండిలో ఆయన లోపలకూర్చుండుటకు ఏర్పాటుచేసినట్లు తెలియపరచెను. ఆకారణమున గాంధీజీ ఆ బండిలో సురక్షిత ప్రయాణముజేసి రాత్రి సరికి 'జోహాన్సుబర్గు' స్టేషను జేరెను. అక్కడనుండి మరునాడు ప్రిటోరియాకు రైలుపై బోవుటకు ఒక ఫస్టుక్లాసు టిక్కెట్టు కొని ప్రయాణము సాగించెను. రైలు మరియొక స్టేషను చేరగానే, గార్డు టిక్కెట్లను సోదాచేయవచ్చి గాంధీజీని ఎగాదిగా పరికించి చూచి ఆయన అక్కడి కూలి జాతికి చెందినవాడని ఉహించి, మూడవక్లాసు బండిలోనికి బొమ్మనెను. దైవవశాత్తు, గాంధీజీ ఎక్కిన మొదటి తరగతిపెట్టెలో ఒక తెల్లదొర మాత్రమే యుండెను. ఆయన గార్డును మందలించి, తన కభ్యంతరము లేదని తెలియబరచెను. ఆగార్డంతట విసుగుజెంది, 'కూలీతో గూర్చుండుటకు నీకవమానము లేనిచో నాకేనా మరి?' అని సణగుకొనుచు వెడలిపోయెను. ఆరైలు రాత్రి 8 గంటలకు 'ప్రిటోరియా' నగరము చేరెను.

10. గాంధీజీ ఆమరునాడు అబ్దుల్లా కంపెనీవారి వకీలైన బేకరుదొరగారిని గలిసికొని, దావాను గురించిన అంశముల నన్నింటిని సమగ్రముగా తెలిసికొనెను. బేకరుదొరగారు క్రైస్తవమతబోధకుడు కూడ నగుటచే, గాంధీజీతో తన మతాధిక్య

తను గూర్చి అప్పుడప్పుడు చర్చలు జరుపుచుండెడివారు. మానవుడు పాపము చేయకుండ ఉండ నేరడనియు, కావున ఆ పాప భారమును ఏసుపై వేసి, ఆయనను నమ్మియుండినంతమాత్రమున ఆయనయే మోక్షమును సమకూర్చుననియు దెలుపుచుండెను. గాంధీజీ కావాదము నచ్చలేదు. ఎవరైనను పాపకార్య మొనర్చి దాని ఫలము తనకు తగలకూడదని ప్రార్థించుట తగనిపనియనియు, పాపకర్మమునుండి, పాపప్రవృత్తి నుండి విముక్తు డగుటకు తాను ప్రయత్నించవలయుననియు, అట్టిది చేకూరువరకు మానవుడు అశాంతుడై యుండుటయే తగినపనియనియు, గాంధీజీ వాదించుచుండెను. గాంధీజీ అక్కడి భారతీయ వర్తకుల నందరిని ఒక్కచో జేర్చి, 'సత్యమునకును, వర్తకమునకును సంబంధములేదు' అను మామూలు అభిప్రాయము మంచిదికాదని విన్నవించెను. ఆ ట్రాన్సువాలు రాష్ట్రములో భారతీయులు నివసించుటకు ఆబోయరు రాష్ట్రపుచట్టములనుబట్టి కొంతపన్ను కట్టవలసియుండెను. మరియు వారల కచట ఓటు అధికారముకూడ లేదు. భారతీయేతరులై చైనా మొదలగు అన్యదేశీయులైన వారిమీద మరికొన్ని నిబంధన లుండెను. అట్టి అన్యజాతులవారు రోడ్ల రహదారిలో నడువరాదు; మరియు రాత్రిళ్లు బయట తిరుగరాదు. ఈ నిబంధనలను అచ్చటి యధికారులు అప్పుడప్పుడు భారతీయులపై గూడ బ్రయోగించుచుండిరి. గాంధీజీ తనకీ ఇబ్బంది కలుగకుండ, అక్కడి ప్రభుత్వమువారి వకీలువద్దనుండి ఒక సర్టిఫికెటును సంపాదించి యుంచుకొనెను. అయినను, ఒకనాడు గాంధీజీ ప్రెసిడెంటు క్రూగరు నివసించు వీధిగుండ రహదారిపై మామూలుగ నడచి పోవుచుండగా, అచట క్రొత్తగా నియమితుడైన పోలీసొకడు అకస్మాత్తుగా మీదికివచ్చి, తన్ని అవలకు తగిలివైచెను. దీనిని దూరమునుండి చూచిన, ఆయన తెల్ల స్నేహితు డొకడు ఆపోలీసుపై కోర్టులో చర్య తీసికొనవలసినదని సలహా నివ్వగా, గాంధీజీ తా నెన్నడు తననుగురించి కోర్టుకు బోవుట ఇష్టములేదని బదులుచెప్పెను.

11. గాంధీజీ 'ప్రిటోరియా'లో అబ్దుల్లా సేటుగారి దావాను గురించి ఒక సంవత్సరము గడపెను ఆదావా ఆయనకు రావలసిన ఆరులక్షల రూపాయీల బాకీకి సంబంధించినది. ప్రతివాదులు వారికి దగ్గరబంధువులు. లెక్కలనన్నిటిని బరిశీలించగా బాకీ నిజమని ఇరుకక్షులవారును ఒప్పుకొనిరి. ఇంక కోర్టులో ఏవిధముగా తేలునో అన్న విషయముపై గాంధీజీకి అనుమానము లేకయుండెను. ఏలననగా యదార్థ విషయమే ముఖ్యాలిక 'లా' అను న్యాయము కలదు. ఇంకను కోర్టులో వ్యవహారమును జరిపించినచో వాది ప్రతివాదు లిద్దరును, అత్యధిక ధనవ్యయముతోను, కాలహరణములోను చెడిపోదురనియు, ఒకరినొక రోడించుటకు లాయర్లు 'లా' వెదకుట సహజమనియు, వారికి బోధించి రాజీ కుదిర్చెను. ఆరాజీ ననుసరించి ప్రతివాదులు

దీర్ఘవాయిదాలమీద సొమ్ము నంతను చెల్లించుటకు ఒప్పుకొనిరి. గాంధీజీ 'ప్రిటోరియా'లో నున్న కాలములో అనేక క్రైస్తవ మతగ్రంథములనేగాక, 'సేలు' దొరగారు వ్రాసిన కొరాను అనువాదమును, బొంబాయినుండి రాజచంద్రకవిగారు పంపిన 'పంచీకరణము', 'మణిరత్నమాల', 'యోగవాసిష్టము', 'షడ్దర్శనసముచ్చయము' మొదలగు గ్రంథములనుగూడ చదివియుండెను.

12. గాంధీజీ తాను వచ్చిన దావాపని ముగియుటచే ఇంక ఇండియాకు తిరిగి రాదలచి 1893 సంవత్సరాంతమున నెటాలులోని డర్బానుపట్టణము చేరెను. అక్కడ ఆయనకు అబ్దుల్లా సేటుగారు రొకవిందు నేర్పాటుచేసిరి. ఆవిందులో నుండగా, గాంధీజీ ఒక వార్తాపత్రికను చదువుట సంభవించెను. అందు 'ఇండియన్ ఫ్రాంచైజు' అను శీర్షికగల వ్యాసమును వీక్షించి, నెటాలుశాసనసభకు సభ్యుల నెన్నుకొను, ఆవరకు భారతీయులకుండిన, హక్కును తొలగించుటకై ఒకబిల్లు వెంటనే ఆసభలో చర్చించబడనున్నదని తెలిసికొనెను. ఆసంగతిని విన్న అచటి భారతీయులెల్లరు, ఆబిల్లును ప్రతిఘటించుటకై గాంధీజీని అచట కొంతకాల ముండుమని బ్రతిమాలిరి. గాంధీజీ వారికోరిక ననుసరించి ఒకనెల దినములుమాత్ర మచటనుండ నిశ్చయించుకొనెను. ఆప్రకారము ఒకదినమున అబ్దుల్లా సేటుగారి యింట నొక పెద్దసభ గావించి, ఆబిల్లును ప్రతిఘటించుటకై తీర్మానము చేయించి, ఆబిల్లు చర్చను ప్రస్తుత మాపవలసినదని ఆ శాసనసభ ప్రెసిడెంటుకు తంతి నంపెను. రెండుదినము లాపినట్లు జవాబు వచ్చుటచే, తత్క్షణమే శాసనసభకు పంపవలసిన పిటిషను నొకదానిని తయారుచేసి దాని కాపీలను ఆసభికులకును, పత్రికలకును బంపెను. అందుపై శాసనసభలో చాల కలవరము కలిగెను. అయినను, అందలి మెజారిటీ ఆబిల్లుకు అనుకూలురగుటచే అది ప్యాసు అయ్యెను. కాని నెటాలు ప్రభుత్వము లండనులోని బ్రిటిషుప్రభుత్వపు వలస రాజ్య మగుటచే బ్రిటిషుపార్లమెంటువారు ఆమోదించనిదే ఆబిల్లు అమలులోనికి రానేరదు. కావున గాంధీజీ లండనులో అప్పటి బ్రిటిషు కాలనీల సెక్రటరీగానుండిన లార్డు రిపనుదొరగారికి పదివేల భారతీయుల సంతకములతో నొక పెద్ద అర్జీని పంపించెను. అందులోని ముఖ్యవాదము : భారతీయులకు బ్రిటిషు ప్రభుత్వములోని ఇండియాలో ఓటుహక్కు ఉండగా, అదే ప్రభుత్వములో చేరియున్న నెటాలులో కూడ అట్టిహక్కు ఉండుట న్యాయమనుటయే. ఇంతలో గాంధీజీ నిర్ణయించుకొనిన నెలగడువు దాటవచ్చెను. కాని నెటాలు భారతీయు లాయనను వదలకుండిరి. అప్పుడాయన తాను ప్రజాసేవకార్యములో నెంతమాత్రము ధనము స్వీకరింపనని ఖండితముగా దెలుపుటచే ఇరువది పెద్దవర్తకులు ఆయనను తమ కోర్టు వ్యవహారములలో రిటైనరు వకీలుగా నుంచుకొనుటకు నిశ్చయించుకొనిరి.

13. ఆకారణమున, గాంధీజీ అక్కడి సుప్రీముకోర్టులో అడ్వొకేటుగా జేరదలచి దరఖాస్తును పెట్టుకొనెను. ఆకోర్టులోని తెల్లదొరల వకీలు సంఘము, ఆక్షేపించినను, ప్రధాన న్యాయాధిపతి వారియాక్షేపణను త్రోసిపుచ్చి, గాంధీజీ బ్రిటిషు బారిష్టరు అగుటచే, ఆయన దరఖాస్తును మంజూరు చేసెను. ఆ కోర్టు డ్రెస్సురెగ్యులేషనులను బట్టి, ఆయన తన తలపాగాను తీసివేయ వలసి వచ్చెను. కొందరు ఇవరకు డర్బాను మేజస్ట్రేటు కోర్టులో జరిగినదానికి అసందర్భముగా గనుపడిన ఆనూతన ప్రవర్తనను గురించి అధిక్షేపించగా, గాంధీజీ ఈ విధముగా జవాబిచ్చెను. ఒకే విషయమును వివిధసందర్భలను బట్టి వివిధముగా జూడవలయును. అట్టి సత్యజ్ఞానమే, సంధి సౌందర్యమును చేకూర్పగలదు. సత్యము, వజ్రమువలె ఎంత కాఠిన్యమో, కుసుమము వలె అంతకోమలము, గాంధీజీ న్యాయ వాదిత్వములో బాటు ప్రజాసేవను గూడ జేయుచు, నెటాలులో భారతీయుల ఓటు హక్కునుగురించి, ఇంకను ప్రజలలో తీవ్రప్రచారము సాగించనెంచి, 1894 సంవత్సరము మే నెల 22 వ తేదీన "నెటాలు ఇండియను కాంగ్రెసు" అను ప్రజాసంస్థను స్థాపించెను. ఆ సంస్థ యొక్క ఆదర్శములను నెరవేర్చుటకు ప్రత్యేకముగా, ఆరాష్ట్రమున పుట్టి పెరిగి విద్యావంతులై స్వయం పోషకులై యుండిన భారతీయ యువకులతో గూడిన "ఇండియను ఎడ్యుకేషనలు అసోసియేషను" అను మరియొక సంస్థను గూడ నెల గొల్పెను. మరియు ఆ రెండు సంస్థల తరపున ప్రచారార్థమై రెండు కరపత్రములను గూడ వ్రాసి ప్రచురించెను. అవి (1) దక్షిణాఫ్రికాలోని ప్రతి బ్రిటిషువానికి ఒక విన్నపము. (2) భారతీయుల ఓటు హక్కును గురించి ఒక విజ్ఞాపనము. గాంధీజీ ఈ ప్రచార విషయములోనిమగ్నుడై యుండగా, బ్రిటిషు కలోనియలు సెక్రటరీ లార్డురిపను వద్దనుండి, నెటాలు శాసనసభవారి చట్టమును బ్రిటిషు పార్లమెంటు వారు అంగీకరించ లేదని వర్తమానము వచ్చెను. ఈవిధముగా ఈ వరకున్న హక్కులను నిలువబెట్టుకొనుటకై ప్రచారము జరుపుచుండగా, క్రొత్తయిబ్బందిని అచ్చటి భారతీయులపై రుద్దుటకు నెటాలు ప్రభుత్వము ప్రయత్నించుచుండెను. నెటాలు గవర్నమెంటు ఇండియాగవర్నమెంటు వారితో ఇవరకు అయిదుసంవత్సరముల యగ్రిమెంటు చేసికొని, తెచ్చుకొని యుండిన ఇండెంచెర్డు కూలీలు, ఆ అయిదు సంవత్సరముల తరువాత గూడ, నెటాలులోనే యుండి, స్వంతవ్యాపారమును సాగించుకొనుచు, నివాస మేర్పరచుకొనుచుండిరి. అట్టి భారతీయులపై 1894 సంవత్సరము నుండి ఒక్కొక్కరికి సాలుకు 375 రూపాయలు చొప్పున తలపన్ను విధించదలచియుండిరి. దీనికి కారణము అక్కడి తెల్లవర్తకుల ఒత్తిడి. భారతీయవర్తకులు ఆ తెల్లవర్తకులకు పోటీరై కంటకములుగ నుండిరి. నెటాలు గవర్నమెంటు వారు ఇండియాగవర్న

మెంటు వారి అంగీకారము లేనిదే తమ యగ్రిమెంటును మార్చుటకు వీలులేదు. కావున వారు అట్టి మార్పునకై ఇండియాగవర్నమెంటుకు ఈక్రింది సలహాలను ముందుగా బంపిరి.

(1) గిరిమిటియాలు తమ నియమిత కాలము పూర్తియైన వెంటనే ఇండియాకు తిరిగి పోవలెను.

(2) అటులబోనిచో, రెండేండ్ల కొకసారి క్రొత్త ఒడంబడికను వారు వ్రాయుచుండవలెను.

(3) పై రెండు మార్గములను అనుసరింపకున్న యెడల సాలుకు 25 పౌనులు, అనగా 375 రూపాయలు తలపన్ను నియ్యవలెను.

నెటాలు ఇండియను కాంగ్రెసువారు, పై సలహాలను ఖండించుచు, ఆందోళన సలుపుటవలన, ఇండియాగవర్నమెంటువారు ఆ తలపన్నును మాత్రము మూడు పౌనులకు తగ్గించి ఆ సలహాలను ఒప్పుకొనిరి. ఇట్టి స్థితిలో ఈ నూతనపన్నును ప్రతిఘటించుటకు కూడ నెటాలు భారతీయులు పోరాటము సలుపవలసివచ్చెను.

—o—

## మూడవ ప్రకరణము

# తిరిగి ఇండియాలో

## 1896

14. గాంధీజీ దక్షిణాఫ్రికాకు వెళ్ళి మూడు సంవత్సరములై యుండుట చేతను, ఇంకను అక్కడ మరికొంతకాలము ఉండవలసినట్లు కనబడుటచేతను ఇండియాలో తన ఇంటి వ్యవహారములను కుదుటబరచుకొని, భార్యాపిల్లలను దెచ్చికొను ఏర్పాటు జేసికొనుటకై తన మిత్రులవద్ద ఆరుమాసములు సెలవు గైకొని, 1896 వ సంవత్సరము జూను నెలలో తనదేశమునకు ప్రయాణమయ్యెను. ఆసమయమున సరాసరి కలకత్తా కొకస్టీమరు బోవుచుండుటచే ఆయన దానిలో నెక్కి, ఇరువది నాలుగు రోజులకు కలకత్తారేవు చేరెను. అచటనుండి వెంటనే బొంబాయికి రైలుపైబోవుచు దోవలో అలహాబాదు స్టేషనులో రైలు 45 నిముషములు ఆగునని తెలిసికొని ఊరిలోనికిబోయి తిరిగివచ్చుసరికి రైలు కదిలిపోయెను. ఆకారణమున గాంధీజీ మరునాటి బండిలో బోదలచి, ఈలోపున అచ్చటి కొందరి మిత్రులతో నెటాలు భారతీయుల దురవస్థనుగూర్చి ఆలోచించ నుద్యమించెను. ముందుగా ఆయన అచ్చటి ఆంగ్లో ఇండియను పత్రికయగు 'పయోనీరు' పత్రికాధిపతిని దర్శించి ప్రస్తావించగా, ఆవిషయములను లిఖితరూపమున దెలుపవలసినదని ఆపత్రికాధిపతి కోరెను. ఆకారణమున గాంధీజీ మరునాటి రైలులో నేరుగా రాజకోటకు బోయి ఒక చిన్నగ్రంథమును వ్రాసి పంపించెను. 'పయొనీరు' పత్రికాధిపతి గాంధీగారి పుస్తకమును పురస్కరించుకొని సంపాదకీయవ్యాసము నొకదానిని వ్రాసెను. దానిని రూటరు వార్తాహరుడు సంగ్రహపరచి ఇంగ్లాండు పత్రికల కంపెను. ఆ సంగ్రహము మరింత క్లుప్తపరుపబడి మూడు పంక్తులలో నెటాలులో తెల్లదొరలు, నల్ల భారతీయులను హింసించుచున్నారని గాంధీజీ ఇండియాలో ప్రచారము చేయుచుండినట్టు మాత్రము తెలుపుచు, నెటాలు పత్రికలకు రూటరు తంతిసమాచార మంపబడెను. దాని నాధారము చేసికొని నెటాలు తెల్లదుండగులు కొందరు గాంధీజీపై కోరములను, మిరియములను నూరుచుండిరి. ఆసంగతి గాంధీజీకి తెలియదు.

15. గాంధీజీ ఇండియాలోని పెద్ద పెద్ద నగరములకు బోయి, అచ్చటచ్చట సభలను గావించి, దక్షిణాఫ్రికా భారతీయుల ఇక్కట్టులను గూర్చి ప్రజాభిప్రాయమును పెంపొందించదలచెను. అందుకై ముందుగా బొంబాయికి బోయి, అక్కడ మొట్టమొదట జడ్జీ మహాదేవ గోవిందరెనడేగారిని, జడ్జీ బదురుద్దీన్ తైయాబ్జీగారిని, తరువాత సర్ ఫిరోజిషా మెహతాగారిని సందర్శించి వారిసహాయమున సభ నొక

దానిని యేర్పరచి, అందుపన్యసించి, వారి ప్రశంసను బొందెను. ఆతరువాత ఆయన పూనాకేగి అచ్చటి ప్రముఖరాజకీయ నాయకులగు తిలకు, గోఖలేగారలను దర్శించెను. వారిరువురి సలహాపై ఆయన అచ్చటి సుప్రసిద్ధ సంస్కృతపండితుడైన డాక్టరు రామకృష్ణగోపాల భండార్కరు గారిని గలిసికొని, తన యుద్యమమునకు వారి యాశీర్వాదమును బొంది, వారు మువ్వు రేర్పరచిన సభయందుపన్యసించెను. అనంతరము గాంధీజీ చెన్నపురమున కరిగి, అక్కడి మదరాసు స్టాండర్డు హిందూ పత్రికాధిపతులగు పరమేశ్వరన్ పిళ్ళగారిని, జి. సుబ్రహ్మణ్య అయ్యరుగారిని సమీపించి, వారి సానుభూతిని బొంది, డాక్టరు మణి అయ్యరుగారి ఆధిపత్యమున పచ్చయప్పహాలులో జరిగిన మహాసభలో మహోపన్యాస మొసగెను. తదనంతరము కలకత్తా కేగి, అక్కడి వంగశ్రేష్ఠుడగు బాబు సురేంద్రనాథ్ బెనర్జీగారిని, మరియు హైందవపత్రికలగు అమృతబజారు, వంగవాసి పత్రికాధిపతులనేగాక ఆంగ్లేయ పత్రికలగు స్టేట్సుమను, ఇంగ్లీషుమను పత్రికాధిపతులనుగూడ జూచెను. వారందరి సహాయమున నొకగొప్ప సభ జరుపబడునని ఆశించుచుండగా, ఇంతలో డర్బానునుండి వెంటనే రావలసినదిగా 'కేబిలు' ఒకటి వచ్చెను. ఆకారణమున గాంధీజీ తత్క్షణమే బొంబాయికి బోయి తన భార్యను, ఇరువురు కుమారులను, మేనల్లుని వెంటబెట్టుకొని దాదా అబ్దుల్లాగారి స్వంతస్టీమరుపై దక్షిణాఫ్రికాకు ఆ 1896 వ సంవత్సరము నవంబరు 28 వ తేదీన రెండవమారు బయలుదేరెను.

---

## నాల్గవ ప్రకరణము

# తిరిగి దక్షిణాఫ్రికాలో

## 1896 — 1901

**16.** గాంధీగారెక్కిన స్టీమరు ఏరేవునను ఆగక సరాసరి నెటాలుకు బోవుటచే, ప్రయాణము పదునెనిమిది దినములు మాత్రమే పట్టెను. ఆ ఓడ 1896 డిశెంబరు 18వ తేదీన డర్బాను రేవుకు దూరముగా లంగరువేసెను. అందుకు పైకి చెప్పబడిన కారణము, ఆఓడ బయలుదేరిన బొంబాయిలో ఆరోజులలో ప్లేగు వ్యాపించియుండి యుండుట అసలు కారణము. ఈవరకు గాంధిగారు ఇండియాలో దక్షిణాఫ్రికా భారతీయులను గురించి చేసిన ప్రచారమును గూర్చి రూటరు వార్తాహరుడు అచ్చటి పత్రికలకు బంపిన వార్తాసంగ్రహము నాధారము చేసికొని, డర్బానులోని తెల్లదుండగులు కొందరు, ఆ ఓడలోనున్న గాంధీజీని, ఆయనతో వచ్చుచుండిన ఇతర ప్రయాణికులను అచట దిగకుండ జేయవలయునని రేవులో నప్పుడల్లరులు సాగించుచుండుట ఈ దుండగులను అచ్చటి యధికారులు అణచలేకుండిరి. వారిని ఓదార్చ బ్రయత్నించుచుండిరి. కాని ఆ అధికారులు గాంధీజీ ఇండియాలో జేసి యుండిన నిజమైన ప్రచారమును, ఇండియా ప్రభుత్వము ద్వారా తెలిసికొనియుండియు, ఆ దుండగులకు నచ్చజెప్పుట కిచ్చగించరైరి. కావున అమాయకులైన ఆదుండగులు తాము పత్రికలద్వారా విన్నదే నిజమనుకొని కొలది దినములైన వెనుక అనగా 1897 జనవరి 4వ తేదీన డర్బాను టౌనుహాలులో నొక గొప్ప సభజరిపిరి. ఆ సభకు ఒక బ్రిటిష్షు సైన్యాధికారి అధిపత్యము వహించెను. రెండువేలమంది తెల్లదొరలు హాజరైరి. వారందరు ఏకగ్రీవముగా గాంధీజీ ఓడనుండి దిగకుండునట్లు, హింసాయుతమైన చర్య దీసికొనుటకు తీర్మానించుకొనిరి. మరియు, ఆ ఓడ, అందలి అందరి ప్రయాణికులతోడను తిరిగి ఇండియాకు బోయినచో, నష్టపరిహారమిత్తుమని కూడ వారు ఆయోడ అధికారులకు తెలియబరచిరి. దానికాయోడ యజమాను లియ్యకొననందున, నెటాలు ప్రభుత్వము వారా యోడను ఆజనవరి 13వ తేదీన రేవులోనికి వచ్చుటకనుజ్ఞ నీయవలసి వచ్చెను. ఆరోజున రేవులో పగలంతయు తెల్లదుండగులు గుంపులు గుంపులుగా గుమిగూడి, 'గాంధీ' యనిన మండిపడుచుండిరి. కావున చీకటిపడిన తరువాతనే గాంధీజీ తన కుటుంబముతో రహస్యముగా ఓడనుండి దిగవచ్చునని ఆయన తెల్ల స్నేహితుడొకడు ఓడ కెప్టానుకు కబురుపంపెను. కాని కొంతసేపటికి వేరొక తెల్ల స్నేహితుడు స్వయముగా ఓడమీదికి వచ్చి, ఆసమయమున తెల్లగుండా లెవరును రేవు సమీపమున గానబడకుండటచే, గాంధీజీని సకుటుంబముగా తన వెంటనిడుకొని

వెళ్ళెదనని అభయమిచ్చి వారలను బయటికి దెచ్చి భార్యాబిడ్డలను ముందుగా నొక బండిపై గాంధిస్నేహితుడగు రుస్తుంజీగారి యింటికి బంపి, వారిరువురును కాలినడకను ఊరిలోనికి బోవుచుండిరి. ఇంతలో చాటున దాగియుండిన ఐదారుగురు దొరపిల్లలు వారిని జూచి ''గాంధి, గాంధి'' యని కేకలిడుచు చప్పటులు గొట్టసాగిరి. ఆ తెల్ల స్నేహితుడు వెంటనే అక్కడ నున్న రిక్షాను పిలిచి, అందులో గాంధీజీని గూర్చుండ బెట్ట నుద్యమించెను. ఆపిల్లలా రిక్షావానిని చంపుదుమని బెదిరింపగా, వాడు పారి పోయెను. అంత వారిద్దరు నడచిపోవుచుండగా, వెనుకనుంచి తెల్లగుండాల గుంపొకటి వెంబడించి వారిరువురును వేరుజేసి, గాంధీజీపై రాళ్ళువేసి, తలపాగాను ఎగురగొట్టి ఎడపెడ వాయించి, క్రిందబడద్రోసిరి. ఆయనకు స్పృహతప్పినను వారు చేతి పెత్తములతో బాదుచుండిరి. అంతలో అకస్మాత్తుగా గాంధీజీని ఆవరకు ఎరిగియుండిన, అచ్చటి పోలీసు సూపరింటెండెంటు భార్య, ఆదారిని బోవుచు ఆయనను సమీపించి, ఆయనపై తన గొడుగును విప్పిపెట్టి, దెబ్బలు తగులకుండ కాపాడుచుండెను. ఈ సంగతి పోలీసు స్టేషనుకు తెలియగనే అక్కడ నుండిన సూపరింటెండెంటు ముందుగా బంట్రోతులను బంపి ఆ దుండగుల గుంపును చెదరగొట్టించెను. గాంధీజీ లేచి నడవబోవుచుండగా ఆఫీసరు ఆయనను పోలీసు స్టేషనులో కొంతసేపు దాగుకొనుమని సలహానిచ్చెను. గాంధీజీ అందులకియ్యకొనక, పోలీసు భటుల కాపుదలతో తన భార్యబిడ్డలున్న రుస్తుంజీగారి గృహమునకే బోయెను. ఆ ఆచూకిని తెలిసిన తెల్లదుండగులు ఆయింటిముందు జేరి 'గాంధిని మాకప్పగింపుడు', అని కేకలు వేయసాగిరి. అక్కడికి వచ్చి యుండిన ఆపోలీసు సూపరింటెండెంటు ఆ తెల్లదుండగులను అదమాయించలేక, గాంధీజీని పోలీసు కాన్స్టేబిలు వేషముతో ఇల్లు విడచి పోలీసు స్టేషనుకు బోయి, అందు దాగుకొనుమని సలహానంపగా, ఆయన అప్పుడట్లొనర్చెను. గాంధీజీ, తరువాత తన ఈ విపరీత ప్రవర్తనను గూర్చి తనలో తాను విమర్శించుకొనెను. మొదట ధైర్యముతో ఓడడిగి తెల్లదుండగుల గుంపును లక్ష్యపెట్టకుండుటయు పిదప వారికి భయపడి మారువేషముతో పోలీసుస్టేషనులో దాగుకొనుటయు, తనకే వ్యగ్రతగా కనుపడెను. బాగుగా ఆలోచించగా, గతవిషయముల యోగ్యతను నిర్ణయించుట పనిలేని పనియనియు, కాని ఆ విషయముల నుండి నేర్చుకొనవలసిన దేమైన యున్నయెడల, అది ఇకముందు జరుగబోవు విషయములకు మాత్రమే ఉపయోగించ గలదనియు దోచెను. మఱియు ఒకానొక సందర్భమున ఒకానొకడు ఏవిధముగా ప్రవర్తించునో ముందుగా చెప్పగలుగుట అసాధ్యమని ఆయన గ్రహించెను. ఆకారణమున, మానవుడొనర్చు కేవల బాహ్యకార్యములను బట్టివాని గుణములను సరిగా తెలిసికొనగలుగుట సులభ సాధ్యము కాదని కూడ

ఆయన గ్రహించెను. లోకములో ప్రతి కార్యమునకును మూడు కారణభాజకము లుండుననియు అవి (1) కారకుడు (2) కార్యము (3) పరిస్థితులు అనియు, సాధారణముగా విమర్శకులు మొదటి రెండు భాజకములందే మనస్సు నిలిపి ముఖ్యమైన మూడవ విభాజకమును విస్మరింతురనియు కూడ ఆయన కనుగొనెను.

17. డర్బాను రేవులో తెల్లదుండగీడులు కొందరు గాంధీజీపై జరిపిన దారుణచర్యలు లండనులోని బ్రిటిషు ప్రభుత్వమువారికి పత్రికలద్వారా ఆమరునాడే తెలిసెను. వెంటనే అప్పటి కలోనియలు శెక్రటరీ "ఛేంబర్లేను" గారు ఆవిషయము లను విచారించి, దోషులను శిక్షింపవలసినదని నెటాలు గవర్నమెంటుకు తంతిమూలమున ఆర్డరును బంపెను. అంత నాగవర్నమెంటు యధికారి యొకడు అప్పటి కింకను పోలీసుస్టేషనులో దాగియున్న గాంధీజీని సమీపించి తనపై చర్యజరిపిన ఘాతకులను గుర్తింపవలసినదని కోరెను. ఉదారమనస్కుడగు గాంధీజీ, జీససుక్రీస్తువలె వారు అమాయకులై, తాను ఇండియాలో నెటాలు తెల్లవారినెల్ల తెగతిట్టినట్లు ప్రచురింపబడిన వార్తలు నిజమని, వారికెవరో బోధించుటచేతనే వారట్టి కార్యము లొనర్చి యుండిరనియు, సత్యము లోకమునకెపుడు తెలియునో అపుడు తాము చేసినది చెడ్డ కార్యమని తెలిసికొనగలుగుదురనియు జవాబు చెప్పెను. లండనులోని పై అధికారులకు బంపుటకై దానిని వ్రాతమూలమున వాంగ్మూల మియ్యుమనగా, వల్లెయని యటులనే జేసెను. మూడుదినము లయినవెనుక గాంధీజీ పోలీసుస్టేషనును విడచి తనభార్యబిడ్డలున్న యింటికి బోయెను. గాంధీజీ ఇండియాలో నుండిన రోజులలో నెటాలు శాసనసభవారు భారతీయవర్తకులకును, వలసవచ్చినవారికిని ఇబ్బందిని కలిగించు రెండు క్రొత్తశాసనములను జేసిరి. వాటిని నిరోధించుటకైయే గాంధీజీ ఇండియానుంచి పిలువబడి యుండెను గదా. ఆయన అక్కడ నదివరకు స్థాపించియుండిన నెటాలు ఇండియను కాంగ్రెసు సరిగా పనిచేయజాలకుండుటను గమనించెను. దానికి మూలధనము చాల చేరియుండెను. అదియే అందలి అంతఃకలహములకు మూలమయ్యెను. అట్టి యనుభవమునుబట్టి గాంధీజీ ఏసార్వజనికసంస్థకును మూలధనమును విరివిగా సమకూర్పగూడదనియు, అట్టిదానియందు నైతికముగా అధోగతిబీజము లున్నవనియు, అట్టి సర్వప్రజోపయోగసంస్థలు లోకులవలననే, లోకులకొరకే మొదట ఏర్పడియున్నను వాటి ధర్మకర్తలు క్రమక్రమముగా వాటి అధికారులై తమ యిష్టమువచ్చినట్లును, ఎవరికిని ఉత్తరవాదులు కానట్లును బ్రవర్తింతురనియు దెలిసికొనెను. కావున ప్రజాసంస్థ లెప్పుడును సదా ప్రజలదృష్టిలో నుండి, వారు వాటియెడల తమకుగల భక్తితో ఇచ్ఛాపూర్వకముగా నెలనెలకిచ్చు చందాలతోనే తమ

వైనికవ్యయమును జరుపుకొనుట మంచిదని గ్రహించెను. అందువలన వాటి ధర్మకర్తలు జాగ్రత్తగా ప్రవర్తించగలరు అని నిర్ణయించుకొనెను.

18. భారతీయులకు ఇబ్బందికరమైన నెటాలు శాసనములను రద్దుచేయించుటకై లండను పార్లమెంటులో చర్చ తీసికొనవలసి యుండెను. ఈలోపున గాంధీజీ తన బారిష్టరు ఉద్యోగములో దండిగ గడించుచు, పరులకు సేవచేయగల పని యేమైన దొరకునాయనికూడ వెదకుచుండెను. ఆకారణమున గాంధీజీ అచ్చటి రుస్తుంజీగారి ధర్మవైద్యశాలలో దినమునకు రెండుగంటల చొప్పున జీత బత్తెములు లేకనే నర్సుపని చేయుటకు నిశ్చయించుకొనెను. ఇట్లు కొంతకాలము జరుగగా దక్షిణాఫ్రికాలోని బోయరులు ఆంగ్లేయులపై దిరుగబడి యుద్ధమొనర్చుట సంభవించెను. గాంధీజీ, అచ్చటి భారతీయులు, తాము ఆంగ్లేయ ప్రభుత్వమువారి ప్రజలమను యోగ్యతచేతనే అక్కడ తమ హక్కులకై పోరాడియుండుటవలన అట్టి ఆంగ్లేయులకు ఆయుద్ధమున సహాయము చేయుట తన విధియని తలచియుండెను అట్టి బాధ్యతతో ఆయన పదకొండువందల భారతీయులను జతపరిచి వారిలో నొక ఫస్టుయెయిడు వాలంటీరు దళము నేర్పరచి, యుద్ధక్షేత్రములోనికి గూడ బోయి గాయపడిన యోధులను మోసుకొనివచ్చి, శుశ్రూష జేసెను. గాంధీజీ తన కుటుంబముతో నెటాలుకు వచ్చిన కొత్తలో కస్తూరిబాయి కొక కుమారుడు కలిగెను. ఆ తరువాత 1900 సంవత్సరమున ఆమె రెండవసారి గర్భవతియై ఒక దినమున హఠాత్తుగా ప్రసవవేదన బొందెను. ఆ సమయమున దాపున మంత్రసాని దొరకనందున గాంధీజీ, తానా వరకు రుస్తుంజీగారి ధర్మ ఆసుపత్రిలో నర్సుగానుండి సంపాదించిన అనుభవమును పురస్కరించుకొని తానే స్వయముగా భార్యకు పురుడు పోసెను. భార్యపడిన ప్రసవవేదనను కనులారకని యుండుటచే తానింక ఆమరణాంతము బ్రహ్మచర్య మవలంబింపదలచి యుండెను. ఆ ప్రయత్నములో ఆయన ఆరుసంవత్సరముల తరువాతనే పూర్తిగా కృతకృత్యుడయ్యెను. అప్పుడే ఆయన దృష్టి తన ప్రత్యేక సంసారమునుండి సర్వ మానవశ్రేయస్సుపై ప్రసరింప మొదలిడెను. కస్తూరిబాయి ప్రసవమైన వెనుక, గాంధీజీ ఇండియాకు బోదలచియుండెను. అయినను దక్షిణాఫ్రికాలోని భారతీయు లాయనను వదలరైరి. అవసరమైనచో నొకసంవత్సరములోపల తిరిగి వచ్చెదనని వారికి నచ్చజెప్పి వారి సెలవును గైకొనెను. ఆయన గౌరవార్థము జరిగిన వీడ్కోలు సభలలో పెక్కండ్రు భారతీయులు తమకృతజ్ఞతాసూచకముగా విలువైన కానుకల నెన్నియో ఆయనకు సమర్పించిరి. కస్తూరిబాయికి ప్రత్యేకముగా నొకపెద్ద బంగారు హారము నిచ్చిరి. ప్రత్యేక వ్యక్తిసేవకుగాక, లోకసేవకు ప్రతిఫల మందుకొనుట తగని పనియని నమ్మియున్న గాంధీజీ ఆకానుక లన్నిటిని అక్కడనే యొక ట్రస్టీ ఫండుగ నేర్పరచి దాని ఫలసాయమును అక్కడి భారతీయులకే వినియోగించున ట్లేర్పాటు చేసెను. లోకసేవయనగా లోకములో భాగమైన అనగా లోకముతో ఐక్యమునందిన తన సేవకూడ యగుటచే దానికి ప్రతిఫలమును కోరుట తగనిపనియని మహాత్ముని యభిప్రాయము.

---

ఐదవ ప్రకరణము

# తిరిగి ఇండియాలో రెండవసారి
## 1902

19. గాంధీజీ 1901 వ సంవత్సరాంతమున డర్బానునుండి బయలుదేరి ఇండియాకు మరలివచ్చెను. ఆ డిసెంబరు నెలాఖరున కలకత్తాలో జరుగనున్న కాంగ్రెసు మహాసభకు బోదలచి, బొంబాయినుండి బయలుదేరునప్పుడే అక్కడికి బోవుచుండిన సర్ ఫిరోజిషా మెహతాగారిని, వాచాగారిని రైలులోనే కలిసికొనెను. దక్షిణాఫ్రికా భారతీయులకు సానుభూతిని దెలుపుచు కాంగ్రెసు మహాసభలో తానాపాదింపనున్న చిత్తుతీర్మానమును వారికి జూపి, దానికి వారి యామోదమును బొందెను. కలకత్తా స్టేషనులో గాంధీజీ దిగినవెంటనే కాంగ్రెసు స్వచ్ఛందసేవకు లాయనను రిప్పను కాలేజీలో నేర్పరచిన ప్రతినిధుల శిబిరమునకు గొనిపోయిరి. ఆశిబిరములోనే లోకమాన్య తిలకునకుకూడ విడిది ఏర్పరుపబడెను. అందువలన గాంధీజీ తన చిత్తు తీర్మానమునుగూర్చి ఆయనతోగూడ ముందుగా సంప్రదింపులు జరుపుటకు అవకాశమేర్పడెను. అక్కడి కాంగ్రెసు స్వచ్ఛందసేవకులలో నింకను తగినంత శిక్షణ ఏర్పడకుండుటను గమనించెను. ప్రతినిధులు చెప్పిన పనులను చేయుటకు తలాయించుచుండిరి. సేవాప్రేమ పైనుండిగాక మనస్సులోపలనుండి రావలయునని గాంధీజీ అభిమతము. కావున వారికి దారి చూపుటకై తానే వారిపనులను కొన్ని జేయుచుండెను. కాంగ్రెసు మహాసభ జరుగుటకు రెండు రోజులు ముందుగా వచ్చియుండుటచే గాంధీజీ కాంగ్రెసు ఆఫీసునకు బోయి, తనకేదైనను పని కల్పించవలసినదని కోరెను. అచ్చటి కార్యదర్శి ఆయన నెఱుగనందున ఒక వాలంటీరు గుమాస్తాపని నిచ్చెను. ఆపనిని వెనువెంటనే చేసి ఇచ్చుటను గమనించి, అచ్చెరువంది కొంతసేపటికి ఆయన ప్రఖ్యాత గాంధీజీ యని తెలిసికొని చాల నొచ్చుకొనెను. కాంగ్రెసు మహాసభ ప్రారంభమైన వెనుక జరిగిన విషయనిర్ణయసభకు ఆయనను గోఖలేమహాశయుడు గొనిపోయి, అందు గాంధీజీ చిత్తు తీర్మానమును ఆమోదింపజేసెను. తరువాత జరిగిన మహాసభలో ఆతీర్మానము ఏకగ్రీవముగా అంగీకరింపబడెను.

20. కాంగ్రెసు మహాసభ ముగిసిన వెంటనే గాంధీజీ ఒకనెల కలకత్తాలో గోఖలేగారి కతిథిగనుండి, అచ్చటి పెద్దల దర్శనమును జేయుచుండెను. వారిలో ముఖ్యులు సుప్రసిద్ధ డాక్టరు ప్రఫుల్లచంద్రరాయిగారు; ఆయన బ్రహ్మచారి; బ్రాహ్మసమాజమునకు జెందిన నాయకుడుగూడను. నెలకు ఎనిమిదివందల రూప్యముల జీతమైనను, అందు తాను నలుబది రూప్యములను మాత్రమే తన ఖర్చున కుంచుకొని

మిగిలినది ప్రజాసేవకు వినియోగించుచుండిరి. గాంధీజీ కలకత్తాలో ప్రఖ్యాతకైస్తవ నాయకుడగు కాళీచరణబెనర్జీ గారిని కూడ దర్శించిరి. మరియు ఆరోజులలో నచ్చట మహర్షి దేవేంద్రనాథ టాగూరిగారి యింట జరిగిన బ్రాహ్మసమాజ మహోత్సవములో బాల్గొనిరి. తదనంతర మాయన వివేకానందస్వామిని సందర్శించుటకై బేలూరులోని రామకృష్ణ మఠమున కరిగిరి. స్వామిజీ అప్పు డక్కడ లేకుండుటచే ఆయన శిష్యురాలైన సహోదరి నివేదిత యను మారుపేరుగల మిస్ నోబుల్ దొరసానిగారితో సంప్రదింపులు జరిపిరి. ఆతరువాత బేలూరునుండి కలకత్తాకు తిరిగి వచ్చి, బర్మాకుబోయి, అక్కడి బౌద్ధమతప్రచారకులతో ప్రసంగములు సలిపెను. గాంధీజీ మరల కలకత్తాకు మగలివచ్చి, గోఖలేగారివద్ద సెలవు గైకొని కాశీ, ఆగ్రా, జయపూరు, పాలంపూరు మొదలగు పట్టణములలో నాగి, చివరకు తన స్వగ్రామమగు రాజకోటకు బోదలచెను. మధ్యమధ్య ఆయా పట్టణములలో ఆయన తీర్థయాత్రాపరులతో కలసి వారితోబాటు అందందలి ధర్మశాలలలో పండాల సహాయముతో బసలు చేసికొనుచుండెను. కాశీకి బోయినప్పుడు 'అనె వసంతమ్మ' గారి నివాసమున కేగి ఆమెతో అనేక విషయములనుగూర్చి ముచ్చటించెను. గాంధీజీ తన ప్రయాణములను పూర్తిచేసుకొని తన రాజకోటకు బోయినతరువాత కొన్నిసెల లచట వకీలుప్రాక్టీసు జేయుచుండెను. కాని గోఖలేగారి కోరికపై గాంధీజీ 1902 మార్చి నెలలో బొంబాయిలో ప్రాక్టీసు నారంభింపవలసి వచ్చెను. అక్కడ ఆయన నివాస మేర్పరచుకొనిన కొలది దినములకే పదియేండ్ల వయసుగల ఆయన కుమారుడు మణిలాలు గాంధికి టైఫాయిడు జ్వరము వచ్చెను. డాక్టరు కోడిగ్రుడ్లరసమును, కోడిపిల్లల రక్తమును ఆహారముగా నీయవలయుననెను. గాంధీజీ కప్పుడు ధర్మసంకట మేర్పడెను. తప్పుగాని, ఒప్పుగాని మానవుడు మాంసమును తినరాదని ఆయనమతము. తొట్టివైద్యమును గనిపెట్టిన జర్మనుడాక్టరు లూయీకుహినీ దొరగారు మానవుని యొక్కయు, మాంసమునుదిను కుక్కలు మొదలగు జంతువులయొక్కయు దంతముల యేర్పాటును బాగుగా పరిశీలించి, మానవుడు స్వాభావికముగ మాంసాహారి కాడని నిర్ణయించియుండెను. అందుచే గాంధీజీ తన కుమారునికి అట్టి తీవ్రజ్వరములో కుహినీ చెప్పినట్లే ముందుగా కొన్ని లంఘనములు కట్టించి, కటిస్నానములను తడవకు మూడు నిముషములు మాత్రమే చేయించుచు, మూడురోజులవరకు నీరుకలిపిన నారింజపండ్లరసమును మాత్రమే యిచ్చెను. ఆమరునాడు చలినీట దడిపి పిండిన శుభ్రమైన గుడ్డనొకదానిని ఒడలిపై తలవరకుగప్పి, పైన రెండు దట్టమైన కంబళ్ళను గప్పెను. తలకొక తడి తువ్వాలును జుట్టెను. అంత గొంతసేపటికి చర్మములోని స్వేదద్వారములు తెరుచబడి మచ్చెనుటలు బోయుటచే జ్వరము తగ్గెను. అతరువాత నలుబదినాళ్ళు

పాలు, నీళ్ళు, పండ్లు మాత్రమే ఆహారముగా నిచ్చెను. ఆచికిత్సల వలన మణిలాలుకు కలిగిన ఆరోగ్యము, బలిష్ఠత నిలకడగా నేర్పడెను. గాంధీజీ యిట్లు కుటుంబపరిస్థితులను చక్కపరచుకొని హైకోర్టులో ప్రాక్టీసు చేయుచు అనుభవము సంపాదించుకొనుచుండెను. ఇంతలో బ్రిటిషు కొలనీల కార్యదర్శి ఛేంబర్లేనుగారు త్వరలో దక్షిణాఫ్రికాకు స్వయముగా రానున్నారనియు, వారితో సంప్రదించుటకు రావలయుననియు, నెటాలు భారతీయ నాయకులవద్దనుండి తంతి సమాచారమొకటి వచ్చెను. అచట మరల నొక ఏడాదిమాత్రమే పట్టునని గ్రహించి ఆలుబిడ్డల నింటికడ నునిచి ఒంటరిగ హఠాత్తుగా 1902 డిసెంబరు నెలలో నెటాలున కేగవలసి వచ్చెను. ఆసందర్భమున గాంధీజీ తనలో నిట్లనుకొనెను:—

"ఈప్రపంచమున భగవంతు డొక్కడే నిశ్చితమైన సత్యము, మిగిలినదంతయు అనిశ్చితము, భ్రమచే నిశ్చితమని దలంతుము. మన చుట్టుప్రక్కల గాన్పించునదియు. జరుగునదియు, అంతయు అనిశ్చితము, క్షణికము, ఈ జరిగెడిదానియందు నిశ్చితమైన పరమతత్వము విలీనమై తనప్రదర్శన మెల్లప్పుడును జరుపుచుండును. ఈ సత్యవిషయమున నమ్మకమున్నపుడే మానవజీవితము శాంతిని బొంది సార్థకము కాగలదు. ఈ సత్యాన్వేషణమే పురుషార్థము".

---

ఆరవ ప్రకరణము

# తిరిగి దక్షిణాఫ్రికాలో మూడవసారి

## 1903 — 1908

21. దక్షిణాఫ్రికాలో నెటాలు రాష్ట్రమేగాక, ట్రాన్సువాలు రాష్ట్ర మొకటికూడ యుండెను. బోయరు యుద్ధమునకు బూర్వము భారతీయుడెవడైనను ఆ ట్రాన్సువాలు రాష్ట్రములోనికి నిరాఘాటముగా బోవీలుండెను. యుద్ధానంతరము అది బ్రిటిషుకాలనీగా ఏర్పడిన తరువాత అచ్చటి యధికారులవద్దనుండి పరిమిట్లను బొందిననేగాని, భారతీయుడచటికి బోవీలు లేకుండెను. అందువలన గాంధీజీ 1902 డిసెంబరు నెలాంతమున ఇండియానుండి నెటాలు జేరినవెంటనే ట్రాన్సువాలుకు బోవుటకు పర్మిటును సంపాదించి పెట్టుకొనెను. అయినను బ్రిటిషు కలోనియలు సెక్రటరీ 'ఛేంబర్లేను' అప్పుడు నెటాలులోనుండి యుండుటచే గాంధీజీ ఆయనను సమీపించి నెటాలు భారతీయుల కడగండ్లనుగూర్చి ఒక మెమొరాండమును స్వయముగా సమర్పించి ముచ్చటించెను. ఆదొరగారు తానా రాష్ట్రమునకు వచ్చినపని అచ్చట నివాస మేర్పరచుకొన్న తెల్లవారల సానుభూతిని బొందుటయే ననియు, అందువలన తానేమియు గాంధీజీ కోరికను చెల్లించజాలనందుకు చింతిల్లుచుంటిననియు, తన యభిప్రాయమును నిష్కపటముగా నివేదించెను. అనంతరమా దొరగారు ట్రాన్సువాలు రాష్ట్రమును పర్యటించబోయెను. ఆరాష్ట్రము మొదట స్వతంత్ర బోయరు రిపబ్లికుగనుండి 1900 సంవత్సరములో జరిగిన బోయరు యుద్ధానంతరము బ్రిటిషు సామ్రాజ్యములోని భాగమయ్యెను. గాంధీజీ 1903 జనవరి ఒకటవ తేదీన అచ్చటికేగి, అచ్చటి భారతీయుల యిక్కట్టులనుగూర్చి ఆదొరగారితో మనవిచేయ దలచెను. అసలు బోయరు యుద్ధకారణములలో నొకటి బ్రిటిషు సామ్రాజ్యమునకు చెందియుండిన భారతీయులపై అచ్చటి బోయరు ప్రభుత్వము కొన్ని నిర్బంధములను విధించియుండి యుండుటయే అయియుండెను. అయినను ఆ యుద్ధానంతరమున ఇండియానుంచి బ్రిటిషు సామ్రాజ్యము తరఫున వెళ్ళిన ఆంగ్లేయాధికారులు తమకు భారతీయులయెడగల న్యూనభావమును వదలలేదు. వారే ట్రాన్సువాలు ప్రభుత్వములో జోక్యము కలిగించుకొని 'ఏషియాటికు డిపార్టుమెంటు' అను ప్రత్యేక శాఖను నిర్మించి, అందులో తాము ఉద్యోగస్థులై దానిద్వారానే ఏషియా భాగమైన భారతదేశపు ప్రజల యిబ్బందులను పరిష్కరించవలయునట్లు నిర్ణయమును చేయించియుండిరి. ఆకారణమున ఆ డిపార్టుమెంటు ఆంగ్లేయాధికారులు కల్పించుకొని గాంధీజీ ట్రాన్సువాలు నివాసి కాదను సాకును దెచ్చి ఆయన మనవిని వినవలసిన అవసరములేదని అడ్డు పెట్టిరి. అంత, గాంధీజీ ట్రాన్సువాలునందే నివాస మేర్పరచుకొనదలచి, అచ్చట సుప్రీము కోర్టులో యట్టార్నీగా ఏప్రిలు నెలలో ఎన్రోలు అయి జోహాన్సుబర్గు కోర్టులో ప్రాక్టీసు నారం

భించి, తనసంసారమును ఇండియానుండి తెప్పించుకొనెను. మరియు నచ్చట 'బ్రిటిషు ఇండియను అసోసియేషను' సంస్థ నొకదానిని నెలకొల్పెను.

22. గాంధీజీ ఆరోజులలో తన బారిష్టరు ప్రాక్టీసుకుదోడు, మతవ్యాసంగమున గూడ మునిగియుండెను. అచ్చటి క్రైస్తవమతబోధకులవలన బైబిలునందు బాగుగా పరిచయమును బొందెను. అందుజీససుబోధించియుండిన, "పాపమును ద్వేషింపుము కాని పాపిని ద్వేషింపకుము" అనుసూత్రమును గాఢముగా తన మనమున నాటించుకొనెను. ఒక దినమున నచ్చటి థియొసాఫికల్ లాడ్జిలో తానుపన్యాసమిచ్చుట తటస్థించెను. ఆ ఉపన్యాసములో ఆయన థియాసఫీ, హిందూమతసిద్ధాంతమే అనియు, అయినను థియొసాఫికలు వాఙ్మయము మనోబుద్ధులకు సంబంధించిన వాద ప్రతివాదములకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చుచుండగా, హిందూమతము, థియొసాఫికలు సిద్ధాంతములను జీవితములో అనుసరించుటయే, యనియు, దెలియబరచెను. థియాసఫీ మూలసూత్రములగు సర్వమానవ సోదరత్వమును, సర్వమానవుల నైతికాభివృద్ధిని వారి వాఙ్మయము చదివి నేర్చుకొనదలచిన వారి దృష్టినుండి, అవి సాధారణముగా తప్పిపోవుచున్న వనియు, కావున ఆమూల సూత్రములు మొట్టమొదటనే గట్టిగా మనసున నాటుకొనినతరువాతనే ఆవాఙ్మయముయొక్క ఉపయోగ మేర్పడగలదనియు, తన యభిప్రాయమును దేటబరిచెను. మరియు ఆకారణముననే, మన పూర్వులు "అథాతో బ్రహ్మజిజ్ఞాస" అని తమ హిందూమత పవిత్రగ్రంథములందు, వాటిని పఠించుటకు ముందుగా అర్హత అవసరమనియు, ఆఅర్హత ముఖ్యముగ సత్య, పవిత్ర, ఆత్మనిగ్రహ, సర్వభూతదయయను సాధన చతుష్టయసంపత్తితోగూడిన జీవితమును అలవరచుకొని యుండుటయేయనియు, ఖండితముగా నిర్ణయించియుండినట్లు ఎరుకపరచెను.

భూమిలో విత్తనములు బాగుగా నాటుకొనవలయునన్నచో ముందుగా భూమిని పదునుపరచవలసి యున్నట్లే ఉత్తమభావములు మనసున గట్టిగా నాటుకొనవలసియున్నచో ముందుగా సాధనచతుష్టయ సంపాదనలో మనస్సును పదునుపరచవలయును

అట్టి అర్హతను ముందుగా సాధనమూలమున సంపాదించకనే ఎవ రెంతమంది భారతభాగవతాది పురాణములను, భగవద్గీతాది వేదాంతగ్రంథములను పఠించినను, వినినను నిరుపయోగ మేర్పడుచున్నదనియు ఆయన భావము. గాంధీజీ, అట్టి అర్హతను బొందిన వెనుకనే పఠించిన గీతనుండి రెండు ముఖ్యవిషయములను నేర్చుకొని, వాటిని తన జీవితములో ఉపయోగమునకు తేగలిగెను. అవి: (1) అపరిగ్రహము, (2) సమభావము. అనగా (1) తనదియని తానేమియు కూడబెట్టుకొనక, భవిష్యత్తుకు భగవంతునిపై నమ్మకముంచుకొనుట, (2) అందరి మేలును కోరుట. అపరిగ్రహ భావము గట్టిగా నేర్పడుటచే గాంధీజీ తానావరకు బొంబాయిలో గట్టియుండిన పది

వేల రూపాయిల ఇన్సూరెన్సు పాలిసీని రద్దుచేసెను. తాను అనుదినము ఆర్జించుకొను చుండిన ఆస్తికి, తాను ధర్మకర్త మాత్రమేయని తలపోయుచుండెను. గృహవ్యయ మును తగ్గించుకొనుటకై ఇంటి నౌకరులు చేయవలసిన పనిని తానే చేయుచుండెను. తానున్న జోహాన్సుబర్గులో ప్లేగు వ్యాపింపగా రోగులకు నర్సుగా పనిచేసి వారల కొక హాస్పిటలునుగూడ ఏర్పాటు జేసెను. ఒకదినమున గాంధీజీ డర్బానుకు పని మీద ప్రయాణము చేయుచుండగా ఆయన స్నేహితుడొకడు 'రస్కిను' మహాశయుడు వ్రాసిన 'అన్టూస్ లాస్టు' అను గ్రంథమును చదువుటకై ఇచ్చెను. గాంధీజీ ఆరాత్రి యంతయు మేల్కొని దానిని చదివి గొప్పమార్పును పొందెను. ఆయన సహజముగా కర్మయోగి కావున ఆగ్రంథములోని ఈక్రింది సత్యములు ఆయన మనమును తీవ్ర ముగా ఆకర్షించెను :—

(1) వ్యక్తియొక్క క్షేమము సంఘములోని అందరి క్షేమములోనే ఇమిడియుండును అనగా సర్వోదయముద్వారానే శాశ్వతమైన ప్రత్యేకోదయము చేకూరగలదు.

(2) లాయరువృత్తి ఎంత గౌరవనీయమో, మంగలి వృత్తికూడ అంత గౌరవ నీయమే. ఏలననగా ఇరువురును ఒకే సంఘమునకు అత్యవసరమైన రెండు వివిధవృత్తుల ననుసరించి జీవించుచున్నారు.

(3) సంఘక్షేమమునకై శరీరపరిశ్రమతో గూడిన పనులను జేయుట అనగా సంఘ మునకు అవసరమైన ఆహారపదార్థములను సృష్టించుటకై కాయకష్టముతో పొలములను సేద్యముచేయుచుగాని లేక తదితరావసరములగు వస్తువులను చేతితో తయారుచేయుచుగాని జీవించు జీవితము ధన్యమైన జీవితము.

ఇటుల గాంధీజీకి ఏర్పడిన అత్యుత్తమ ఆశయములను అమలులో బెట్టుటకై ఆయన డర్బానువద్ద 'ఫానిక్సు' అను వ్యవసాయక్షారము నొకదాని నేర్పరచెను. దానిలో పనిచేయుటకై తన ముఖ్య అనుచరుల గొందరి నునిచెను. మరియు వారి సహాయముచే నక్కడ 'ఇండియను ఒపినియను' అను పత్రికను స్థాపించి, దానిని ముద్రించుటకు ఒకచేతి ముద్రణాలయమునుగూడ నేర్పరచెను.

23. బోయరు యుద్ధమునకు బూర్వము ట్రాన్సువాలు స్వతంత్రరాష్ట్రముగా నుండినప్పుడు భారతీయవర్తకులకు విధింపబడియుండిన 25 పౌనుల లైసెన్సు పన్నును బ్రిటిషు ప్రభుత్వము జోక్యము కలిగించుకొని 3 పౌనులకు తగ్గించియుండిరి. బోయరు యుద్ధానంతరమున నూతనముగా నేర్పడినటుకంటె ఏషియాటిక్ డిపార్టుమెంటుకు సంబంధించిన భారతదేశప్రభుత్వమునుండి వెళ్ళిన ఆంగ్లేయాధికారులు బోయరులకు మించిపోయి క్రొత్తగా భారతీయు లెవరా రాష్ట్రమునకు రావీలులేనట్లు జేయుటకై

'ఏషియాటిక్ ఆర్డినెన్సు' బిల్లు నొకదానిని చెప్పించిరి. ఆబిల్లు అక్కడి గెజెటులో 1906 వ సంవత్సరము ఆగష్టు 22 వ తేదీన ప్రచురింపబడెను. గాంధీజీ వెంటనే ఆబిల్లును భారతీయు లందరికిని బోధపడుటకై వారి భాషలలో కనువదించి ప్రకటించెను. ఆబిల్లునుబట్టి ట్రాన్సువాలులో నుండియుండిన ప్రతిభారతీయుడును స్త్రీపురుష వివక్షత లేక ఎనిమిది సంవత్సరముల వయస్సుకు మించినవారందరును తమ వేలి ముద్రలనిచ్చి, తమపేర్లను రిజిస్టరీ చేయించుకొని, డామిసైలు సర్టిఫికేటునుగూడ పొంది, దానిని అధికారులు అడిగినప్పుడు చూపించవలసి యుండెను. అబిల్లు ఆరాష్ట్ర శాసనసభలో ఆ సెప్టెంబరు 4 వ తేదీన ప్రవేశపెట్టబడి చట్టమయ్యెను. ఇట్టి నిర్బంధము బ్రిటిషు సామ్రాజ్యపౌరులైన భారతీయులకు అవమానకరమగుటచే గాంధీజీ ఆచట్టమును ప్రతిఘటించుటకై పట్టుబట్టి ప్రతిఘటనసాధనకై ఆలోచించుచుండెను.

24. గాంధీజీ ముందుగా 1906 సెప్టెంబరు 11 వ తేదీన ట్రాన్సువాలులోని భారతీయుల నందర నొక్కచోజేర్చి అందు, ఆచట్టమును 'పాసివు రెసిస్టెన్సు' పద్ధతిని ప్రతిఘటించుటకై వారు సన్నద్ధులుగా నుండవలయునని తీర్మానమును గావించెను. ట్రాన్సువాలు రాష్ట్రశాసన సభలో ప్రభుత్వపుబిల్లు చట్టమైనను, ఆరాష్ట్రము బ్రిటిషు సామ్రాజ్యములోని కాలనీగా యేర్పడియుండుటచే ఆచట్టములులోనికి వచ్చుటకు బ్రిటిషు పార్లమెంటువారి యామోదమవసరమై యుండెను. 'పాసివు రెసిస్టరు' తన సిద్ధాంతము ననుసరించి, యెప్పుడును తన ఉద్యమమును ప్రారంభించుటకుముందుగా చట్టబద్ధమైన పరిహార మార్గములనన్నిటిని ఉపయోగించవలసి యుండును. ఆకారణమున గాంధీజీ భారతీయుల మరియొక సభగావించి, అందు మొదట ఇంగ్లాండులోని పార్లమెంటుకు డెప్యుటేషను బంపుటకు తీర్మానము జేయించెను. ఆతీర్మానము ననుసరించి గాంధీజీ తనవెంట మరియొక ప్రతినిధిని తీసికొని 1906 అక్టోబరు 10 వ తేదీన లండను కేగెను. ఆయన అచ్చటి భారతీయ నాయకులతో ముందుగా సంప్రదింపులు జరిపి నవంబరు 8వ తేదీన అప్పటి బ్రిటిషు ప్రభుత్వ కాలనీల కార్యదర్శియైన లార్డు ఎలిజను దొరగారిని, భారతదేశపు ప్రభుత్వ కార్యదర్శియైన లార్డుమార్లీ దొరగారిని స్వయముగా గలిసికొని వారలకొక మెమొరాండమును సమర్పించెను. వార లిరువురును దానిని సావకాశముగా చిత్తగించి తాము చేయదగినవంతయు చేతుమని వాగ్దత్తమిచ్చిరి. గాంధిజీ ఆతరువాత అప్పుడక్కడ నుండిన దాదాభాయి నౌరోజీగారి సహాయమున అచ్చట ఇండియను నేషనలు కాంగ్రెసువారి బ్రిటిషుకమిటీ అధికారులను సందర్శించి వారితో ముచ్చటించెను. మరియు, యీవరకొకసారి ఇండియను నేషనలు కాంగ్రెసు అధ్యక్ష పదవిని నిర్వహించియుండి, అప్పుడింగ్లండులో నుండిన సర్ విలియం వెడ్డరు బరన్ దొరగారి సాయమున పార్లమెంటులోని హౌసు ఆఫ్

కౌమన్సుకు సంబధించిన ఇండియను కమిటీవారిని, ఐరిషుపార్టీ నాయకుడైన రెడ్మండు దొరగారినికూడ సందర్శించి, వారలందరికు ట్రాన్సువాలు భారతీయులపై నూతన ముగా విధింపబడిన నిర్బంధములనుగూర్చి నచ్చజెప్పెను. ఇంతేగాక, లండనులోనే దక్షిణాఫ్రికా బ్రిటిషు ఇండియను కమిటీ నొకదానిని నెలకొల్పెను.

25. గాంధీజీ ఇట్లు ఆరువారములు గడపి, తిరుగు ప్రయాణమున మరలి వచ్చుచుండెను. ఇంతలో మార్గమధ్యముననే, లండనులోని ఆయన స్నేహితుడొకడు ఆయన ఇచ్చియుండిన మెమోరాండమునుగూర్చి లార్డు ఎల్జిన్ దొరగారు అనుకూల ముగా ఆలోచించుచున్నారని, స్టీమరుమీదనున్న గాంధీజీకి తంతివర్తమాన మంపెను. కాని గాంధీజీకి జోహాన్సుబర్గు చేరినతర్వాత లార్డుఎల్జిను దొరగారు మోసముచేసి నట్లు తెలియవచ్చెను. ఆ కౌలనీల సెక్రటరీ, ట్రాన్సువాలు ప్రభుత్వమువారు గావించి యుండిన ఆ 'నల్లచట్టము'నకు అనుమతినీయకున్నను, కొలదిదినములలో, అనగా 1907 సంవత్సరము జనవరి మొదటి తేదీనుండి ట్రాన్సువాలురాష్ట్రము, డొమినియను స్వరా జ్యమును బొందునుగాన, అప్పుడారాష్ట్రము మరల నట్టిచట్టమును జేయుచో, బ్రిటిషు ప్రభుత్వము జోక్యము కలిగించుకొనజాలదుగదా యని తన యభిప్రాయమును వెలి బుచ్చెను. ఆ ట్రాన్సువాలురాష్ట్రము, ఆహామీ సూచనను సందుగాగొని, డుమిని యను స్వరాజ్యము బొందినవెనుక, అనగా 1907 మార్చి 21 తేదీన, పాత 'ఏషియా టికు ఆర్డినెన్సుఆక్టు', నే'ఏషియాటికు రిజిష్ట్రేషను ఆక్టు' అను మారుపేరుతో, కొలది మార్పులతో నూతనచట్టమునుజేసి, దానికి బ్రిటిషు ఇంపీరియలు గవర్నమెంటువారి అనుమతిని, ఆరాష్ట్రప్రభుత్వము మామూలు పద్ధతిని సంపాదించెను. ఆచట్టము ఆసంవ త్సరము జూలై మొదటి తేదీనుండి అమలులోనికి వచ్చుననియు, కావున ఆపైన ఒక నెలరోజులలోగా అనగా జూలై 31 వ తేదీలోపున, అక్కడి భారతీయులెల్లరు, తమపేర్లను రిజిష్టరీ చేయించుకొని అక్కడ నుండుటకు పర్మిట్లను బొందవలయు ననియు ఆ ప్రభుత్వము ప్రకటించెను. గాంధీజీకింక గత్యంతరములేక తన నూతన 'పాసివురెసిస్టెన్సు' మార్గమును అవలంబించవలసిన అవసరమేర్పడెను. అందుకై ముందుగా ఆయన అచట 'పాసివురెసిస్టెన్సు అసోసియేషను' నొకదానిని స్థాపించెను. దాని యధ్వర్యమున పెక్కు సభలను గావించి, అచ్చటి భారతీయప్రజలకు ప్రబోధ మును కల్గించెను. అసలు 'పాసివురెసిస్టెన్సు' అను ఉద్యమము పశ్చిమఖండములో అవరకేయుండెను. ఆఆంగ్లేయపదమునకు 'సాత్వికనిరోధము' అనిఅర్థము. ఆఉద్యమ పద్ధతిని 1849 వ సంవత్సరములోనే 'హెన్రీథోరో'యను అమెరికను మహానీయుడు మొదట కనిపెట్టి యుండెను. ఆయుద్యమపద్ధతిని ఈవరకే యూరపుఖండమున

'నాన్ కన్ఫర్మిస్టులు' 'విమెన్ సఫ్రజిస్టులు' వాడియుండిరి. కావున గాంధీజీ తనఉద్యమమునకు మొట్టమొదట ఆపేరు పెట్టవలసివచ్చెను. కాని, హెన్రీథోరో ఉద్యమములో పోను, పోను, హింసకుకొంతతావుండినట్లు ఆయన కనుగొనెను. కావున ఆయన తన అహింసాభావమును బూర్తిగా తెలుపగల భారతీయపదముకై వెదకనారంభించెను. అందుకై తన ఇండియను ఒపినియను పత్రికలో బహుమాన ప్రకటననుగూడ ప్రచురించెను. ఆప్రకటననుసరించి తనకువచ్చిన సూచనలలో మగనులాలు సూచించిన 'సదాగ్రహ'పదము కొంతవరకు వచ్చెను; కాని, పూర్తితృప్తికలుగలేదు. ఆ పదమున కర్థము, మంచికార్యమునందు పట్టుదల. ఆపదము గాంధీజీ, తరువాత సత్యాగ్రహమని మార్చెను. సత్యమునకును ప్రేమకును, సంబంధము కలుగదనియు, ప్రేమ అహింసనే సూచించుననియు, కావున 'అహింసాపూర్వకమైన పట్టుదల' అను ఉద్దేశమును ఆపదమునకు గల్పించెను. మరియు 'అగ్రహ' శబ్దమునకు 'గట్టిగా బట్టుకొనుట' యను యర్థమునే గాక, శక్తియను భావమునుగూడ ఆరోపించెను. థోరోపాసివు రెసిస్టెన్సుపద్ధతి నవలంబించినవారు తాము శారీరకముగ శక్తిహీనులమని భావించుకొని, బలవంతులగు ప్రభుత్వమువారు బెట్టుచుండిన బాధలకు విధిలేక లొంగుచు, అవకాశము చిక్కినపుడు ఆప్రభుత్వాధికారులపై హింసనుపయోగించుచుండిరి. ఆపద్ధతికి వ్యతిరేకముగ గాంధీజీ, తన పద్ధతిననుసరించువారు, సత్యానుసరణమున సహజముగా నేర్పడు ఆత్మశక్తిని గ్రహించి ప్రేమపూర్వకముగా, అనగా అహింసామార్గమున ఎదుటివాని ఆత్మతో సంధానమును బొంది, వాని మనోమయకోశముద్వారా వానిలో సరియైన మార్పును గలిగించబ్రయత్నించవలయుననియే.

ఏడవ ప్రకరణము

# దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహ విజయము

## 1908 — 1914

26. ట్రాన్సువాలు ప్రభుత్వమువారు ప్రకటించిన ప్రకటన ననుసరించి భారతీయులు కొందరు భయపడి గడువులోపలనే అనగా జూలై 31 వ తేదీకి ముందుగనే తమ వేలిముద్రల నిచ్చి, తమ పేరులను రిజిస్టరీ చేయించుకొని పర్మిట్లను బొందిరి. కాని చాలమంది ఆగడువాఖరువరకు వేచి ఆ 31 వ తేదీన పెద్దసభ నొకదానిని సమకూర్చి, ఆ నూతనచట్టము నెదుర్కొనుటకు తీర్మానము గావించిరి. ప్రభుత్వము వారును భారతీయులలోని తీవ్రతను గ్రహించి, తాము మొదట పెట్టిన గడువును క్రమక్రమముగా నవంబరు ఆఖరువరకును పొడిగించిరి. అయినను ఈలోపల అక్కడగల పదమూడువేల భారతీయులలో అయిదువందల పదకొండుగురు మాత్రమే ఆగడువును ఉపయోగించుకొని తమపేర్లను రిజిస్టరీ చేయించుకొనిరి. గడువు దాటినతరువాతగూడ సత్యాగ్రహములో పాల్గొనదలచి పర్మిట్లను గలిగియుండనివారు ఆచట్టమునుబట్టి శిక్షాపాత్రు లగుటచే ప్రభుత్వమువారు ముందుగా రామసుందరమను భారతీయనాయకు నొకనిని అరెస్టుచేసి విచారించి ఒకనెల జైలుశిక్ష విధించిరి. అతడు ఉత్తర హిందూస్థానమునుండి ఇండెంచెర్డు కూలీగా మొదట వచ్చియుండి, అయిదు సంవత్సరముల యగ్రిమెంటుకాలము మధ్యలోనే యజమానికద్దనుండి ఎచ్చటికో పారిపోయి అచ్చటచ్చట దిరుగుచు స్వేచ్ఛావిహారియై తనకు వచ్చిన కొన్ని సంస్కృత శ్లోకములను జ్ఞానశూన్యులైన భారతీయకూలీలకడ ఏకరువుబెట్టుచు వారిని ఆకర్షించుచుండెను. ఆకారణమున ప్రభుత్వమువా రాతని నొకనాయకునిగా భ్రమించి, ముందుగా నాతనిపై జెయివేసిరి. కాని అతడు జైలునిర్బంధము తనస్వేచ్ఛావిహారమునకు భంగకరముగా నుండుటను భరింపజాలక క్షమాపణ కోరుకొని, చెంపలు వాయించుకొని సత్యాగ్రహులతో చేరననెను. ప్రభుత్వమువారంత కొంత ధైర్యమును దెచ్చుకొని ఆ 1907 డిసెంబరు 28 వ తేదీన గాంధీజీ మొదలగు కొందరు ముఖ్యనాయకులు నచ్చటి మేజస్ట్రేటు యెదుట హాజరుకావలెనని వారికి నోటీసు జారీ చేయించిరి. ఆప్రకారము వారు కోర్టుకు హాజరుకాగా, మేజస్ట్రేటు వారికద్ద పర్మిట్లులేవని తెలిసికొని వారలు మరునెల అనగా 1908 జనవరి 10 వ తేదీ లోపున ట్రాన్సువాలు రాష్ట్రమును వీడిబోవలయునని ఆజ్ఞాపించెను. వారు సత్యాగ్రహపద్ధతి నవలంబించి మేజస్ట్రేటు ఆజ్ఞను పాలింపరైరి. ఆకారణమున వారు ఆజనవరి 10 వ తేదీన మరల పిలిపింపబడి రెండేసి నెలలు విడిఖైదు విధింపబడిరి. అప్పుడు గాంధీజీ జైలులో ధరించ

వలసివచ్చిన జైలుటోపీయే తరువాత ఇండియాలో గాంధీటోపీయని ప్రసిద్ధినొందెను. గాంధీజీకి శిక్ష విధింపబడిన వెనువెంటనే ఆదేనేరమునకై అప్పుడప్పుడు సుమారు 150 మంది స్త్రీలతోసహా జైలుశిక్ష విధింపబడిరి. వారందరు గాంధీతో కలిసి, ఒకే జైలునందుంచబడిరి. ఒక పక్షము దినము లైనవెనుక జోహాన్సుబర్గులోని 'ట్రాన్సువాలు లీడరు' పత్రికా సంపాదకుడైన 'కార్టురైటు' దొరగారు గాంధీజీని జైలులో సందర్శించి ఆ రాష్ట్రాధిపతి యగు జనరలు బోధాకు మంత్రియైన స్మట్సును తానామధ్య కలిసికొనినట్టును, ఆయన భారతీయులకు అనుకూలముచేయు కోరికతో ఒక ఒడంబడికను తయారుచేసి తనచేతి కిచ్చినట్టును, దానిపై గాంధీజీ సంతకమును సేకరించి తనకు బంపుమనినట్టును, తెలియబగచెను. ఆ ఒడంబడిక మసాయిదాలో ట్రాన్సువాలులోని భారతీయులు పెక్కండ్రు ఇక ముందైనను, అనగా గడువుదాటి పోయినను స్వేచ్ఛాపూర్వకముగా తమ పేర్లను రిజిష్టరీ చేయించుకొని, పర్మిట్లను బొందదలచిన యెడల శిక్షను విధించు ఆ చట్టము నిరుపయోగమై త్వరలో రద్దుకా గలదని హామీ యివ్వబడెను. ఆ ఒడంబడికను పూర్తిగా నొప్పుకొనుటకు గాంధీజీకి మనస్కరించకుండెను. కాని అప్పుడు తనతోనున్న తోటి భారతీయ సత్యాగ్రహ ఖైదీలు జైలులో బాధను భరింపజాలక ఆ ఒడంబడికకు తమ ఆదుర్దాను వెలిబుచ్చిరి. కావున ఆయన మరియిద్దరు ముఖ్యనాయకులతో కలసి ఆ ఒడంబడికపై సంతకములు చేసెను. అంతట నా 'కార్టురైటు' దొరగారా ఒడంబడికను స్మట్సు దొరగారికి బంపెను. రెండు మూడు దినములైన తరువాత అనగా 1908 జనవరి 30 వ తేదీన అక్కడి పోలీసు సూపరింటెండెంటు జైలుకువచ్చి, గాంధీజీని బయటికి దెచ్చి, జనరలు స్మట్సు ఆయనను దీసికొని రమ్మనినట్టు చెలిపి, ప్రిటోరియాకు గొనిపోయి, స్మట్సు సమ్ముఖమున ఆయనను విడిచి వెళ్ళిపోయెను. స్మట్సు దొరగారు గాంధీగారిని సగౌరవముగ ఆదరించి, ఆయనవలెనే తానును బారిష్టరేయని తెలియపరచి, భారతీయులయెడ తన కెంతమాత్రము ద్వేషము లేదని స్పష్టపరచెను. అయినను, అచ్చటి యూరపియనులు ముఖ్యముగా ఆంగ్లేయుల ఒత్తిడివలన పర్మిటు పద్ధతిని ఒక శాసన చట్టముగా విధించవలసి వచ్చెననియు, స్వేచ్ఛాపూర్వకముగా అట్టి పర్మిట్లను భారతీయులు పొందేయెడల శిక్షారూపకమైన ఆశాసన చట్టమును పూర్తిగా రద్దుచేయించెద ననియు, నమ్మకముగా బలికి లేచి నిలువబడెను. ఆంగ్లేయుల మర్యాదనుబట్టి లేచి నిలువబడుట సంప్రదింపుల ముగింపు సూచన యగుటచే గాంధీజీ తానపుడెచటికి తిరిగి పోవలయునని ప్రశ్నించెను. స్మట్సు నవ్వుచు ఆయన స్వతంత్రుడయ్యెనని తెలిపెను. మరియు ఆయనతోబాటు జైలులోనుండిన వారినందరిని విడుదల చేయవలసినదిగా టెలిఫోనుద్వారా జైలుసూపరింటెండెంటుకు దెలుపుచుంటిననియుబలికెను. అంతవెంటనే

స్మట్సు దొరగారు తన సెక్రటరీద్వారా గాంధీగారికి జోహాన్సుబర్గుకు రైల్వే టిక్కెట్టు ఇప్పించి ఆయన ప్రయాణమునకు తగిన ఏర్పాటు చేసెను.

27. గాంధీజీ జోహాన్సుబర్గు చేరుసరికి ఆ 1908 జనవరి 30 వ తేదీ రాత్రి తొమ్మిదిగంట లయ్యెను. వెంటనే ఆరాత్రియే గాంధీజీ సుమారు వేయిమంది భారతీయులను జేరదీసి సభ నొకదానిని ఏర్పాటుచేసి, తాను స్మట్సు దొరగారితో చేసికొనిన ఒడంబడికను వివరించెను. ట్రాన్సువాలు రాష్ట్రశాసనసభవారు గావించిన 'నల్ల చట్టము' ననుసరించి 31 వ జూలై లోపున పర్మిట్లు పొందనివారు శిక్షార్హులగు చుండగా ఆచట్టము లేనట్టే భావించి గడువు దాటినతరువాతనే స్వేచ్ఛాపూర్వకముగా పర్మిట్లను పుచ్చుకొనదగుననుట ఆ ఒడంబడికలోని ముఖ్యవిషయమని తేటబరచెను. ఆసభలోని కొందరు అచట్టము ముందుగా రద్దుకొనిచో, అది మెడమీది కత్తివలె వ్రేలాడుచుండును గావున, ఆ ఒడంబడికనుబట్టి పర్మిట్లనుపుచ్చుకొనుట సరిగాదని వాదించిరి. గాంధీజీ ఆవాదన రాజీవిధానము గాదనియు, రాజీలో ఇరుకక్షులవారును తమ ముఖ్యసూత్రములకు భంగము రాకుండ తమ పంతములను కొంతకొంత సడల వలసియుండుననియు బోధించెను. ఏది ఏమైనను ఒకవేళ భారతీయులు ఆ ఒడంబడిక ననుసరించి తమ పేరులను రిజిష్టరీ చేయించుకొని పర్మిట్లను పొందిన తరువాత స్మట్సు దొరగారు తానిచ్చిన హామీని తప్పి, ఆ నల్లచట్టమును రద్దుచేయనిచో వెంటనే మనము మన పర్మిట్లను కాల్చివేసి సత్యాగ్రహోద్యమమును సాగించి, పర్మిట్లులేమిచే జైలుకు బోవుటకు సంసిద్ధులమై యున్నాముగదా యని ధైర్యమిచ్చెను. మరియు సత్యాగ్రహి ఎన్నడును తగినంత ఆధారము స్పష్టముగా కనుపడనిదే ఎవరిని సందేహించకూడదని బోధపరచెను. అంతలో సభలోనుంచి 'మీర్ ఆలం' అను పఠాను సభికుడు లేచి గాంధీజీయే మొట్టమొదట 1907 జూలై 31 వ తేదీన తమనందరిని సత్యాగ్రహాము నకు బురిగొల్పి ఇప్పుడు మరొక విధముగా సలహా నిచ్చుటను ఎదిరించెను. గాంధీజీ తాను తన పూర్వవాదమును వదలలేదనియు, సంగతి సందర్భములనుబట్టి ఒకానొకప్పుడు తప్పుగా గనపడినది, మరియొకప్పుడు ఒప్పుగా నేర్పడవచ్చుననియు ఉదాహరణకు ఒకడు మరియొకనిని తనకు సలాము బెట్టుమని కట్టడిచేసినప్పుడు కలుగు అవమానము మరియొకడు స్వేచ్ఛాపూర్వకముగా సలాము చేసినప్పుడు కలుగదు కదాయని జవా బిచ్చెను. దూరపు ఆలోచనలేని మూర్ఖుడగు ఆపఠాను గాంధీజీ స్మట్సునుండి పదివేల పౌనులు లంచముగొని ఆయనకు అమ్ముడుబోయి ఆ యొడంబడికకు సమ్మతించెనని నిందమోపి అంతటితో నాగక ఆయొడంబడిక ననుసరించి మొట్టమొదట రిజిష్టరీ చేయించుకొన్నవారిని తాను తెగటార్తునని కూడ బెదిరించెను. గాంధీజీ చలించక

తానే ముందుగా రిజిష్టరీ చేయించుకొని యితరులకు దారి చూపదలచుకొని యుండి నట్లు వెలిబుచ్చెను. అపఠాను మిత్రుడు బలికినట్లు తాను తెగటార్చబడవలసి వచ్చినను తనప్రియసోదరుని హస్తమువలన మరణించుట తనకు సంతాపవిషయము గాదనియు ఆ హంతకుడుసైతము తన నిర్దోషిత్వమును త్వరలో గ్రహించి పశ్చాత్తాపము నొంద గలడనియు వాక్రుచ్చెను. చివరకు ఆఒడంబడిక తీర్మానమును వోటుకు బెట్టగా ఒక రిద్దరు పఠానులు దక్క మిగిలినవా రందరు ఏకగ్రీవముగా అంగీకరించిరి. గాంధీజీ సభను విడిచి తన ఇంటికి జేరుసరికి తెల్ల వారుజామున మూడుగంట లయ్యెను. వెంటనే కాలకృత్యములను దీర్చికొని తానావరకు జైలులో విడిచివచ్చిన సోదర సత్యాగ్రహు లను తనతో దెచ్చుటకై ఉదయము ఏడుగంటలకు అచ్చటి కేగెను. అప్పుడే వారు స్మట్సు టెలిఫోను ఆర్డరునుబట్టి విడుదలగుచుండిరి. గాంధీజీ వారలకు స్వాగతమిచ్చి వారిని ఆ ఉదయమున జరుగనున్న వేరొకసభకు గొనిపోయెను.

28. ఆ ఉదయమున జరిగిన సభలో స్మట్సుతో జేసికొనిన ఒడంబడిక ననుసరించి, గాంధీజీ ఆ 1908 ఫిబ్రవరి 10వ తేదీన, ఇరువురు ముఖ్యనాయకులతో గలిసి, ముందుగా తమ పేర్లను స్వేచ్ఛగా రిజిస్టరీ చేయించుకొనవలెనని నిర్ణయింప బడెను. ఆ నిర్ణయము ననుసరించి ఆతేదీన గాంధీజీ రిజస్ట్రేషను ఆఫీసుకు బోవుచుం డగా, దోవలో, "మీరు ఆలము" పఠానుడు అడ్డగించి ఆయనను ప్రశ్నించుచుండెను. గాంధీజీ అతనికి జవాబు చెప్పుచుండగా, ఆపఠాను యొక్క స్నేహితు డొకడు, వెనుకనుంచి గాంధీజీపై గట్టిగా ఒక కర్రను విసరెను. గాంధీజీ క్రింద బడగనే, ఆయనను, ఆయనతోనున్న ఇరువురిని, ఆపఠానులు బడితెలతో మోది, పారిపోయిరి. అప్పుడా బాటను బోవుచుండిన కొందరు ఐరోపియను దొరలా పఠానులను వెంబడించి, పట్టుకొని, పోలీసుల కప్పగించిరి. ఇంతలో ఈసంగతిని వినిన రిజిస్ట్రేషను ఆఫీసరు స్వయముగా అక్కడికి వచ్చి, గాంధీజీని తమ సమీపమందున్న ఆయన స్నేహితుడగు 'డోకు' దొరగారి యింటికి బండిమీద గొనిపోయి, విడిచి, వైద్యునికై కబురుపంపెను. వైద్యుడు వచ్చులోపలనే గాంధీజీకి స్మారకము సరిగా వచ్చి తనను గొట్టిన అపఠాను మిత్రులను పోలీసు అరెస్టునుండి విడుదల చేయించుమని కోరుచు, గవర్నమెంటు ఆట్టార్నీ జనరలుకు తంతినంపెను. అయినను వారొనర్చినది పబ్లికు అఫెన్సు అను కారణముచే ప్రభుత్వము వారివలన వారలకు మూడు మాసముల కఠినవరకము విధింపబడెను. గాంధీజీని డాక్టరు వచ్చి పరీక్షించి, చెంపలమీదను, మీదిపెదవి మీదను కలిగిన గాయములను గుట్టి ఎముకలబాధ నివారణార్థమై పై పూతకు మందు ఇచ్చి, కట్లకట్టు విప్పువరకు పెదవిని కదిలించరాదనియు, ద్రవాహా

రమే సేవించవలెననియు, రెండు నెలలవరకు శరీరపరిశ్రమ చేయకూడదనియు సలహా నిచ్చి వెడలిపోయెను. గాంధీజీని ఆయన స్నేహితుని యింటవిడిచి, వెడలిపోయిన రిజిస్ట్రేషను ఆఫీసరు మరలవచ్చి, తాను తెచ్చిన కాగితముపై, గాంధీజీ వేలుముద్దర్లను సంతకములను బుచ్చుకొని, పర్మిటు సర్టిఫికెటునిచ్చి తన ఆఫీసుకు తిరిగి పోయెను.

29, ఆతరువాత వెంటనే గాంధీజీ ట్రాన్సువాలులోని తనయింటికి బోయెను. కొంత ఆరోగ్యము కలిగినవెనుక, తన సంసారమున్న నెటాలులోని 'ఫానిక్సుఫారము' కాపురమునకు బోదలంచియుండెను. నెటాలుకుబోవుటకు వేరొక కారణముకూడ గలదు. ఈవరకు తన సత్యాగ్రహోద్యమము ట్రాన్సువాలురాష్ట్రమునకుమాత్రమే సంబంధించియుండి అక్కడిప్రజలకుమాత్రము ఆనూతన పద్ధతి అలవాటు అయియుండెను. గాంధీజీ తనఉద్యమమునకు నెటాలు భారతీయులుకూడ తోడు పడవలెనని ఆశించియుండెను. కావున ఆయన నెటాలులోని డర్బానునగరమున కరిగి, అచట నొకనాటిరాత్రి ఎనిమిదిగంటల కొకసభ నేర్పాటుజేసెను. అందును, అక్కడి కొందరు పఠానులు గాంధీజీని శంకించి, ఆయన స్మట్సువద్ద లంచమునుబొంది, భారతీయుల హక్కులను అమ్మివేసెనన్న మూర్ఖపునమ్మకమును వెలిబుచ్చిరి. గాంధీజీ, తన ఫానిక్సు ఫారములో ముద్రింపబడుచుండిన, 'ఇండియను ఒపినియను' పత్రికలో, స్మట్సు ఒడంబడికయెడ గల కొందరి సందేహములను దీర్చుటకై మనోకల్పితమైన ప్రశ్నోత్తరరూపపు సంభాషణ వ్యాసము నొకదానిని వ్రాసి ప్రచురించెను. ఆ వ్యాసము చాలవరకు అచ్చటి భారతీయుల అనుమానములను బారద్రోలుటచే, వారిలో చాలమంది ట్రాన్సువాలుకుబోయి, అచ్చట గొంతకాలముండదలచి, స్వేచ్ఛాపూర్వకముగా తమ పేర్లను రిజిష్టరీ చేయించుకొని, సర్టిఫికెటు పర్మిట్లను బొందిరి. స్వేచ్ఛాపూర్వకకార్యములలో క్రోధమునకు తావులేదు. క్రోధరహిత కార్యమునకు దారిచూపినది గాంధీజీ సత్యాగ్రహపద్ధతియే. క్రోధమును పూర్తిగా విసర్జించుట సాధారణముగా సాధ్యముకాదని ఆయనకు దెలుసును. అంతమాత్రముచేత తన ఉద్యమము నే తృణీకరించుట తగనిపనియని తెలుపుచుండెను. అనేకవేల సంవత్సరములుగ, మానవప్రపంచమును పశుశక్తియే పాలించుచున్నదనియు, దాని ఫలితమును మానవులిప్పుడు బాగుగా ననుభవించుచున్నారనియు తేటబరచుచుండెను. కావున మానవులికనైనను, అట్టి పశుశక్తి ప్రయోగమువలన శాశ్వతమైన మేలేమాత్రము చేకూరజాలదని గ్రహించగలుగుట మనము కోరదగినదని, గాంధీజీపలుమారు, నెత్తిన నోరు బెట్టుకొని, మొత్తుకొనుచుండెను. గాంధీజీతరువాత తిరిగి తన జోహాన్సుబర్గు నివాసమున కరిగెను.

30. గాంధీజీని నమ్మించిన 'స్మట్సు' కొలది దినములకే తన మొండిచేతిని బయట బెట్టెను. ఆదొరగారు తోటి తెల్లదొరలకు భయపడి నల్లవారల నచటికి సాధ్యమైనంత వరకు క్రొత్తగా రాకుండజేయు నుద్దేశ్యముతో గావించి యుండిన 'నల్లచట్టము'ను రద్దుపరుప కుండుటయేగాక; అందు జెప్పబడిన గడువు దాటిన తరువాత స్వేచ్ఛాపూర్వకముగా నైనను బొందబడిన పర్మిట్లు అచట్టమునకు విరుద్ధములై చెల్ల నేరవను నెపమున వాటిని చట్టబద్ధముచేయుటకై వేరొక బిల్లునుకూడ దెచ్చెను. కావున గాంధీజీ ఆనూతన పరిస్థితిని అచ్చటి భారతీయులకు బోధపరచి, ఈవరకు ఆపివేసిన సత్యాగ్రహ కమిటీని పునరుద్ధరించెను. సత్యాగ్రహ పద్ధతి ననుసరించి ముందుగా స్మట్సు దొరగారికొక లేఖ వ్రాసెను. అందులో ఆనూతనబిల్లు తామిద్దరు చేసికొనియున్న ఒడంబడికకు వ్యతిరేకమని విన్నవించి జవాబును కోరెను. కోరిన తేదీకి జవాబు రానందున గాంధీజీ పలుచోట్ల సభలను గావించి అందు స్థితి గతులను బాగుగ సభికులకు బోధించి ప్రభుత్వమువారా నల్లచట్టమును ఫలాని తేదీలోపున రద్దు చేయుటయేగాక నూతన బిల్లునుకూడ ఉపసంహరించుకొన వలయుననియు, అటుల జేయనిచో భారతీయులు తామావరకు స్వేచ్ఛా పూర్వకముగా బొందియుండిన పర్మిట్ల నన్నింటిని మంటలో గాల్చివేయుటకు సిద్ధముగా నుండినట్లు ఆసభలలో తీర్మానములను గావింపించెను. మరియు ఆతీర్మానమును స్మట్సు దొరగారికి వెంటనే బంపుటకు తీర్మానింప బడెను. ఇంతచేసినను, భారతీయ ప్రజలకు బాధ్యులుగాని అచ్చటి ప్రభుత్వము యేమాత్రము వారి తీర్మానములను లక్ష్యపెట్టక 1908 ఆగష్టు 16వ తేదీన ఆనూతన బిల్లును తమ శాసనసభలో చట్టముగా మార్చివేసిరి. ఆసంగతి బయలుపడిన ఆనాటి సాయంతనము నాలుగు గంటలకే అచ్చటి ఒక మసీదులో సత్యాగ్రహులు సభకూడి తమ పర్మిట్ల నన్నింటిని ఒకపెద్ద యినుప హండాలోబెట్టి కాల్చివేయ నుద్యమించుచుండిరి. ఇంతలో నొక వాలంటీరు సైకిలుమీద అతివేగమునవచ్చి స్మట్సుగారంపిన టెలిగ్రామును గాంధీజీ కందజేసెను. ఆతంతియందు స్మట్సు సత్యాగ్రహుల సంకల్పమునకు తానెంతయు చింతిల్లుచుండినట్లును, అయినను ప్రభుత్వ సంకల్పము నంగు మార్పు కలుగజాలదనియు దెలిపెను. ఇంక వేరు మార్గములేక అక్కడ జేరిన భారతీయ సత్యాగ్రహులందరు తాము సేకరించి దెచ్చియున్న రెండువేలకు మించిన పర్మిట్లను ఆహండాలో పడవేసి వాటిని పారఫిను నూనెతో తడిపి, నిప్పంటించి కాల్చివేసిరి. ఇంతలో నొక వింత జరిగెను. మొదటిలో గాంధీజీని పిరికివాడని పరిహసించి ఆయన స్వేచ్ఛా పూర్వకముగా పర్మిటును బొందబోవునపుడు ఆయనపై జేయిజేసికొనియుండి జైలుశిక్ష ననుభవించి విడుదలైన 'మీర్ ఆలము' పఠాను తానే పిరికిపందయై మొదటిగడువు జులై 31వ తేదీ లోపుననే సంపాదించుకొనియుండిన పర్మిటునుదెచ్చి దానిని ఆమంటలో బారవైచెను.

31, పెక్కండ్రు భారతీయులట్లు తమ పర్మిట్లను బోగొట్టు కొనుటచే, అడిగినప్పుడు చూపించలేదన్న నేరముకై కొందరు శిక్షింపబడి జైళ్ళలోనుంచబడిరి. గాంధీజీకూడ అట్టి నేరముననే ఆ 1908 అక్టోబరు 15 వ తేదీనయరెష్టుకాబడి, రెండు నెలల కఠినవరకశిక్ష విధింపబడి, ఆ డిసెంబరు 13 వ తేదీన విడుదల కాబడెను. ఇంతలో దక్షిణాఫ్రికా పరిపాలన విషయములో గొప్పమార్పు ఏర్పడజొచ్చెను. అంతవరకు ప్రత్యేక "డొమినియను స్వతంత్ర పరిపాలనను" అనుభవించుచుండిన ట్రాన్సువాలు, ఆరెంజిఫ్రీస్టేటు, అను రెండుబోయరు రాష్ట్రములును, కేపుకాలనీ, నెటాలు అనురెండు ఆంగ్లేయ రాష్ట్రములును, ఇకముందు ఏకమై, ఒకే యూనియను రాజ్యాంగముగా ఏర్పడుటకు వారలలో వారునిశ్చయించుకొని లండనులోని బ్రిటిషు సామ్రాజ్యమువారి ఆమోదముకై ఒక డెప్యుటేషనును బంపదలచియుండిరి. ఆసమయముననే దక్షిణాఫ్రికా భారతీయుల తరఫున గూడ ఒక డెప్యుటేషనునులండనుకు బంపుట మంచిదని గాంధీజీ తలంచెను. ఆ ఉద్దేశమున కక్కడి భారతీయుల యామోదమును బొంది, గాంధీజీ, మరొక భారతీయ నాయకుని తన వెంట నిడుకొని 1909 వ సంవత్సరము జూను 23వ తేదీన లండనుకు బయనమయ్యెను. వారచట జేరకమునుపే ట్రాన్సువాలునుండి, జనరలుబోథా, జనరలుస్మట్సు, తమ డెప్యుటేషనుతో లండనుకు చేరియుండిరి. ఆరోజులలో, లార్డు క్రూదొరగారు కాలనీల సెక్రటరీగను; లార్డుమార్లీదొరగారు, ఇండియా సెక్రటరీగను, యుండియుండిరి. గాంధీజీ, ఒకప్పుడు, మద్రాసుగవర్నరుగా బనిచేసియుండిన, 'లార్డుయాంప్ధిలు, దొరగారి నచ్చట కలసికొనిరి. ఆదొరగారు, గాంధీజీ డెప్యుటేషనుతరఫున, ముందుగా జనరలు బోథాతో, రాజీసంప్రదింపులు జరిపెను. జనరలుబోథా, తాను భారతీయులకు వీలయినంతవరకు తప్పక సదుపాయములను జేసెదననియు, కాని, ట్రాన్సువాలులోని ఆంగ్లేయదొరల కయిష్టముగ, 'నల్లచట్టము'ను మాత్రము తాను రద్దుచేయజాలననియు దెలుపగా, యాంప్ధిల్ దొరగారా సమాచారమును గాంధీజీకెఱుకపరచెను. 'బోథా' సానుభూతి లేనిదే, లండను అధికారులయొక్క బలవంతమున పేక్షించుట, ప్రయోజనకారి కాజాలదని గాంధీజీ గ్రహించెను.

32. డెప్యుటేషను పనిపై గాంధీజీ లండనులోనున్న రోజులలో మరపురాని విషయమొకటి జరిగెను. అప్పుడచ్చట విద్య నభ్యసించుటకై వచ్చియుండిన భారతవిద్యార్థులతో గాంధీజీకి బరిచయము కలిగెను. వారలప్పుడు అచ్చటి భారత విప్లవోద్యమ నాయకులైన వినాయక దామోదర సవర్కరు, వి. వి. ఎస్ అయ్యరు గార్ల పలుకుబడి క్రింద పనిచేయుచుండిరి. మద్రాసు కాంగ్రెసు మంత్రిగా యుండియుండిన డాక్టరు రాజనుగారా రోజులలో వైద్య విద్యార్థిగా లండనులో నుండి

యుండెను. ఆవిద్యార్థులందరు గాంధీజీకి ఒక రాత్రి విందుజేయదలచి, ఆయన యంగీకారమును బొందుటకై తమ నాయకుడైన శ్రీ అయ్యరుగారిని ఆయన కడకు బంపిరి, గాంధీజీ వారి ప్రేమపూర్వక ఆహ్వానమును వందనపూర్వకముగా నందుకొనెను శ్రీ అయ్యరుగారు ఆ విందు ఏర్పాటుకు అక్కడి యొక హోటలుకు ఆర్డరు ఇవ్వబోవు చుండగా, గాంధీజీవలదని వారించి, ఆవిద్యార్థులే స్వయముగా వంటలు చేసికొని, విందారగించుట మంచిదని మందలించెను. ఆ కారణమున నా విద్యార్థు లొక పెద్ద హాలును అద్దెకు బుచ్చుకొని, దానినంటియున్న పాకశాలలో మధ్యాహ్నమే వంట పనుల నారంభించిరి. ఆ సమయమున అక్కడా పనులలో నిమగ్నులుగా నుండిన విద్యార్థుల కపరిచితుడైన ఒక పొట్టి బక్క, పల్చని, తీగవంటి శరీరము గల వ్యక్తి యొకరు వచ్చి, వారితోబాటు, గిన్నెలు మొదలగు వాటిని గడుగుట, కూరలు తరు గుట మున్నగు పనులను అత్యుత్సాహముతో జేయుచుండెను. సాయంతనమగు సరికి, ఆ విద్యార్థుల నాయకుడు శ్రీ అయ్యరుగారు వంటశాల కరుదెంచినపుడు, ఆయన ఆనూతన వ్యక్తిని గాంధీజీయని గుర్తించెను. వెంటనే ఆ విద్యార్థులు తెల్లబోయి, క్షమాపణ వేడుకొని, ఆయన చేతిలోని పనిని సవినయముగా లాగికొనిరి. గాంధీజీ అప్పటికి తాను చేయుచుండిన పనిని వదలినను, విందుసమయమున సందరకు, విస్తళ్ళు వేసి, వడ్డించుటలో కూడ సాయపడెను. విద్యార్థులటుల స్వయంసహాయముపై ఆ విందును జరిపించినందులకు గాంధీజీ వారలనందరను, మిగుల శ్లాఘించెను.

33. గాంధీజీ ఆ 1909 సంవత్సరము నవంబరు 13 వ తేదీన ఇంగ్లండునుండి దక్షిణాఫ్రికాకు ఓడపై మగిడివచ్చెను. ఆ ఓడప్రయాణములోనే ఆయన సుప్రసిద్ధ 'హింద్ స్వరాజ్య' గ్రంథమును లిఖించెను. తాను దక్షిణాఫ్రికాలో మరల సత్యా గ్రహోద్యమమును సాగించదలచి ఆ ఉద్యమాను సరణములో అక్కడి యూనియను ప్రభుత్వపు నల్లచట్టము నుల్లంఘించునెడల జైళ్లకుబోవలసియుండువారి కుటుంబముల నివాసార్థమై జోహాన్సుబర్గు సమీపమున టాల్స్టాయ్‌ఫారము నొకదానిని నిర్మించెను. అందులకు గావలసిన ఖర్చుకై భారతదేశములోని సేట్ రతన్ తాతాగారు ఇరువది యైదువేల రూప్యముల సహాయము బంపగా ఆఫారములో తగిన తదుపాయములను సమకూర్చగలిగెను. ప్రభుత్వమువారు పర్మిట్లులేక బయట బాహాటముగా దిరుగు సత్యా గ్రహుల నరెస్టుచేసి జైళ్లలో నంచుచుండగా వారి కుటుంబములకు గాంధీజీ ఆఫార ములో వసతు లిచ్చి వారి ఆహారవిషయమునను, ఆరోగ్యవిషయమునను, పిల్లల విద్యా విషయమునను అనేక నూతనమార్గములను అవలంబించుచుండెను. ఇటుల సుమారు మూడు వత్సరములు జరుగగా 1912 వ సంవత్సరము అక్టోబరు 22 వ తేదీన, అవరకు కొలది దినములక్రిందట పనిమీద ఇంగ్లాండు కేగియుండిన గోఖలే మహాశయుడు

తిరిగి ఇండియాకు మరలిపోవుచు గాంధీజీ కోరికపై దక్షిణాఫ్రికా కరుదెంచెను. ఆయన ఆయూనియను ప్రభుత్వపు అధికారులగు జనరలు 'బోధా'ను, జనరలు స్మట్సును గలిసికొని రెండుగంటలసేపు ప్రసంగించి మరలివచ్చి వారిరువురును ట్రాన్సువాలులోని నల్లచట్టమును తగినసమయములో రద్దుచేయుటకేగాక నెటాలులోని మూడుపౌనుల తలపన్నునుగూడ ఒక సంవత్సరములోపల తప్పక రద్దుపరచుటకుగూడ నుద్యుక్తులై యుండినట్లు తనకు హామీ ఇచ్చియుండినట్లుగా గాంధీజీకి ఎఱుకపర చెను. పిదప కొలదిదినము లచటనుండి గోఖలే ఇండియాకు బోయెను. కాని ఆయిద్దరు దొరలిచ్చిన ఒకసంవత్సరపు గడవు గడచినను నెటాలులోని తలపన్ను రద్దుకాబడ కుండెను. మీదుమిక్కిలి స్మట్సు యూనియను శాసనసభలో ఒకప్రశ్నకు జవాబిచ్చుచు, ఆ తలపన్నును రద్దుపరచుట నెటాలులోని యూరపియనుల కిష్టములేదని సాకు జెప్పెను. అజవాబును తెలిసికొనిన గాంధీజీ అది కుంటిజవాబనియు, అపన్ను రద్దుచట్టము అప్పుడు నాలుగు రాష్ట్రములు యూనియను పార్లమెంటుకు సంబంధించినవనియు, ఎక్కడనో నొక రాష్ట్రముయొక్క మారుమూలనున్న కొందరు తెల్లవారి కయిష్టమయినదని, పార్లమెంటులో బిల్లును దేకుండుట సమంజసముగాదనియు తన యభిప్రాయమును వెల్లడించెను. ప్రభుత్వమువా రాయభిప్రాయమును సగకుగొనక పెడచెవిని బెట్టిరి. అంగుచే గాంధీజీ గోఖలే కోరికపై తానావర కొకసంవత్సరమాపియుంచిన సత్యాగ్రహోద్యమమును పునరుపక్రమింప నుద్యమించెను.

34. ఆవరకు జరిపియుండిన సత్యాగ్రహము ట్రాన్సువాలులోని పర్మిట్లకు సంబంధించిన నల్లచట్టమును గురించి మాత్రమే యైయుండుటచే అచ్చట నుండిన భారతీయులు మాత్రమే ఆఉద్యమములో పాల్గొనగలిగిరి. ఇప్పుడు నెటాలులోని మూడుపౌనుల తలపన్ను నెదుర్కొనవలసి వచ్చుటచే నెటాలులోనుండిన భారతీయులును ఆఉద్యమములో బాల్గొనుట కవకాశ మేర్పడెను. మరియు ట్రాన్సువాలులోని అలజడి కొంత సర్దుమణిగెను. కావున నెటాలువారికొరకై జోహాన్సుబర్గులో టాల్స్టాయి ఫారమున నుండిన సత్యాగ్రహోద్యమ నిలయమును డర్బానులోని 'ఫానిక్సు' కాపురమునకు మార్చవలసి వచ్చెను. ఇది యిట్లుండగా తలవనితలంపుగా నొక నూతన సందర్భము సంఘటిల్లెను. భారతీయ కూలీలు మొదటినుండియు తాము దక్షిణాఫ్రికాకు వచ్చినపుడు తమతోబాటు తమ భార్యలనుకూడ దెచ్చికొనుచుండిరి. ఇండియాలో వివాహములను రిజిస్టరుచేయు ఆచారములేదు. కాని ఆయాచారము దక్షిణాఫ్రికాలో నుండెను. రిజిస్టరు అయియుండని భారతీయుల వివాహములచట చెల్లనేరవని ఒకరు తెచ్చిన ఆక్షేపణపై నలువది సంవత్సరములుగ ఆక్షేపణలేని హైందవ వివాహములు

చెల్లవని 1913 వ సంవత్సరము మార్చి 14 వ తేదీన ఆకాలనీల సుప్రీముకోర్టువారు తీర్పుచెప్పిరి. అనగా వారిభార్యలు ఉంపుడుకత్తెలుగమాత్రమె ఎన్నబడి, వారి సంతతి వారికి తండ్రి ఆస్తిపై వారసత్వపు హక్కులుండవు. కావున భారతీయులు ప్రభుత్వమువారంతవరకు నిరాక్షేపణగా ఆమోదించియుండిన తమ వివాహములను మొదటినుండియు చట్టబద్ధమైనవిగా పరిగణించుటకు శాసనమును చేయవలయునని కోరిరి. అయినను ప్రభుత్వము వారందుకు బూనుకొనరైరి. ఆకారణమున ఫానిక్సు కాపురములోని పన్నిద్దరు భారతీయ సాధ్వీమణులు సుప్రీముకోర్టుతీర్పు అవమానమును సహించలేక ఉద్రేకపూరితులై, సత్యాగ్రహోద్యమములో ముందజవేయ సాహసించిరి. వారిలో శ్రీమతి కస్తూరీబాయికూడ నుండెను. వారందరు ముందుగా ట్రాన్సువాలుకు బోయిరి. వారివద్ద పర్మిట్లులేకున్నను అక్కడి పోలీసు అధికారులుఅడ్డలేదు. గాంధీజీ ఫానిక్సులోని మరి పదునారుగురు వాలంటీర్లను ట్రాన్సువాలుకు బంపెను. వారక్కడ యరెస్టుకాబడి 1913 వ సంవత్సరము సెప్టెంబరు 23వ తేదీన విచారింపబడి జైలుశిక్ష విధింపబడిరి. అరెస్టుకాబడని, మొదటవెళ్ళిన పన్నిద్దరు సాధ్వీమణులు తిరిగి నెటాలుకు వచ్చుచు దోవలో 'న్యూకేసిల్' నగరముననాగి. అచ్చట ప్రభుత్వము వారి బొగ్గుగనులలో పనిచేయుచుండిన భారతీయ కూలీలకు, వారికి విధింపబడియుండిన మూడుపౌనుల తలపన్నునుగూర్చి హెచ్చరించిరి. వెంటనేవారు ఆత్మగౌరవమును దెచ్చుకొని, పనికి స్ట్రయికుజేసి గనులనుండి బయటికి వచ్చివేసిరి. ఆసంగతిని వినిన గాంధిజీ వెంటనే నచటికేగెను. ఇంతలో ప్రభుత్వమువారా పన్నిద్దరు స్త్రీలను ఆ అక్టోబరు 21వ తేదీన అరెస్టుచేసి మూడునెలల కఠినశిక్ష విధించి, ఆవరకు శిక్షింపబడిన పదునార్గురున్న జైలులోనే వీరినికూడ మొదట నుంచిరి. ఆతర్వాత ఆడఖైదీలను, మగఖైదీలనుండి వేరుపరచి వారల నందరిని పలుబాధల పాలుజేసిరి. అటుల ఘోరబాధల నోర్చుకొనుచు, సత్యాగ్రహ మొనరించుచుండినవారి ఆత్మత్యాగమును గూర్చి గాంధీజీ కడు ప్రశంసించెను. ప్రపంచమంతయు సత్యముపై ఆధారపడియున్నదనియు, సత్యమనగా శాశ్వతముగా నుండునదనియు, అసత్యమనగా క్షణభంగురమైనదనియు, ఆకారణమున అసత్యము శాశ్వతముగా జయించగలుగు ననుకొనుట వట్టి భ్రమయనియు, సత్యమే తుదకు జయించునన్న దృఢనమ్మకమే సత్యాగ్రహోద్యమమునకు మూలాధారమనియు వాక్రుయిచ్చెను.

35. గాంధీజీ నెటాలులోని 'న్యూకాసిలు' పట్టణము చేరినతరువాత, అక్కడి బొగ్గుగనులనుండి బయలువెడలి వచ్చియుండిన అయిదారువేల భారతీయ కూలీలను, వెంటబెట్టుకొని, ఆ 1913 అక్టోబరు 28 వ తేదీన ట్రాన్సువాలురాష్ట్రమునకు బయలుదేరెను. త్రోవలో వారల తిండికి అక్కడి భారతీయవర్తకులు సాయ

మొనరించుచుండిరి. వారా ప్రయాణమును, ఎనిమిది మజిలీలలో, రాత్రిళ్ళు ఆగుచు, పగలు సాగించుచుండిరి. ఆమజిలీ మకాములలో, అవసరమైన శానిటరీ పనులను, ఊడ్చుట, పాకీపనులుచేయుట మొదలగువాటిని, గాంధీజీయే తన ముఖ్యసహచరులతో గలిసిచేయుచుండెను. వారినిజూచి కొందరు కూలీలును, ఆపనులను జేయబూనికొనిరి. ఈ విషయమును గాంధీజీ గ్రహించి, ఏ ఉద్యమమునందైనను, నాయకుడు తన ఆజ్ఞవలనగాక, తానే స్వయముగాజేసి చూపుటవలననే, అనుచరులను సరియైన దోవలోనికి దేగలడనియు, అటుల నాయకుడు సేవకుడై పనిచేయునపుడు, నాయకత్వముకై పెనగులాట లుండవనియు, బాగుగా దెలిసికొనెను. గాంధీజీ, అటుల కాలినడకను, బ్రయాణమును సాగించుకొనుచు, నవంబరు నెలారంభమున, వారలనందరిని, ట్రాన్సువాలు సరిహద్దుకు జేర్చెను. వెంటనే, ముందుగా ఆరాష్ట్రప్రభుత్వమున కొక లేఖ లిఖించిపంపెను. ఆలేఖలో, తామప్పుడు ఆప్రభుత్వమువారి నల్లచట్టమును ధిక్కరించి పర్మిట్లు లేకుండ, ట్రాన్సువాలులో నివాసమేర్పరచుకొనుటకై వచ్చుచుండుట లేదనియు, కాని ఆప్రభుత్వమంత్రులైన జనరలుబోథా, జనరలు స్మట్సు ఆవరకు గోఖలేగారి కిచ్చియుండిన వాగ్దానమునకు వ్యతిరేకముగ నడచుటచే, వారిమాట దబ్బరకు తమ అసమ్మతిని దెలుపుటకుమాత్రమే తామాసమయమున సత్యాగ్రహులుగా నచటికి వచ్చుచుంటిమనియు స్పష్టముగా తెలియపరచెను. ఆమాట దబ్బర, ప్రస్తుతము యూనియను గవర్నమెంటు అధికారులైన వారిద్దరు గోఖలేగారికి నెటాలులోని ఇండెంచెర్డుకూలీలకు సంబంధించిన మూడుపౌనుల తలపన్ను రద్దును గురించి ఇచ్చిన కొలనియమ వాగ్దాన దబ్బరయనియు, మరింతస్పష్టపరచెను. కావున ఆ తలపన్నును తామిచ్చిన వాగ్దానముప్రకారము తొలగించుదుమని తెలిపినచో, తన వెంటనున్న కూలీలందరు, తమ సత్యాగ్రహోద్యమమును విరమించుకొని 'న్యూకాసిలు'లోని తమతమ గనులకు బోయి, ఆగనుల అధికారులైన ఆంగ్లేయదొరల అనుగ్రహమునకు బాత్రులగుటకు సిద్ధముగా నున్నారనికూడ, గాంధీజీ ఆలేఖలోవిరళముగా విశదీకరించి, జవాబుకై నిరీక్షించుచుండెను. జవాబుకై వారముదినములు, ఆరవ మజిలీలో ఆగి, ఆనవంబరు 7వ తేదీరాత్రి మరు మజిలీలో మకాముచేసి, తరువాత మరిరెండు మజిలీలలో ట్రాన్సువాలురాష్ట్రములోని, జోహాన్సుబర్గునందలి తమ 'టాల్స్టాయిఫాం'మునకు బోదలచియుండెను. కాని ఆమధ్యమకాలములోనే, నిశిరాత్రి అందరు నిశ్శబ్దముగా నిదురించుచున్న తరి, ఒక యూరోపియను పోలీసు ఉద్యోగి, కటికిచీకటిలో లాంతరు నొకదానిని బట్టుకొని, గాంధీజీని వెదకుచు, ఆయన పరున్నస్థలమును జేరి నిద్రలేపి రహస్యముగా ఆయనను అరెస్టుచేయుటకై వారంటును దెచ్చితినని, సంజ్ఞజేసెను. గాంధీజీ లేచి వారంటునందుకొని ఆ

రాత్రియే ఆ పోలీసు అధికారివెంట వెడలిపోయెను. ఆయధికారి ఆమకాము రైలు స్టేషను సమీపముననే నుండుటచే ఆయనను రైలుమీద నెక్కించి తీసికొనిపోయి మరునాడు 'వాల్కుసురస్టు'నందున్న కోర్టునకుగొనిపోయి, ఆకోర్టు మేజిస్ట్రేటునెదుట బెట్టెను. అక్కడి పబ్లికుప్రాసిక్యూటరు తానింకను ఆకేసువిషయమై పూర్తిగా తయారుకాలేదనియు, కావున ఆనెల 14 వ తేదీవరకు ఆయనను రిమాండులో నుంచవలయుననియు కోరెను. గాంధీజీ, తానకస్మాత్తుగా, మధ్యమకాములో విడిచివచ్చిన స్త్రీలు, పురుషులు, పిల్లలుగల అయిదారు వేల కూలీలకు తగిన ఏర్పాట్లు చేయుటకై తిరిగి పోదలచి, బెయిలుపై, ఆవాయిదా తేదీవరకు విడుదలను కోరెను అందుకా పబ్లికు ప్రాసిక్యూటరు, అభ్యంతరమును దెలిపినను, చట్టరీత్యా, మరణనేరస్థునికిగాక, ఇతరనేరస్థులకు, బెయిలు ఇవ్వదగియుండుటచే. ఆమేజిస్ట్రేటు విధిలేక, ఆయనను బెయిలుపై వదలెను. గాంధీజీ వెంటనే తనకు బెయిలు ఇచ్చినస్నేహితుని మోటారుకారుపై తన మకాముకుబోయి అక్కడి తన సహచరులైన కూలీలతో గలిసి, ఆ మరునాడు అనగా నవంబరు 8వ తేదీన 'స్టాండర్టను' మజిలీచేరెను. అచ్చట ఆ కూలీలకు భోజన సమయమున గాంధీజీ తన స్వహస్తముతో రొట్టిముక్కలను పంచిపెట్టుచుండగా ఆపట్టణకోర్టు మేజిస్ట్రేటు స్వయముగా నచ్చటికివచ్చి, గాంధీజీ ప్రక్కన నిలువబడి, రొట్టెలను బంచిపెట్టుట పూర్తియైనవెనుక ఆయనను చాటుకుపిలిచి, నవ్వుచూ ఆయన అప్పుడు అరెస్టుకాబడెనని దెలిపి, తనవెంట కోర్టునకు దీసికొనిపోయి కేసు విచారణను ఆనెల 21 వ తేదికి వాయిదావేసెను. గాంధీజీ మరల ఆకేసులో కూడ బెయిలుమీద విడుదలనుబొంది, తిరిగిపోయి, తానులేకున్నను ప్రయాణము సాగించుచుండిన ఆకూలీలను మార్గమధ్యమున గలిసికొనెను.

36. ఇండియాలో నుండిన గోఖలే మహాశయుడు పత్రికలద్వారా గాంధీజీ యొక్క ప్రస్తుతపు ఉద్యమమునుగూర్చి కొంత తెలిసికొనుచుండెను. పూర్తి వివరములను దెలిసికొనుటకై, అప్పుడు 'ఫానిక్సు'లో 'ఇండియను ఒపినియను' పత్రికకు సంపాదకుడుగా నుండిన 'పోలకు' దొరగారిని ఇండియాకు బంపవలసినదిగా గాంధీజీకి తంతినిచ్చెను. గాంధీజీ పోలకుకు తంతినిచ్చి తనను ముందు కలిసికొనుమనెను. ఆప్రకారము పోలకు దొరగారు గాంధీజీని 'లెకువర్తు' అను మకాములో నవంబరు 9వ తేదీన గలిసికొని, ఆసత్యాగ్రహులముందు ప్రయాణములో వారితోగూడి కొంత దూరమేగి, గాంధీజీవద్ద సెలవుబుచ్చుకొని ఇండియా ప్రయాణమునకై సన్నద్ధుడగుచుండెను. ఇంతలో ట్రాన్సువాలు ఇమిగ్రేషను ఆఫీసరు వారిద్దరున్న స్థలమునకు వచ్చి గాంధీజీని తాను అరెష్టుచేసినట్లు తెలిపెను. గాంధీగారంత నా ప్రయాణీకులను పోలకుదొరగారి నాయకత్వమున కప్పగించి తానా ఆఫీసరుతో వెడలిపోయెను. అప్ర

యాణికులు మరునాడు అనగా ఆ నవంబరు 10వ తేదీన ఉదయము తొమ్మిది గంటలకు 'బాల్ఫరు' స్టేషనుదరికిచేరినతోడనే వారందరు అరెస్టుకాబడి, మూడు స్పెషలు ట్రైనులలో నెటాలుకు తిరిగి పంపివేయబడిరి. ఇంక గాంధీజీని ఆ ఇమిగ్రేషను ఆఫీసరు అచ్చటి మేజస్ట్రేటు యెదుట బెట్టెను. ఆమేజస్ట్రేటు, గాంధీజీ అవరకు న్యూకేసిలు గనులనుండి బయటికివచ్చి, సత్యాగ్రహులుగా యేర్పడినవారిని వెంటనిడుకొని వచ్చుచు, దోవలో 'డండీ' నగర గనులలో బనిచేయుచుండిన వారిని పురిగొల్పి, క్రొత్తగా స్ట్రయికుచేయించి, వారినిగూడ సత్యాగ్రహోద్యమ ప్రయాణీకులతో జేర్చుకొనిన నేరముకై ఆయనను అరెస్టు చేయవలసినదిగా ఆ డండి మేజస్ట్రేటునుండి తనకు వారంటు వచ్చినదని తెలియబరచెను. ఆవారంటును పురస్కరించుకొని, ఆ మేజస్ట్రేటు గాంధీజీని పోలీసు గార్డుతో 'డండి' మేజస్ట్రేటు కోర్టుకు వెంటనే బంపెను. గాంధీజీ అక్కడ 11వ తేదీన విచారించబడి తొమ్మిది నెలల కఠినవరకము విధింపబడెను. ఆయన అవరకు చెప్పినట్లు 'వాల్కుసురస్టు' మేజస్ట్రేటు కోర్టులో 14వ తేదీన హాజరు కావలసి యుండుటచే ఆదినమున నచ్చటికి గొనిపోబడెను. ఆ కోర్టులో ఆయనకు మూడునెలల కారాగార శిక్ష విధింపబడెను. 21 తేదీ వాయిదా కేసుపై చర్యనేమియు తీసికొనినట్టులేదు. ఈసంగతుల నన్నింటిని ఇండియాలో నుండిన గోఖలేగారు వెంటవెంటనే తెలిసికొని, అప్పటి ఇండియా గవర్నరుజనరలుగా నుండిన లార్డు హార్డింజిగారికి నివేదించుచుండెను. దయార్ద్రహృదయుడైన ఆ హార్డింజి ప్రభువు ఆ 1913 డిసెంబరు నెలలో మద్రాసులో ప్రసంగించుచు, దక్షిణాఫ్రికా యూనియను ప్రభుత్వమువారి చర్యలను తీవ్రముగా ఖండించి, గాంధీజీ ఉద్యమమును ప్రశంసించెను. అయినను దక్షిణాఫ్రికా యూనియను ప్రభుత్వమువారు హార్డింజి ప్రభువు అభిప్రాయమును లక్ష్యముచేయక, భారతీయ కూలీలను జైళ్ళలో నునిచి, పలుబాములకు లోనుచేయుచుండిరి. ఇట్టి దుర్భర స్థితి యేలవచ్చెనో, యెంత కాలముండునో గాంధీజీకి అగోచరముగానుండి ఆయన తనలోతాను తర్కించుకొనుచుండెను. ఒక పెద్ద యంత్రములో దానిలోని ప్రతి స్వల్ప భాగమునకును ప్రత్యేక ప్రయోజనమున్నట్లే, మానవజాత్యభ్యుదయములో ప్రతివ్యక్తియొక్క స్వల్ప కార్యమునకును ప్రత్యేక ప్రయోజనముండి తీరవలయునని ఆయనకు దోచెను. ఆపెద్ద యంత్రముయొక్క ఆశయ నిర్వాహకమునకై దానిలోని స్వల్పభాగములు ఉపకరణములైనట్లే, సర్వమానవాభి వృద్ధికై భగవంతుని ఆశయము నెరవేర్పబడుటకే మనమందరము పనిముట్లవంటి వారమని యూహించెను. కావున మనమొనర్చు కార్యములలో ఏ ఏ సందర్భములలో ఏది భగవదాశయమునకు అనుకూలమో, ఏది ప్రతికూలమో మనము నిర్ణయింపలేము గనుక మనచేతిలోనున్న ప్రయత్న సాధన సైర్మల్యమునందే

నిగానుంచుకొనవలెనేగాని, కార్యఫలసిద్ధికై మనము ఆతురత పడుట అజ్ఞత యని గాంధీజీ గ్రహించెను.

37. దక్షిణాఫ్రికా యూనియను గవర్నమెంటువారు నిర్దోషులై అహింసాపరులైన సత్యాగ్రహకూలీలను చాలకాలము జైలులో నుంచజాలకుండిరి. ఆకూలీలను ఇంగ్లండెంచెర్డు అగ్రిమెంటుపై అక్కడికి బంపిన ఇండియా గవర్నమెంటువారు తమ బాధ్యతను గ్రహింప మొదలుపెట్టిరి. వైస్రాయి హార్డింజి ప్రభువు యూనియను ప్రభుత్వమువారి దారుణచర్యల కచ్చెరువొంది అక్కడి భారతీయకూలీల కడగండ్లను విచారించుటకై ఒక కమిటీని ఏర్పాటుచేయవలసినదని జనరలు స్మట్సుకు ఒకలేఖ వ్రాసెను. అస్మట్సు అక్కడికి వచ్చియుండిన భారతీయకూలీలకు అక్కడి పౌరసత్వపు హక్కుల నిచ్చుటకు మాత్రమే వెనుదీయుచుండెను. కాని వారిచేత తనదేశపు బంగారుగనులలోను, చెరకు, కాఫీ, తేయాకు మొదలగు తోటలలోను తుక్కుచిరుగ పని చేయించుకొని తనదేశము నభివృద్ధినొందించుకొనదలచినవాడగుట వలన ఇండియా వైస్రాయి ఆకూలీల ప్రవాహము నాపుచేయించునేమో యని భయపడి, వైస్రాయి కోరికప్రకారము ఒకకమిటీ నేర్పాటుచేయుట కొప్పుకొనెను. ఒకమూల అక్కడి ఆంగ్లేయవర్తకులకును ఆయన భయపడుచుండెను. అప్పుడాయనస్థితి గాంధీజీ వర్ణించినట్లు ఎలుకను నోటగరచుకొన్న పామువలె మ్రింగను, కక్కను లేకుండెను. అయినను స్మట్సుదొరగారి కప్పుడు భారతీయ కూలీలయెడ కొంత దాక్షిణ్యము కలిగెను. సాధారణముగా మొగమాటము కలవారు తమంతట తామెవరిని నొప్పింపలేక నామకః 'కమిటీలు' అను మిషచే కొందరిని నిర్మించి వారి సిఫారసులను నెపమున తాము చేయదలచుకొనిన పనులను సాధించుకొందురు. ఆవిధముగా స్మట్సు తన కనుకూలురైన మువ్వురు ఆంగ్లేయ సభ్యులుగల కమిటీ నొకదాని నేర్పాటుజేసి, ఆకమిటీ ఎదుట సాక్ష్యమిచ్చుటకై ముందుగా గాంధీజీని ఆయన ఇద్దరు ముఖ్య అనుచరులతో గలిపి, ఆ 1913 డిసెంబరు 18 వ తేదీన బేషరతుగా జైలునుండి విడుదల చేయించెను. అంత గాంధీజీ తన ఇరువురు అనుచరులతో గలిసి డర్బానుకు బోయి 21 వ తేదీన స్మట్సుకొకలేఖ వ్రాసెను. ఆలేఖలో రెండు సంగతులను దెలిపెను. ఒకటి ఆయన ఏర్పాటుచేసిన కమిటీలో మరి ఇద్దరు నిష్పాక్షిక సభ్యులను జేర్పింపవలెననుట; రెండు, మిగిలిన సత్యాగ్రహ కూలీల నందరినికూడ విడుదలచేయవలయుననుట, స్మట్సు దొరగారు 24 వ తేదీన జవాబిచ్చుచు మొదటి విషయమును ప్రస్తావించి ఆయన కోరికను నెరవేర్చుటకు వీలులేదనెను. రెండవ విషయమున కొప్పుకొనిరెను. కావున గాంధీజీ 1914 జనవరి మొదటితేదీనుండియు మరల సత్యాగ్రహోద్యమమును సాగించదలచి యుండెను. అందుకు ముందుగా స్మట్సుతో

స్వయముగా మాటాడదలచి ఆయన ఆహ్వానమును బొంది, ఆయనయున్న ప్రిటోరియా నగరమున కరిగెను.

38. అదేసమయమున, అకస్మాత్తుగా ప్రిటోరియాలోని రైల్వేపని వాండ్రయిన యూరపియను దొరలు, ప్రభుత్వముపై సమ్మెకట్టియుండిరి. గాంధీజీ, తానా సమయమున, తన సత్యాగ్రహోద్యమము వలన, ప్రభుత్వము వారి ఇబ్బందులను, ఇనుమడించుట కిష్టపడక తన ఉద్యమమును విరమించుకొనదలచెను. గాంధీజీ యొక్క ఉత్కృష్టౌదార్యమునకు, ఇండియాలోని, దక్షిణాఫ్రికాలోని ఆంగ్లేయులు దిగ్భ్రమనొందిరి. స్మట్సు తనను గాంధీజీ కలిసికొనక మునుపే. పైసంగతిని తెలిసికొని ఆయనకు తన కృతజ్ఞతను వెల్లడించుచు, తన ప్రభుత్వపు కష్టకాలములో, తమను ఆదుకొన దలచిన భారతీయులను శిక్షించుటకు, చేతులాడకున్నవని, తన కార్యదర్శి ద్వారా గాంధీజీకి కబురుపంపెను అటుల అచ్చటి ప్రభుత్వ మానసిక వాతావరణము భారతీయులకు అనుకూలముగ ఏర్పడెను. అతరువాత గాంధీజీ, స్మట్సును చూడబోయినపుడు, ఆ దొరగారాయనను అతిగౌరవముగ నాదరించి, చేరదీసి సంప్రదించి భారతీయుల కోర్కెలను దీర్చుటకు, తన ప్రభుత్వము కంకణము కట్టుకొనినదని గట్టిగా నచ్చజెప్పి పంపెను. భారతీయులంతట ప్రభుత్వము వారేర్పరచిన కమిటీ ముందు సాక్ష్యమిచ్చుట కొప్పకొనిరి. వారిలో గొందరు తాము జైలులోనున్న కాలములో, తమపై జైలుపోలీసు అధికారులొనర్చిన అత్యాచారములను గూడ ఆకమిటీ వారు విచారించవలయునని, పట్టుబట్టిరి. కావేషముతో పగసాధింప బూనుట, సత్యాగ్రహికి తగదని గాంధీజీ వారలకు బోధించెను. ధైర్యవంతులకు క్షమయే భూషణమన్న ఆర్యోక్తిని వారికి జ్ఞప్తికి దెచ్చెను. అంత కతిపయదినములలో ఆకమిటీ భారతీయుల కనుగుణముగ సిఫారసు చేయుటచే ప్రభుత్వమువారు "ఇండియను రిలీఫు" బిల్లు నొకదానిని శాసనసభలో బ్రవేశబెట్టి దానిని చట్టముగా జేసిరి. అందీ సంస్కరణము లుండెను :-

(1) మూడుపౌనుల తలపన్ను తొలగుట

(2) హైందవ వివాహములు చట్టబద్ధమగుట

(3) 'నల్లచట్టము' నాశనమై, భారతీయులు స్వేచ్ఛాను సారముగా 'డామెసైలు' సర్టిఫికెట్లను బొంది అచ్చటి పౌరసత్వపు హక్కులను బొందగలుగుట.

ఈ విధముగా గాంధీజీ మొదట 1906 సెప్టెంబరులో తాను సాగించిన సత్యాగ్రహోద్యమమును 1914 జూనులో విజయవంతమును గావించెను.

## ఎనిమిదవ ప్రకరణము

# ఇండియాకు ప్రయాణము
# ఇంగ్లాండులో - యుద్ధారంభము

## 1914

39. గాంధీజీ ఆతరువాత ఇండియాకు బోదలచెను. ఇంతలో గోఖలే మహాశయుడు తాను ఇంగ్లాండుకు పనిమీద బోవుచుండినట్లును, తన నచ్చట గలిసికొనవలసినట్లును ఇండియానుండి గాంధీజీకి కేబిలుగ్రామును బంపెను. కావున గాంధీజీ తన 'ఫానిక్సు' కాపురములోని ముఖ్య అనుచరులను మాగనులాలు గాంధి వెంట ఇండియాకు బొమ్మని సలహానిచ్చి తానును త్వరలో నచ్చటికి వచ్చెదనని నచ్చజెప్పి తాను ఈలోపున ఇంగ్లాండుకు బోదలచియుండెను. మాగనులాలు వెంట వెళ్ళిన 'ఫానిక్సు' అనుచరులకు ఇండియాలో తగిన వసతి ఏర్పాటు చేయవలసినదిగా ఆవరకు దక్షిణాఫ్రికాలో తన కుడిభుజమైయుండి, అప్పుడు యిండియాలో నుండిన ఆంద్రూసు దొరగారికి గాంధీజీ ముందుగా తెలిపియుండెను. అందువలన ఆయన వారిని మొదటిలో స్వామి శ్రద్ధానందగారి ఆర్యసమాజ గురుకులములో కొంతకాలముంచి అవల వారిని కవిరవీంద్రుని శాంతినికేతన ఆశ్రమమునకు బంపెను. రవీంద్రుడు వారిని దయాగౌరవములతో ఆదరించుచుండెను. ఈలోపున గాంధీజీ ఆ 1914 జూలై 18వ తేదీన తన భార్యను, తన జర్మను స్నేహితుడైన కాలింబాష్ దొరగారిని వెంట నిడుకొని స్టీమరుపై మూడవక్లాసు పాసింజరుగా ఇంగ్లాండుకు ప్రయాణము సాగించెను. స్టీమరు ప్రయాణములోనే మార్గమధ్యముననే ఐరోపాయుద్ధము అసన్నమగు సూచనలు తెలియవచ్చెను. ఆయన ఇంగ్లండులో కాలుపెట్టిన 1914 ఆగష్టు 6 వ తారీఖుకు రెండురోజులు ముందే ఇంగ్లండునకును, జర్మనీకిని యుద్ధము ప్రకటింపబడెను. గాంధీజీ ఇంగ్లాండుచేరిన మరుక్షణమే గోఖలే కొరకు విచారించుచుండెను. ఆయన ఆరోగ్యముకొరకు కొలదిదినముల క్రిందటనే 'పారిసు' నగరమునకు బోయియుండెననియు ప్రస్తుతము ఐరోపా యుద్ధసందర్భమున అకస్మాత్తుగా లండనుకును, పారిసుకును తంతిసంబంధము తెగిపోయెననియు కావున గోఖలే ఎప్పుడు లండనుకు తిరిగి వచ్చునో తెలియుదనియు కనుగొనెను. అందువలన గాంధీజీ గోఖలేకొరకు కొంతకాలము వేచియుండవలచెను. ఆరోజులలోనే ఇండియను నేషనలు కాంగ్రెసు తరఫున భూపేంద్రనాథబోసు, జిన్నా, లాజపతిరాయి మున్నగు భారతీయ ప్రభృతులు కొందరు ఇం

డియా రాజ్యాంగపద్ధతిలో కొన్ని మార్పులను కలిగించవలసిన యవసరమును బ్రిటిషు ప్రభుత్వమువారికి స్వయముగా విన్నవించుటకై లండను వచ్చియుండిరి. బ్రిటిషు గవర్నమెంటువా రాసమయమున చావుబ్రతుకుల స్థితిలో యుద్ధమహార్ణవమున మునిగి యుండుటచే వారికి భారతీయులు వీలైనంత సహాయము చేయగలరని ధైర్యమిచ్చిరి. వారి యభిప్రాయములతో గాంధీజీ పూర్తిగా ఏకీభవించి కార్యరంగమున దుముకుటకు సంసిద్ధుడై యుండెను.

40. ఆయుద్దేశముతో గాంధీజీ, వెంటనే అక్కడి భారతీయ విద్యార్థులను కొందరిని చేరదీసి వారి సాయమున అప్పుడు ఇంగ్లాండు, స్కాట్లండు, వేల్సు, ఐర్లాండులలో నుండిన భారతీయులను పెక్కండ్ర నొకచో సమావేశపరచి తామందరు బ్రిటిషు ప్రభుత్వము వారికి, కష్టకాలములో సహాయముచేయుట తమ విధియని తన యభిప్రాయమును వెల్లడించెను. కాని వారిలోని యువకులు కొందరందు కిష్టపడక భారతీయుల కోరిక ననుసరించి, ఇండియారాజ్యాంగములో మార్పులు చేయవలసినదని, ఒత్తిడిచేసి చెప్పుటకు ఇదియే తగిన అవకాశమని వాదించిరి. గాంధీజీ ఇంగ్లాండు యొక్క అవసరమును ఇండియా యొక్క అవకాశముగా దీసికొనుట సముంజసము కాదని విన్నవించెను. ఆ తరువాత గాంధీజీ ఆ ఆగస్టు 14వ తేదీన కస్తూరిబాయితోపాటు అప్పుడక్కడ నుండిన శ్రీమతి సరోజనీదేవి, డాక్టరు జీవరాజ మెహతా మొదలగు ఏబదిమంది భారతీయనాయకులు గూడ తనతో జేరగా వారందరు కలిసి తాము బ్రిటిషు ప్రభుత్వమునకు వారి యుద్ధసందర్భమున చేతనైన సహాయము చేయగలవారమని ఇండియా అండరు సెక్రటరీ, 'రాబర్ట్సు' దొరగారికి అందరును సంతకములు చేసిన పత్రమునొక దానిని సమర్పించిరి ఆయన దానిని ఇండియా సెక్రటరీ లార్డు క్రూదొరగారికి బంపగా ఆయన మొదట తటపటాయించెను. తరువాత అక్టోబరు నెలలో తన యంగీకారమును తెలిపెను. వెంటనే గాంధీజీ ఎనుబదిమంది వాలంటీర్లను సమకూర్చి ఆరు వారములు వారికి తనతోబాటు ఫస్టుఎయిడు కోర్సు నిప్పించి, వారల నందరిని ఆపరీక్షలో కృతార్థుల జేయించెను. అటుల పరీక్షలో ఉత్తీర్ణుడైన గాంధీజీ తన శక్తికిమించిన డ్రిల్లు, కాలినడక ప్రయాణముల వలన డొక్కలో పార్శ్వశూలతో బాధపడవలసి వచ్చెను. ఇట్లుండగా గోఖలే మహాశయుడు లండనుకు తిరిగివచ్చెను. ఆ సన గాంధీజీయొక్క అనారోగ్యస్థితికి చాల చింతించెను. తరువాత ఆయన ఇండియాకు మరలిపోయెను. డాక్టరు జీవరాజ మెహతా గాంధీజీకి వైద్యచికిత్స జేయుచు, ఆహారములో కొన్ని మార్పులను సూచించెను. అయినను శూలనొప్పి తగ్గకుండెను. అంతట ఇండియా అండరు సెక్రటరీ

రాబర్ట్సు దొరగారు గాంధీజీని స్వయముగా దర్శించి ఆయనచేసిన సేవకు కృతజ్ఞతను దెలిపి, ఆయన త్వరలో ఆయనదేశమునకు బోయినచో పూర్తి ఆరోగ్యమును బొంద గలడని సలహానిచ్చెను. గాంధీజీ ఆసలహా ననుసరించి ఇండియాకు బోనిశ్చయించు కొని, తన జర్మను స్నేహితునిగూడ తనవెంట దీసికొనిపోదలచి యుండెను. కాని, అప్పటి యుద్ధము ఇంగ్లీషువారికిని, జర్మనువారికిని ఆయియుండుటచే ఆజర్మను స్నేహితునికి ఇండియాకు బోవుటకు 'పాసుపోర్టు' దొరకలేదు. గాంధీజీ ఇండియా లోని వైస్రాయి హార్డింజి ప్రభువుకు కేబిలు పంపినను ప్రయోజనము లేకపోయెను. ఆకారణమున గాంధీజీ తన ప్రియ మిత్రుని అచ్చటనే వదలిపెట్టి తాను మాత్రము తనభార్యతో కలిసి ఆ డిసెంబరు 19వ తేదీన సరాసరి ఇండియాకు బయనమయ్యెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

# ఇండియాలో - తుదిసారి - ఆరంభదినములు

## 1915

**41.** గాంధీజీ 1915 వ సంవత్సరము జనవరి 9వ తేదీన బొంబాయిరేవులో దిగెను. అప్పటికి ఇండియాలో ప్రెస్ఆక్టు, సెడిషనుమీటింగ్సుఆక్టు, అమలులో నుండెను. తిలకు, బిసెంటుగారలు నిర్బంధములనుండి వదలిపెట్టబడినను, పెక్కు దేశాభిమానులు జైళ్ళలో మ్రగ్గుచుండిరి. బొంబాయిచేరినవెంటనే ముందుగా నచ్చట గవర్నరు లార్డు విల్లింగుడనును గలిసికొనవలసినదిగా పూనానుండి గోఖలే వర్తమాన మంపియుండెను. కావున గాంధీజీ అటుల నొనర్చెను. గవర్నరు గాంధీగారి ధైర్య సాహసములను ఆవరకే నెరిగియున్నవాడగుటచే, ఆయన అచ్చటి రాజకీయపరిపాలనా విషయములలో జోక్యము కలిగించుకొనదలచినపుడు ముందుగా తనతో సంప్రదింపుమని కోరెను. అందుకు గాంధీజీ జవాబిచ్చుచు తన సత్యాగ్రహవిధానమును ననుసరించి, ముందుగా ఎదుటివాని అభిప్రాయమును పూర్తిగా గ్రహించనిదే, తానేమియు ఎప్పుడును చేయనని స్పష్టముగా తెలియబరచెను. గాంధీజీ గవర్నరువద్ద సెలవుగైకొని, ఆ జనవరి 13 వ తేదీన అప్పుడు పూనాలో జబ్బుగా నున్న గోఖలేగారిని చూడబోయెను. గోఖలే తానాఁరకు 1905 జూను 12వ తేదీన స్థాపించియుండిన, 'సర్వెంట్సు ఆఫ్ఇండియా' సొసైటీలో మెంబరుగా చేరుమని గాంధీజీని కోరెను. ఆప్రకార మొనర్పుటకు గాంధీజీ సమ్మతించి, అందుకై అప్లికేషను నొకదానిని వ్రాసిఇచ్చెను. ఆ తరువాత గాంధీజీ తన స్వగ్రామమగు రాజకోటకు బోయెను. మరునెల ఫిబ్రవరి మధ్యలో కవిరవీంద్రుడు గాంధీజీని మహాత్ముడని సంబోధించుచు, తన శాంతినికేతనమునకు ఆహ్వానింపగా అచటికేగదలచెను. మహాత్ముడను బిరుదు గాంధీజీకి అప్పటి నుండియు, స్థిరముగా నేర్పడెను. మహాత్ముడుభార్యాసమేతుడై ఆ ఫిబ్రవరి 17 వ తేదీకి బోల్పూరు జేరుసరికి రవీంద్రుడెచటికో బోయియుండెను. అయినను గాంధీజీ శాంతినికేతనములో నప్పుడుండిన తన ఫీనిక్సు అనుచరులతోగూడి కాలము గడుపుచు వేచియుండెను. ఇంతలో పూనాలో జబ్బుగానున్న గోఖలే ఆ ఫిబ్రవరి 19 వ తేదీన మరణించెనన్న తంతివార్తనందుకొని 22 వ తేదీకి అక్కడికి చేరెను. గాంధీజీ గోఖలే మరణమునకు తనకుగల భక్తియుతదుఃఖసూచకముగ ఒక సంవత్సరము పాద రక్షలను ధరించనని దీక్షవహించెను. గోఖలే గతించినవెనుక, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యులు పెక్కండ్రు గాంధీజీ నూతనసత్యాగ్రహపద్ధతి తామంత వరకనుసరించుచుండిన కంసిట్యూషనలు పద్ధతికి విరుద్ధమని భావించియుండిరి. ఆసం

గతిని గమనించినగాంధిజీ తానిచ్చియుండిన అప్లికేషనును ఉపసంహరించుకొనెను, ఆ ఫిబ్రవరి నెలాఖరున గాంధీజీ రంగూనునకు బోదలచి, మార్గమధ్యమున కలకత్తాలో దిగెను. అక్కడప్పుడింకను ఆవేశపూరితులైయుండిన బంగాళీయువకుల విప్లవయురాజకపు పద్ధతులను నిరసించెను.

42. గాంధీమహాత్ముడు రంగూనువెళ్ళి, కొలదిదినములైనతరువాత కలకత్తాకు తిరిగి వచ్చి మార్చి 6వ తేదీన వఃరల రవీంద్రుని శాంతినికేతనమునకు బోయెను. బ్రాహ్మసమాజ మతస్థాపకులైన శ్రీరాజర్షి రామమోహనరాయి, మహర్షి దేవేంద్ర నాథ టాకూరుగారల ఉన్నతఆదర్శములతో గూడియుండిన, శాంతినికేతనములోని, సార్వజనీన వైజ్ఞానికవాతావరణమును, తనివిదీర ననుభవించెను. పిమ్మట మహాత్ముడు ప్రయాగకేగి ఆపిమ్మట హరిద్వారమునకరిగెను. అచటనున్నపుడే మితాహారదీక్ష వహించెను. అంత నాసమీపముననే ఆర్యసమాజమువారిచే నెలకొల్పబడియుండిన గురుకులమును దర్శించి వారియాదర్శములను గ్రహించెను. తదనంతర మాయన హృషీకేశమునకు బోయి, అక్కడి సన్యాసులతో ననేక మతవిషయముల గూర్చి చర్చించెను. ఆసంయమీంద్రు లాయనను విదేశములకు బోయినపుడు విసర్జించియుండిన శిఖాయజ్ఞోపవీతములను తిరుగ ధరింపుమని కోరిరి. జాతి వివక్షతలేక హిందువులందరు ధరించు శిఖనుమాత్రము తిరిగిధరించి, హిందువులలో యజ్ఞోపవీతము ధరించని వారి కన్న తాను అధికుడనుగానని విన్నవించి అందులకియ్యకొనకుండెను.

43. మహాత్ముడా 1915 వ సంవత్సరము ఏప్రిలు నెలలో మద్రాసుకు బోయెను. అప్పుడక్కడ బ్రిటీషు బారిష్టర్లేర్పాటుచేసిన 'లాడిన్నరు' సమావేశములో పాల్గొని బ్రిటిషు సామ్రాజ్యమునకు 'టోస్టు' ప్రపోజుచేసెను. ఆసందర్భమున ప్రసంగించుచు బ్రిటిషు సామ్రాజ్యములోని ప్రతి పౌరుడును తన మనస్సాక్షి కనుగుణముగ ప్రవర్తించుట కవకాశ మేర్పడియుండుటచేత దానియెడల తనకు భక్తిప్రేమలు కలవని తెలియబరచెను. మరియు ఏప్రభుత్వము ప్రజలను ఎంత తక్కువ జోక్యముతో బరిపాలించునో అట్టి ప్రభుత్వమే శ్రేష్ఠమైనదను ఉత్తమ సిద్ధాంతమును బ్రిటిషు ప్రభుత్వము అనుసరించుచున్నందులకు సంతోషించెను. ఆతరువాత మహాత్ముడు ఆనెలలోనే మద్రాసులోజరిగిన రెండు మూడు సభలలో గంభీరోపన్యాసము లిచ్చెను. విద్యార్థుల సభలో నుపన్యసించుచు ప్రొఫెసరు మాక్సుముల్లరు హిందూమతమునకు ఇచ్చియుండిన నిర్వచనమును బోధపరచెను. అది హిందూమతమంతయు Duty అను నాలుగు ఇంగ్లీషు అక్షరములలో నిమిడియున్నదనుట. అందు 'ధర్మము' అను విధియేగాని 'హక్కు' జోటులేదు. ఆయన పశ్చిమదేశ నాగరికతను ఖండించుచు మనమాదేశపు

పరప్రభుత్వమును సహించుటలో అపరదేశ నాగరికతను బేరమాడి దాని ననుసరించుటకు బూనుకొనలేదని తెలిపెను. ఐరోపాఖండము నేడు అధునిక నాస్తికనాగరికత యొక్క కాలిమడమలక్రింద నణగద్రొక్కబడి మూలుగుచున్న వైనమును కన్నులార గాంచుచుండిన భారతీయులు అట్టి నాగరికతను తమ మాతృదేశములో నెలకొల్ప దలచుట విచారకరమైన విషయమని వ్రాసెను. తాను బ్రిటిషు సామ్రాజ్యమునకు జెందిన దేశములలోని వారు లందరితోడను సమానస్థాయి నొందుటకు వీలున్నట్లు కనుపడుటచే ఏదోయొక సభ్యజాతికి జెందినవాడ ననుకొనుటలేదని దెలిపెను. మరియు మనము వాంఛించిన సమానస్థాయిని ఇచ్చుటకు బ్రిటిషు గవర్నమెంటు నిరాకరించినచో దానిని మనమే దీసికొన బ్రయత్నించుట మనకు విధియని కూడ స్పష్టముగా దెలియపరచెను.

44. మహాత్ముడనంతరము మేనెల 22వ తేదీన దక్షిణాదిననున్న మాయవరమున కరిగెను. అచ్చటాయన అస్పృశ్యతను గురించి మొదటిసారి ముచ్చటించెను. అస్పృశ్యత, సర్వమానవ సౌభ్రాతృత్వమును బోధించు హిందూమతమునకు, కళంక మాపాదించుచున్నదని విశదపరచెను. మరియు ఆనగరమున మంచిమంచి చీరలను తయారు చేయుచుండిన పెక్కు చేతిమగ్గములను తిలకించి సంతసించి, ఆస్వదేశీ ఉద్యమమును చాల ప్రోత్సాహ పరచెను. మహాత్ముడానెల ఆఖరువారములో బెంగుళూరుకుబోయి అచ్చట గోఖలే మహాశయుని చిత్రపట మావిష్కరించెను.

45. ఈవిధముగా మహాత్ముడు దేశయాత్రను కొంతవరకు జరిపి ఆ మేనెల 25వ తేదీకి అహమ్మదాబాదు జేరెను. అక్కడాయన ఇరువది యైదుగురు అనుచరులతో 'సత్యాగ్రహాశ్రమము'ను మొదట స్థాపించెను. ఆ ఆశ్రమవాసులకు కొన్ని నియమములను విధించెను. అవి పతంజలి మహర్షిచే మానవుల ఆత్మోన్నతికి అవసరమని చెప్పబడిన అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను ఐదు ముఖ్య విధులకుతోడు స్వదేశీ, అస్పృశ్యత అను మరి రెండు కూడ అయియుండెను. మహాత్ముని 'స్వదేశీ' నియమము మానవుడు సాధ్యమైనంతవరకు తన యిరుగు పొరుగువారి పరిశ్రమలను ముందుగా ప్రోత్సహించవలయునను నైతిక సిద్ధాంతముపై ఆధారపడి యుండెను. గాంధీమహాత్ముడట్లు అహమ్మదాబాదులో నుండగా ఒక గొప్ప విశేషము తటస్థించెను. అక్కడ నాపరకు చిన్న వకీలువృత్తిలో నుండియుండిన వల్లభభాయి పటేలు కొంతకాలమునకు తన నలువదవయేట ఇంగ్లాండుకేగి బారిష్టరు పరీక్షలో ప్రథమ తరగతిని ఉత్తీర్ణుడై పాశ్చాత్య నాగరికతలో మునిగి తిరిగివచ్చి గొప్పగా ప్రాక్టీసుచేయుచుండెను. ఆయన ఆరోజులలో అనుదినము అక్కడిక్లబ్బులో చాలసేపు చీట్లపేక ఆడుచుండెడి అలవాటును కలిగియుండెను. అట్టి సమయములో

ఒక దినమున గాంధీజీ అక్లబ్బులోని యొకగదిలో కొందరితో తన సత్యాగ్రహపద్ధతిని గూర్చి బిగ్గరగా ముచ్చటించుచుండగా ప్రక్కగదిలో చీట్లాడుచుండిన పటేలు విసుగుకొని, ముచ్చటించుచున్నది గాంధీజీయని తెలిసికొని ఆపిచ్చవాని గోలయా యని హేళనజేసెను. కాని భగవంతుని మాయవలన కొలదిరోజులకే పటేలులో గొప్ప మార్పుగలిగి, ఆయన మహాత్ముని ఆశ్రమములో జేరుట, గాంధీజీకి అత్యంత ప్రియశిష్యుడగుట సంభవించెను.

---

ప ద వ ప్ర క ర ణ ము

# కాంగ్రెసుతో సంబంధము - మహాత్ముని విజయము

## 1915—1918

46. మహాత్ముడు బొంబాయిలో ఆ 1915 వ సంవత్సరము డిసెంబరు నెలలో జరిగిన కాంగ్రెసు మహాసభకు అహమ్మదాబాదునుండి డెలిగేటుగా మొదటి సారి వెళ్ళెను. అప్పటివరకు కాంగ్రెసు అనుసరించుచుండిన కంస్టిట్యూషనలు పద్ధతి కలవాటుపడిన వారికి, ఆయన యొక్క నూతన 'సత్యాగ్రహపద్ధతి' విపరీతముగా దోచుటచే, ఆయన కాంగ్రెసు విషయనిర్ణయ కమిటీకి మెంబరుగా నెన్నుకొనబడ లేదు. అయినను ఆయన ప్రతిభను బాగుగానెరిగిన ఆ కాంగ్రెసు ప్రెసిడెంటు సత్యేంద్రప్రసన్న సింహాగారు, మహాత్ముని నాకమిటీలో మెంబరుగానుండుటకు నామినేటు చేసిరి. ఆసంవత్సరపు కాంగ్రెసులో నామోదింపబడిన ముఖ్యమైన తీర్మానము కాంగ్రెసు డెలిగేట్ల అర్హతలను గురించినది యైయుండెను. 1907 లో సూరతులో జరిగిన కాంగ్రెసు మహాసభవరకు డెలిగేట్ల యర్హతలను గురించి కట్టుదిట్టము లేవియు లేకుండుటచే తిలకు మొదలగు అతివాదులు కాంగ్రెసును వశపరచుకొనుటకై జేసిన రసాభాసు అనంతరము గోఖలే మొదలగు మితవాదులు కాంగ్రెసు డెలిగేట్లకు కొన్ని అర్హతలను నిర్ణయించియుండిరి. బొంబాయి కాంగ్రెసు సబ్జక్టు కమిటీ మెంబరుగా నేర్పడిన మహాత్ముని సలహాపై ఆ అర్హతలలో కొన్ని మార్పుల నా కాంగ్రెసు మహాసభ ఆమోదించెను. ఆ మార్పువలన, అతివాదులు కూడ డెలిగేట్లు గావచ్చుటకు వలను కలిగెను.

47. తరువాత మహాత్ముడు 1916 ఫిబ్రవరి 4వ తేదీన కాశీలోని హిందూ విశ్వవిద్యాలయ మహోత్సవమునకు, మదనమోహనమాలవ్యా గారి ఆహ్వానముపై వెడలి అందు అపూర్వోపన్యాసమిచ్చెను. ఆయన ఆఉత్సవ సభావేదికపై అనేక దివ్యాభరణములను ధరించి, ఆసీనులైయున్న మహారాజుల నుద్దేశించి వారి బాధ్యతలను గూర్చి చేసిన నిష్కల్మష ప్రసంగము వారి ప్రక్కన గూర్చుండియుండిన అనిబెసెంటమ్మ గారికి ఆగ్రహమును కలిగించెను. మహాత్ముడా తరువాత మద్రాసుకు మరిల బోయి అచ్చట సాంఘిక సేవ స్వదేశీ, సత్యాగ్రహము మున్నగు అంశములను గూర్చి కొన్ని ఉపన్యాసము లిచ్చి అహమ్మదాబాదుకు వెడలిపోయెను, ఆ సంవత్సరము మే నెల మొదటి తేదీన బెల్గాములో జరిగిన పొలిటికలు కాన్ఫరెన్సులో ఆయన బాల్గొనెను. ఆకాన్ఫరెన్సు కాంగ్రెసుకు సంబంధించి యుండెను. అప్పటి కింకను కాంగ్రెసులోని మితవాదులు అతివాదులు ఒకరి నొకరు కాంగ్రెసు నుండి వెడల

గొట్ట బ్రియత్నించుటను జూచి, వారు ఒకరినొకరు సమన్వయబరచుకొన బ్రయత్నించ వలెనని ప్రార్థించెను.

48. ఆ సంవత్సరాంతమున అనగా డిసెంబరు 22 వ తేదీన మహాత్ముడు అలహాబాదుకు జని, అక్కడి 'మ్యూరు' కాలేజికి సంబంధించిన 'ఎకొనామిక్సు సొసైటీ' వారి ఆధ్వర్యమున జరిగిన సభలో నుపన్యసించుచు, ఆర్థిక నైతిక అభివృద్ధులలో మానవునికి నైతిక అభివృద్ధియే ఎక్కువైనదని నొక్కి వక్కాణించెను. అనంతర మాయన ఆ నెలాఖరున లక్నోలో జరిగిన కాంగ్రెసు మహాసభకు హాజరయ్యెను. అక్కడనే ఆయనకు శ్రీ జవహరులాలు నెహ్రూతో ప్రథమ పరిచయ మయ్యెను. ఆ కాంగ్రెసు మహాసభయొక్క సబ్జెక్టు కమిటీకి మెంబరుగా మహాత్ముడు తిలకు పక్షమువారి వోట్లచే నెన్నుకొనబడెను. ఆ మహాసభలోనే మహాత్ముని ప్రోద్బలమున నే కాంగ్రెసు, ముస్లింలీగుల ఐక్యతకై ఒక స్వరాజ్యరాజకీయప్రణాళిక ఆమోదింపబడెను. మఱియు దక్షిణాఫ్రికాలోని నెటాలులో ఆంగ్లేయుల గనులలోనుతోటలలోను బనిచేయుచుండిన భారతీయకూలీల దురవస్థలను పారదోలిన మహాత్ముడు భారతదేశములోని బీహారులో ఆంగ్లేయ పెట్టుబడిదారుల నీలిమందుతోటలలో బనిచేయుచుండిన భారతీయకూలీల దురవస్థనుగూడ తొలగించగలడని ఆకాంగ్రెసు సభకు వచ్చియుండిన బీహారు డెలిగేట్లు తలచియుండిరి. ఆకారణమున వారు మహాత్ముని సమీపించి బీహారు కూలీల ఇబ్బందులను గూర్చి తీర్మానము నొకదానిని ఆసభలో నుపపాదింపుమని కోరిరి. ఆయన తాను స్వయముగా ఆకూలీలను గలిసికొని అన్నిసంగతులను విరళముగా దెలిసికొనిన తరువాతనే తానేమైనను చేయగలనని వారలకు తెలియపరచెను. బీహారునాయకు లంతట ఆయనను తమ రాష్ట్రమున కాహ్వానించిరి. మహాత్ము డచటికి సాధ్యమైనంత త్వరలో బోవుటకు సమ్మతించెను. ఇంతలో భారతీయులను బ్రిటిషు వలసదేశములకు ఇండెంచెర్డు కూలీలనుగా బంపు పద్ధతిని మాన్పించ వలసినదని కేంద్ర శాసనసభలో మాలవ్యాజీ 1917 ఫిబ్రవరి నెలలో నొక తీర్మానమును దెచ్చెను. దానికప్పటి వైస్రాయి లార్డు ఛెమ్సుఫర్డు అంగీకరించకుండెను. అందుపై మహాత్ముడు వైస్రాయితో స్వయముగా సంప్రదించినను ఉపయోగము లేకుండెను. మహాత్ముడు గత్యంతరములేక ముందుగా దేశములో అందునుగూర్చి కొంత ప్రచారము గావించెను. బొంబాయిలో నావరకేర్పడి యుండిన 'ఇంపీరియలు సిటిజనుషిప్పు అస్సోసియేషను' తరపున నొకసభ నేర్పరిచి అందు ఇండించెర్డు పద్ధతిని ఆసంవత్సరము మేనెల 31వ తేదిలోపున ప్రభుత్వమువారుమాన్పించవలసినదని కోరుచు ఒక తీర్మానమును గావించి వైస్రాయికి దానిని పంపెను. మహా

త్ముని కార్యదీక్షను గ్రహించిన బ్రిటీషు ప్రభుత్వము వారి ఆదేశముపై పైప్రాయి ఆ గడువు తేదికి పూర్వమే అవరకు సుమారు ఏబది సంవత్సరముల నుండియు అమలులో నుండిన అపద్ధతిని మాన్పించెను. ఈలోపున మహాత్ముడు తాను బీహారు నాయకులకు లక్నోలో యిచ్చిన వాగ్దానము ననుసరించి ఏప్రిలు 10వ తేదిన పాట్నాకు బోయెను. అక్కడనే ఆయన రాజేంద్రప్రసాదును మొదటిసారి కలిసికొనెను. అక్కడినుండి నీలిమందు తోటలున్న 'చంపరాను' జిల్లాలోని కొండప్రదేశమగు 'మోతీహారు'కు ఏనుగపై బ్రయాణము చేయవలసివచ్చెను. గాంధీజీరాక అచ్చటి నీలిమందు వర్తకులగు ఆంగ్లేయ దొరలకు చికాకుగ నుండుటచే ఆయనయొక్క ముందు ప్రయాణమును ఆపించవలసినదని ఆదొరలు అచ్చటి జిల్లా ఆంగ్లేయ మేజస్ట్రీటును కోరిరి. ఆ మేజస్ట్రీటు మహాత్ముని ముందుప్రయాణము సాగించకూడదని ఉత్తరవు చేసెను. మహాత్ముడా ఉత్తరవును నిరాకరించ దలచినట్లు తెలుపుటచే ఆయాంగ్లేయ మేజస్ట్రీటు నిష్ఠాంతుడయ్యెను. అవరకెన్నడును, యొవడును భారతదేశములో ఆంగ్లేయ ప్రభుత్వమువారి అజ్ఞలను యెదిరించ సాహసించినవాడు లేకుండెను. కావున ఆమేజస్ట్రీటు ఆయనను అరెస్టుమాత్రము చేయించి ఆరాష్ట్రగవర్నరున కంతయు తంతిద్వారా తెలియబరచెను. ఆగవర్నరు మహాత్ముని మహిమను అవరకే వినియున్న వాడగుటచే అరెస్టును రద్దుచేయవలసినదని ఆర్డరు బంపెను. మహాత్ముడంతట ముందుకు బ్రయాణము సాగించి నీలిమందు తోటలలో బనిచేయుచుండిన భారతీయ రైతులను కలిసికొనెను. వారు ఆంగ్లేయ పెట్టుబడిదారులనుండి పడుచుండిన యిడుములనుగూర్చి వివరముగా దర్యాప్తు చేసెను. అనంతరమాయన బీహారు గవర్నరును జూను 4వ తేదిన స్వయముగా సందర్శించి సర్వవిషయములను సమగ్రముగా ఆయనకు నివేదించి, ప్రభుత్వము వారే ఒక విచారణ సంఘమును నియమించవలసినదిగా బ్రార్థించెను.

49. మహాత్ముడాతరువాత 1917 ఏప్రెలు నెలాంతమున తిరుగ అహమ్మదాబాదు చేరుకొనెను. అప్పుడక్కడ ప్లేగువ్యాధి వ్యాపించియుండుటచే తన 'సత్యాగ్రహాశ్రమము'ను సబర్మతీనదీతీరమునకే క్రొత్తచోటుకు మార్చెను. అప్పటికి ఐరోపాయుద్ధము ఆంగ్లేయుల కనుకూలముగా ఫలించు సూచనలు గనుపట్టెను. ఆకారణమున యుద్ధానంతరమున భారతీయ రాజ్యాంగములో గొన్నిమార్పులను గలిగించి ఒక సంస్కరణ ప్రణాళికను తయారుచేయుటకై బ్రిటిషుపార్లమెంటులోని ఇండియామంత్రి 'మాంటేగ్యు' భారతదేశమునకు రాదలచియుండెను. ఆయనకు సమర్పించుటకై మహాత్ముడు లక్నో కాంగ్రెసు ఆమోదించియుండిన కాంగ్రెసు - లీగు - స్కీమునననుసరించి ఒక మహజరును ఆసంవత్సరమున నవంబరు నెలలో తయారుచేయిం

చెను. ఈలోపున బీహారుగవర్నరు నీలిమందురైతుల ఇడుమలను విచారించుటకై ఏర్పరచిన విచారణ సంఘములో గాంధీజీనికూడ ఒక మెంబరుగాజేర్చియుండుటచే, ఆయన అక్కడికేగి, తనపనిని నిర్వర్తించి అక్టోబరు 3వ తేదీన ఆసంఘపు రిపోర్టును గవర్నరున కందజేసెను. ఆరిపోర్టననుసరించి నవంబరు నెలలో ప్రభుత్వచట్టమొకటి చేయబడుటచే ఆరైతుల ఇక్కట్టులు చాలవరకు తొలగిపోయెను.

50. ఆ 1917 నవంబరు 3 వ తేదీన మహాత్ముడు తిరిగి గుజరాతున కరిగి అచట జరిగిన మొదటి రాజకీయ కాన్ఫరెన్సున కధ్యక్షత వహించెను. తన అధ్యక్షోపన్యాసములో భారతదేశముయొక్క రాజకీయ ఆదర్శము, పశ్చిమదేశముల రాజకీయ ఆదర్శముకన్న మిగుల భిన్నమైనదని విన్నవించెను. ఆ పశ్చిమదేశముల ఆదర్శము 'స్వేచ్ఛ' అయి యుండగా భారతదేశముయొక్క ఆదర్శము 'స్వాతంత్ర్యము' అయి యున్నదని దెలియబరచెను. 'స్వేచ్ఛ' పదములోని 'స్వ' 'అహము' యొక్క ఇచ్ఛతోగూడిన ప్రకృతిసంబంధమైనదనియు, స్వాతంత్ర్యపదములోని 'స్వ' అందరి యందును వ్యాపించిన ఏకైక ఆత్మస్వభావ సంబంధమైనదనియు దేటబరచెను. స్వాతంత్ర్యములో ఇతరులతో సామరస్యముండును; స్వేచ్ఛలో అట్టిదుండదు. మరియు మనముకోరు 'స్వరాజ్యము' యొక్క అర్థము 'స్వార్థముయొక్క రాజ్యము' కాక 'స్వార్థముపైన' రాజ్యము అని బోధించెను. మహాత్ముడాతరువాత డిశెంబరు నెలలో కలకత్తాలో కాంగ్రెసు మహాసభతోపాటు జరిగిన 'సోషలు సర్వీసులీగు' సమావేశమునకు అధ్యక్షుడై సాంఘిక సేవయొక్క యావశ్యకతను గూర్చి చక్కని యుపన్యాస మిచ్చెను. మరు సంవత్సరము అనగా 1918 ఫిబ్రవరి నెలలో అహమ్మదాబాదులోని మిల్లుయజమానులకును అందలి కూలీలకును మధ్య ఏర్పడిన జీతపుతగాదాను బరిష్కరించుటకై యచటి కేగెను. ఆఫిబ్రవరి 22 వ తేదీన ఆ వివాదవిచారణకై మిల్లు యజమానుల అంగీకారముతో ఆర్బిట్రేషను కమిటీ నొకదానిని నెలకొల్పెను. ఆకమిటీ కూడు లోపలనే ఆమిల్లు యజమానులు అకస్మాత్తుగా, కొలది రోజులు 'లాకవుటు' ను డిక్లేరుచేసిరి. కావున గత్యంతరము లేక మహాత్ముడా కూలీలకు సమ్మె చేయవచ్చునని, సలహానిచ్చెను. అటుల సమ్మె నారంభించిన కొలది రోజులకే వారిలో కొందరు మిల్లుపనిలో జేరిపోవుటచే ఆసమ్మె సన్నగిల్లెను. అయినను వారందరు అసంతృప్తితోడనే యుండిరి. అందుపై మహాత్ముడు వారు తిరిగి పట్టుబట్టి తమ తగాదాను ఆ ఆర్బిట్రేషను కమిటీ పరిష్కరించువరకు సమ్మెను సాగించవలెనని చెప్పి వారికి తన సానుభూతిని ప్రదర్శించుటకై అంతవరకు తన ఆహారమును తగ్గించుకొనుటకు దీక్షబూనెను. ఆసమ్మెను వారు తిరుగనారంభించిన కొన్ని రోజు

లకే ఆమిల్లు యజమానులు మహాత్ముడు సూచించిన ఆర్బిట్రేషను కమిటి పరిష్కార మున కొప్పుకొని ఆ ప్రకారము జరిపించిరి. పశ్చిమదేశపు ఆర్థికశాస్త్రము నాధార ముచేసి కొనియే ఫాక్టరీ లేర్పడినవనియు, ఆ ఆర్థికశాస్త్రము ననుసరించి మిల్లు కూలీలు అచేతనములైన యంత్రములుగా భావింపబడుచున్నారనియు ఇంతమంది ఇన్ని గంటలలో ఇంతపని చేయవలయునని మాత్రము అంచనా వేయబడి వారు నిర్బంధింప బడుచున్నారనియు, అందువలన ఆ ఫాక్టరీ యజమానులు మానవాభివృద్ధి కవసరమైన ప్రేమ సౌహార్ద్రిముల ఆవశ్యకతను మరచిపోయిరనియు మహాత్ముడా సందర్భమున దెలియబరచెను. మహాత్ముడు మార్చి నెలలో గుజరాతులోని కైరా జిల్లాకు బోయెను. అక్కడ పంటలా సంవత్సరమున చాలవరకు నశించి యుండుటచే రైతులు గవర్న మెంటు వారికి పూర్తి శిస్తుల నివ్వలేకుండిరి. అయినను ప్రభుత్వ ఉద్యోగస్థులు రివిన్యూచట్టముననుసరించి, వారిని నిర్బంధింప దొడగిరి. ఆరైతులా నిర్బంధములకు ధైర్యముతో తలయొగ్గి పూర్తిశిస్తు నివ్వలేని తమనిజమైన ఆశక్తిని వినయముతో ప్రదర్శించవలయును అని తెలిపిన మహాత్ముని ఆదేశమును బరిపాలించిరి. గవర్న మెంటువారు ఆవిధముగా నిజమును దెలిసికొనగలిగి, వారియ్యవలసిన శిస్తులలో చాల భాగమును మాఫుజేసిరి.

51. అప్పటికింకను ఐరోపాయుద్ధము పూర్తిగా పరిసమాప్తి నొందకుండు టచే, ఇంగ్లీషువారికింకను యోధులు కావలసివచ్చెను. బ్రిటిషుప్రభుత్వము వారి కోరికపై ఇండియావైస్రాయి కొందరు భారతీయులను క్రొత్తగా సేనలో జేర్పించి బంపదలచెను. భారతీయ నాయకుల సహాయముననే, అట్టి రిక్రూటింగు బాగుగా జరుగగలదని యోచించి వైస్రాయి ఆ 1918 సంవత్సరము ఏప్రెలు 27 వ తేదీన ఢిల్లీలో దేశనాయకుల సమావేశమొకదాని నేర్పరచి దానికి మహాత్మునాహ్వా నించెను. ఆ సమావేశమునకు దేశములోని జాతీయ నాయకులగు తిలకు, బిసెంటమ్మ గారలను అలీసోదరులను బిలువకుండుటను దెలిసికొనిన మహాత్ముడు తాను మర్యాద ననుసరించి, ఆహ్వానమునంగీకరించియుండినను ఆ సమావేశములో మాటాడదలచుకొన లేదని వైస్రాయికినివేదించెను. అయినను ఆసభలో వైస్రాయి మొగమాటబరచుటచే రిక్రూటింగు తీర్మానమును బలపరచుచుంటిననిమాత్రము హిందూస్థానిభాషలో ఒక్కమాట జెప్పికూర్చుండెను. మహాత్ముడు తనఇంటికిబోయినతరువాత వైస్రాయి కొకలేఖ వ్రాసిపంపెను. అందులో డొమినియను స్వరాజ్యదేశములతోబాటు బ్రిటిషుసామ్రా జ్యములో సమానస్థాయి నపేక్షించుచున్న భారతదేశము ఆసామ్రాజ్యమునకు ముప్పు కలుగుతరి, బేషరతుగా సహాయముచేయుట సమంజసమని ఒప్పుకొనెను. మరియు

అట్టిసహాయమువలన దేశములోనప్పుడు వ్యాప్తిలోనున్న హోమురూలు ఉద్యమ లక్ష్యము త్వరలో నెరవేరగలదని తానాశించుచున్నట్లు నిర్మొగమాటముగా వ్యక్తపరచెను. ఆయుద్దేశముతోడనే మహాత్ముడు కైరాజిల్లాలో పర్యటించి, రిక్రూటింగు పనిలో శ్రమనొందుటచే బంకవిరేచనములవలన బాధనొందవలసి వచ్చెను. ఆకారణమున ఆయన సేదదీర్చుకొనుటకై తనసబర్మతీ ఆశ్రమములో కాలముగడుపుచుండెను. డాక్టరు ఆయన ఆహారమునకు ఆవుపాలు విధించిరి కాని ఆయన వారితో తాను తన జర్మను స్నేహితునితో గలిసి 1912 వ సంవత్సరములో దక్షిణాఫ్రికాలో ఆమరణాంతము ఆవుపాలను వర్జించు వ్రతమునుబూనియుండెనని చెప్పబోవుచుండగా, ప్రక్కనున్న కస్తూరిబాయి వారిద్ద రాసంవత్సరమున ఆవుపాలను గేదెపాలను వర్జించుటకుమాత్రమే వ్రతమును బూనియుండిరనియు, కావున గొఱ్ఱెపాలు త్రాగవచ్చునన్నచో, అభ్యంతరముండగూడదనియు విన్నవించెను. డాక్టరు అంగీకరించుటచేతను అట్టిది వ్రతభంగము కాదని భార్య ఒత్తిడిచేయుటచేతను, మహాత్ముడు వల్లెయని అప్పటినుండియు ఆయన గొఱ్ఱెపాలను విధిగా త్రాగుచుండెను.

---

## పదునాఱొండవ ప్రకరణము

# దేశములో నూతన పరిస్థితులు

## 1918

52. ఇంతలో ఆ 1918 సంవత్సరము జూలై నెలలో మాంటేగు-ఛేమ్సుఫర్డు రాజకీయ సంస్కారణముల రిపోర్టు ప్రచురింపబడెను. దానిని జర్చించుటకై ఆగష్టు 29 వ తేదీని బొంబాయిలో స్పెషలు కాంగ్రెసు యేర్పాటు కాబడెను. ఆరిపోర్టులో రాష్ట్రములకు ద్వంద్వపరిపాలన సూచింపబడెను. కాంగ్రెసు నాయకులు రాష్ట్రములు వెంటనే పూర్తి ప్రజాప్రతినిధుల పరిపాలనార్హతను కలిగియుండునని నమ్మియుండిరి. ఆకారణమున వారు మొదట కొంత నెనుదీసియుండినను, నూతనరాజ్యాంగ విధానములో కొంచెమైనను బాధ్యతాయుత రాష్ట్రప్రభుత్వ మేర్పడగలదని యూహించి మొదటి ఆరు సంవత్సరములు మాత్రమే ద్వంద్వపాలన సాగించి అనగా కొన్ని ప్రభుత్వశాఖలను మాత్రము ప్రజాప్రతినిధుల కొప్పగించుట కొప్పుకొని, ఆవల అన్నిశాఖలను ప్రజలకు బాధ్యులైన ప్రతినిధుల చేతిక్రిందికి దేవలయునని కోరుచు ఆ స్పెషలు కాంగ్రెసు మహాసభలో తీర్మానించిరి. తరువాత మూడు నెలలకే అనగా నవంబరు 11 వ తేదీన యుద్ధము పరిసమాప్తి నొందెను, ఆర్మిస్టిసు ఏర్పడెను. ఆ ఆర్మిస్టిసు పత్రములో బ్రిటిషువారికి సాయముచేసిన దేశములకన్నిటికి పరిపాలనలో స్వయం నిర్ణయాధికార మివ్వబడునని స్పష్టముగా తెలుపబడెను. అటుల సహాయముజేసిన భారతదేశమునకుగూడ ఆ సూత్రమును వర్తింపజేయవలయునని బ్రిటిషు పార్లమెంటును గోరుచు ఆసంవత్సరము డిశెంబరు నెలలో ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు మహాసభలో మహాత్ముని సలహాపై తీర్మాన మొకటి కావింపబడెను.

---

## పన్నెండవ ప్రకరణము

# పంజాబు దురంతములు

## 1919

53. అప్పుడే అంతమైయుండిన యుద్ధములో మొదటనే ఇంగ్లండుపై విజృంభించి వచ్చియుండిన జర్మను సేనలను భారతీయ సేనలు ధైర్యముతో యెదిర్చి ఫ్రాన్సు దేశములోనే ఆపివేయగలిగి యుండెను. బ్రిటిషువారికా సమయమున యేర్పడిన కృతజ్ఞతను సూచించుటకు ఆయుద్ధ మధ్యముననే అనగా 1917 ఆగస్టు 20వ తేదీన భారతదేశమునకు క్రమేపి బాధ్యతాయుత ప్రభుత్వమును అనగా డొమినియను ప్రభుత్వమును ప్రసాదించుటయే తమ ఆశయమని ప్రకటించి యుండిరి. వారియు యుద్ధానంతరమున యేర్పడిన 'ఆర్మిస్టిస్' సంధి ఒడంబడికలో తమకు సాయము చేసిన దేశముల కన్నింటికి పరిపాలన విషయములో స్వయం నిర్ణయాధికార మిప్పింతు మని వాగ్దానమిచ్చియుండిరి. అయినను అవసరము ముగిసినవెనుక మాట దప్పుటకు వెనుదీయరైరి. మాట దబ్బర మానవుని నైతికముగ బలహీనునిగ జేయును. అట్టి బలహీనతవలన భయమేర్పడును. భయమువలన చేయగూడని పనులను చేయవలసివచ్చును. ఆకారణమున బ్రిటీషు గవర్నమెంటువారు భారతదేశమును తమకాలి క్రిందనే ఇంకను ఉంచుకొన దలచిరి. ఆఉద్దేశ్యముతోడనే ఇండియా ప్రభుత్వమువారు 1919 జనవరి నెలలో ఒకరిపోర్టును ముందుగా ప్రచురించిరి. అదియే 'రౌలటు కమిటీ రిపోర్టు' దానిని గనిన మహాత్ముడు ఆరిపోర్టు ననుసరించి ప్రభుత్వమువారు శాసనము నొకదానిని జేయబూనుకొనిన యెడల ఆశాసనమును నిరోధింప దలచెను. అందుకుగాను ముందుగా శ్రీ వల్లభభాయితో నాలోచించి బొంబాయిలో 'సత్యాగ్రహసభ' నొకదానిని యేర్పాటు చేసెను. అవసరమైనచో దానిద్వారా భారతీయులచే సత్యాగ్రహోద్యమమును సాగింతునని ఆ ఫిబ్రవరి 28వ తేదీన ప్రకటన గావించి దానిని ప్రభుత్వము వారికి తెలియజేసెను. ఆప్రకటనను పత్రికలలో గనిన, శ్రీ జవహరులాలు నెహ్రూ ఆసభలో జేరుటకు ఉత్సాహాలుడై యుండెను. కాని తండ్రి మోతీలాలు కుమారుని పనికి సమ్మతింపకుండెను. కావున మోతీలాలు మహాత్ముని అలహాబాదుకు పిలిపించుకొని, అనేక విషయములను చర్చించి అప్పట్లో ఆయన తన సత్యాగ్రహోద్యమమును విరమించుకొనునట్లు చేయగలిగెను. ఈలోగా గవర్నమెంటు వారు రౌలటు రిపోర్టును బట్టి బిల్లు నొకదానిని శాసనసభలో ప్రవేశపెట్టి మార్చి 18వ తేదీన దానిని శాసనముగా జేసిరి. ఆసమయమున మహాత్ముడు చెన్నపట్టణములో నుండెను. అప్పుడొకనాటి రాత్రి మహాత్మునికి కలయొకటివచ్చెను.

ఆకలలో ప్రభుత్వము వారి నూతన శాసనము నుల్లంఘించు సూచనగ, ప్రజలచే దేశము నందంతటను ఒకరోజు హర్తాలు మాత్రము జరిపించవలసినదిగా ఆదేశము వచ్చెను. ఆ ప్రకారము దేశమునందంతటను ప్రజలు హరతాళమును మార్చి 30 వ తేదీన జరుప వలసినదిగా గోరుతు మహాత్ముడు మార్చి 23 తేదీన పత్రికలద్వారా సందేశమంపెను. మహాత్ముని ఉద్దేశము 'హరతాళము' అనగా మానవుడు తనకు పరునివలన కలిగిన అవమానము గట్టిగా తన మనసున నాటుటచే దానిని బోగొట్టవలయునని శ్రీ హరుని బ్రార్థించుట. అట్టి ప్రార్థనను తదేకనిష్టతో జేయవలసి యుండును గాన ఇతరపనుల నన్నింటిని మానుకొనవలయును కావున అది సమ్మెకాదు. మహాత్ముని సందేశము ననుసరించి కొన్నిచోట్ల మాత్రమే మార్చి 30వ తేదీననే హరతాళము జరుపబడెను. అందులకు గారణ మా సందేశమందరికిని సకాలములో నందమియే. కావున ఇతరులు ఏప్రిలు 6వ తేదీన హరతాళమును జరుపనగునని తిరుగ ఆదేశమియ్యబడెను. ఆప్రకార మన్నినగరములతో బాటు పంజాబులోని అమృతసరు నగరమున గూడ హరతాళ మాదినమున జరుపబడెను. ఆమరునాడు మహాత్ముడచటికి బోవుటకు ప్రయాణ మయ్యెను. దోవలో ప్రభుత్వమువారాయనను బంధించి తిరిగి బొంబాయికి గొని వచ్చి విడిచిరి. ఆవార్తను వినిన గుజరాతు లోని ప్రజలు తమ నాయకునకు గలిగిన అవ మానమును సహించలేక రోషావేశాపరులై ఒడలు మరిచి కొన్ని దుష్కృత్యముల నొనరించిరి. ఆ కారణమున ప్రభుత్వము వారక్కడ మార్షలులాను బ్రవేశ పెట్టిరి గుజరాతులోని 'నడియాడు' ప్రజలొనర్చిన హింసాత్మక చర్యలకు తానే భాధ్యుడనని మహాత్ముడు తలపోసి ప్రాయశ్చిత్త సూచకముగ మూడుదినము లుపవాసముండెను.

54. ఈ సందర్భములో మహాత్ము డుపయోగించిన 'ప్రాయశ్చిత్తము' 'ఉప వాసముల యొక్క యాధార్థ ప్రయోజనమును దెలిసికొనుట యవసరము. ప్రాయశ్చిత్త మనగా మారిన చిత్తము. ఉపవాసమనగా (భగవంతుని) సమీపమున నివాసము. ఇత రులు చేసిన తప్పుకై తాను ప్రాయశ్చిత్తమును ఉపవాసమును అనుసరించుటకు గల కారణమును మహాత్ముడే ఒకసారి తెలిపియుండెను. మనలోని ప్రతివ్యక్తియు తన ఇరుగు పొరుగు వారి చేష్టలకు బాధ్యుడు. అనగా తాను వారి పాపకార్యములకు కూడ పూచీ వహించవలసియున్నది. పరమాత్మ డొక్కడే సమస్తమును అయి యున్నాడు. అయనలో అంశమైన ఒక జీవాత్మ మిగిలిని అంశలనుండి పూర్తిగా వేరుకాజాలదు. అనగా తాను పాపవంతుడైనచో తనచుట్టు నుండువారలకు తన పాపమంటును. ఆదేవిధముగా పుణ్యము కూడ అంటును. అందుచే మహాత్ముడు తాను పునీతుడగుటకు తన ఆత్మకు పరిశుద్ధ పరమాత్మ సమీపమున వసింపజేసి శారీరక సంబంధమైన భోజనాదికములను తాత్కాలికముగ విసర్జించి తన ప్రకృతి సంబంధ

మైన చిత్తములో సరియైన మార్పును కలిగించుకొను ప్రయత్నమే ఆయన ఉప వాస క్రియ.

55. పైన చెప్పినట్లు గుజరాతులోని స్థితి యట్లుండగా పంజాబులో విపరీత చర్యలు జరుగుచుండెను. అచ్చట అమృతసరు నగరములో ఆ 1919 సంవత్సరాంత మున కాంగ్రెసు మహాసభను జరుప నిశ్చయింపబడెను. అప్పు డచ్చట కాంగ్రెసు నాయకులుగా నుండిన హిందూ డాక్టరు సత్యపాలు, మహమ్మదీయ బారిష్టరు కిచ్లూ గారలను గవర్నమెంటువారు ఏప్రెలు 6 వ తేదీన జరుగవలసిన హర్తాలుకు ముందు దినముననే వారిద్ద రందులో బాల్గొనకుండుటకై వారివారి గృహములనుండి బయటకి రారాదని నిర్బంధించిరి. ఏప్రెలు 6 వ తేదీన జరిగిన బహిరంగసభలో ఏబదివేల ప్రజలు పాల్గొని రౌలటు చట్టమును రద్దుచేయించవలసినదనిన్ని, నిరపరాధులగు తమ ఇద్దరు నాయకులను వారి గృహనిర్బంధములనుండి విడిపించవలసినదనిన్ని వినయ పూర్వకముగా ప్రభుత్వమువారిని వేడుచు తీర్మానములను మాత్రము చేసి నెమ్మదిగా నెవరి యిండ్లకు వారు పోయిరి. తరువాత రెండురోజులు ఏవిధమైన అలజడియు లేకుండెను. 9 వ తేదీన అక్కడ జరిగిన శ్రీరామనవమి మహోత్సవమునందు హిందూ మహమ్మదీయ పౌరులెల్లరు కడు సఖ్యతతో బాల్గొనిరి. ఆ ఉత్సవపు టూరేగింపు సత్యపాలు కిచ్లూ ప్రభృతుల ఇండ్లసమీపమునుండి పోవునపుడు అపౌరు లానాయకు లకు జై, జై యని నినాదము లొనర్చిరి. గవర్నమెంటువా రీచర్యను జూచి సహించ లేక వారి నిరువురిని రహస్యముగా తెల్లవారకమునుపే నెక్కడికో గొనిపోయిరి. మరునాడు అనగా 10 వ తేదీ ఉదయమున ఈసంగతిని తెలిసికొని దుఃఖావేశమున నున్నను శాంతిపరులైన విద్యార్థికులు కొందరు వారిద్దరున్న స్థలమును తెలుపవలసిన దని కోరుటకై అచటి డెప్యూటీ కమీషనరు సదనమున కరిగిరి. దోవలోనున్న ఒక వంతెనవద్ద కాపలియుండిన సిపాయిలు వారి నడ్డలేదు. కాని ఆ విద్యార్థికు లావంతె నను దాటినతరువాత ఆసిపాయిలు వారిలో కొందరి వీపులపై తుపాకులను పేల్చిరి. అంత నా విద్యార్థికులు వెనుకకు మరలి గాయపడినవారిని మోసుకొని వారిని వారి వారి యిండ్లకడ జేర్చిరి. ప్రభుత్వమువారి సిపాయి లొనర్చిన ఘోరకృత్యమును వినిన సామాన్యప్రజలు కొందరు వెంటనే రోషావేశముచే మైమరచి ప్రభుత్వ.కట్టడములకు నిప్పంటించుటయు, టెలిగ్రాఫు తీగలను తెంపుటయు మొదలగు దుష్కృత్యము లొనరించిరి. ఆ ఉదయమే గాయపడినవారిని కొందరిని అక్కడి ఆసుపత్రికి గొని పోగా అందున్న దొరసాని నరుసు వారిని హేళనజేసెను. ఆకారణమున కొందరు దుండగులు ఆమె ఇంటికి సైకిలుపై బోవుచుండగా వెంటాడి ఆమెను ఒకసందులో క్రిందకు బడద్రోసిరి. అట్టిచర్యలను సాకుగాగొని గవర్నమెంటువారు మరునాడు

అనగా ఏప్రెలు 11 వ తేదీ నుండియు అమృతసరమున 'మార్షలు లా' పరిపాలనను నెలకొల్పిరి.

56. నిరంకుశమైన ఆ 'మార్షలులా' పరిపాలనలోనే ఆ ఏప్రిలు 13వ తేదీన 'జలియనువాలాబాగు' దురంతము జరిగెను. ఆదినము అక్కడి వారికి నూతన సంవత్సరాది; ఉగాది పండుగరోజు. కావున అమృతసరు పట్టణమునకు చుట్టు ప్రక్కల పల్లెలనుండి వినోదార్థమై వేలకొలది జనము ఆడంగుల తోడను, పసిపిల్లల తోడను వచ్చియుండిరి. అది యదనుగాగొని, అక్కడి 'మార్షలులా' అధికారి జనరలు డయరు ఆరోజున నొక గొప్పసభ జరుగునని చాటింపించి, యెత్తుగోడలుగల యొక పెద్ద దొడ్డిలో సభ యేర్పాటుచేయించి, అక్కడికి అనేకమంది ప్రజలను రప్పించి ఒక సి. ఐ. డి. వానిచే నుపన్యాస మిప్పించెను. ఆ ఉపన్యాస మధ్యమున ఆకాశమున నొక గాలివిమానము తిరుగుచుండునట్టుజేసి ప్రేక్షకులద్దానిని వీక్షించుటలో నిమగ్నులై యుండగా ఆ డయరు దొరగారు తనసైనికులచే వారిపై తుపాకిగుండ్ల వర్షమును గురిపించెను. ప్రభుత్వమువారి లెఖ్ఖలనుబట్టి నాలుగువందలమంది బలవన్మరణము పాలైనట్లును, రెండువేలమంది గాయము బడినట్లును తరువాత తెలియవచ్చెను. ప్రభుత్వమువారా తరువాత జరిపిన ఘోరకృత్యములు చాలాకాలము వరకు బయట పడకుండుటకై ఆ'మార్షలులా' పరిపాలనను ఆసంవత్సరము జూను 11 తేదీ వరకు పొడిగించిరి. అయినను బొంబాయిలోని 'బొంబాయి క్రానికలు' దినపత్రిక సంపాదకులైన హార్నిమను దొరగారు ప్రభుత్వమువారి కఠిన చర్యలను యెటులనో తెలిసికొని తన పత్రికలో విమర్శించెను. అందువలన ప్రభుత్వమువారాయనను ఇండియానుండి ఇంగ్లండుకు పోర్టుచేసిరి. అంతనా 'బోంబేక్రానికలు' ప్రొప్రయిటర్లు మహాత్మ్మాగాంధిగారిని ఎడిటరుగానుండగోరిరి. వెంటనే గవర్నమెంటువారా పత్రికనుసస్పెండు జేసిరి. ఆప్రొప్రయిటర్లయొక్క వారపత్రికయగు 'యంగు ఇండియా'ను మహాత్ముడు తీసికొని 1919 అక్టోబరు 8వ తేదీన తన ప్రథమ సంచికను ప్రచురించెను. అందులో వైస్రాయి శాసనసభలో శ్రీయుత సత్యేంద్ర ప్రసన్నసింహా గారావరకు యిచ్చియుండిన ఉపన్యాస సారాంశమును తన ఆమోదముతో బ్రకటించెను. ఆ ఉపన్యాసములో ఆయన భారతప్రజల సర్వతోముఖాభివృద్ధికై ఆప్రజలకు తెలిసిన ప్రాంతీయభాషలోనే, ప్రాంతీయ శాసన సభలందు ప్రసంగములను జరుపవలసిన యావశ్యకతను విశదీకరించెను. ఇంగ్లాండులోని బ్రిటిషుపార్లమెంటులో సభికులు కొందరు హార్నిమను దొరగారిద్వారా తెలిసికొనిన పంజాబు ప్రభుత్వపు ఘోర దురంతములనుగూర్చి ఆ పార్లమెంటులో ప్రశ్నించిరి. తత్ఫలితముగ ఇండియా గవర్నమెంటువారు 'హంటరు' కమిటీ విచారణ సంఘము నొకదాని నేర్పరచవలసి వచ్చెను. అంతకు ముందుగనే

కాంగ్రెసు మహాసభవారు మహాత్మునితోగూడిన విచారణ సంఘము నొకదానిని నెలకొల్పిరి. కాంగ్రెసు విచారణ సంఘమువారు పంజాబునకు బోవుటకు ప్రభుత్వమువారు మొందట నిరాకరించినను తరువాత ననుజ్ఞనిచ్చిరి. ఆకారణమున కాంగ్రెసు విచారణ సంఘము తరువాత అక్కడికిబోయి అన్నివిషయములను సాకల్యముగా దర్యాప్తుచేయగా 'మార్షలులా' పరిపాలన కాలములో పంజాబు ప్రభుత్వమువారు అచ్చటి ప్రజలను యీక్రింది అష్టకష్టములకు గురిపెట్టినట్లు స్పష్టమయ్యెను.

(1) ఆవరకు హాస్పటలునర్సు దొరసానిని బైసికిలునుండి కొందరు క్రిందకు పడద్రోసిన సందులోనుండి పోవు మనుష్యులందరు తమ పొట్టలపై ప్రాకుచు పోవలసియుండుట. అట్లుపోవుటలో తమముడ్డిని పైకెత్తినచో కొరడా దెబ్బలు తినవలసియుండుట.

(2) వీధిలో నెచ్చటనైనను తెల్లదొర కనుపించినచో నల్లవారు వెంటనే సలాము పెట్టవలయును. సలాము సరిగాపెట్టినట్లు గన్పడినచో శిక్షార్హులగుట.

(3) బ్రిటిషు అధికారులయెడల అచ్చటి పౌరులకు భక్తివినయములు లేనట్లు ఏమాత్రము కనుపించినను, ఆమార్షలులా అధికారులు వారిని నడిబజారులో కొరడాలతో వీపుపై నెత్తురువచ్చునట్లు కొట్టుట.

(4) పట్టభద్రులైన లాయర్లనెందరినో అక్కడిపోలీసువారు తమను జీతబత్తెములు లేని కూలీలనుగా నుపయోగించుకొని వారిచే అనేక బరువులను మోయించుట.

(5) సైనికోద్యోగస్థులు, చెలగాటకు తమకుతోచినవారిని నిర్నిమిత్తముగ అరెస్టు చేసి జైలులోనుంచుట.

(6) ఏప్రెలు 10 వ తేదీన ప్రభుత్వభవనములను తగులబెట్టుటలో పాల్గొనిరన్న అనుమానముపై కొందరిని విచారించు నెపమున మార్షలులాకోర్టును సృష్టించి అధర్మ విచారణసలిపి పెక్కండ్రకు క్రూరశిక్షలు విధించుట.

(7) బడులలో జదివెడి చిరుతవిద్యార్థులను నడిమధ్యాహ్నపు మిడిఎండలో చాల దూరము నడిపించుట.

(8) గృహములలో ఏపాపమెరుగకయుండిన జనానాస్త్రీలను బయటికి బలవంతముగ లాగి, అనేకవిధముల అవమానబరచుట.

పైవిధముగా భారతీయులను లొంగదీసికొనగలుగుదుమని ఇండియాలోని ఆంగ్లేయప్రభువులు భ్రమించియుండిరి. మహాత్ముని రాకవలన భారతీయులలో అద్భుతమైన నూతనప్రబోధము కలిగినదని వారెరుగరు. మరియు ఈ వరకు తెలిపినట్లు మాటదబ్బర ప్రభుత్వపువారిని నైతికముగ బలహీనులుగ జేసెను. ఆనైతిక పతనమే భారతదేశమున బ్రిటిషుపరిపాలన పతనమునకు ముఖ్యహేతువయ్యెను. పంజాబు దురంత మాపతనమునకు మొందటి దిగువమెట్టుగ పరిణమించెను.

---

పదమూడవ ప్రకరణము

# కాంగ్రెసు చర్చలో మొదటిసారి పాల్గొనుట

## 1919

57. పంజాబు దురంతములను గూర్చిన యుదంతము నంతను కాంగ్రెసు విచారణ సంఘము వారు 1920 ఫిబ్రవరిలో గాని పూర్తిగా గ్రహించలేకుండిరి. ఈ లోపున అనగా 1919 నవంబరు 20వ తేదీన ఢిల్లీలో ఆల్ ఇండియా ఖిలాఫత్ కాన్ఫరెన్సు జరిగెను. దానికి మహాత్ముడు అధ్యక్షత వహించెను. అప్పుడే మహాత్మునికి అబ్దులుకలాము అజదుతో తొలిపరిచయము కలిగెను. స్మార్తబ్రాహ్మణమతస్థులకు శంకరాచార్యుల మతమెట్టిదియో అట్టిదియే మహమ్మదీయ మతస్థులకు ఖిలాఫతు మతము ఖిలాఫతు మతము టర్కీదేశమందుండెను. యుద్ధానంతరమున ఆమతమును ఆంగ్లేయులు వశముచేసికొని యుండిరి. ఆమతమున కేమాత్రము లోపమురాకుండ జూచుట హిందూదేశమందలి మహమ్మదీయ పౌరుల యాశయమైయుండెను. ప్రపంచమందెక్కడను అన్యాయము జరుగకూడదను విశాలదృక్పథము గల మహాత్ముడా ఆశయముతో నేకీభవించక యుండ నేరడు. ఆ డిసెంబరు నెలలో అమృతసరమున జరిగిన కాంగ్రెసు మహాసభలో మహాత్ముడు మొదటిసారి అక్కడ ఏర్పడిన తీవ్రమైన చర్చలో పాల్గొని ఆ జాతీయ మహాసభకు నూతన రూపమును గల్పించెను. అప్పటికే కాంగ్రెసు మహాసభ మితవాద నాయకుల నుండి అతివాదనాయకుల వశమయ్యెను. మహాత్ముడా అతివాద నాయకులకును మించియుండెను. మాంటేగు-చెమ్సుఫర్డు రిపోర్టు ననుసరించి పార్లమెంటులో 1919 సంవత్సరపు ఇండియారాజ్యాంగ చట్టమప్పుడే ప్యాసుకాబడెను. ఆ అమృతసరపు కాంగ్రెసు మహాసభలో ఆ చట్టము చర్చకు వచ్చెను. తిలకు మొదలగు అతివాదుల ఆశయము, ప్రభుత్వముతో సమయానుకూల సహాకారము అయియుండెను. ఆ నూతన చట్టములో ద్వంద్వపరిపాలనా విధానము అనగా పరిపాలనకు సంబంధించిన కొన్ని విషయములలో మాత్రమే బాధ్యతాయుత ప్రభుత్వ విధానము ఉన్నంతమాత్రముచేత ఆచట్టము నమలులో బెట్టుటలో ప్రజలు ప్రభుత్వమునకు సహాకరించవలయునని తిలకుగారొక తీర్మానమును దెచ్చిరి. ఆ అతివాదులలోనే కొందరా తీర్మానమును ప్రతిఘటించిరి. మహాత్ముడాతీర్మానమును గాని ప్రతిఘటనను గాని పూర్తిగా నొప్పుకొనక ఆతీర్మానమునకొక సవరణను ప్రతిపాదించెను. భారతదేశమున కంతకును పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వమును క్రమేపి ప్రసాదింతుమని మాంటేగు చేసియుండిన ప్రకటన ననుసరించియే అనగా మున్ముందు భారతరాజ్యాంగము నేర్పాటుచేసికొను అధికారము భార

తీయుటకే ఏర్పడగలదు అను వాగ్దానము ననుసరించియే ఈచట్ట మిప్పు డేర్పడియుండ వచ్చునని మహాత్ముడు నమ్మియుండెను. ఆకారణమున అపూర్తి బాధ్యతాయుత ప్రభుత్వ సంపాదనయే ఆదర్శముగా బెట్టుకొని దానిని సాధించుటకే ఆచట్టము నుప యోగించవలయునను నూతన తీర్మానము నొక దానిని దెచ్చెను. దాని సందరామో దించిరి. మహాత్మునిపై ఆమహాసభవారొక బరువునుగూడ బడవేసిరి. కాంగ్రెసు మహా సభ నూతన కాన్స్టిట్యూషనును తయారుచేయవలసినదని వారాయనను కోరిరి. మహాత్ముడాతరువాత అలహాబాదున కరిగి అక్కడ నొకనాటి రేయి 'లీడరు' పత్రికా సంపాదకుడగు శ్రీయుత చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణిగారిని చూడ బోయెను. ఆయనలోన బరుండియుండుటచే నిదురలేపుట కిచ్ఛగించక బయటనే రాత్రియంతయు ఆ అచ్చుఆఫీసులో బనిచేయుచుండిన ప్రెస్సు కంపోజిటర్లతో కలిసి మెలసి వారి కష్టసుఖములను దెలిసికొనుచు, వారలతో బాటు ఆరుబయట వేడిమంట లతో చలి గాచుకొనుచు, కటికి నేలపై బండుకొనుచు, తెల్లవారువరకు కాలము గడ పెను. మరునాడుదయమున శ్రీ చింతామణిగారు నిదురలేచి బయటకురా వేగమే మహాత్ముడాయనను గలిసికొని మాట్లాడెను. రాత్రి సంగతిని దెలిసికొనిన శ్రీ చింతా మణిగారు చాలనొచ్చుకొని, ఆప్రెస్సు కంపోజిటర్లను తన కెందుకు నిదుర లేప లేదని మందలింపగా వారు అవచ్చిన కొత్తమనిషి మహాత్మగాంధి యని అప్పుడు తెలిసికొని నిర్ఘాంతబోయిరి.

## పదునాల్గవ ప్రకరణము

# మహాత్ముని లో మార్పు

## 1920

౫౮. ఇంతవరకు మహాత్మునికి బ్రిటిషు ప్రభుత్వమువారు పైకి దెలిపిన తమ ఉద్దేశ్యములను శంకించుటకు అవకాశములు యేర్పడియుండలేదు. మహమ్మదీయ మత పీఠమును కలిగియుండిన టర్కీదేశమునకు యేవిధమైన లోపము కలుగనియ్యము అని యుద్ధకాలములో అప్పటి బ్రిటిషు ప్రధానమంత్రి లాయిడుజార్జి యిచ్చియుండిన హామీని బ్రిటిషు ప్రభుత్వమువారు యుద్ధానంతరమున పాలించుట కిచ్చగించరైరి. యుద్ధ సందర్భమున బ్రకటించి యుండిన బాధ్యతాయుత ప్రభుత్వ సిద్ధాంతమును గాని, ఆర్మిస్టిస్ సందర్భమున బ్రకటించిన స్వయం నిర్ణయాధికార సూత్రమునుగాని, వెంటనే వాడుకలోనికి దేకున్నను భారతప్రజల నింకను నిర్బంధములక్రింద నుంచ నుద్దేశింపబడిన రౌలటు శాసనము రద్దుకాకున్నను మహాత్ము డోపికపట్టి యుండెను. కాని పంజాబు దురంతములాతనికి హృదయ విదారణము గావించెను. వాటి నొనర్చినవారు ఇంగ్లండులోని బ్రిటిషు ప్రభుత్వమువారు కారని ఆయనకు తెలుసును. వాటికి నిజమైన బాధ్యులు జీతబత్తెముల కొరకై వచ్చిన నిర్వాచీ ఉద్యోగస్థులని కూడ ఆయనకు తెలుసును. అయినను అట్టి ఉద్యోగస్థులను శిక్షించుటకు మారుగా వారిని సమర్థించి వెనుకవేసికొని వచ్చుటను మహాత్ముడు సహించలేక పోయెను. పంజాబు దురంతములనుగూర్చిన కాంగ్రెసు విచారణ సంఘపు రిపోర్టు ఆ 1920 ఫిబ్రవరి నెలలో బ్రచురమయ్యెను. అంతకుముందే యేర్పడిన ఇండియా గవర్నమెంటువారి 'హంటరు కమిటీ రిపోర్టు' ఆతరువాత బ్రచురింపబడెను. దానిలో దెలుపబడిన కొన్ని యబద్ధపు వ్రాతలు స్వయముగా విచారణను సలిపియుండిన మహాత్మునికి చాల ఆశ్చర్యమును కలిగించెను. ఆఅబద్ధపు వ్రాతల నాధారము చేసికొని ఇంగ్లాండులోని బ్రిటిషు ప్రభుత్వమువారు ఆదురంతములకు బాధ్యులైన మిలిటరీ అధికారి 'డయరు'ను, వానిని బ్రోత్సహించిన గవర్నరు 'ఓడ్వయరు'ను నిర్దోషులుగనెంచి గౌరవించిరి. అంతటితో మహాత్మునికి భారతీయుల యెడల బ్రిటిషువారికి ఉండవలసిన న్యాయశీలత యందు నమ్మకము పూర్తిగా నశించెను. అట్టి సత్యజ్ఞానమును భారతీయులలో వ్యాపింప చేయుటకే ఆవరకు 1919 సంవత్సరము ఏప్రెలు 6వ తేదీన హర్తాళుతో ఆరంభమై 13 వ తేదీన జలియనువాలా బాగుతో అంతమైన వారమును జ్ఞాపక పరచుకొనుటకై 1920 వ సంవత్సరమున ఆ తేదీల మధ్య వారమున జరుపబడిన జాతీయ వారమును యిక ముందు ప్రతి యేటను

జరుపవలసినదిగా మహాత్ముని ఆదేశముపై కాంగ్రెసు నిర్ణయించెను. మరియు మహాత్ముడు అట్టి అన్యాయశీలయుక్తమైన బ్రిటిషుప్రభుత్వమును భారతీయు లికముందు సహించజాలరని సూచించుటకొక ప్రణాళికను సమకూర్చెను. మహాత్ముడు కాంగ్రెసుతో బాటు అప్పటికీదేశములో 1911 నుండి వ్యాప్తములోనుండియుండిన అనిబిసెంటమ్మగారి హోమురూలులీగుతోగూడ సంబంధమును కలిగియుండెను. ఆయన 1920 ఏప్రెలు మూడవవారములో ఆ హోమురూలులీగుకు ప్రెసిడెంటుగా నెన్నుకొనబడెను. మహాత్ముడు తన నూతనప్రణాళికను ఆహోమురూలులీగుద్వారానే మొదట బ్రచురించెను. ఆప్రణాళికలో ఆవరకు వ్యాప్తములోనుండిన స్వదేశీతోబాటు మఱిమూటిని జేర్చెను. అవి: (1) హిందూమహమ్మదీయసఖ్యత (2) హిందూస్తానీ భాషను భారతజాతీయభాషగా నంగీకరించుట (3) దేశమును భాషాప్రయుక్తరాష్ట్రములుగ విభజించుట. ఈమూటియొక్క అత్యంతావశ్యకతను మహాత్ముడు చాలా దూరదృష్టితో గ్రహించెను. ఈ మూడును భారతసుపరిపాలనకు అవసరములే. పరిపాలనయనునది మానవులకు సంబంధించినదేయైనను దానిసరిహద్దులు ఏకదేశసంబంధమైనవేగాని, అందలి భిన్నమతములసంబంధమైనవికావు. అనగా ఒకదేశమందలి పరిపాలనావిధానము అందలివారలందరికిని సమానముగా సంబంధించినది. అందువలన ఒకదేశములోని ఏప్రత్యేకమతస్థులనుగాని నిర్లక్ష్యముచేయుటకు వీలులేదు. మతసంబంధమైన వివిధదృక్పథములయెడల సహజసహన ప్రవృత్తిగల ఆర్యుల భారతదేశము పూర్వము తనపై దండెత్తివచ్చి దేశములో నివాసమేర్పరచుకొనిన సిధియనులు, మంగోలియనులు మొదలగు పైవారలను తనలో జీర్ణముచేసికొనియుండెను. కాని తరువాతి అట్టిమహమ్మదీయులను జీర్ణముచేసికొనలేకుండెను. కారణము: అసహజమైన పరప్రభుత్వములో సహజమైన జీవముండుట అసంభవమగుటవలన,జీర్ణముచేసికొనుటసాగలేదు. దీనికితోడు ఆపరప్రభుత్వమైన బ్రిటిషుప్రభుత్వముహిందూమహమ్మదీయుల నెడబాపుటయే తనపనిగాబెట్టుకొనెను. దూరదృష్టిగలమహాత్ముడట్టియెడబాటు ఉత్తరోత్తర భారతదేశము స్వాతంత్ర్య మనుభవించవలసివచ్చినప్పుడు మహాత్తరమైన యనర్థమును దెచ్చిపెట్టగలదని ఊహించెను. ఆకారణమున హిందూమహమ్మదీయసఖ్యతను తన నూతనప్రణాళికలోజేర్చెను. మరియు జాతీయభాషను నెలకొల్పుటలోగల యుద్దేశముకూడ ఆయన దూరదృష్టినే దెలుపును. లోకములో మానవులను బంధించునది భాషయే. అనగా ఒకరి అభిప్రాయములను వేరొకనికి తెలుపుకొనుటవలననే మానవులలో ఒకరికొకరికి సంబంధము కలుగుచున్నది. అటుల తెలుపుకొనుటకు భాషయే ఆధారము. రాజకీయముగ ఐక్యభారతమును సృష్టించదలచిన మహాత్ముడు ఐక్యభాషనుకూడ సృష్టించదలచుట అవసరమే. ఏభాష, ఈవరకే భారతదేశ

మంతటిలోని ఎక్కువమందిచే వాడబడుచుండినదో దానినే ఏకజాతీయభాషగా నేర్పాటు చేయదలచుట సమంజసముకాదా ? అట్టి ఏకభాషను భారతీయులెల్లరు నేర్చుకొనినచో ఒకరితో నొకరికి పరస్పరసంబంధ మేర్పడును. ఇంక మహాత్ముని ప్రణాళికలోని నాల్గవ సూత్రమగు భాషాప్రయుక్తరాష్ట్రవిభజన ఆయా ప్రత్యేక ప్రదేశములలోని పౌరు లందరికిని విజ్ఞానాభివృద్ధి కలుగుటకు సహకారి కాగలదు. ఆయా ప్రదేశభాషలలో విజ్ఞానసంబంధమైన గ్రంథసముదాయ మీవరకే ఏర్పడి అందలి ప్రజల ఆత్మాభివృద్ధికి దోహద మిచ్చెను. మనదేశములో పూర్వపు స్వతంత్ర కాలమున ప్రత్యేకరాజు లుండియుండుటచే రాజకీయ, ఆర్థిక విషయములను వారే ప్రజలతరపున జూచుకొనియుండిరి. కాని మహాత్ముడుద్దేశించిన నూతన స్వతంత్ర భారతములో ప్రజలే ప్రభువులు కావలసియున్నది. వారు రాజకీయముగను, ఆర్థికము గను గూడ జ్ఞానులు కావలసిన యవసరముండెను. కావున ఆరెండు విషయముల పరి జ్ఞానములుకూడ ఇతర విజ్ఞానవిషయములతోబాటు తమ మాతృభాషలో జరిగినప్పుడే వారు పూర్తిగా అభివృద్ధి నొందగలరు. అట్టి సకలవిధవిజ్ఞానాభివృద్ధియే మానవ జీవి తాదర్శము. ఇటుల మహాత్ముడు తాను నిర్మించబోవు నూతన ఏకైకస్వతంత్ర భారత సౌధము సరిగా నిలుచుటకు గావలసిన నాలుగు స్తంభములకు ముందుగా గట్టి పునాదులను వేయ సమకట్టెను.

59. ఆ 1920వ సంవత్సరము మేనెల 14వ తారీఖున ఏర్పడిన యుద్ధానంతర సంధి షరతులలో ఆవరకు బ్రిటిషుప్రధాని లాయడు జార్జి ఖిలాఫతు మతమును గూర్చి యిచ్చి యుండిన హామీ నిర్మొహమాటముగా వెనుదీయబడెను. ఆకారణమున మహాత్ముడు తన భారతదేశములోని మహమ్మదీయ పౌరుల కోరికపై 'ఖిలాఫతు' సబుకమిటీ నొకదాని నేర్పరచి తద్వారా మాట నిలకడలేని బ్రిటిషు ప్రభుత్వముపట్ల అసహాయోద్యమమును బ్రకటించు తీర్మానమును మొట్టమొదట గావించెను. ఆకారణ మున మహాత్ముడు తన సత్యాగ్రహ విధానము ననుసరించి ముందుగా జూలై నెలలో వైస్రాయి కొక లేఖవ్రాసి పంపెను. అందు తన నూతన అసహాయోద్యమ ప్రణాళి కను గూర్చి ఆయనతో ముచ్చటించదలచి యుంటినని పేర్కొనెను. ఆలేఖకు బదు లుగా వైస్రాయి ఆ ఉద్యమ లక్ష్యమును దెలిసికొనుటకు నిరాకరించి మీదు మిక్కిలి దానిని తృణీకరించి, అది లోకములోని పిచ్చి ప్రణాళిక లన్నిటిలో మిక్కిలి పిచ్చి ప్రణాళికయని వెక్కిరించుచు జవాబిచ్చెను. తన తీర్మానమును ప్రత్యేక మహమ్మ దీయ సంఘముతోబాటు అఖిలభారత జాతీయమహాసభ సంఘము కూడ ఆమోదించి యుండుటచే మహాత్ముడు ధైర్యమువహించి తన అసహాయోద్యమ ప్రణాళిక నములులో

బెట్ట దృఢముగా సంకల్పించెను. ఆ యుద్దేశముతో ఆయన ఆ జూలై 31వ తేదీన తన ఉద్యమమును ఉపవాసముతో నారంభించి, దాని ప్రణాళికను బహిరంగపరచెను ఆ ప్రణాళిక ననుసరించి ముందుగా మహాత్ముడు తానావరకు బ్రిటిషు వారికి బోయరు యుద్ధములో సహాయము చేసినందుకు 1915 లో బ్రిటిషు గవర్నమెంటు తరఫున ఇండియా వైస్రాయి బహుకరించియుండిన కేసరి-ఇ-హింద్ గోల్డు మెడలును వైస్రాయికి వినయపూర్వకముగా తిరిగి పంపివేసెను. దానితో బాటు ఆయన ఒక లేఖను గూడ వ్రాసెను. అందీవిధముగా తనకు బ్రిటిషు ప్రభుత్వము యెడ గలిగిన మార్పును గూర్చి ప్రకటించెను.

"కడచిన కొద్ది నెలలలో జరిగిన విషయములను సావధానముగా పరిశీలించగా బ్రిటిషు సామ్రాజ్యాధికారులు ఖిలాఫతు విషయమునను, పంజాబులోని ప్రభుత్వాధికారు లొనరించిన దారుణకృత్యవిషయమునను భారతీయులయెడ అధర్మమునకు జంకక దుర్నీతికరముగను, అన్యాయముగను ప్రవర్తించినట్లు స్పష్టమైనది. కావున అట్టి అన్యాయప్రభుత్వమునెడల నా కిసుమంతయు గౌరవముగాని, ప్రేమగాని యుండజాలదు. ప్రస్తుతపు బ్రిటిషు ప్రభుత్వముతో ఈవరకువలెనే నికముం దెంతమాత్రము మనస్ఫూర్తిగా నేవిధమైన సహకార మొనర్పజాలను".

60. మహాత్ము డాతరువాత మహమ్మదాలి మున్నగు యనుచరులతో గూడి తన అసహాయోద్యమమును గూర్చి దేశమునందు పలుచోట్ల ప్రచారము చేయదలచెను. ఆప్రకార మాయన ముందుగా మద్రాసుకు బోయి అక్కడ బీచిలో మహోపన్యాసము లిచ్చి యా తరువాత తంజావూరు, తిరుచునాపల్లి, బెంగుళూరు మొదలగు పురముల కేగి యా యుద్యమమును గూర్చియే మరలమరల చర్విత చర్వణముగ జెప్పుచుండెను. అట్టి ఉపన్యాసములకు దోడు వారవారము తన వారపత్రికయగు 'యంగు ఇండియా' యందు తన ఉద్యమముపై కొందరికి గలిగిన అభ్యంతరములకు సహేతుకమైన జవాబులను బ్రచురించుచుండెను. మరియు అందు తన నూతన అసహాయోద్యమ ప్రణాళికను వివరముగా విశదపరచు చక్కని వ్యాసములను చదువరుల మనసుల కెక్కునట్లు సరళముగా వ్రాయుచుండెను. ఆ వ్యాసములలో నొకటి : "క్షత్రియొక్క సిద్ధాంతము". అందులో ఆయన వ్రాసిన వాక్యము లివి :—

"దౌర్జన్యమా ? లేక పిరికితనమా ?- ఏది యుక్తము అను సమస్య ఏర్పడి నప్పుడు నేను ఆ రెంటిలో దౌర్జన్యమునే ఆమోదింతును. కాని దౌర్జన్యము కంటె అనేకరెట్లు ఎక్కువ శాశ్వతసఫలీకృతము, ధైర్యయుత, దౌర్జన్య

రాహిత్యము. దౌర్జన్యము పశుధర్మము. దౌర్జన్యరాహిత్యము మానవధర్మము. మన ప్రాచీనధర్మమైన స్వార్థత్యాగమునే నేను, సత్యాగ్రహము, అసహాయోద్యమము, సాత్వికనిరోధము అను మారుపేరులతో దెలుపుచున్నాను. బుద్ధిపూర్వకముగ బాధనొందుటయే సజీవమైన దౌర్జన్యరాహిత్యము. భారతదేశము దుర్బలమైనదని తలచి, అది దౌర్జన్య రాహిత్యము నవలంబించవలయునని నేను వాదించుటలేదు. భారతదేశము కత్తిని చేపట్టినచో తాత్కాలికముగ బ్రిటిషు ప్రభుత్వము వారిని జయించగలదు. కాని ఆజయము శాశ్వతముగా నుండజాలదు. భారతదేశము దౌర్జన్యమునందు నమ్మకమున్న పాశ్చాత్య ప్రపంచమున కొక నూతనసందేశ మివ్వగలదని నా దృఢవిశ్వాసము".

మహాత్ముడు తన పత్రికలో (1) పరప్రభుత్వముపెడల ప్రేమలేకుండుట ఒక సుగుణమే (2) బ్రిటీషు సింహముయొక్క జూలును ధైర్యముతో బట్టుకొని దానిని గట్టిగా విదళించుట అను గంభీరమకుటములను మరిరెండు వ్యాసములనుగూడ వ్రాసెను.

---

పదునైదవ ప్రకరణము

# మహాత్ముని అసహాయోద్యమము - రామరాజ్యము

## 1920 — 1921

61. భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వము బాధ్యతాయుతము కానందున అనగా ప్రజలకు బాధ్యులైనవారి ప్రతినిధుల ప్రభుత్వము కానందున అట్టి పర ప్రభుత్వమువారితో వీలైనంతవరకు సహకరించక పోవుట మూలమున దక్కవారిని వేరు విధమున ప్రజల కనుకూలముగ ద్రిప్పుటకు వీలుకలుగగు. అనగా వారిలో హృదయ పరివర్తనము కలుగనేరదు. కావుననే మహాత్ముడు తననూతన అసహాయోద్యమ ప్రణాళికను సృష్టించెను. దానిని జర్చించుటకై 1920 వ సంవత్సరము సెప్టెంబరు 4వ తేదీ మొదలు 9వ తేదీవరకు కలకత్తాలో స్పెషలు కాంగ్రెసు మహాసభ జరిగెను. దానికి సుప్రసిద్ధ పంజాబు నాయకుడు శ్రీ లాలా లాజపతిరాయిగా రధ్యక్షత వహించిరి. ఆప్రణాళికలో సప్తవిషయములు గలవు. అవి :

(1) బ్రిటిషు గవర్నమెంటువా రిచ్చియుండిన గౌరవపదవులను త్యజించుట,

(2) ప్రభుత్వమువారాహ్వానించు సభలకు బోకుండుట,

(3) గవర్నమెంటు స్కూళ్ళనుండి విద్యార్థులను తప్పించి, జాతీయ విద్యాలయములలో వారిని జేర్పించుట,

(4) బ్రిటిషు కోర్టులను న్యాయవాదులు, తగవుదారులు, క్రమ క్రమముగా విడిచి పెట్టి, తమ తగాదాలను ప్రైవేటు ఆర్బిట్రేషను మూలమున పరిష్కరించు కొనుట,

(5) భారతదేశమునకు జెందని మెసపొటమియాలో బ్రిటిషు ప్రభుత్వపు నౌకరీలో భారతీయు డెవరును చేరకుండుట,

(6) బ్రిటిషు పార్లమెంటులో ప్యాసు అయిన నూతన ఇండియా రాజ్యాంగచట్టము ననుసరించి యేర్పడబోవు నూతన శాసన సభలను బహిష్కరించుట, అనగా అందు జేరదలచిన అభ్యర్థులకు ఓట్లనివ్వ కుండుట,

(7) వీలైనంతవరకు విదేశ వస్తువులను వాడకుండుట.

పై ప్రణాళికలోని, 4, 6, విషయములను, అనగా లాకోర్టులను శాసనసభలను త్యజించవలయునను విషయములు అక్కడెక్కవగా గూడిన పెక్కు వకీళ్ళమనముల కెక్కలేదు. అక్కడ నున్న ఆనెబిసెంటమ్మ గారికి బ్రిటిషు ప్రభుత్వము నెడల అసహాయోద్యమము అసలే గిట్టలేదు. ఇట్టి స్థితిలో మహాత్ముడు సామరస్య మనస్తత్వము

గల వాడగుటచే, తన ప్రణాళికలోని విషయముల నన్నింటిని వెంటనే అమలులో
బెట్ట నవసరములేదనియు కాలానుసరణముగ క్రమక్రమముగా వీలును బట్టి వాటి
నవలంబింపవచ్చుననియు, వారికి నచ్చజెప్పెను. ఆకారణమున మహాత్ముని తీర్మానము
ఎక్కువమంది సభికులచే నామోదింపబడెను. ఆమహాసభలో వేరొక ముఖ్యమైన తీర్మా
నముగూడ గావింపబడెను. మహాత్ముని అసహాయోద్యమము ఆవరకనుకున్న ఖిలాఫతు
పంజాబులను గూర్చియేమైయుండగా స్వరాజ్య సంపాదనార్థము కూడ ఆయుద్యమ
మును సాగించవలయునని క్రొత్తగా తీర్మానింపబడెను. మహాత్ముడు ఆవరకు తన
కస్పష్టికింకను కాంగ్రెసులో పూర్తిపలుకుబడి దొరకమిచే తాను మొదట చేరియుం
డిన హోంరూలు లీగును కాంగ్రెసుకు అనుబంధముగా నుంచియుండెను. ఆసెప్టెం
బరులో జరిగిన స్పెషలు కాంగ్రెసు అనంతరము తనహోంరూలు లీగుకు స్వరాజ్యసభ
యని నామకరణ మొనరించెను. ఆ సంవత్సరము అక్టోబరు నెల 2వ తేదీన మామూ
లుగా ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సమావేశము కాశీలో జరిగెను. అందు కేవల
స్వరాజ్య సాధనకై ప్రత్యేకముగా మహాత్ముని అసహాయోద్యమ ప్రణాళికను దేశ
ములో నలుదిక్కుల వ్యాపింపజేయుటకు గాను కావలసిన ఖర్చుకై స్వరాజ్య ఫండు
నొక దానిని జమచేయ తీర్మానింపబడెను. అంతకుముందు జూలై నెలలో లోకమాన్య
తిలకు మహాత్ముని అసహాయోద్యమ ప్రణాళికను కాశీలో జరుగబోవు కాంగ్రెసు
కమిటీ ఆమోదించినచో, తాను తప్పక దాని ననుసరింతునని వాగ్దానమిచ్చి ఆ తరు
వాత కొలది దినములకే అనగా ఆ జూలై 31వ తేదీన మరణించుటచే ఆ స్వరాజ్య
ఫండుకు లోకమాన్యుని పేరిడబడెను.

62. మహాత్ముని అసహాయోద్యమ ప్రణాళికనుబట్టి, విద్యార్థులు కాలేజీలను
వదలవలసియుండుటచే వారు విద్యావిహీనులుగ నుండకుండుటకై దేశములో
ముందుగా జాతీయ విద్యాశాలలను మహాత్ముడు నెలకొల్పదలచియుండెను. ఆ యుద్దే
శ్యముతోడనే ఆయన గుజరాతునందు నేషనలు యూనివర్సిటీ నొకదానిని ఆసంవత్స
రము నవంబరునెలలో స్థాపించెను. ఆనెలాఖరున అనగా 26వ తేదీన కాశీకిబోయి
యందలి హిందూయూనివర్సిటీ విద్యార్థుల సభలో బ్రిటిషుగవర్నమెంటుపై నాధార
పడు కాలేజీల 'బాయికాటు'నుగురించి యుపన్యసించెను. మహాత్ముడాయూనివర్సిటీ
విద్యార్థుల నుద్దేశించి, వారు తమయంతరాత్మ బోధించిన తెఱంగున వర్తింపవలయునని
దెలుపగా, వారిలో నొకడు తన కాబోధ ఎప్పుడును వినబడియుండలేదని విన్నవిం
చెను. మహాత్ముడాతనికి జవాబిచ్చుచు, స్వార్థత్యాగము నలవరచుకొన్నవారికే పర
మాత్మసంబంధమైన యీయంతరాత్మయొక్క బోధసరిగా వినబడుననియు, కావున
ముందుగా స్వార్థత్యాగము నలవరచుకొనవలయుననియు, దేటబరచెను. కొందరు

విద్యార్థులారాత్రి మహాత్ముని స్వయముగాదర్శించి తమకొరకై వెంటనే జాతీయ విద్యాశాల నొకదానిని స్థాపించినచో, అయిదునందలమంది విద్యార్థు లాహిందూ యూనివర్సిటీ కాలేజినుండి బయటికివచ్చుటకు సిద్ధముగా నుంటిమని తెలియబరిచిరి. మహాత్ముడు పరప్రభుత్వపోషణక్రిందనున్న కళాశాలలు, అందలి విద్యార్థుల నాపర ప్రభుత్వమునకు మానసికముగ బంధించుచున్నవని దృఢముగానమ్మియుండెను. వారికిని ఆవశ్యకమున్నదని తెలిసికొనినకిమ్మట, వారినొకప్రశ్న వేసెను. వారున్నగదిలో ఘోర సర్పమొకటి కానిపించినచో వారేమిచేతురని ప్రశ్నించెను. వారు తమ కాసమయమున వేరుగదిలేకున్నను, తక్షణమే తామాగదిని వదలివేయుదుమని జవాబిచ్చిరి. అటులనే పరప్రభుత్వ పోషకయూనివర్సిటీకాలేజీని వదలవలసిన యావశ్యకతను నిరూపించెను. అప్పుడే ఆయూనివర్సిటీకాలేజీలో బోధనాచార్యపదవినియుండున్న ఆచార్యకృపలానీ తన యుద్యోగమును త్యజించి, మహాత్మునితో జేరి, కాశీలోనే గాంధీఆశ్రమమను పేరనొక విద్యాకూటమును నెలకొల్పెను. హిందూయూనివర్సిటీ కాలేజినుండి వెడలివచ్చిన విద్యార్థు లావిద్యాకూటములో విద్యనభ్యసించుచుండిరి.

68. ఆ 1920 వ సంవత్సరాంతమున నాగపూరులో అఖిలభారత కాంగ్రెసు మహాసభ శ్రీ సేలం విజయరాఘవాచార్యులవారి యధ్యక్షతను జరిగెను. అందు ఆ వరకు కలకత్తా స్పెషలు కాంగ్రెసు సభలో ప్యాసుకాబడి యుండిన అసహాయోద్యమ ప్రణాళిక పూర్ణాధికార పూర్వకముగా నామోదింపబడి తీర్మానింప బడెను. తొలుదొల్త మహాత్మునివలన ఖిలాఫతు సమస్యయును, తరువాత పంజాబు దురంత సమస్యయును నిర్దేశింపబడియుండిన తన అసహాయోద్యమము కలకత్తా స్పెషలు కాంగ్రెసులోను, కాశీకాంగ్రెసు కమిటీలోను స్వరాజ్యసంపాదన సమస్యకుకూడ విస్తరింపజేయబడి నాగపూరు మహాసభలో పూర్తిగా ఆమోదింపబడెను. కావున మహాత్ముడంతవరకు కాంగ్రెసు మహాసభకు అనుబంధముగా నుంచియుండిన తన స్వరాజ్యసభ నాకాంగ్రెసు మహాసభలో వెంటనే లీనముజేసెను. అప్పటినుండియు తన ప్రణాళికలోని విదేశ వస్తునిరసన సూత్రమునకు అనగా స్వదేశవస్త్రనిర్మాణ సూత్రమునకు సంబంధించిన ఖద్దరువస్త్ర ఉత్పత్తికై దినమున కొకయర్ధగంట చొప్పున రాట్నముపై నూలుదీసికొని భోజనము చేయునని శపథము పట్టెను. అమృతసరు కాంగ్రెసు మహాసభవారు కోరియుండిన ప్రకారము మహాత్ముడు తయారుచేసిన కాంగ్రెసు నూతన కన్స్టిట్యూషను మహాత్ముడు నాగపూరు కాంగ్రెసు మహాసభకు నివేదించియుండెను. అది ఆసభలో ఆమోదింపబడి యుండెను. దాని ప్రకారము కాంగ్రెసు ఆదర్శ మార్గము క్రొత్తగా నేర్పడెను. 1906 లో కలకత్తా కాంగ్రెసు సభలో భారతజాతీయ పితామహుడై యుండిన దాదాభాయి నౌరోజీగారిచే ప్రతిపాదింపబడి

యుండిన 'డొమినియను స్వరాజ్య' ఆదర్శమును సాధించుటకు ఆవరకు ఆమలులో నుండిన గోముూలు పద్ధతిలో "శాంతియుతమైన, ధర్మబద్ధమైన" అను నియమము లను పాటింపవలయు ననుటయే మహాత్ముని కన్స్టిట్యూషను యొక్క నూతనత్వము. మహాత్ముని అసహాయోద్యమ విధానమునకు రెండు భాగములు గలవు. అందొకటి విధ్వంసక కార్యక్రమము. అది పొలములోని కలుపును తీయుట వంటిది. రెండవది నిర్మాణ కార్యక్రమము. అది విత్తనములు చల్లుట వంటిది. కలుపు దీయుట, విత్తన ములు చల్లుట అనురెండు పనులను జేయుటవలననే ఫలసిద్ధి కలుగునట్లు విధ్వంస కార్యక్రమములో బాటు నిర్మాణ కార్యక్రమమునుగూడ జరిపిననేగాని ప్రయోజన ముండజాలదని మహాత్ముని సత్యాభిప్రాయము. కావున పరప్రభుత్వ ప్రాబల్యము నకు పట్టుగొమ్మలై యుండిన బ్రిటిషుదేశపు వస్త్రములు, వారేర్పరచిన కళాశాలలు, కోర్టులు, పోలీసు సిబ్బంది, వారిదేశపు యితర వస్తుసామాగ్రి మొదలగువాటిని బహి ష్కరించునట్టి విధ్వంసక కార్యక్రమములోబాటు వెనువెంటనే వాటికి బదులుగా ఖద్దరు వస్త్రములు, జాతీయ పాఠశాలలు, ఆర్బిట్రేషను సభలు, స్వచ్ఛంద సైనిక దళము, గ్రామ పరిశ్రమలు మొదలగువాటిని నెలకొల్పు నిర్మాణ కార్యక్రమమును గూడ కొనసాగించ వలయుననియే మహాత్ముడు తానూహించిన భారతస్వరాజ్య సంపా దన కాదేశించిన ప్రక్రియ. అట్టి ఆదర్శ స్వరాజ్యమునే మహాత్ముడు రామరాజ్యమని సూచించెను. మహాత్ముడు సూచించిన రామరాజ్యము జీసస్ క్రీస్తు ప్రబోధించిన 'కింగడము అఫ్ హెవెను' వంటిది. గోముూలు అగ్రమున [illegible] రఘువంశోద్భవుడైన శ్రీరామచంద్రరాజు వలన ప్రజలకొరకు అనగా ప్రజాక్షేమముకొరకు జరుపబడి యుండిన స్వరాజ్యమువంటి రాజ్యమని భావము. మహాత్ముని నూతన స్వతంత్ర భారత తములో వేరే రాజు అనునతడు ప్రత్యేకముగాలేక ప్రజలే రాజకృత్యములను జరుపు కొనవలసియుండును. అనగా ఆరాజ్యము 'రాజులు'వలన యనిగాక, ప్రజలవలన యని యేర్పడును. కావున ప్రజలందరును తప్పక రాజునకుండవలసిన న్యాయశీలతను అల వరచుకొన వలసియుండును. అదియే మహాత్ముని 'రామరాజ్య' పరమావధి.

64. కాశీలో నావరకు జరిపిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీవారు తీర్మానించియుండిన లోకమాన్య తిలకు స్వరాజ్యనిధికి 1921 జనవరిలో ఆవరకే తన రావు బహదూరు బిరుదమును విసర్జించియుండిన సేటు జమ్నాలాలు బజాజీ ఒక లక్ష రూపాయల విరాళ మిచ్చెను. అసహాయోద్యమ ప్రణాళికలోని ముఖ్యాంశమై నట్టియు, మానమును గాపాడుకొనుటకు వలయు వస్త్రములకు విదేశములపై నాధారపడవలసి వచ్చియుండుటచే నట్టి విదేశవస్త్రనిరసనకు సంబధించినట్టియు ఖద్దరువస్త్ర నిర్మాణకార్యక్రమ వ్యాప్తమునకై మహాత్ముడాజనవరి నెల లోనే బొంబాయి నగరమున మొదటి ఖద్దరు భాండారమును నెలకొల్పెను. మరు

నెలలో అనగా ఫిబ్రవరి 4 వ తేదీన కలకత్తాకు బోయి యక్కడ సేవనలు కొలే జీని దెరచెను. మార్చి 31 వ తేదీ మొదలు ఏప్రెలు 4 వ తేదీవరకు ఆంధ్రదేశము లోని విజయవాడలో జరిగిన కాంగ్రెసు వర్కింగుకమిటీ మీటింగుకు మహాత్ముడు హాజరయి తిలకు స్వరాజ్యనిధికి ఒకకోటి రూపాయలను సమకూర్చవలెననియు, కాంగ్రెసులో ఒకకోటి మెంబర్లను జేర్చవలయుననియు, ఖద్దరును ప్రోత్సహించుటకై ఇరువది లక్షల రాట్నములను తయారుచేయించి కోరినవారికి సప్లయి చేయించవలసిన దనియు తీర్మానమును జేయించెను. మరియు ఆవర్కింగుకమిటీ కోరికపై పశ్చిమతీర మందలి పోరుబందరు పురమున జననమందిన ఆ గాంధీ మహాత్ముడు తూర్పుతీరమందలి మచిలీబందరు పురవాస్తవ్యుడైన శ్రీ పింగళి వెంకయ్యగారను, ఆంధ్రకళాకోవిదుని సహాయముతో భారతజాతీయ కాంగ్రెసుకు మొట్టమొదటి త్రివర్ణపతాకమును వారముదినములలో తయారుచేసి ఆ ఏప్రెలు 13 వ తేదీన ఆకమిటీవారికి సమర్పించెను.

---

పదునారవ ప్రకరణము

# ఆలీసోదరులు - అసహాయోద్యమము

## 1921

65. ఆ 1921 వ సంవత్సరము ఏప్రిలు మాసములోనే లార్డు ఛెమ్సుఫర్డుకు బదులుగా లార్డు రీడింగు వైస్రాయిగా వచ్చెను. ఆయన అవరకు ఇంగ్లండులో ప్రధానన్యాయమూర్తిగా నుండి ప్రఖ్యాతిని గడించియుండెను. పండిత మదన మోహన మాలవ్యా మహాత్ముని వెంట నిడుకొని శిమ్లాకేగి ఆయనను నూతన వైస్రాయికి ఎరుకపరచెను. మహాత్ముడు వైస్రాయితో పెక్కుగంటలు తన యసహాయోద్యమమును గూర్చి సంప్రదింపులు జరిపెను. ఆ సంప్రదింపులలో వైస్రాయి, కాంగ్రెసు హింసాపూర్వక చర్యల నవలంబించ నంతవరకు, కాంగ్రెసు ఉద్యమములో ప్రభుత్వ మెంతమాత్రము జోక్యము కలిగించుకొనదని స్పష్టముగా తెలియబరచెను. కాంగ్రెసు సభ్యులైన అలీ సోదరులు అంతకుముందు కొలది దినముల క్రిందట నిచ్చియుండిన ఉపన్యాసములలో ప్రభుత్వముపై హింసను పురిగొల్పు వాక్యము లుండియుండుటచే వారిద్దరిపై ప్రభుత్వము చర్యదీసికొనదలచి యుండినట్లు వైస్రాయి మహాత్మునికి తెలియబరచెను. మహాత్ముడు వెంటనే వారిరువురును తామికముందు అట్టి హింసాబోధక వాక్యములను పూర్తిగా త్యజించెదమని వారివద్దనుండి బహిరంగ వాగ్దానమును తెప్పించెదనని నమ్మకముగా మనవిచేసెను. ఆవిధముగా మహాత్ముడొనరించిన తరువాత వైస్రాయి ఆలీసోదరుల నిద్దరిని ప్రాసిక్యూటు చేయుటను ఉపసంహరించుకొనెను. మహమ్మదాలీ షౌకతాలీ, సోదరులిద్దరు అటుల బహిరంగముగా చేసిన ప్రకటనలో తామావరకు అప్పు డప్పుడు రోషావేశముచే ప్రభుత్వమును గూర్చి మితిమీరిన పరుషోక్తు లాడినందుకు తమ మనఃపూర్వక సంతాపమును వెలిబుచ్చిరి. మఱియు ఇకముందు అట్టి హింసను పురిగొల్పు వ్రాతలను గాని మాటలను గాని, ఉపయోగింపము అని వాగ్దానమిచ్చిరి. ఆప్రకటన ఆలీసోదరులకు అవమానమును గలిగించిన పని కొందరనుకొనిరి. అందువలన మహాత్ముడు, ఆ సోదరులిరువురు కాంగ్రెసు ఆదేశానుసారము అనుసరించబోవు అసహాయోద్యమము అహింసాపూర్వకముగ నుండ గలదని నిర్ధారణచేయుటయే అవాగ్దానము యొక్క ముఖ్యోద్దేశమని తెలిపెను. మఱియు దాని నామోదించిన వైస్రాయి యొక్క హామీ ప్రకటన కాంగ్రెసు అవలంబింపబోవు అహింసాపూర్వక అసహాయోద్యమమునకు ప్రభుత్వమేమాత్రము అడ్డుపెట్టదని వైస్రాయి బహిరంగముగా వాగ్దానమిచ్చుట తటస్థించెనని కూడ తెలిపి తాను చేసిన పనిని సమర్థించెను.

66. ఆ సంవత్సరము (1921) జూలై 8 వ తేదీన కరాచీలో జరిగిన ఆల్ ఇండియా ఖిలాఫతు కాన్ఫరెన్సు అధ్యక్షుడుగా మహమ్మదాలీ ప్రసంగించుచు, ''మహమ్మదీయు లెవ్వరును బ్రిటీషువారి సేనలలోగాని, పోలీసులోగాని జేరరాదని దెలిపి ఆప్రకారము తీర్మానమును గూడ గావించెను. తరువాత ఆనెల 28 వ తేదీన బొంబాయిలో జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీసమావేశములో, 1919 సంవత్సరపు నూతనఇండియా రాజ్యాంగ చట్టప్రకారమేర్పడిన శాసనసభల నామోదింప జేయుటకై రాదలచిన యువరాజాగమనమును బహిష్కరించుటకు దీర్మానింపబడెను. యువరాజ బహిష్కరణము ఆయనయెడల ద్వేషమువలనగాదు. భారతదేశములోని పరప్రభుత్వము తమ గౌరవాధిక్యతను నిలువబెట్టుకొనుటకు యువరాజు అనువ్యక్తిని ఉపయోగించదలచుటను నిరసించుటకే ఈ బహిష్కరణతీర్మానము గావింపబడెను. అగస్టు మొదటి తేదీన లోకమాన్యుని నిర్యాణప్రథమ వార్షికోత్సవసందర్భమున బొంబాయిలో స్వదేశవస్త్రోత్పత్తిని చురుకుగా బ్రోత్సహించుటకై విదేశ వస్త్ర వ్యామోహమును నిరుత్సహించుటకై విదేశవస్త్రదహనము మహాత్ముని యాదేశమున జరిగెను.

67. ఆనెల 9 వ తేదీన మహాత్ముడు అలహాబాదుకు బోయి ఆచార్య కృపలానీద్వారా కృష్ణదాసు అనునమ్మకమైన యువకుని దనకు సహాయముగా జేకొనెను. తరువాత మహమ్మదాలీ, బీగం మహమ్మదాలీ, మౌలానా అజాదు మొదలగు వారలతోగూడి పాట్నా, అస్సాము, తూర్పుబెంగాలులలో బర్యటనమొనర్చి సెప్టెంబరు 4వ తేదీన కలకత్తాకువచ్చి తానుమాత్రము మిడ్నపూరుబోయి మిగిలిన వారలను ఖర్గపురములో గలుసుకొని, వారలతో మదరాసుకు బయనమై ఆనెల 14 వ తేదీ మధ్యాహ్నము $2\frac{1}{2}$ గంటలకు వాల్తేరు చేరెను. అవరకు జూలై 8వ తేదీన కరాచీలో ఇచ్చిన ఉపన్యాసమునకై మహమ్మదాలి యరెస్టుకాబడి కరాచీకి విచారణకై గొనిపోబడుటచే, మహాత్ముడు మిగిలినవారితో మద్రాసును మరునాడు జేరి అచ్చట రెండుదినములుండి తానుమాత్రము కృష్ణదాసుతో గలిసి దక్షిణమునకుబోయి 19 వ తేదీన తిరునాపల్లిజేరి పత్రికలలో మొదట మహమ్మదాలీని తరువాత షౌకతాలిని అరెస్టుజేయుటకుగల కారణమునుగూర్చి బొంబాయిప్రభుత్వమువారు ప్రకటించిన ప్రకటననుజదివి, తానాకరాచికాన్ఫరెన్సులోనుండి యుండినయెడల తానుగూడ నట్టియుపన్యాసమునే ఇచ్చియుండెడివాడనియు, కాంగ్రెసుకూడ అట్టితీర్మానమును గావించి యుండదనందులకుగారణము ఇష్టములేకగాక అట్టితీర్మానమును జేసినచో ఆప్రకారము నడిపింపవలసిన బాధ్యతగూడ కాంగ్రెసునాయకులపైబడును గావున ఆ తీర్మానమునననుసరించి మిలిటరీపోలీసుఉద్యోగములను త్యజించి వచ్చినవారికి తగిన

జీవనోపాధిని గల్పించుకొనుటకు సామర్థ్యము లేకుండుటయేయని, తన యభిప్రాయ మును వెల్లడించుచు నొక ప్రకటన జేసెను.

68. తరువాత నాసెప్టెంబరు 21వ తేదీన మధురకు బోయి యక్కడనుంచియే తన 'యంగు ఇండియా' పత్రిక కొకవ్యాసమును వ్రాసి అందులో "భారతీయులెల్లరు ఈవరకు ఖిలాఫతు కాన్ఫరెన్సులో మహమ్మదాలీ ఉపన్యసించియుండిన మాటలనే తిరిగి ప్రతిచోటను బాహాటముగా మాట్లాడవలెనని హెచ్చరించెను. ఆమధురలో నున్నప్పుడే తానావరకు ప్రారంభించిన ఖద్దరు వస్త్రధారణోద్యమము దేశములో నింకను విరివిగా వ్యాపించకుండుటకు వగచి, అందుకు తనను నిందించుకొని శిక్షా రూపముగ తానంతవరకు ధరించుచుండిన ధోవతి, చొక్కా, టోపీలను త్యజించి, కట్టుకొనుటకొక కొల్లాయియు, అవసరమైనప్పుడొక ఖండువాయును దప్ప వేరొక టిని ధరించనని శపథముపట్టెను. తననువారించవచ్చిన స్నేహితులకు తానట్లుచేయుట సన్యాసమునుబుచ్చుకొనుట, గాదని నచ్చజెప్పెను.

69. ఆతరువాత మహాత్ముడు తిరునల్వేలికిబోయి యచ్చట నుపన్యాసము లిచ్చెను. అప్పుడు చేరువనున్న తిరువాన్కూరు సంస్థానమునుంచి పంచము డొక డేతెంచి తమవారలనాసంస్థానములోని హిందూ దేవాలయములలోనికి రానిచ్చుట లేదనియు, కావున రాబోవు దేవోత్సవ సమయమున నచ్చటి పంచములు గుంపులుగ చేరి బలవంతముగ నొక దేవాలయములోనికి జొరబడ దలచితిమనియు మహాత్మునికి దెలిపెను. ఆయన హిందూ పంచములకు హిందూ దేవాలయములలోనికిబోవు యర్హత యొక్క న్యాయమును ఒప్పుకొని యట్లుబలవంతముగబోవ ప్రయత్నించుట న్యాయము కాదని మందలించెను. ఆపంచముడు తమ యుద్దేశ్యము దేవాలయ ప్రవేశముమాత్రమే గాదనియు, తద్వారా భోజన విషయముననను, వివాహ విషయముననను తమకును తక్కిన హిందువులకునుగల భేదములను రూపుమాప దలచుటగూడ యనియు మహా త్మునితో బ్రసంగించెను. ఆప్రసంగమునకు మహాత్ముడిష్టపడక తాను తలపెట్టిన అస్పృ శ్యతా నివారణోద్యమమునకును భోజన వివాహములకును నెట్టిసంబంధము లేదనియు, హిందువులు తమలోని వారలకుజూపు గౌరవమును హిందువులైన పంచముల యెడల గూడ జూపింపవలయుననుట మాత్రమే తన యాశయమని దెలిపెను. అందుకా పంచ ముడు భోజన వివాహ సంబంధమైన కట్టుబాట్లు మారకున్నచో అస్పృశ్యత బోదని మరలజెప్పుటచే మహాత్ముడాకార్యములు రెండును వ్యక్తిసంబంధములైనవనియు భోజ నము విరేచనమువలె వ్యక్తియొక్క శారీరక సంబంధమైన దనియు, ఆకారణమున దానిని తప్పక ఒరులు జూచుచుండగా నొనర్ప నవసరము లేదనియు, వివాహము భావి సత్సంతానోత్పత్తి కొరకే యగుటచే నట్టివివాహ విషయమున విచ్చలవిడి

యథేచ్ఛ నిచ్చుటవలన సత్సంతానోత్పత్తికి భంగము వాటిల్లవచ్చుననియు జవాబిచ్చెను. హిందూ సాంఘికాచార మార్పులనుగూర్చి మహాత్మ డోకతూరి ప్రసంగించుచు ఆర్యఋషుల యభిప్రాయము ననుసరించి మనమతము సర్వమానవులకు సంబంధించిన మానవమతము లేక 'మనుధర్మము' అనియు "హిందూ" అను పదము యితరులచే మనకు బెట్టబడిన దనియు, సృష్టిలో స్వాభావికముగా గలుగుచుండిన మానవాభివృద్ధితోబాటు మనసంఘముకూడ స్వాభావికాభివృద్ధిని బొందకుండ పర ప్రభుత్వమువారు తమ సంకుచిత దృష్టితో మనకై జేసిన సాంఘిక రాజ్యాంగ చట్టములడ్డు వచ్చుచుండెననియు దెలియబరచెను.

70. మహాత్ముడనంతరము తిరుగు ప్రయాణమై మధుర, తిరుచునాపల్లి గుండ ఈరోడ్డు కోయంబత్తూరు, సేలము, లకుబోయి దక్షిణదేశయాత్రను ముగించుకొనెను. మహాత్ముడా ప్రయాణములో తనతోడనున్న కృష్ణదాసును సంబోధించి భగవద్గీత మూడవ యధ్యాయము 12వ శ్లోకములో "దేవతల వలన భోగములను బొందినవాడు తిరుగ నా దేవతల కేదియు నివ్వనిచో చోరుడనిపించుకొనునని దెలుపబడిన భావమును బోధపరచి మన దేహపోషణకై ప్రపంచమిచ్చుచున్న వస్తువులకు ప్రతిఫలముగ తిరుగ నాదేహము నుపయోగించి ప్రపంచాభివృద్ధికై పరిశ్రమించవలయుననియు, కావున దేహధారులు సులభముగా ప్రపంచలాభముకై ప్రతిదినము పరిశ్రమించ దగినది రాట్నముద్రిప్పి నూలువడికి సమర్పించుటయనియు బోధపరచెను. మరియు నాప్రయాణములోనే అశ్విని కుమారదత్తు బంపిన "అసహాయోద్యమము అహింస" యను కరపత్రమును దిలకించి అందుదహరింపబడిన మహాభారతములోని వాక్యమగు "సాధ్యం మృదునకించిత్" అనగా మృదుత్వమునకు సాధ్యము కానిదేదియులేదని తెలుపు విషయము తన కనుభవమగుటచే జాల సంతసించెను.

71. మహాత్ముడా తరువాత ఆంధ్రదేశములోని దత్తమండలము గుండ బ్రయాణము జేయుచు ఆ 1921 సెప్టెంబరు 28వ తేదీన తిరుపతిలోదిగి అనంతరము రేణిగుంట రాజంపేట గుండ కడపకు జేరెను. మహాత్ముడు మధ్య స్టేషనులలో దనను జూడవచ్చిన వారల లోనిపిల్లలనేరి చేరదీసి వారలకు తనచేతులతో నరటిపండ్లను నారింజపండ్లను బంచిపెట్టుచుండెను. కడపనుండి బయలుదేరి తాడిపత్రి కర్నూలు పురములలో నాగి యక్కడ కరువుకాలములో గవర్నమెంటువారు కూలీలకు తిండి కలిగించనెంచి దినమునకు $1\frac{1}{2}$ అణా మొదలు $2\frac{1}{2}$ అణాల వరకు మాత్రమే కూలి నిచ్చి బయట నెండలలో రాళ్ళను పగులగొట్టించుచుండుటవలన వారలకు నచ్చటి కాంగ్రెసు కమిటీవారు దినమునకు 3 అణాల నిచ్చి ఇండ్లలో చల్లగా రాట్నముపై నూలుడీయుంచుచుండుటను మహాత్ముడు గమనించి చాల సంతసించెను. మహాత్ము

డనంతరము గుంటకలు గుండ బళ్ళారికిబోయి యక్కడ రాత్రి 11 గంటల కుపన్యాస మిచ్చి 1½ గంటలకు స్టేషనుకు తిరిగివచ్చి ఎవరికిని తెలియకుండ ఆరుబైట ప్లాటు ఫారము మీద ప్యాసెంజరులమధ్య కటికనేలపై పక్కవేసుకొని పరుండి నిద్రించు చుండెను. ఇంతలో నకస్మాత్తుగా స్థానిక నాయకులలో నొకరు రయమున నరుదెంచి ఆయన ఈవరకు మహమ్మదాలీ కరాచి యుపన్యాసమును గీర్తించుచు తిరుచునాపల్లిలో జేసిన ప్రసంగముకై మద్రాసు గవర్నమెంటు అరెస్టువారంటును జారీచేసిరని తాను విన్నవార్తను మహాత్మునికి కెరింగించెను. మహాత్ముడు చలించలేదు. అయినను వెంటనున్న కొండా వెంకటప్పయ్య పంతులుగారు మహాత్ముడట్లు యరెస్టుకాబడినచో మరి నాలుగు రోజులలో బొంబాయిలో జరుగనున్న వివిధరాష్ట్రనాయకుల సమావేశములో జేయవలసిన కార్యక్రమమును గూర్చి ముందుగా దెలుపుమని మహాత్ముని గోరెను. ఆయన ఆ రోజులలో అన్నిటికన్న ఖద్దరు ప్రణాళికయే అతి ముఖ్యమని చెప్పెను.

72. అయినను అట్టి యరెస్టు జరుగకుండగనే మహాత్ముడు అక్టోబరు 4 వ తేదికి బొంబాయి చేరగలిగెను. అక్కడ 5 వ తేదీన జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశములో బాల్గొని "ప్రస్తుతపు పరదేశపు ప్రభుత్వ కొలువులలో నేదానిలోనైనను భారతీయుడు పనిజేయుట జాతీయగౌరవమునకును, జాతీయ క్షేమమునకును భంగకరమ"ని తీర్మానమొకటి గావింపించెను. ఆప్రకారము ఈవరకు కరాచిలో జరిగిన ఖిలాఫతు కాన్ఫరెన్సు తీర్మానముయొక్క కాపీలు మహాత్ముడు పెక్కు కాంగ్రెసు నాయకుల సంతకములతో ఆనెల 16 వ తేదీన దేశమందంతట బంచిపెట్టించెను. దీని ముఖ్యోద్దేశము ప్రజలలో పరప్రభుత్వముయెడలగల భయమును బోగొట్టి వారికి మానసిక పరివర్తనమును గలిగించ బ్రయత్నించుటయే. ఆరోజులలోనే ఆంధ్రదేశములోని విశాఖపట్టణమున మెడికలుస్కూలు విద్యార్థులు పైఅధికారులు వలదన్నను ధైర్యముతో ఖద్దరు టోపీలను ధరించిన విషయమును మహాత్ముడు ౯ నవంబరు 3 వ తేదిగల యంగు ఇండియా పత్రికలో ప్రశంసించెను.

# పదునేడవ ప్రకరణము

# శాసనోల్లంఘనోద్యమము

## 1921—1922

73. తరువాత ఢిల్లీలో ఆ 1921 వ నవంబరు 5 తేదీన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటి సమావేశములో రాష్ట్రీ కాంగ్రెసు కమిటీల బాధ్యతలపై పన్నుల నిరాకరణ ప్రణాళిక మూలమున సమిష్టి శాసనోల్లంఘనమును గావించవచ్చునని తీర్మానింప బడెను. అట్టి పన్నుల నిరాకరణను సాగించినచో గవర్నమెంటువారు అట్టివారికి రైల్వే, పోస్టు, టెలిగ్రాము సదుపాయములను నిరాకరించవచ్చునని కొందరు మహాత్మునికి తెలుపగా ఆయన ప్రభుత్వమువారు అటుల నిరాకరించ దలచుట స్వాభావికమనియు, తాను ప్రభుత్వపుస్థితిలో నుండియున్నచో తాను మరింత కఠినచర్యలను దీసికొనవలసి వచ్చునేమోయనియు, కావున అట్టి ప్రభుత్వపుచర్యలకు కినుక వహించి వెరువగూడదనియు తన "యంగు ఇండియా" పత్రికలో జవాబిచ్చెను. ఇది యిట్లుండగా యీవరకే యేర్పాటు చేసియుండినట్లు ఆనవంబరు 17 వ తేదీన ప్రిన్సు ఆఫ్ వేల్సు యువరాజు బొంబాయిలో దిగెను. వెంటనే అక్కడి అసహాయోద్యమములో సుశిక్షితులుకాని సామాన్యప్రజలు కొందరు చాల అల్లరులను గావించిరి. శాంతియుతముగ ఉద్యమమంతయు జరుగవలయునని ఆశించిన మహాత్ముడా యల్లరులకు మిగుల ఖిన్నుడై ఆనెల 19వ తేదీ మొదలు నాలుగు రోజులు ఉపవాసముండెను. ఆసందర్భముననే వారమునకొక దినమును మౌనమున గడిపెదనని వ్రతము నారంభించెను. మరియు ఆరోజులలో నూరతు బార్డోలీలలో జరుప దలచియుండిన సాత్వికనిరోధోద్యమ ప్రయత్నములను ఆపుచేయవలసినదని అక్కడివారలకు తన కుమారుడైన దేవదాసు గాంధీద్వారా ముందుగా కబురు పంపెను. తరువాత బొంబాయిలో ఆనవంబరు 23వ తేదీన జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశములో మహాత్ముని చర్యను సమర్థించుచు యథావిధిగా తీర్మానము గావింపబడెను. ప్రిన్సు ఆఫ్ వేల్సు యువరాజాగమన సందర్భమున బొంబాయిలో జరిగిన అల్లరులను అచ్చటి యిరోపియనులు క్రోధోద్దీపులై కాంగ్రెసుపై కఠినచర్యలను తీసికొన వలయునని పైప్రాయిపై ఒత్తిడి తెచ్చిరి. ఆకారణమున యికముందితరచోట్ల అట్టి అల్లరులు జరుగకుండుటకై ప్రభుత్వమువారు బెంగాలు, పంజాబు, సంయుక్తరాష్ట్రము, బీహారు, అస్సాముల లోని కాంగ్రెసు, ఖిలాఫతు సంఘములను అక్రమ సంస్థలుగా ప్రకటించిరి. ఆసందర్భములోనే చిత్తరంజన్‌దాసు, లాలా లాజపతిరాయి, మోతీలాల్ నెహ్రు, అబ్దుల్

కలాము ఆజాదు, జవహర్‌లాల్ నెహ్రూ అరెస్టు కాబడి నిర్బంధింపబడిరి. గాంధీ టోపీని ధరించినవారిని గవర్నమెంటువారు బహువిధముల బాధించి యన్యాయముగ దోషముల నారోపించి ప్రాసిక్యూట్ చేసి శిక్షించిరి. పోలీసులు కాంగ్రెసు వాలంటీర్లను వస్త్రవిహీనులుగచేసి, బలవంతముగ గ్రామ చెఱువులలోముంచి తామానందించుచుండిరి. ఈ ఘోర అకృత్యములను గమనించిన మాలవ్యాజీ వైస్రాయిని సమీపించి ఆయన కోరికపై గాంధీజీతో అసహాయోద్యమ ప్రణాళిక విరమణనుగూర్చి రాజీప్రయత్నముజేసి విఫలుడయ్యెను. మహాత్ముని ఉద్దేశ్యములో పర ప్రభుత్వము సహజముగ ఉపయోగించు ప్రతిక్రియకు సంసిద్ధులయిరేని సహనముతో అసహాయోద్యమమును సాగించవలసియున్నది. ఎందువలన ననగా ప్రజలకు జవాబుదారీకాని పరప్రభుత్వమును వదలించుకొనుటకు అసహాయోద్యమముకన్న శాశ్వతమైన మార్గము వేరొకటి లేదు. ఈవరకు అనుసరింపబడుచుండిన హింసాపూర్వక యుద్ధము అశాశ్వతమార్గము కావున నిరర్ధకమని ఆయన ప్రజలకు బోధించి తాను యీ నూతన పద్ధతి నవలంబించితినని చెప్పెను.

74. ఆ సంవత్సరాంతమున అహమ్మదాబాదులో జరిగిన కాంగ్రెసు మహాసభలో సమిష్టి శాసనోల్లంఘన తీర్మానమునకై సభ్యులు ఉవ్విళ్లూరుచుండిరి. ఒకప్రక్క మాలవ్యాజీ కాంగ్రెసుకును, బ్రిటిషు ప్రభుత్వమునకును మధ్య రాజీని కుదుర్చుటకై ప్రభుత్వమువారు ఒక రౌండు టేబిలు సమావేశమును ఏర్పాటుచేయవలయునని కోరుచు నొక తీర్మానమును దెచ్చెను. వేరొకప్రక్క హాస్రత్ మొహాని బ్రిటిషు ప్రభుత్వములో తెగతెంపులు జేసికొనవలయునని వేరొక తీర్మానమును దెచ్చెను. ఈ రెండు తీర్మానముల నెదుర్కొనుచు మహాత్ముడు గంభీరోపన్యాసమిచ్చెను. చివరకు ఆ సమావేశములో జరిగిన తీర్మానము ననుసరించి శాసనోల్లంఘనోద్యమమును నడిపించు పూర్తి బాధ్యత మహాత్మ నొక్కనిపైననే పెట్టబడెను. ఆయన శాంతియుతవాతావరణ మున్నచోటనే శాసనోల్లంఘనమును జరుపుటకు అనుజ్ఞ నీయదలచి యుండెను. మహాత్ముడు సత్యాగ్రహియగుటచే సలక్షణమగు సామమార్గ మాతనికి ప్రధానకర్తవ్యము. అందుచే తొందరపడక ముందుగా సాధ్యమైన సామమార్గములచే కాంగ్రెసు ఆదర్శమైన స్వరాజ్యప్రాప్తినిగూర్చి ప్రభుత్వమువారిలో హృదయపరివర్తనమును గలిగింప బ్రయత్నించుచుండెను: మరియు తన "యంగు ఇండియా" పత్రికలో ఆత్మ పరీక్ష యను శీర్షిక క్రింద ఈవిషయమునుగూర్చి చక్కని సుబోధకమగు వ్యాసమును వ్రాసెను. అందు ఆ సంవత్సరాంతములోనే స్వరాజ్యము తెప్పించెదనని తానావరకు చేసియుండిన వాగ్దానమునుగూర్చి పలువురువిమర్శకులు వెలిబుచ్చిన అభిప్రాయములను

గూర్చి విపులముగ చర్చించెను. అనిబిసెంటమ్మ మహాత్ముడు చేసియుండిన కాలనిర్ణయ వాగ్దాన నిష్ప్రయోజనముగూర్చి హేళన గావించెను. ఆమెకు సమాధాన మిచ్చుచు ఆకాలనిర్ణయము కొన్ని షరతులకు లోబడియుండెననియు, మరియు కాలనిర్ణయ మనునది లేకున్నయెడల ఏపనియు శ్రద్ధతో జరుపబడదనియు అను సత్యసిద్ధాంతము లను మహాత్ముడు దెలియపరచెను. ఒకప్పుడు వైస్రాయి దేశనాయకులను ఒక రౌండు టేబిలు కాన్ఫరెన్సుకు బిలిపించుకొను నేమోయని మహాత్ముడు ఆశబెట్టుకొనుచుం డెను ఇట్టిస్థితిలో ఆంధ్రదేశములోని గుంటూరు మండలము పన్నుల నిరాకరణకు సిద్ధముగా నున్నదని మహాత్మునికి దెలియవచ్చుటచే ఆయన మొదట కొంత తటపటా యించి చివరకు పన్నుల నిరాకరణోద్యమమును అక్కడ 1922 జనవరి 12 వ తేదీ నుండి ప్రారంభించుట కనుజ్ఞనిచ్చెను. దాని ననుసరించి అచ్చట నూటికి 5 మంది చొప్పున మాత్రమే పన్నులు చెల్లించి యుండుటచే ఆయుద్యమ మచ్చట జయమైనట్టే ఎంచవచ్చును. అయినను మద్రాసు గవర్నమెంటువారు తాము తీసికొనిన చర్యలతో నాగక అహింసాపరులైన అసత్యాగ్రహుల శరీరములపై నుపయోగించిన అమానుష చర్యలను మహాత్ముడు ఖండించుచు వైస్రాయి తన కావరకు అలీసోదరుల ప్రకటన సందర్భమున యిచ్చిన అహింసాపరులపై ప్రభుత్వము చేయిజేసికొనదన్న వాగ్దాన మును జ్ఞాపకపరచుచు వైస్రాయి కొక బహిరంగలేఖను ఫిబ్రవరి మొదటి తేదీన వ్రాసెను. ఆలేఖలోనే గుజరాతులోని బార్డోలీతాలూకాగూడ గుంటూరు మండల ములోవలెనే పన్నుల నిరాకరణకు సంసిద్ధముగా నున్నదనియు దాని కనుజ్ఞ నిచ్చు టకు పూర్వము కాంగ్రెసు సత్యాగ్రహుల అహింసాపూర్వక చర్యలపై గవర్నమెంటు వారు హింసాపూర్వక చర్యల నుపయోగింపము అని వారమురోజులలోగా హామీ ఇచ్చినచో కాంగ్రెసు దేశమంతటిలోని తన అసహాయోద్యమమును పూర్తిగా వదలు కొనునట్లు జేయుదునని గూడ వైస్రాయికి వ్రాసెను. ఈవింతలేఖ వైస్రాయిని తబ్బిబ్బు జేసెను. వైస్రాయి అట్టి హామీ ఇచ్చినంతమాత్రమున స్వరాజ్యసంపాదనకై ఖిలాఫతు సమస్య పరిష్కారమునకై పంజాబు నష్టపరిహారమునకై యారంభించిన అసహాయోద్యమమును పూర్తిగా విరమించుకొందునని మహాత్ముడు వ్రాసిన వాక్యము లోని రహస్యమేమి ? అదియిది : అహింసాపూర్వకముగ నేరూపముననైనను ప్రజలు అవసరమైనప్పుడు పరప్రభుత్వమున కయిష్టమైన కార్యములను గావించుటకు అధి కారమును గలిగియుందురను సూత్రమును గవర్నమెంటువారిచే నంగీకరింపజేయుటయే.

75. వైస్రాయి మహాత్ముడు కోరిన హామీ నివ్వలేకపోయెను. అయినను మహాత్ముడుబెట్టిన వారమురోజులు గడవు దాటకమునుపే, తలవని తలంపుగా 1922

ఫిబ్రవరి 5వ తారీఖున యునైటెడ్ ప్రావిన్సులోని చౌరీ చౌరాలో ప్రజలు ఇరువది ఇద్దరు పోలీసుయుద్యోగస్థులను ఒక గదిలో బెట్టి గదికి నిప్పంటించి చంపెనన్న ఘోర వార్త మహాత్మునకు దెలియవచ్చెను. ఆయన వెంటనే సమిష్టి శాసనోల్లంఘ నోద్యమమును అప్పటికి విరమింప నిశ్చయించుకొని ఆ నెల 12వ తేదీన బార్డోలీలో కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశమును సమకూర్చి ఆ కమిటీచే దన నిశ్చయమున కామోద తీర్మానమును జేయించి ఆ చౌరీ చౌరా దురంతములకు తాను ఒక విధముగ బాధ్యుడనని భావించి ప్రాయశ్చిత్తముగ 5 దినము లుపవసించెను. కాని యెక్కడనో కొన్నివందల మైళ్ళదూరమున చౌరీ చౌరాలో జరిగిన దురంతములకై శాసనోల్లంఘ నోద్యమమునే పూర్తిగా జాలించుటవలన పన్నుల నిరాకరణకై యువ్విళ్ళూరుచుండిన బార్డోలీ రైతులకు మాత్రమేగాక సత్వర స్వరాజ్య సంపాదనకై యతికుతూహలు లైయున్న దేశమందలి యువకుల నేతలకు తీవ్రమైన యాశాభంగము గలిగి పెక్కండ్రు కుపితులైయుండిరి. ఆ కారణమున గొందరు డాక్టరు మూంజీ నాయకత్వమున ఆ నెల 24వ తేదీన ఢిల్లీలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశములో మహాత్మునిపై విశ్వాసరాహిత్య తీర్మానమును ఉపపాదించిరి. కాని ఆ తీర్మానమునకు పలువురు వ్యతిరేకులగుటచే ఇరుకక్షులవారిని సమాధానపరచుటకై కొన్ని కఠిన నియమములకు లోబడిన వ్యక్తులు మాత్రము తమ స్వంతబాధ్యతపై శాసనోల్లంఘన మొనరింపవచ్చునని ఆ సమావేశములో తీర్మానింపబడెను. మరియు శాసనోల్లంఘన మొనరింపని వ్యక్తులు నిర్మాణకార్యక్రమమును శ్రద్ధగా గొనసాగించవలెనని గూడ తీర్మానించబడెను. ఈ సమిష్టి శాసనోల్లంఘనోద్యమ విరమణవలన దేశమునందు వేరొక క్రొత్తసమస్య యేర్పడెను. విశేషవిద్యావ్యాప్తి లేక కేవల మతోద్రేకులై ఖిలాఫతు సమస్య పరిష్కారమునకు మాత్రము ఇతర భారతీయులతో జేరి వారి అసహాయోద్యమమునందు మిన్నగ బాల్గొన్న ముస్లిము యువకుల నేతలు ఆయుద్యమ విరమణవలన నిరాశాపూరితులైరి. దీనికి తోడు ఆసంవత్సరము నవంబరు నెలలో మహమ్మదీయ కాలిఫ్‌గా నుండిన టర్కీసుల్తాను మాల్టాకు బారిపోవుటయు కేవల లౌకిక తత్పరుడగు కెమెల్‌పాషాటర్కీని స్వాధీనము చేసుకొనుటయు జరుగుటచే ఖిలాఫతు సమస్యకు అవకాశమే పోయెను. ఆకారణమున ముస్లిము లనేకులు కాంగ్రెసునుండి వైదొలగుట సంభవించెను. ఆ యెడబాటు, స్వార్థపరులైన ముస్లిము నాయకుల ధైర్యలోపముకలన క్రమేపి ఎక్కువై, తుదకు పాకిస్తాను ఉద్యమముగా బరిణమించెను.

76. చౌరీచౌరాలో ఫిబ్రవరి 5వ తేదీన భారతీయ ప్రజలు చూపించిన భయంకరసాహసచర్యలకు బ్రిటిషు వైస్రాయి భయకంపితుడై 9వ తేదీన భారత

దేశపు భయంకరస్థితినిగూర్చి లండనులోని యధికారుల కొక లేఖవ్రాసెను. కాని ఆ తరువాత మూడు రోజులకే శాసనోల్లంఘన ఉద్యమ విరమణనుగూర్చి వెలువడిన కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానము, వైస్రాయికి మనస్థిమితము గలిగించెను. అందుచే ధైర్యము దెచ్చుకొని అప్పటికి సాధువై పిచ్చుకవలెనున్న మహాత్మునిపై బ్రహ్మాస్త్ర ముపయోగించదలచి లండను బ్రిటిషు అధికారుల ఉత్తరువులకై వేచియుండెను. మహాత్ముడు తన సమష్టిశాసనోల్లంఘన విరమణను సమర్థించుచు తన 'యంగు ఇండియా' పత్రికలో రెండు వ్యాసములను వ్రాసెను. ఆయన యేర్పరచిన ప్రణాళి కానుసరణమునకు శాంతివాతావరణ మవసరమనియు సత్యము, అహింస యను కవచములను ధరించిననేగాని ఆయన సూచించిన శాంతిసమరమునకు యోధులెవరును గాజాలరనియు మరియు చేసినతప్పును ఒప్పుకొనుట ఎప్పుడును అంతస్సును తుడిచి శుభ్రము చేయు చీపురుకట్టవంటిదనియు మహాత్ముడా వ్యాసములో తన విశిష్టదృక్పథమును స్పష్టపరచెను.

## పదునెనిమిదవ ప్రకరణము

# రాజద్రోహ నేరము - శిక్ష - విడుదల

## 1922-24

77. మహాత్ముడు పై విధముగా తాను వెనుదీసిన కొద్దీ గవర్నమెంటువారు తమ మృగచర్యలను సత్యాగ్రహులపై ధారాళముగా నుపయోగించుట జూచి "గవర్నమెంటు వారు దేశములో నెన్ని నెత్తురు కాలువలను బ్రవహింపజేసినను తానెంత మాత్రము భయపడువాడనుగాను" అని మార్చి 9వ తేదీన అహమ్మదాబాదులోని తన సత్యాగ్రహాశ్రమమునుండి యొక వ్యాసమును వ్రాసి తన 'యంగు ఇండియా' పత్రికలో బ్రకటించెను. వెంటనే మరునాడు బొంబాయి గవర్నమెంటు వారు మహాత్ముని, ఆశ్రమములో నే రాత్రి పదిన్నర గంటలకు యరెస్టుజేసి "యంగు ఇండియా" పత్రికలో ఆవరకు 1921 సంవత్సరము జూన్ సెప్టెంబరు డిసెంబరు నెలలలోను 1922 ఫిబ్రవరిలోను కలిసి నాలుగు రాజద్రోహవ్యాసములు వ్రాసి ప్రకటించెనన్న నేరముపై మరునాడు అసిస్టెంటు మేజస్ట్రీటు కోర్టులో ఆరంభ విచారణకుదెచ్చిరి. దాని ఫలితముగ మహాత్ముడు 18వ తేదీన అహమ్మదాబాదు డిస్ట్రిక్టు సెషన్సుజడ్జి కోర్టులో విచారింపబడి ఆరుసంవత్సరముల కారాగారశిక్ష విధించబడెను. మహాత్ముడాసమయమున నిచ్చిన అతి గంభీరమైన తన స్టేటుమెంటులో ఏదేశపు ప్రజలైనను పరాయి దేశపు ప్రజాప్రభుత్వపు బలవంతపు చర్యలను బ్రతిఘటించుట సహజ ధర్మమగుటచే నది రాజద్రోహ మనిపించుకొనజాలదని ధైర్యముతో వాదించెను. ఆవాదము యొక్క సబబును ఆజడ్జి గ్రహించినను గత్యంతరము లేక ప్రభుత్వము వారి శిక్షాస్మృతి ననుసరించి శిక్షించవలసివచ్చెను. అటుల యరవాడ జైలులో శిక్ష ననుభవించుచుండిన కాలములోనే మహాత్ముడు తన "ఆత్మకథ"యను యుద్గ్రంధమును వ్రాసెను. ఆసంవత్సరాంతమున (1922) గయలో జరిగిన కాంగ్రెసు మహాసభలో మహాత్మునియందత్యంత భక్తిగల కొందరు రాజాజీ నాయకత్వమునగూడి మహాత్ముడు నెలకొల్పిన అసహాయోద్యమ ప్రణాళికలో ముఖ్యమైనదగు శాసన సభాప్రవేశ నిరసనమునందు దమకుగల పట్టుదలను ప్రకటించుచు రాబోవు యెన్నికలలో కాంగ్రెసువారు పాల్గొనరాదను తీర్మానమును బ్రతిపాదించి అనుకూలముగ 1740 వోట్లును, ప్రతికూలముగ 890 వోట్లును వచ్చుటచే మెజారిటీ వోట్లతో గెలుపొందిరి. అయినను చిత్తరంజనదాసు, మోతీలాలు నెహ్రూ మొదలగు కొందరు ముఖ్యనాయకులా తీర్మానమునకు విముఖులుగా నుండియుండుటచే వారు మరుసంవత్సరము (1923) సెప్టెంబరు నెలలో ఢిల్లీలో స్పెషలు కాంగ్రెసు కొకదానిని యాహ్వానించి యందు

కౌన్సిళ్ళలో జేరదలచినవారు ఎన్నికలలో బాల్గొని చేరవచ్చునను మార్పు తీర్మాన మును జేయించుకొనిరి. దీనితో కాంగ్రెసులో "నో ఛేంజర్సు", "ప్రో ఛేంజర్సు" అనగా మార్పు అక్కరలేదను వారు, మార్పు కావలెననువారు అనురెండు పార్టీ లేర్పడెను. మార్పు అక్కరలేదను వారి కార్యక్రమము నిర్మాణ కార్యక్రమము. కాని అది ప్రత్యక్ష పోరాటము గాకుండుటచే కొందరికి తృప్తినియ్యలేదు. నిర్మాణ కార్యక్రమమును సాగించుటవలన కాంగ్రెసు సేవకులకు ప్రజా సంబంధ మేర్పడును. తద్వారా ప్రజలలో చిత్తసంస్కార మేర్పడి ప్రత్యక్షపోరాట మవసరమైనప్పుడు వారిలో సమర్ధత యేర్పడును అని వారి వాదము.

78. ఆ 1923వ సంవత్సరాంతమున కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహా సభలో మార్పు వలదను ("నో ఛేంజర్సు") వారే గెల్చుటచే కౌన్సిలు బహిష్కార ణము నిర్ధారణ కాబడెను. అయినను యిట్లు యేర్పడిన యిరుపార్టీలవారు తమ తమ వాదప్రతివాదములను పత్రికలమూలమున వెల్లడించుకొనుచు తగవులాడుకొనుచుండిరి. ఇంతలో మహాత్ముడు కారాగారములో 1924 జనవరి 12వ తేదీన "అప్పెండిసైటిస్" తో బాధపడి ఆపరేషను అయి ఫిబ్రవరి 5వ తేదీన బేషరతుగా వదలిపెట్టబడి ఆరో గ్యముకై బొంబాయి పరిసరమున సముద్రతీరముననున్న "జుహూ" గ్రామమునకు పోయి కొంత విశ్రాంతిని పొందుచు ఏప్రిల్ నెలలో తిరిగి తన "యంగు ఇండియా"కు సంపాదకత్వము వహించెను. వెంటనే మొదటిసంచికలోనే తానావరకు దక్షిణాఫ్రి కాలో నున్నప్పుడు ప్రచురించియుండిన "హింద్ స్వరాజ్య" గ్రంథములో తాను తెలిసిన ప్రకృతి వైద్యమునకు విరుద్ధముగా తాను శస్త్రచికిత్స చేసికొనినందుకు పలు వురు వెలిబుచ్చిన ఆక్షేపణలను బేర్కొని తానాగ్రంథములో తెలిపినది సంపూర్ణ ఆదర్శ మనియు, తానింకను అట్టి సంపూర్ణతను పొందలేదనియు, మానవుడు ముందుగా సంపూర్ణ ఆదర్శమును దృష్టియందుంచుకొని దానిని పొందుటకై సదా ఓర్పుతో శ్రమపడి, నిరంతరము భగవత్ప్రార్థనలలో నిమగ్నుడై క్రమక్రమముగా పెరుగవల యునను సత్యమును బోధపరచుచు సమాధానమిచ్చెను. మరియు వారవారము వెలు వడు తనపత్రికలో మహాత్ముడు పెక్కు ముఖ్య విషయములను విపులముగా చర్చించు చుండెను. అప్పటి కాంగ్రెసు సంస్థయొక్క పరిస్థితులనుగూర్చి చర్చించుచు నాయ కులు తమతమ భేదాభిప్రాయములను దాచుకొనక నిష్కపటముగ వెల్లడించుకొనుట వలననే మేలు కలుగగలదనియు అయినను ఏకాభిప్రాయములు కలవారు మాత్రమే కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గముగా నేర్పడవలయుననియు భిన్నాభిప్రాయముల ప్రాతినిధ్య మవసరమనుట తగదనియు తన నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చెను. అహిం

సాసత్యములనుగూర్చి ముచ్చటించుచు హింసకును, పిరికితనమునకునుమధ్య హింసనే తాను మెచ్చుకొందుననియు గ్రుడ్డివాని ముందు గొప్ప దృశ్యమును ఉంచి దానిని చూచి ఆనందింపుమని కోరుట యెట్టిదో పిరికిపంద ముందు అహింసా ఆదర్శమును ఉంచి, దానిని అనుసరింపవలయునని కోరుటకూడ అట్టిదే అనియు తాను చిన్నతనమున పిరికివాడుగానున్న రోజులలో హింసయందే యిష్టముండెననియు, ధైర్యవంతుడైన కొలది అహింసయందు పట్టుదల యెక్కువగుచుండెననియు ఆయా వ్యాసములలో తెలిపియుండెను. ఆరోజులలో ఆర్య సామాజికులు అనుసరించుచుండిన 'అఖాడా' లను గూర్చి ప్రస్తావించుచు అవి భారతీయులందరి శరీరసౌష్ఠవముకొరకైనచో తన కాక్షేపణ లేదనియు, కాని భారతీయులలో కొందరైన హిందువులు మరికొందరైన మహమ్మదీయులను శిక్షించు సమర్థతకొరకైనచో వారును తిరిగి అదేపనికి పూనుకొందురు. కావున అది మంచిదికాదని వాదించెను.

78. మహాత్ముడు జూహూలోనున్న రోజులలో మేనెలలో యిరు పార్టీల వారునుజేరి తన సలహాను గోరగా తనపై యభిమానముచే మార్పువలదను వారిని మందలించుచు మార్పుగోరిన స్వరాజ్యపార్టీనిగూర్చి అసహ్యతను జెందగూడదనియు, తాముమాత్రము కౌన్సిళ్ళలో ప్రవేశించక నిర్మాణ కార్యక్రమమును కొనసాగించు చుండవలెననియు బోధించుచు ఒక స్టేటుమెంటును ప్రకటించెను. ఆకారణముచే జూను నెలలో అహమ్మదాబాదునందు గూడిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సమావేశములో నిర్మాణ కార్యక్రమమును ప్రోత్సహించుటకై కాంగ్రెసు కమిటీల కెన్నుకొనబడిన సభ్యులు తప్పక ప్రతినెల 2000 గజముల ఖద్దరునూలు వడికి, తమ సభ్యత్వ చందాక్రింద నివ్వవలసినదిగా తీర్మానింపబడెను. మహాత్ముడు జూహూలో నుండియుండిన రోజులలో ఆయనను సందర్శించుటకై వచ్చిన మోతీలాలు నెహ్రూ ఆయనతో చేసియుండిన సంభాషణ ఒక విధముగా అతి ముఖ్యమైనది. మోతీలాలు తానప్పుడు నిరీశ్వరవాదిననియు మహాత్ముని ఆధ్యాత్మిక వాదమునందు తనకు నమ్మకములేదనియు తెలుపగా, మహాత్ముడు తాను బ్రిటిషు సామ్రాజ్యముయొక్క అనంత శక్తిని ఢీకొన సాహసించినందుకు పలువురు ఆశ్చర్యపడు చుండిరనియు, కాని నిజముగా తనకా సాహసము పూర్తిగా తనను తాను ఈశ్వరార్పణము చేసికొనుట వలననే కలిగినదని నచ్చజెప్పినపుడు మోతీలాలులో గొప్ప మార్పు కలుగుట కారంభించెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము

# హిందూమహమ్మదీయ కలతలు - కాంగ్రెసు అధ్యక్షత

## 1924 — 26

79. మహాత్ముడు అహమ్మదాబాదును విడిచి 1924 సెప్టెంబరు 18 వ తేదీన ఐక్యభారతీయులైన హిందూమహమ్మదీయ సమ్మేళనార్థమై ఢిల్లీకిబోయి అచ్చట మహమ్మదాలీ ఇంటిలో బసచేసెను. ఆసమయములోనే వాయువ్యరాష్ట్రములోని 'కోహట్టు'లో హిందూమహమ్మదీయులకు కలతలేర్పడి చాటుమాటున ఘోర హత్యలు గావింపబడినట్లు తెలియవచ్చుటచే మహాత్ముడు మిగుల దుఃఖించి వెనువెంటనే 21 దినము లుపవాసదీక్ష వహించెను. ఆచాటుమాటు హత్యలను పురస్కరించుకొని ప్రసంగించుచు బహిరంగముగ ధైర్యముతో ముష్టాముష్టిని పోరాడినచో తానంత సరకుచేయననియు, కాని పిరికిపందలు ఒకరిపై నొకరు దూరముననుండి రాళ్ళను విసరి పారిపోవుటయు, చాటున వచ్చి చంపి మాయమగుటయు, హిందూమహమ్మదీయ పరస్పర కలహములను ప్రోత్సహించు పరప్రభుత్వాధికారుల సలహాలపై కోర్టుల కెక్కి అబద్ధపు సాక్షులను సేకరించి ప్రతికక్షులను శిక్షింపించుటయు మిగుల శోచనీయములైన పనులని వాటిని గర్హించెను. తన ఉపవాసదీక్ష రహస్యమును గ్రహించలేని, తనతో నప్పుడు ప్రసంగించుచుండిన షౌకతాలీ నుద్దేశించి తాను బూనినదీక్షను సమర్థించుచు, ఉపవాసము దైవప్రార్థనసంబంధమైనదనియు, అట్టి నియమమును మహమ్మదు ప్రవక్తకూడ పాటించి యుండెననియు, అది ఆత్మశుద్ధికి అత్యవసరమనియు, అట్టి ఆత్మశుద్ధివలన ఇతరులలో హృదయపరివర్తనమును కలిగించు శక్తి ఏర్పడవచ్చుననియు వాక్రుచ్చెను. మరియు మానవుడు తన శరీరమును ఎంత యెక్కువగా తన స్వాధీనమునందుంచుకొనగలడో అంత యెక్కువగా ఆత్మాభివృద్ధి నొందగలడను సత్యసిద్ధాంతమును స్పష్టీకరించెను. ఆ 'కోహట్' హిందూమహమ్మదీయ కలతలకు కారణము. ఒకరినొకరు తన ప్రత్యేకమతములోనికి కలుపుకొని పరప్రభుత్వపు శాసనసభలలో ప్రాతినిధ్యముకొరకై తమతమ మతానుసరుల సంఖ్యను వృద్ధిపరచుకొనదలచుటయే యని తేటపడెను. మహమ్మదీయులు హిందువులను తమమతములోనికి గలుపుకొనుచున్నకాలదిని హిందువులలోని ఆర్యసామాజికులు శుద్ధి ఉద్యమమును లేవదీసి ప్రతిక్రియ చేయుచుండిరి. తన్మూలమున పరస్పరవైషమ్యములు పెరుగుచుండెను.

80. మహాత్ముని ఉపవాసదీక్ష బయటికి తెలియుటతోడనే నలుదిశలనుండి వివిధ మతములకు జెందిన దేశనాయకులు ఢిల్లీకి బరువెత్తిపోయి మహాత్ముని దర్శించి

యేడు దివసములు సమావేశములను సలిపిరి. వారిలో క్రైస్తవమత నాయకుడు రెవరెండు డాక్టరు వెస్టుకాట్ దొరగారును, అనిబిసెంటు, హాకీమ్ అజ్మెల్ ఖాన్, స్వామిశ్రద్ధానంద, మాలవ్యాజీ, చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణి, 'స్టేట్సుమన్'సంపాదకుడు ఆర్థర్ మూరు మొదలగుప్రముఖులుండిరి. వారందరు ఆ సెప్టెంబరునెల 26వ మోతీలాల్ నెహ్రూ ఆధ్వర్యమున ఐక్యపార్టీ సమావేశమును గావించి మతకలహములను మాన్పుటకై ప్రయత్నించవలసినదిగా తీర్మానించుకొనిరి. ఆతీర్మానమును అందుకొనిన మహాత్ముడు మోతీలాలుకు జవాబిచ్చుచు తన ఉపవాస దీక్షకు అగాధమైన కారణము కలదనియు, ఆదీక్షద్వారా తన దృఢమైన విశ్వాసమును బ్రకటించు చుంటినని యు, తన అసహాయోద్యమము యే ఒక్క ఆంగ్లేయుని యెడలను ద్వేషముతోను, చెడ్డతలంపుతోనుఉద్దేశింపబడి యుండలేదనియు, దాని అహింసాతత్వము ఆంగ్లేయుని ప్రేమపూర్వకముగా తనవైపుకు త్రిప్పుకొనుటకుగాను మాత్రమే యుద్దేశింపబడిన దనియు తెలియబరచెను. అయినను అటుల జరుగకుండుట మాత్రమేగాక భారతీయులైన వారిలోనే పరస్పర ప్రేమ రాహిత్యము ప్రబలుచుండుటకు గాను తాను లోలోన దుఃఖించు చుంటిననియు అందువలన వెనుదీయరాని ఘోరతపస్సును, ఉపవాస దీక్షాభారమును తనపై విధించుకొనవలసి వచ్చెననియు, కావున తనను తన ఉపవాస దీక్షను విరమించుకొనుమని కోరుటకన్న తన దీక్షోద్దేశమును ఫలింపజేయునట్లు భగవంతుని ప్రార్థించుట శ్రేయస్కరమని సలహా నిచ్చెను.

81. తరువాత బొంబాయిలో నవంబరు 21, 22 తేదీలలో జరిగిన ఆల్ పార్టీస్ కాన్ఫరెన్సు నందును 23, 24 తేదీలలో జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సమావేశమునందును మహాత్ముడు పాల్గొని కౌన్సిళ్ళలో చేరి గవర్నమెంటు వారితో ఘోరాహోరీ ప్రత్యక్షముగపోరాడి స్వరాజ్యమును సాధించవచ్చునను నమ్మకమునుగల్గియుండిన చిత్తరంజనదాసు మోతీలాలునెహ్రూగారల కోర్కెను మన్నించి వారు కాంగ్రెసుసభ్యులుగ నుండియే వారి కోరికను నెరవేర్చుకొనుటకై అవకాశమిచ్చుట కిచ్చగించెను. కావున ఆ సంవత్సరాంతమున బెల్గామ్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభకు మహాత్ముడే యధ్యక్షుడగుట సంభవించుటచే ఆయన సలహా ననుసరించి కాంగ్రెసు నాయకులు కౌన్సిళ్ళలో జేరవచ్చునను తీర్మాన మాసభలో ఆమోదింపబడెను. మహాత్ముడు మరుసంవత్సరము 1925 ఆరంభమున కథియవాడు, మధ్యభారతము, బెంగాలులలోని పలుగ్రామములలో పర్యటనమొనర్చి అందందు పెక్కు ఉపన్యాసము లిచ్చెను.

82. తరువాత మార్చి, ఏప్రిల్ మాసములలో తిరిగి దక్షిణదేశ సంచారమును జేయుచు తిరువాన్కూరుకుబోయి అక్కడ 'వైకొము'లో పంచములు అస్పృశ్యులని

అకారణముగ పరిగణింపబడి పబ్లిక్ రోడ్లపై నడువగూడదన్న మూఢ ఆచారము నుల్లంఘించుటకై జరుపబడుచుండిన సత్యాగ్రహోద్యమమును ఆశీర్వదించెను. ప్రస్తుతమున పంచములని పిలువబడుచున్న వారి పూర్వీకులు కొన్ని శతాబ్దముల క్రిందట సకారణముగానే అస్పృశ్యులుగా పరిగణింపబడి యుండవచ్చును. వారి సంతతి వారిని అనేక తరముల తరువాత గూడ ప్రస్తుతము నస్పృశ్యులుగ నెన్నబడుచుండిన వారికన్న నెక్కువ తప్పులు లేకున్నను అస్పృశ్యులుగ పరిగణించుట సమంజసము కాదని మహాత్ముని యభిప్రాయము. మరియు వారు అస్పృశ్యులుగ నెన్నబడుచుండు నంతకాలము వారిలో అభివృద్ధికి అవకాశముండదు. మానవకోటిలో జేరినవారిలోని యందరి యభివృద్ధికి అవకాశమివ్వవలసిన ఆవశ్యకతను బాధ్యతను ఆ మానవకోటిలో భాగమైన బుద్ధిమంతులు గ్రహించవలసియుండునని గూడ మహాత్ముని యభిమతము.

83. మహాత్ముడాతరువాత ఆంధ్రదేశములోగూడ పర్యటనమొనర్చి మేనెల 24వ తేదీన శాంతినికేతనమునకేగి టాగూరును సందర్శించెను. తదుపరి ఆయన జూన్ 9వ తేదీన డార్జిలింగ్ కుబోయి అక్కడ అనారోగ్యముచే విశ్రాంతిని దీసికొనిచుండిన చిత్తరంజనదాసుతో కొలదిదినములు గడపి, పిదప బంగాళములోని ఖుల్నాపట్టణమున కరిగెను. అంతలో దాసు ఆనెల 16 వ తేదీన అంతమొందిన పిడుగువంటి వార్తను విని, మిగులవగచి ఆయన ఉదారజీవితములగూర్చి శ్లాఘాపాత్రముగ ప్రశంసించెను. 18 వ తేదీన దాసుశవము డార్జిలింగ్ నుండి కలకత్తాకు దేబడి స్మశానమునకు గొనిపోబడినపుడు అప్పుడక్కడకు వచ్చిన మహాత్ముడు అజదు మొదలగువారితో గలిసి ఆశవవాహకుడయ్యెను.

84. బెల్గాముకాంగ్రెసు తీర్మానమునుసరించి కౌన్సిళ్ళలో జేరిన కాంగ్రెసు నాయకులు అచ్చట తమ అభినివేశమును జూపుచుండినను కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమప్రణాళికలో ముఖ్యమైనదగు ఖద్దరుయుత్పత్తినిగూర్చి తగినంతశ్రద్ధవహింపకుండుటచే 1925 వంవత్సరం సెప్టెంబరు 22వ తేదీన పాట్నాలోజరిగిన ఆల్ ఇండియా కాంగ్రెసుకమిటీ సమావేశములో మహాత్మునికోరికపై, ఆల్ ఇండియా స్పిన్నర్సు అసోసియేషను ప్రత్యేకముగా స్థాపింపబడెను.

85. మహాత్ముడు ఆ 1925 సంవత్సరము డిసెంబరు 3వ తేదీని వెలువడిన తన 'యంగు ఇండియా పత్రికలో సత్యాన్వేషణమను తన ఆత్మకథను వారమునకొక ప్రకరణముచొప్పున ప్రచురించుట కుప్రకమించి, 1920 సంవత్సరపు నాగపూరు కాంగ్రెసువరకు జరిగిన తనచరిత్రనంతనుమాత్రమే మూడుసంవత్సరములలో ముగించి, తిరిగి అచరిత్ర నంతను ప్రథమసంపుటమును 1927 లోను, ద్వితీయసంపుటమును 1929

లోను ప్రత్యేకగ్రంథరూపమున బ్రచురించెను. ఆ 1925 డిసెంబరు మాసాంతమున కాన్పూరులో జరిగిన కాంగ్రెసు మహాసభలో, అంతవరకు పూర్తిగ ఒకసంవత్సరము కాంగ్రెసుప్రసిడెంటు హోదాలోనుండి యనేకభారములను వహించిన మహాత్ముడు తానికముందొక సంవత్సరమువరకు కాంగ్రెసు రాజకీయ అవకాశమును కౌన్సిలులోజేరి స్వరాజ్యమును సాధించదలచియుండిన స్వరాజిస్టులకు పూర్తిగావదలి, తాను తాత్కాలికముగ వైదొలంగుటకు నిశ్చయించుకొనెను. కాని ఆయనపూర్తివిశ్రాంతిని తీసికొనక, ఇతరమైన అనేక ముఖ్యవ్యాసంగములలో కాలము గడుపుచుండెను.

86. మహాత్ముడు ఒకతూరి బ్రహ్మచర్యమునుగూర్చి ప్రసంగించుచు అది అనుభవములో చాల సక్కృతియయిన ఆదర్శమునియు, యూక్లిడుయూహించిన గీతవలె ఊహలోమాత్రమే ఉండుననియు అయినను ఆఊహాగీతనిర్వచనమునుబట్టియే గొప్పగొప్పజామెట్రీసమస్యలు పరిష్కారమైనట్లు, ఊహామాత్రుడైన ఆదర్శ బ్రహ్మచారినైనను మనమనుదిము మనమనస్సున నిలుపుకొననియెడల మనము చుక్కానిలేని పడవమాదిరి ఒడుదుడుకులతోగూడియుందుమనియు, మానవుడెప్పుడును ఒకానొక సంపూర్ణస్థితిని ఊహించుకొని, దానిని సమీపించబ్రయత్నించినకొలదిని అభివృద్ధి నొందగలడనియు బోధపరచెను. మఱియు మానవజీవితాదర్శము ఎడతెగనియభివృద్ధి అనగా ఆత్మవికాసము అగుటచే అది శారీరకవాంఛలను రోజుకురోజు ఎక్కువ అదుపులోనుంచుటపై ఆధారపడియుండుననియు, అందుకొరకే వివాహమును పవిత్రకర్మ మానవులకు విధింపబడినట్లెంచుకొనవలయుననియు దేటబరచెను.

87. కౌన్సిళ్ళలోజేరి గవర్నమెంటును సాధించవలెననికోరి మొదట వేరయిన స్వరాజ్యపార్టీవారిలో 1926 లో కేంద్ర యసెంబ్లీసభకు జరిగిన ఎన్నికల వలన జీలికలేర్పడెను. ఆ యెన్నికలలో మాలవ్యా, లాలాజీ యాధ్వర్యమున నూతన జాతీయపక్షమొకటి బయలుదేరి స్వరాజ్యపార్టీతో పోటీచేసి చాలవరకు జయమంది, దాని పతనమునకు దారితీసెను. అట్టి పతనమునకు ముఖ్యమైన కారకులు ఆస్వరాజ్య పార్టీలోనే చేరియుండిన కులతత్వవాదులే. వారు తమతమ ప్రత్యేక కులములకు శాసనసభలలోను, ఉద్యోగములలోను ప్రత్యేక ప్రాతినిధ్యములను గోరువారు. అట్టి వారు ఐక్యభారతజాతిదృష్టిని కలిగియుండక పోవుటయేగాక, నిజముగా తమప్రత్యేక కులమునంతనైనను గూడ దృష్టియుంచు కొనరు. శాసన సభ్యత్వములు, సర్కారు ఉద్యోగములు కొలదివిగామాత్రమే యుండుటచే వాటిని ఆయాకులములలోని మధ్య తరగతులవారి కేకొందరికో లభింపజేయవలెనను స్వార్థయెత్తుగడను మాత్రమే తమ మనస్సులలో నుంచుకొని అంతటితో తృప్తినొందుదురు. ఆవిధముగా అధఃపతన మగు చున్న స్వరాజ్యపార్టీనుండి ఇండిపెండెన్సు ఆఫ్ ఇండియా లీగు ఉద్భవమయ్యెను.

౭౭. ఆసంవత్సరము డిసెంబరులో గౌహతియందు జరిగిన కాంగ్రెసు మహాసభలో మహాత్ముడు తిరుగ మొదటిసారి రాజకీయములో జోక్యము కలిగించుకొని ఆ సభలో ఇండిపెండెన్సు ఆఫ్ ఇండియా లీగు వారు తెచ్చిన సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమును బ్రతిఘటించెను. కారణమేమనగా అప్పటికింకను ప్రజలలో స్వచ్ఛమైన స్వాతంత్ర్యము కొరకు శ్రమవహించి శాంతియుతముగ పోరాడుటకు తగిన మానసిక పరిపక్వముగాని, నైతిక వాతావరణముగాని యాయనకు గోచరించలేదు. ఆసభ జరుగు ముందురోజున ఢిల్లీలో స్వామి శ్రద్ధానంద జబ్బుతో మంచముమీద నుండగా అబ్దుల్ రషీదను మహమ్మదీయ యువకుడాయనను పిస్తోలుతో గాల్చి చంపినట్లు ఆ సభకు వర్తమానము వచ్చెను. మహాత్ముడాసభలో సానుభూతి తీర్మానమును ప్రతిపాదించుచు ఆహత్యకు నిజమైన కారకుడాయువకుడు గాడనియు, సత్యమైన మతమును గ్రహించజాలక హిందూ మహమ్మదీయ మతస్థులకు పరస్పర ద్వేషమును పురిగొల్పియుండిన యిరుమతముల నాయకులే నిజమైన కారకులనియు దెలిపియుండెను.



## ఇరువదవ ప్రకరణము

# కమ్యూనిజము - త్రాగుడు పన్ను ఇర్విను ఆహ్వానము-సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము.

## 1927-29

89. మహాత్ముడు 1927 ఫిబ్రవరి మొదటి వారములో మధ్యపరగణాలలోని 'ఓటమాలు' నగరమునకు బోయినపుడు అక్కడనుండిన కమ్యూనిష్టు క్రామేడు శక్తలు వాలాతో చాలా సేపు ప్రసంగించుట సంభవించెను. భౌతిక కోరికలకు అత్యంత ప్రాధాన్యమిచ్చు కమ్యూనిష్టు ప్రణాళికలు తనకు నచ్చలేదని మహాత్ముడాయనకు స్పష్టపరచెను. కమ్యూనిస్టులను కొనుచున్నట్టు కాపిటలిస్టులు (ధనవంతులగు పెట్టుబడి దారులు) కార్మికులకు గర్భశత్రువులని తాను నమ్మజాలననెను. ఆనెల 2వ వారములో మహాత్ముడు మహారాష్ట్ర సంచారముచేసి మార్చి 23వ తేదీన బొంబాయికి బోయెను. ఏప్రిల్ ఆఖరు వారములో కర్ణాటకరాష్ట్రములోని నందికొండపై విశ్రాంతిని బొంది జూనుమధ్యలో బెంగుళూరు చేరి జూలై 3వ తేదీన దక్షిణయిండియా ఖాదీ ఎగ్జిబిషను తెరచెను. 12వ తేదీన మహాత్ముడు బెంగుళూరులోని విద్యార్థుల సభలో ప్రసంగించుచు వారినందరిని హిందీని నేర్చుకొనవలెనని కోరెను. ఆవిద్యార్థులు పేదజనోపయోగముకై బహూకరించిన 17 వందల రూపాయలను స్వీకరించి బ్రిటిషు ప్రభుత్వము వారు దేశీయుల విద్యావిధానపు ఖర్చును పేదజనులు త్రాగియిచ్చిన పన్ను మీద ఆధారపరచియుంచుటను వారికి తెలియపరచి అట్టి పేదజనుల పాపపుధనమూలమున ఇంగ్లీషువిద్య నభ్యసించుచున్న ఆవిద్యార్థులు తమ పాపపరిహారార్థమై యింకను ఎక్కువగా తమసొమ్మును వసూలుచేసి పేదలకొరకివ్వవలసినదని హెచ్చరించెను. ఆగష్టు మధ్యలో మైసూరున కుత్తరభాగముననున్న దేవనగరి కరిగి, అక్కడి హరిహరదేవాలయములో ముచ్చటించుచు హైందవత్రిమూర్తులలోని బ్రహ్మ సృష్టించినవారికి, హరి రక్షకుడు, హరుడు శిక్షకుడనియు రక్షణకృత్యము సరిగా నెరవేరునప్పుడు శిక్షకవకాశ ముండదనియు, అది నెరవేరనప్పుడె శిక్షకవకాశ మేర్పడుననియు అనగా సృష్టిలో ఒకభాగమైన ధనికులు, వేరొకభాగమైన దరిద్రులను రక్షించుచున్నంత కాలము ధనికులను శిక్షించవలసిన యవసరముండదనియు, ఆధనికులు దరిద్రులను హింసించుట కారంభించినపుడు త్రిమూర్త్యాత్మకుడైన భగవంతుడు హరరూపమును మాత్రమే బొంది వారిని నిర్మూలము చేయుననియు, అటులగాక ధనికులు, దరిద్రులు ఒకరితో నొకరు ఏకమైనప్పుడు హరిహరులేకమై ఆదేవళములోని నిజమైన ఏకైక

హరిహరస్వామి సార్థకుడగుననియు సమయోచితముగా బోధించెను. అవగాసంఘములో పరస్పర రక్షణశక్తులు పనిచేయనపుడు పరస్పర శిక్షణశక్తులు ప్రబలునట. ఆనెల లోనే ఏర్పడిన జన్మాష్టమి దినమున "అర్సికెర్" గ్రామములో ప్రసంగించుచు, శ్రీకృష్ణునిగూర్చియు, భగవద్గీతనుగూర్చియు అక్కడి జనులకు విపులముగా విశదీకరించెను. ఆ ఆగష్టు 24 వ తేదీన తమిళనాడులో సంచారము మొదలుపెట్టి సెప్టెంబరు 3 వ తేదీకి మదరాసు జేరెను. అక్కడ నుండిన నాలుగురోజులలో 17 సభలలో ప్రసంగించెను. ఆరోజులలోనే అచట సాగుచుండిన బ్రిటిషు ప్రభుత్వమువారి దౌర్జన్యచిహ్నమైన 'నీలు' సత్యాగ్రహోద్యమమునకును మహాత్ముడు తన సానుభూతిని జూపెను. చెన్నపట్టనమున జరిగిన ఒకానొక సభలో మహాత్ముడు త్రాగుడును గూర్చి మాట్లాడుచు, మనమధ్య వేలకొలది త్రాగుబోతు లుండుటకన్న భారతదేశమంతయు దరిద్రపూరితమై యుండవలసివచ్చినను తనకు సమ్మతమేననియు, త్రాగుడును మాన్పించినచో ప్రభుత్వ ఆదాయము తగ్గి ఆ ఆదాయముపైన ఆధారపడిన విద్యాబోధ లేకపోయినను మెరుగేయనియు స్పష్టపరచెను. చుట్ట, కాఫీ, తేయాకు వాడుకలను గురించి ఒక ప్రొఫెసరు ప్రశ్నించగా అవి మానవజీవితములకు అత్యవసరములు కావనిమాత్రము తెలిపెను. మహాత్ముడు సెప్టెంబరు 9 వ తేదీన మద్రాసును విడిచి చిదంబరమునుజేరి అక్కడ ప్రసిద్ధినిగన్న నందనారునుగూర్చి చక్కని యుపన్యాస మిచ్చెను. తరువాత కడలూరున కరిగి అప్పుడక్కడ చెలరేగుచుండిన బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్యనుగూర్చి ముచ్చటించుచు బ్రహ్మజ్ఞానసంపన్నులును, త్యాగమూర్తులును అయిన బ్రాహ్మణుల నుద్దేశించి, బ్రాహ్మణేతరులు కోరిన ఐహిక విషయములను వారికి కావలసినన్నిటిని వారికి వదలివేసి మిగిలినవాటితోనే తాము తృప్తినొందుట శ్రేష్ఠమనియు, బ్రాహ్మణేతరుల నుద్దేశించి జనసంఖ్యలో వారే అత్యధికులగుటచేతను, ధనము విశేషముగా వారివద్దనే యుండుటచేతను, వారు ఏవిధమైన నిరాశను జెందనవసరములేదనియు విన్నవించెను. మఱియు వారు తాము బ్రాహ్మణులపై వహించిన ద్వేషాంధమున కన్నుగానక భారతజాతికి అనేకయుగములనుండి సంక్రమించిన ఆధ్యాత్మిక విజ్ఞానగ్రంథములను తమ కాలిక్రింద నణగద్రొక్కుచున్నారనిగూడ హెచ్చరించెను.

90. తరువాత కొంతకాలమునకు మహాత్ముడు మరల దక్షిణదేశయాత్ర చేయుచు మంగుళూరుప్రాంతమున నుండగా నూతన వైస్రాయి లార్డు ఇర్విను 1927 నవంబరు 5వ తేదీన మహాత్మునికొక లేఖ వ్రాయుచు వెంటనే తనను ఢిల్లీలో కలిసికొన వలసినదిగా ఆహ్వానించెను. మహాత్ముడు తన దక్షిణదేశయాత్ర పూర్తిగా ముగి

యాకముందే మధ్యలో కొన్నివందల మైళ్ళు ప్రయాణముచేసి ఉత్తరముననున్న ఢిల్లీకి జేరినవెంటనే వైస్రాయి ఒక చిన్న కాగితమును చేతిలోపెట్టెను. అందు భారతరాజకీయ సంస్కరణ సందర్భమున సైమనుకమిషను విచారణ సంఘమును బ్రిటిషు గవర్నమెంటువారు పంపదలచినట్లుమాత్రమే పేర్కొనబడెను. వైస్రాయి మరేమియు మాటాడలేదు. ఆమాత్రపు కాగితమునిచ్చుటకు తనను అంతదూరమునుండి పిలిపించుకొనక దానిని పోస్టులో బంపియుండిన బాగుండెడిదని మనసులోననుకొని వైస్రాయికి మారుబలుకక వెంటనే తిరుగుప్రయాణమై తిరుచునాపల్లి జేరి అక్కడనుండి సిలోనుకు బోయి అచ్చట మూడువారములు గడిపి డిసెంబరు నెలాఖరున మద్రాసునందు జరిగిన కాంగ్రెసు మహాసభకు హాజరయ్యెను. ఆసభలో సైమను కమీషను బహిష్కరించుటకు తీర్మానింపబడెను. మరియు ఆసభయందు అప్పుడే ఐరోపా సంచారములో స్వేచ్ఛావాతావరణము ననుభవించి స్వదేశమునకు తిరిగివచ్చిన జవహరులాలు నెహ్రూ యొక్కయు, దేశములోని యువక నాయకమణిగా నుండిన సుభాసు చంద్రబోసు యొక్కయు ప్రోద్బలమున కాంగ్రెసు క్రీడను సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్య సంపాదనగా మార్చుటకు తీర్మానమొకటి గావింపబడెను. ఆసమయమున మహాత్ముడాసభలో లేకుండుటచే తన ప్రతికూలతను తరువాత తన 'యంగు ఇండియా' పత్రికలో దెలుపుచు "కాంగ్రెసు తానుచేయు తీర్మానమును తానములు జరుపుటకు తనకప్పుడు తగిన శక్తి లేదని బాగుగా నెరిగియు అట్టి నిష్ఫ్రాచీ తీర్మానమును జేయుటవలన తన తెలివిహీనతను బ్రకటించుకొనుటయే" యని వ్రాసెను. మరియు ఆతీర్మానమున కసందర్భముగా నాసభలోనే మోతీలాలు నెహ్రూ మొదలగు వృద్ధనాయకుల యభిప్రాయము ననుసరించి బ్రిటిషు సామ్రాజ్యమునకు లోబడిన అధినివేశ రాజ్యాంగ ప్రణాళికను కాంగ్రెసువారు దేశములోని కాంగ్రెసేతర పార్టీలవారితో సంప్రదించి తయారు చేయించవలసినదనిగూడ వర్కింగు కమిటీకి అధికార మిచ్చుచు తీర్మానమొకటి జేయబడెను. ఆప్రకారము కాంగ్రెసు వర్కింగు కమిటీ 1928 మే 19 వ తేదీన అల్ పార్టీ కాన్ఫరెన్సును జతపరిచి జూలై మొదటితేదీలోపున డొమినియను రాజ్యాంగ విధాన రిపోర్టును తయారుచేయవలసినదిగా ఆదేశించి అందుకు మోతీలాలు నెహ్రూ ఆధిపత్యమున 8 మంది సభ్యులుగల కమిటీని నియమించెను.

91. ఇంతలో గుజరాతులోని బార్డోలీ తాలూకాలో రివిన్యూసెటిలుమెంటు వలన నేర్పడిన హెచ్చు శిస్తులను రైతులిచ్చుకోలేక సర్కారువారి నిర్బంధచర్యలకు గురియగుచుండిరి. మహాత్ముడదిగని సర్దారుపటేలు సహాయముతో నచ్చట ఆగష్టు నెలలో పన్నుల నిరాకరణ సత్యాగ్రహమును సాగించి రైతుల పన్నులను న్యాయ

మైన పద్ధతికి మార్పించి జయించెను. కాంగ్రెసు వర్కింగుకమిటీ సలహాపై మోతీలాలు నెహూరుగారి సబుకమిటీ తయారుచేసిన రిపోర్టును జర్చించుటకు లక్నోలో 1928 ఆగష్టు 28 వ తేదీన ముస్లిములీగు మొదలగు 17 ప్రత్యేక రాజకీయవర్గముల యొక్క ప్రతినిధులతో గూడిన ఆల్ పార్టీసు కాన్ఫరెన్సు సమావేశమై ఆ రిపోర్టులో ప్రతిపాదింపబడిన 'డొమినియను సెల్ఫు గవర్న మెంటు' ప్రణాళికను ఆమోదించెను. కాని ఆకాన్ఫరెన్సులో మెంబర్లుగా నుండిన జవహరు, సుభాసులు, సంపూర్ణ స్వాతంత్ర్య వాదులగుటచే ఆచర్చలో పాల్గొనుటకు నిరాకరించిరి. తరువాత డిసెంబరు నెలలో, కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభకు ముందుగా నాపట్టణముననే సమావేశమైన ఆల్ పార్టీసు కాన్ఫరెన్సుకు మహాత్మ డధ్యక్షత వహించెను. ఆకాన్ఫరెన్సుకు ఆవరకు ఫిబ్రవరినెలలో వచ్చియుండిన సైమనుకమిషనును కాంగ్రెసువారితోబాటు బహిష్కరించి, వెంటనే ఇంగ్లాండుకుబోయి అక్కడమారిపోయి, తిరిగి అప్పుడే ఇండియాకువచ్చిన జిన్నాహాజరై, తాను లేనికాలములో తన ముస్లిములీగు లక్నోలో జరిగిన ఆల్ పార్టీసు కాన్ఫరెన్సులో పాల్గొని, మోతీలాలు నెహ్రూరిపోర్టును ఆమోదించినందుకు అహంభావమున అహంకారమువహించి అసహ్యాకరమైన యుపన్యాసమీయ నారంభించెను. జిన్నాయొక్క ఈవిపరీతచర్యకు అధ్యక్షుడైనమహాత్ముడు మిగులవగచి ఆకాన్ఫరెన్సును అప్పటికి ఆపి, కాలపరిమితిలేక వాయిదా వేసెను. ఇంక నాకలకత్తానగరమున తరువాతజరిగిన కాంగ్రెసుమహాసభయొక్క విషయనిర్ణయసభలో మహాత్ముడు, మోతీలాలు రిపోర్టులోని 'డొమినియను స్టేటసు' ప్రణాళికను ప్రతిపాదించినవెంటనే, మోతీలాలుకుమారుడైన జవహరు సుభాసుతో కలిసి, ఆప్రతిపాదనను తీవ్రముగ నెదిరించెను. ఇరుకక్షులవారికిని సామరస్యము నెలకొల్ప దలచి మహాత్ముడు మోతీలాలుపార్టీవారు గోరిన "డొమినియను స్వరాజ్యమును బ్రిటిషుగవర్న మెంటువారు ఒక సంవత్సరములోపల నీయనియెడల జవహరుపార్టీవారు గోరిన "సంపూర్ణ స్వరాజ్య" సంపాదనకై కాంగ్రెసు తగినచర్యను దీసికొనవలసినదని మహాసభలో తీర్మానముజేచ్చి, యందరిచేతను ఒప్పించి యాతీర్మానమును వైస్రాయికి నోటీసుగా దెలియబరిపించెను. న్యాయమైన పద్ధతిననుసరించుటకై ఎదుటివానికి దగినంత యవకాశమిచ్చి, యతడాయవకాశము నుపయోగించుకొనక, యధర్మపు దారినిబట్టినప్పుడు సహజముగా సృష్టిలో నేర్పడుధార్మికశక్తి సహాయముచే మనము వానిని జయించవచ్చునను సృష్టిరహస్యమును గుర్తెరిగినవాడగుటచేత మహాత్ముడా పద్ధతి నవలంబించెను.

92. ఇటుల నొక స్పష్టమయిన మూలకు ద్రోయబడిన బ్రిటిషుగవర్న మెంటువారు గాథరాపడుచుండుట వింతగాదు. అయినను సామాన్య ప్రజల సానుభూతి

లేనిదే దేశములో సమిష్టియుద్యమమేదియు గొనసాగదని గవర్నమెంటు వారు గ్రహించినవారయి దేశములో నప్పుడు కాంగ్రెసుకు దన్నుగానుండిన కార్మికోద్యమమును రూపుమాపదలచి ముందుగా ముప్పదియారు కార్మికనాయకులను యరెస్టుచేసి వారు బ్రిటిషుచక్రవర్తి యొక్క భారతదేశరాజ్యాధికారమును ఆయననుండి తొలగించు టుద్దేశ్యముతో కుట్రలుపన్నుచున్నారని వారిపై రాజద్రోహ నేరమారోపించి, 1929 మార్చి 20వ తేదీన మీరటులో కేసుపెట్టి విచారణ సలుపనారంభించిరి. ఇది యిట్లుండగా మహాత్ముడా నెలారంభములో బర్మాకుబోవుచు త్రోవలో కలకత్తాలో నాగి, యచ్చటప్పుడు జరిగిన విదేశవస్త్రదహనచర్యలో బాల్గొనెను. అదియొక ప్రైవేటు సందులో జరిగినను మహాత్ముడాచర్యను పబ్లికు రోడ్డుమీద జరిపించి ట్రాఫిక్ రూల్సుకు భంగము కలిగించెనని పోలీసు ఆక్టు 66వ సెక్షనుక్రింద నేరము మోపబడి ఒకరూపాయి జరిమానా విధింపబడెను. మహాత్మునికి తెలియకుండగనే ఎవరో ఆజరిమానాను జెల్లించిరి. మహాత్ముని విదేశవస్త్రదహనోద్దేశము అవసరవస్తువుల కొఱకు విదేశీయులపై నాధారపడు మానసికదాస్యవ్యామోహమును తెగగోసి కొనునట్లు జేయుటయే. మహాత్ముడు అప్పుడు హిందుదేశములో భాగమైయుండిన బర్మాలోనుండగా రంగూనునగరమున జరిగిన బర్మాక్రైస్తవస్త్రీల టెంపరెన్సు యూనియను సభలో మాటాడుచు హిందూదేశములోని ప్రజలకందరకు త్రాగుడు మంచిది కాదని ఇదివరకే తెలిసియున్నందున అందును గూర్చి పాశ్చాత్యదేశములలోవలె ప్రభుత్వ శాసనమును జేయుటకు ముందుగా ప్రజలలో విద్యావ్యాప్తిని గలిగించవలసిన యావశ్యకత లేదని దెలియబరచెను. మహాత్ముడా తరువాత ఆంధ్రదేశ సంచారము జేసి, ఆంధ్రులచే ననేకమన్ననల నందెను. తరువాత బొంబాయిలో జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సమావేశమునకు హాజరైన ఆంధ్రనాయకులను తన సబర్మతీ ఆశ్రమమునకు ఆహ్వానించి వారికి సాదరముగ విందుచేసెను.

93. ఆ సంవత్సరము మే నెలలో బ్రిటిషు పార్లమెంటుకు ఎలెక్షనులు జరుగనుండెను. లేబరుపార్టీకి జెందిన 'రామ్సేమేక్డనాల్డు' తన ఎలెక్షను ప్రచారసందర్భమున కామన్‌వెల్తు లేబరుపార్టీ కాన్ఫరెన్సులో నుపన్యసించుచు బ్రిటిషు కామనువెల్తులో కొలది సంవత్సరములలో లేక కొలది నెలలలోనే అన్ని డొమినియనులతో సమానసహోదాగలయొక నూతన డొమినియను చేర్చబడుననియు, అది ఇండియాయనియు స్పష్టముగా దెలియబరచెను. కావున ఆ మేక్డొనాల్డు యెలెక్షనులో గెలుపొంది బ్రిటిషు ప్రధానమంత్రిగూడ యయినవెంటనే ఇండియావైస్రాయి లార్డు ఇర్వీనును లండనునకు బిలిపించుకొని, ఇండియా రాజ్యాంగ మార్పువిషయమై సమాలోచనలు జరిపెను. ఇర్వీను ప్రభువు అక్టోబరు 25వ తేదీన ఇండియాకు దిరిగివచ్చి బ్రిటిషుప్రభుత్వమువారు

ఇండియారాజ్యాంగ మార్పువిషయమై బ్రిటిషు ఇండియాలోని వివిధరాజకీయవర్గముల ప్రతినిధులతోబాటు స్వదేశసంస్థానాధీశుల ప్రతినిధులతో గూడిన రౌండుటేబిలు సమావేశము నొకదానిని లండనులో జరుపదలచినట్లు ఆనెల 31 వ తేదీ దీపావళి పండుగదినమున బ్రకటించెను. వెంటనే ఢిల్లీలో అఖిలపక్షనాయకులు సమావేశమై ఆ ప్రకటనను ఆమోదించుచు గాంధీజీ మొదలగు నాయకుల సంతకములతో నొక జాయింటు మానిఫెస్టోను బ్రచురించి దానిని ప్రభుత్వము వారికి బంపిరి. ఆ జాయింటు 'మానిఫెస్టో'ను నవంబరు మొదటివారమున ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆమోదించుచు మెజారిటీ తీర్మానించుటచే ఆకమిటిలో మైనారిటీగా నుండిన జవహారు, సుభాసులు తమ కమిటీసభ్యత్వములకు రాజీనామాల నిచ్చిరి.

94. వైస్రాయి ఇర్విను రౌండు టేబిలు సమావేశ నిర్మాణమునుగూర్చి సంప్రదించుటకు ఆల్‌పార్టీసు కాన్ఫరెన్సు సభవారికి ఆహ్వానమంపగా వారేర్పరచిన డెప్యుటేషనులో కాంగ్రెసేతరులగు సప్రూ, జిన్నా మొదలగు వారితోబాటు మహాత్ముడు, మోతీలాలు, పటేలులుగూడజేరి వైస్రాయిని డిసెంబరు 23 వ తేదీన గలిసికొనిరి. ఆసమయమున మహాత్ముడు మాట్లాడుచు ఆవరకు బ్రిటిషు ప్రధాని తన ఎలక్షనుకుముందు లేబరుపార్టీ కాన్ఫరెన్సులో నిచ్చిన యుపన్యాసము, అక్టోబరు 31 వ తేదీన వైస్రాయి వెల్లడించిన ప్రకటన, ఇండియాకు డొమినియను రాజ్యాంగ ప్రదానపుటాశను గలిగించియుండుటచే రాబోవు రౌండు టేబిలు కాన్ఫరెన్సులో అట్టి రాజ్యాంగము నేర్పాటుచేయుటను గురించిమాత్రమే చర్చలుజరుగునని హామీ నివ్వవలసినదిగా వైస్రాయిని కోరెను. అటుల హామీనిచ్చుటకు వైస్రాయి నిరాకరించినందున ఆ డెప్యుటేషను, యితర విషయములనుగురించి మాట్లాడక నిరాశాపరులై మారుమాటాడక వెడలివచ్చిరి. ఆవరకు జవహరు, సుభాసులతో నేకీభవించి సంవత్సరపు గడవు ఆఖరున సంపూర్ణ స్వాతంత్ర్య స్వరాజ్యమునకై బోరాడ నిశ్చయించుకొన్న మహాత్ముడు యింతలో రౌండు టేబిలు కాన్ఫరెన్సులో "డొమినియను" రాజ్యాంగ మేర్పడినయడల పూర్తిగా సంతుష్టి నొందదలచుట కొందరికి వింతగా దోచవచ్చును. కాని ఆయన యుద్దేశ్యము ఇండియా వెంటనే యెవరికిని యేశ్రమయు లేక నెమ్మదిగా బ్రిటనుతో సమానహోదాగల డొమినియనుగా బరిగణింప బడిన యడల అట్టి సమానత్వమును బురస్కరించుకొని ఉత్తరోత్తరా ఆవసరమునుబట్టి తేలికగా తెగతెంపులు చేసికొనుటకు యీవరకున్న బ్రిటిషు పార్లమెంటు చట్ట ప్రకారమే వీలు కలుగుననుటయే అయినను ఆవరకు కలకత్తా కాంగ్రెసు మహాసభలో నిచ్చిన సంవత్సరపుగడువు కాలములోపల నప్పుడుగోరిన హామీరాకుండుటచే లాహోరులో తరువాత గూడిన కాంగ్రెసు మహాసభలో 1929 డిసెంబరు 31 వ తేదీ రాత్రి 1½ గంటలవరకు వేచి ఆపైన ఐదు నిమిషములకు ఆనిశీథముననే మహాత్ముడు తెచ్చిన సంపూర్ణస్వాతంత్ర్య స్వరాజ్య తీర్మానమును సభికులందరేకగ్రీవముగా నామోదించిరి. మరియు అట్టి సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనకై తక్షణచర్యలను దీసికొనవలయునని గూడ ఆసభలోనే తీర్మానింపబడెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

# సంపూర్ణస్వాతంత్ర్య ప్రయత్నము

## 1930 — 31

95. లాహోరులో 1929 డిసెంబరాఖరున జరిగిన కాంగ్రెసు తీర్మానము ననుసరించి 1930 జనవరి రెండవ తేదీన వర్కింగుకమిటీ మీటయి, ఆనెల 26 వ తేదీన ప్రజలందరు సంపూర్ణస్వాతంత్ర్యసంపాదన ప్రయత్నప్రమాణమును బహిరంగముగా దీసికొనవలసినదని నిర్ణయించెను. ఈనిర్ణయమును పూర్వాపూర్వాజేయుచు అంతి కొక రోజు ముందుగ అనగా జనవరి 25 వ తేదీన వైస్రాయి ఢిల్లీ శాసనసభలో మాట్లాడుచు ఇండియాకు కాంగ్రెసువారు కోరినట్లు స్వయంనిర్ణయాధికార మిచ్చుట కల లోనివార్త యని హెచ్చరించెను. ఆ హెచ్చరికకు జవాబిచ్చుచు మహాత్ముడు వెంటనే తన 'యంగు ఇండియా' వారపత్రికలో ఆనెల 31 వ తేదీన భారతీయుల సౌఖ్యజీవనమున కత్యవసరమని తాను దృఢముగా నమ్మియున్న :

(1) మద్యపాననిషేధము

(2) భూమిశిస్తు తగ్గింపు

(3) ఉప్పుపన్ను మాఫీ

(4) విదేశవస్త్ర దిగుమతి నిరసన

(5) రాజకీయఖైదీల విడుదల

(6) రూపాయి-పౌను మారకపురేటు మార్చుట

(7) సైనికవ్యయమును తగ్గించుట

(8) ఐరోపియను ఉద్యోగస్థుల జీతములను తగ్గించుట

(9) కోస్తా స్టీమరు వ్యాపారమును దేశీయము గావించుట

(10) సి. ఐ. డి. శాఖను ప్రజాయత్తము జేయుట

(11) ఆత్మరక్షణకై తుపాకులను ధరించుటకు లైసెన్సుల నిచ్చుట

అను పదకొండు రాజకీయ సంస్కరణములను గవర్నమెంటువారు వెంటనే గావించిన యెడల, జనవరి 26 వ తేదీ ప్రమాణము ననుసరించి కాంగ్రెసు ప్రారంభింపనున్న శాసనోల్లంఘనోద్యమము విరమింపబడుననియు; మరియు గవర్నమెంటువా రేర్పరచు రౌండుటేబిలు కాన్ఫరెన్సులో భారతప్రతినిధులు ధారాళముగా దమ యాశయములను వెల్లడించుకొనుటకు అవకాశ మిచ్చినచో ఆ కాన్ఫరెన్సులో బాల్గొనుటకు కాంగ్రెసు సిద్ధముగా నున్నదనియు వ్రాసెను. అందుకు వైస్రాయి సమాధానమియ్య

సందున ఫిబ్రవరి 14 వ తేదీన సబర్మతియందు జరిగిన వర్కింగు కమిటి సమావేశములో సంపూర్ణ స్వరాజ్య సంపాదనార్థమై మహాత్ముని నాయకత్వమున శాసనోల్లంఘన నుపక్రమింప దీర్మానింపబడెను.

96. అప్పటి శాసనోల్లంఘనముయొక్క ముఖ్యోద్దేశము న్యాయమైన యధికారములేని, అనగా మనదేశపు ప్రజాప్రతినిధులకు బాధ్యతలేని, పరాయిదేశపు ప్రజల ప్రభుత్వముజేసిన శాసనములను తప్పకుండా ననుసరించవలసిన యవసరములేదని తెలియబరచుటయే. అనగా అట్టి పరాయిప్రభుత్వమును అంగీకరింపగూడదు అను మానసిక ప్రవృత్తిని ప్రజలలో గట్టిగా నాటుకొనునట్లుజేయు ప్రయత్నమే. కావున మహాత్ముడు ముందుగా భారతీయులందరకును అనగా అబాలగోపాలమునకును, సంబంధించిన ఉప్పుపన్ను శాసనమును ఉల్లంఘించదలచి, తగిన వ్యవధితో ముందుగా గవర్నమెంటువారికి తెలుపవలసియుండుట సత్యాగ్రహియొక్క పరిమధర్మమగుటచే, అప్రకారము వైస్రాయికి మార్చి రెండవ తేదీన రెజినాల్డు రైనాల్డ్సు అనునమ్మకమైన యొక ఆంగ్లేయునిద్వారా నోటీసును బంపెను. దానికి వైస్రాయి జవాబిచ్చుచు, గాంధిమహాత్ముడు చేయబోవుకార్యము ప్రభుత్వమువారి శాసనమునుల్లంఘించుటయగునని యు, అందువలన దేశములోశాంతికి భంగమువాటిల్లుననియు మాత్రము తెలిపెను. మహాత్ముడు తక్షణమే తిరిగి బదులువ్రాయుచు, తానావరకు వినయపూర్వకముగా మోకరించుకొని రొట్టెనుగోరగా రాతినిబొంచెననియు, వైస్రాయి యిప్పుడు పేర్కొనిన 'శాంతి' ప్రజలకు చెరసాలలో భయమువలన నేర్పడిన శాంతివంటిదనియు, అట్టి నిర్బంధశాంతి దేశములోని ప్రజలకు దుఃఖకరమై, విసుగుపుట్టించుచు, భారతజాతికి ఊపిరాడనిచ్చుటలేదనియు, అందుచే అట్టిశాంతిని భేదించుటకై తానాపరప్రభుత్వపు శాసనము నుల్లంఘించ సమకట్టితిననియు ధైర్యముతో తెలిపెను. తిరిగి జవాబు రాకుండుటచే మొదట నిచ్చిన నోటీసులో తెలిపినట్లు ఆమార్చినెల 12 వ తేదీన తానున్న సబర్మతీ ఆశ్రమములోని 75 మంది అనుచరులతో బయలుదేరి, రెండువందల మైళ్ళు కాలినడకను మజిలీలమీద 25 దినములు ప్రయాణముచేసి మధ్యమధ్య మజిలీలలో నుపన్యాసములిచ్చి, చివరకు సముద్రతీరముననున్న 'దండి' గ్రామమును, రామచంద్రుడు లంకను జేరినట్లు ఏప్రెలు 5 వ తేదీన చేరెను, ఆతీరమున బాహాటముగా బయలులో కావలసినంత ఉప్పు ఏర్పడియున్నను, బ్రిటిషుగవర్నమెంటువారికి పన్ను గట్టనిదే బిటికెడైనను ముట్టగూడదను గవర్నమెంటువారి శాసనముండుటచే, ఆపరప్రభుత్వశాసనమును, అనగా ఆపరప్రభుత్వమును, అంగీకరింపము అని తెలుపు సూచనగా మహాత్ముడు తనచేతితో అచ్చటి ఉప్పును తాకదలచెను. అందుకుగాను మహాత్ముడు ఆరాత్రిని ఉపవాసముతోడను భగవత్ప్రార్థనలతోడను గడపి మరునాడుదయమున

ఏప్రెలు 6 వ తేదీన సముద్రస్నానమొనరించి, అతడి బట్టలతో క్రిందికివంగి అక్కడ బాహాటముగా విరివిగానున్న ఉప్పులోని స్వల్పభాగమును పిడికిలితో చేతబట్టెను.

97. ఈస్వల్ప కార్యము కార్చిచ్చువలె త్వరత్వరగ దేశమంతట వ్యాపించుటచే గవర్నమెంటువారు కాంగ్రెసువారి సెందరినో యరెస్టు చేయడమేగాక కొన్నిచోట్ల గొందరిపై తుపాకిగుండ్ల వర్షమునుగూడ గురిపించిరి. మహాత్ముడట్లు శాసనోల్లంఘనమును మొదలిడినపుడే అట్టి కార్యము లొనరించు సత్యాగ్రహులు ఆయాశాసనములతో నిర్ణయింపబడిన శిక్షలకు సంతోషపూర్వకముగా బద్ధులై యుండవలెనని నియమించుటచే సత్యాగ్రహుల యరెస్టున కెంతమాత్రము అభ్యంతరమును గలిగియుండలేదు. కాని ప్రభుత్వమువారు తమ శిక్షాస్మృతుల ననుసరించి న్యాయమైన విచారణ సలిపి, యందు నిర్ణయింపబడిన శిక్షను విధించక అధికారులు యిచ్చవచ్చినట్టు సత్యాగ్రహులను హింసించుట మృగత్వ మనిపించుకొనునని ప్రభుత్వము వారి మహాత్ముడు తెలియబరచెను. మరియు శాసనవిరుద్ధముగా అక్కడి ఉప్పును పిడికిలిలో బెట్టుకొనినచో నక్కడనున్న పోలీసు ఉద్యోగి ఆతనిపిడికిలిని బలవంతముగ బెకలించి తానా ఉప్పును దీసికొనుటకు ప్రభుత్వపు లవణశాసనములో అధికార మివ్వబడలేదనియు అతని పని యంతయు ఆ ఉప్పును దొంగిలించిన సత్యాగ్రహిని అరెస్టుచేసి మేజస్ట్రేటు సెదుట కేసుపెట్టి, ఆమేజస్ట్రేటు ఉత్తరువుపైన మాత్రమే ఆఉప్పును గవర్నమెంటువారు స్వాధీనము చేసికొనవలయుననియు, కాంగ్రెసు సత్యాగ్రహులు పోలీసు అధికారులు తమను అరెస్టుచేసినామని దూరముననుండి చెప్పినంత మాత్రముననే మారుమాటాడక ఆఅధికారుల స్వాధీనములోనికి వెంటనే వెళ్లుటకు సంసిద్ధులై యున్నారనియు ప్రభుత్వమువారికి దెలిపెను.

98. గాంధి మహాత్ముడు తానింకను యరెస్టు కాబడకుండుటచే ఇతరపనులను జేయుచుండెను. ఆ 1930 ఏప్రెలు నెలలో ప్రభుత్వమువారు దెచ్చిన బెంగాలు ఆర్డినెన్సు, ప్రెస్సు ఆర్డినెన్సులను గూర్చి వ్యాఖ్యానించుచు, తన అహింసాతత్వమునందు నమ్మకములేని కొందరు బెంగాలులో ఉప్పు సత్యాగ్రహములో పాల్గొని కొన్ని హింసాత్మక చర్యలను గావించుచుండుటచే బెంగాలు ఆర్డినెన్సు ఏర్పడినదనియు అంతమాత్రముచేత నిజమైన సత్యాగ్రహులు భీతిజెందనవసరములేదని వారిని హెచ్చరించెను. ప్రెస్సు ఆర్డినెన్సును గూర్చి ప్రత్యేకముగ వ్యాఖ్యానించుచు 'థోరో' మహాసీయుడు నుడివియుండినట్లు క్రూరప్రభుత్వములో ప్రజలు తమ శరీరములతోబాటు ఆస్తులనుగూడ త్యాగము చేయవలసివచ్చినను తమ ఆత్మల నెప్పుడును అమ్ముకొనరాదని పత్రికాధిపతులను హెచ్చరించెను. అనగా బ్రిటిషు ప్రభుత్వమువారు తమ ప్రెస్సు ఆర్డినెన్సు ననుసరించి పత్రికాధిపతుల ఆఫీసులలోని ప్రెస్సులను, చేతిలోని

కలమును, నోటిలోని మాటను వశపరచుకొనుటలో కృతకృత్యులు కాగలిగినను భారతీయు లందరిహృదయములలో రగులుచున్న భావముల నెంతమాత్రము నిర్మూలింప జాలరనియు దెలియబరచెను. ఆకారణమున తన 'యంగు ఇండియా' పత్రికను బ్రచురించుచున్న నవజీవను 'ప్రెస్సు మేనేజరుకు వ్రాయుచు, ప్రభుత్వమువారా ప్రెస్సునుండి సెక్యూరిటి కోరేయడల ఇవ్వరాదనియు, అవసరమైనచో తన పత్రికను బ్రచురించుట నాపవలయుననియు దెలియబరచెను. చివర కటులనే సంభవించెను.

99. మహాత్ముడా ఏప్రిలు నెలలోనే సూరతునగరమునకు బోయి, యక్కడి స్త్రీ సమాజములో బ్రసంగించి వారిని ధైర్యవంతులగుటకు బురిగొల్పి 'కరాడి' గ్రామము జేరి. అక్కడనుండి తాను త్వరలో 'దర్శన' మొదలగు చోట్లకు బోయి యక్కడి 'సాల్టు' డిపోలను స్వాధీనము చేసికొనదలచినట్లు మే నెల 4వ తారీఖున వైస్రాయికొక లేఖ వ్రాసి మరునాడు ఆయనకు బంపుటకై ఆరాత్రి దానిని తనవద్ద నుంచుకొనెను. వెంటనే వెంటనున్న సి. ఐ. డి. పోలీసువారు ఆచూకి దీసి పైయధికారులకు తంతిమూలమున దెలియబరచి వారియాజ్ఞచే నారాత్రియే 12 గంటల 45 నిముషములకు మహాత్ముని నిద్రలేపి, పూర్వమెప్పుడో బ్రిటిషువారీ దేశమున తమ ప్రభుత్వమును బాగుగా స్థిరపర్చుకొనని రోజులలో తమవిరోధస్థులను అరెస్టుచేయుటకై 1827 సంవత్సరములో నేర్పరచుకొన్న బొంబాయి రాష్ట్రపు 25 వ రెగ్యులేషను క్రింద యరెస్టుచేసి యరవాడ జైలుకు దీసికొనిపోయిరి.

100. వెంటనే దేశములో నలుమూలల నావిర్భవించిన యావేశమువలన అనేక ఘోరకృత్యములను ఒడలు మరచిన ప్రజలును, ప్రభుత్వమువారునుగూడ జరిపి ఆ మేనెలాంతములో అలహాబాదులో జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశములో మొదట నొక్క లవణశాసనోల్లంఘనముతో నారంభించిన సత్యాగ్రహోద్యమము యితరములగు విదేశవస్త్ర బాయికాటు, కల్లుదుకాణముల పికెటింగు, అటవీ శాసనముల ధిక్కరణ, బ్రిటిషువారి బ్యాంకుల, ఇన్సూరెన్సు కంపెనీల బహిష్కరణ, గ్రామోద్యోగస్థుల రాజీనామా, రయితువారి జిల్లాలలోమాత్రము పన్నుల నిరాకరణ అను ఆరు నూతన విషయములకుగూడ వ్యాపింపజేయబడెను. ఈనూతన సత్యాగ్రహ ప్రణాళికోద్యమ సందర్భమున దేశములో నొకలక్షమందికిపైగా శిక్షింపబడిరి. వారిలో పన్నెండువేలమంది మహమ్మదీయులు. ఈనూతనోద్యమ వ్యాపకముచే బ్రిటిషు గవర్నమెంటు ఇండియాలో అటకట్టుకునచ్చునట్టు గన్పట్టెను. ఇండియాలో వైస్రాయి ఇర్వినుతోబాటు ఇంగ్లండులో లేబరు పార్టీకిజెందిన ప్రధాని మేక్డొనాల్డుగూడ తహతహలాడుచు తమలేబరుపార్టీ అభిప్రాయపత్రికయైన "డైలీహెరాల్డు" కరెస్పాండెంటుగా

నిండియాలోనున్న జార్జిస్లోకోంబును జైలులోనున్న మహాత్ముని గలిసికొని కాంగ్రెసు వారు తమ సత్యాగ్రహోద్యమమును విరమించుకొని లండనులో జరుగనున్న రౌండు టేబిలు సమావేశములో బాల్గొనవలసినదిగా గోరవలసినదని ఆజ్ఞనిచ్చుటచే ఆ దొర గారు మహాత్ముని మే నెల 20 వ తేదీన దర్శించెను. అప్పుడు మహాత్ముడు కాంగ్రెసు ప్రతినిధులు రౌండుటేబిలు సమావేశములో బాల్గొనుటకు ముఖ్యముగా మూడు షరతులను గోరెను. అవి :

(i) రౌండుటేబిలుకాన్ఫరెన్సు యజెండాలో 'ఇండియాయొక్క స్వాతంత్ర్య వస్తుత్వమును సూచించు రాజ్యాంగప్రణాళిక ఏర్పాటుచేయుట' అనునంశమును జేర్పవలెను.

(ii) ఈవరకు తాను జనవరి 31 వ తేదీన తన పత్రికద్వారా వైస్రాయికి దెలిపిన పదకొండు రాజకీయ సంస్కారణములలో (1) ఉప్పుపన్ను రద్దగుట, (2) మద్యపాననిర్మూలనకై ప్రయత్నములు జరుగుట (3) విదేశవస్త్రముల దిగుమతి వ్యాపారమును నిషేధించుట (4) రాజకీయ ఖైదీలను వదలుట అను నాలుగింటినిమాత్రము వెంటనే జరుపవలెను.

(iii) పదకొండుసంస్కారణములలో మిగిలినవాటినిగురించి తరువాత నెమ్మదిమీద చర్చించుట కొప్పుకొనవలయును.

101. మహాత్ముడీవిధముగా గొంత రాజీకిరాదలచుటను పత్రికలద్వారా సప్రూజయకరులు దెలిసికొని, వైస్రాయిని సమీపించి, గాంధీజీ మొదలగు కాంగ్రెసు నాయకులను కారాగారములలో సందర్శించి సంప్రదించుట కనుజ్ఞవడసి, యెక్కడనో యుత్తరప్రాంతమున అలహాబాదులోని నైనీజైలులో నిర్బంధింపబడియుండిన కాంగ్రెసువర్కింగు కమిటీమెంబర్లు తండ్రికొడుకులగు నెహ్రూలనిద్దరిని దక్షిణమున పూనాజైలులోనున్న మహాత్మునొద్దకు గవర్నమెంటువారిచే అగస్టు నెలలో దెప్పించి వారిమువ్వురితో గలిసి సంప్రదించిరి. జవహరు ఉప్పుచట్టముక్రింద ఆవరకు ఏప్రెలు 14 వ తేదీన నిర్బంధింపబడియుండెను. మోతీలాలు బొంబాయినుండివచ్చినవెంటనే జూను 30 వ తేదీననిర్బంధింపబడి యుండెను. ఆతరువాత గవర్నమెంటువారుపటేలు, సరోజిని మొదలగుకొందరు ఇతరకాంగ్రెసు వర్కింగుకమిటీమెంబర్లనుగూడ వారి వారిప్రదేశములనుండి దెప్పించి అచ్చటవిడిచిరి. వారందరు యథావిధి కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశముగా 1930 అగస్టు 14 వ తేదీన మహాత్ముని సమక్షమున, జైలులోనే గూడి యొకతీర్మానమునకువచ్చి, మరునాడు ప్రముఖకాంగ్రెసు నాయకుల సంతకములతో నొకలేఖను బ్రచురించిరి. ఆలేఖలో ఈవరకు జార్జిస్లోకోంబుకు దెలిపిన మూడుషరతులతోబాటు మరిమూడు నూతనషరతులుగూడ జోడుపరచి పేర్కొనబడెను. అవి :—

(1) రౌండు టేబిలు కాన్ఫరెన్సులో ఇండియాకు డుమినియను రాజ్యాంగము ఏర్పడిన తరువాత అవసరమైనచో ఇండియా బ్రిటిషు సామ్రాజ్యము నుండి వేరగుటకు హక్కును కలిగియుండవలెను.

(2) ఇండియాకు ఏర్పడు డుమినియను రాజ్యాంగము అమలులోనికి వచ్చులోగా వెంటనే చేయవలసిన ప్రస్తుతపు రాజ్యాంగములోని మార్పులేవో భారతీయ ప్రతినిధులే నిర్ణయింపవలెను.

(3) ప్రస్తుతము గవర్నమెంటు వారికున్న ఇండియా పబ్లికు ఋణము మొత్తములో యే యే పద్దులనుమాత్రమే ఇండియా భరింపవలయునో నిర్ణయించుటకు ఒక ఇండెపెండెంటు ట్రిబునలు యేర్పాటుకావలయును.

102. ఈపైపరతులను గవర్నమెంటు వారు ఒప్పుకొనిన సూచనలు గనుపడమిచే కాంగ్రెసు ఆ 1930 నవంబరు 12వ తేది నుండి మరుసంవత్సరము (1931) జనవరి 18 వ తేదీవరకు లండనులో జరిగిన ప్రధమరౌండు టేబిలు కాన్ఫరెన్సును బహిష్కరించెను. జనవరి 19 వ తేదీన బ్రిటిషుప్రధాని ప్రసంగించుచు ద్వితీయ రౌండు టేబిలు కాన్ఫరెన్సు జరుగులోపల కాంగ్రెసు తన శాసనోల్లంఘనోద్యమ తీర్మానమును ఉపసంహరించుకొన్నచో, తప్పక కాంగ్రెసు ప్రతినిధులను ఆ కాన్ఫరెన్సుకు రప్పించుకొనదలచినట్లు సూచించెను. ఆసూచననుసరించి, కాంగ్రెసు నాయకులు తమలోదాము సంప్రదింపులు జరుపుకొనుటకు అవకాశమిచ్చుటకై వైస్రాయి ఆ నెల 26వ తేదీన అనగా స్వాతంత్ర్య ప్రమాణస్మారకదినమున మహాత్మునితో బాటు మరి 30 మంది కాంగ్రెసు నాయకులను బేషరతుగా వారి వారి జైళ్ళనుండి విడుదల జేసెను. అయినను ఈలోపున నే అనగా జనవరి 21 వ తేదీన నే, జైలుకు బోకబయట నుండి యుండిన కాంగ్రెసుకమిటి మెంబర్లు అలహాబాదులో సమావేశమై బ్రిటిషు ప్రధాని ప్రసంగమును విమర్శించి ఆవరకు పూనాలో 1930 ఆగష్టు 15వ తేదీన ప్రముఖకాంగ్రెసు నాయకులు ప్రచురించిన లేఖలోని ఆరుషరతులను పునరుద్ఘాటించుచు తీర్మానించియుండిరి. ఇది యిట్లుండగా ప్రధమరౌండుటేబిలు కాన్ఫరెన్సుకు గవర్నమెంటు వారిచే నామినేటుఅయి వెళ్ళియుండిన సప్రూ జయకరులు తాము తిరిగివచ్చి సంప్రదించువరకు బ్రిటిషుప్రధాని సూచనపై యేచర్యయుదీసికొనవలదని మోతీలాలుకు కేబిలు గ్రామును బంపియుండిరి.

---

## ఇరువదిరెండవ ప్రకరణము

# రౌండుటేబిలు కాన్ఫరెన్సు

## 1931 — 1933

103. జయిలునుండి 1931 జనవరి 26 తేదిన విడుదలయిన కాంగ్రెసు కమిటీ మెంబర్లు మిగిలిన కాంగ్రెసువారితో చేరి అలహాబాదులో జనవరి 31 తేదిన తిరుగ కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశమును జరపి అవర్కు 21 తేదిన జైలులోనేని సభ్యులతో చేయబడిన తీర్మానమును బహిర్గతము చేయకుండ నుంచిరి. అయినను మేగ్డనాల్డు కోరియుండినట్టుగ తమ పూర్వపు శాసనోల్లంఘనోద్యమ తీర్మానమును విరమించుకొనలేదు. వైస్రాయి మహాత్ముడు మొదలగు కాంగ్రెసు నాయకులను 1931 జనవరి 26 తేదీన విడుదలచేసి యూరకుండెను. మహాత్ముడు ఫిబ్రవరి 14 వ తేదివరకు వేచి తానే స్వయముగా వైస్రాయితో మాట్లాడదలచిన ట్లొకలేఖను వ్రాసిబంపి, ఆయన యనుజ్ఞను బడసి, అలహాబాదునుండి ఢిల్లీకి తన సహచరులతోబోయి 17 వ తేదీన నాలుగుగంటలసేపు ఆయనతో సంప్రదించెను. ఆసందర్భముననే చర్చిహిలు కొల్లాయితో సగము దిగంబరుడైన ఫకీరును బ్రిటిషు వైస్రాయి భవనమునకు రప్పించుటను పరిహాసించెను. మహాత్ముడు వైస్రాయితో మూడువారముల కాలములో ఎనిమిదిసార్లు సలిపిన సంప్రదింపుల ఫలితముగ మార్చి 5 వ తేదీన గాంధి-ఇర్విను ఒడంబడిక యొకటి ఏర్పడెను. ఆయొడంబడిక ననుసరించి ఆసంప్రదింపులలో వైస్రాయి కోరిన శాసనోల్లంఘనోద్యమ సంపూర్ణవిరమణ తాత్కాలికముగ మాత్రము ఏర్పడుటయు, ఆసమయమున మహాత్ముడు కోరిన నాలుగుషరతులలో మూటిని అనగా వ్యక్తులను తమస్వంత యుపయోగమునకై మాత్రము ఉప్పును స్వేచ్ఛగా జేసికొననిచ్చుట; కల్లంగళ్ళను, విదేశవస్త్రనిలయములను పికెటింగు చేయనిచ్చుట; అహింసాపరులై యుండిన సత్యాగ్రహులను జైలునుండి విడుదలజేయుట మాత్రము వైస్రాయి ఒప్పుకొనుటయు సంభవించెను. పోలీసువారు సత్యాగ్రహులపై జరిపిన అధర్మపుచర్యలను విచారించవలయునను నాల్గవ షరతును వైస్రాయి ఒప్పుకొనమిచే మహాత్ముడు దానిని వదలుకొనవలసి వచ్చెను. కాని మహాత్ముడు ఒప్పుకొనియుండిన శాసనోల్లంఘనోద్యమ తాత్కాలికవిరమణను తరువాత వెంటనే ఢిల్లీలో గూడిన కాంగ్రెసు వర్కింగుకమిటీ మొదట యంగీకరించకుండెను. అయినను మహాత్ముని నాయకత్వము లేనిదే శాసనోల్లంఘనోద్యమమును గొనసాగించలేమని కమిటీవారు గ్రహించి, విధిలేక చివరకు ఆయన షరతును ఒప్పుకొనిరి.

104. ఆ మార్చినెల 25 వ తేదీన కరాచీలో జరుగబోవు కాంగ్రెసు మహాసభకు మహాత్ముడొక రోజు ముందుగా బోవుచుండగా త్రోవలో అయనకు కోపోద్రేకులైన కొందరు ప్రజలు నల్లజెండాలను జూపిరి. దీనికి కారణము: క్రిందటి సాయంత్రమే గవర్నమెంటువారు భగత్ సింగు అను దేశభక్తుని అతని యిద్దరు అనుచరులతో గలిపి ఉరిదీసిరి. అట్టి క్రూర గవర్నమెంటుతో మహాత్ముడు రాజీ చేసికొని యుండుటను ఆప్రజలు సహించలేకుండిరి. భగత్ సింగుపై గవర్నమెంటువారు రెండు నేరములనారోపించి మరణదండన విధించిరి. అందొకటి 1928 లో సైమను కమిషను బహిష్కరణ సందర్భమున లాజపతిరాయిని బహిరంగముగ లాఠీతో రొమ్ముపై గొట్టియుండిన పోలీసు యుద్యోగిని ఆతరువాత రహస్యముగ హత్యగావించి యుండుట; రెండవది 1929 ఏప్రిలు 8వ తేదీన ఢిల్లీ యసెంబ్లీహాలులో కేవలము బ్రిటిషు పరిపాలన యెడల భారతీయులకుగల అసమ్మతిని నిరూపించుటకు మాత్రమే వేయబడిన బాంబు ప్రయోగము. మహాత్ముడు తనపై కినుకవహించిన ఆప్రజల మనోభావములను సరిగా గ్రహించినవాడగుటచేత యెంతమాత్రమును తొణకక వారు తనకిచ్చిన నల్లపువ్వులను సంతోషముతో స్వీకరించెను. అసలు మహాత్ముడే అవరకు భగత్ సింగు యొక్క ఉరిశిక్షను తప్పించి, ద్వీపాంతరశిక్షగా మార్పించుటకై వైస్రాయిని స్వయముగా గలిసికొని ప్రయత్నించినను లాభము లేకపోయెను. ఆవిషయమును గ్రహించిన కరాచి కాంగ్రెసు మహాసభ గాంధి-ఇర్విను ఒడంబడికను ఆమోదించెను. ఆకాంగ్రెసు మహాసభ మహాత్ముని సలహాపై స్వరాజ్యములో నుండవలసిన భారతపౌరుల ప్రధాన హక్కులు, భారత ప్రభుత్వపు ముఖ్య విధులు మొదలగు వాటిని గూర్చికూడ తీర్మానమును గావించెను.

105. ఇర్వినుతర్వాత 1931 ఏప్రెలు 18వ తేదీన వైస్రాయిగా వచ్చిన విల్లింగ్డను మహాత్ముని గలిసికొనుటకు గుతూహలుడై యుండలేదు. అయినను ఇర్వినుతో జేసికొనిన యొడంబడికననుసరించి, కాంగ్రెసువర్కింగుకమిటి జూను 10 వ తేదీన సమావేశమై రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు కాంగ్రెసుతరపున ఏకైక ప్రతినిధిగా మహాత్ముని నెన్నుకొనెను. కాని, ప్రభుత్వాధికారులు గాంధీ ఇర్విను యొడంబడికలోని మహాత్ముని మూడుషరతులకు విరుద్ధముగ నక్కడక్కడ ప్రజలను బాధించుచుండిరి. ఆ రోజులలోనే ఆంధ్రదేశమున గుంటూరునందు అనవసరపోలీసు కాల్పులుజరిగెను. మరియు తూర్పుగోదావరిజిల్లాలోని వాడపల్లిలో దేవోత్సవసందర్భమున మహాత్ముని పటమును గూడ నూరేగించినందుకు పోలీసులు తుపాకులుపేల్చి నలుగురిని చంపి పెక్కుమందిని గాయపరచిరి. కాంగ్రెసు ఇట్టివిషయముల నేకములను

సేకరించి వైస్రాయికి దెలియబరచినను లాభములేకపోయెను. అందువలన మహాత్ముడు రౌండు టేబిలు కాన్ఫరెన్సుకు బోవుటకు నిరాకరించి, లండనుకు ఆగష్టు 15 వ తేదీన బోదలచి ముందుగా బొందిన తన స్టీమరుప్యాసేజిని వెంటనే రద్దుపరచుకొని ఆసంగతిని వైస్రాయికి ఆగష్టు 11 వతేదీన దెలిపెను. వైస్రాయి ఆవిషయమును బ్రిటిషు అధికారులకు వెంటనే తెలియజేసెను. కాని, వారు వైస్రాయిని మందలించి ఎట్లైనను మహాత్ముని బంపించవలసినదిగా ఆజ్ఞాపించినందున వైస్రాయి ఆగష్టు 27 వ తేదీన మహాత్మునితో ఈవరకు ఇర్విను గావించిన ఒడంబడికకు హామీనిచ్చుచు, వేరొక యొడంబడికను జేసికొని ఆయన రౌండు టేబులు కాన్ఫరెన్సుకు బోవునట్లు చేయగలిగెను. ఆకారణమున మహాత్ముడు ఆగష్టు 29 వ తేదీన గవర్నమెంటువా రేర్పరచిన స్పెషలు ట్రెయినుమీద ఢిల్లీనుండి బొంబాయికిబోయి అక్కడ స్టీమ రెక్కి సెప్టెంబరు 11 వ తేదీన ఫ్రాన్సుదేశములోని మార్సెలిసు రేవుజేరెను. అక్కడ నుంచి పారిసునగరముమీదుగ రైలుమీద బొలోనుతీరమునకును, అపై స్టీమరుమీద ఇంగ్లండులోని ఫోకుస్టోను రేవునకును మరునాడు చేరెను. మహాత్మునకు అచ్చటతనకు స్వాగతమిచ్చిన ఇండియా ఆఫీసు ఉన్నతోద్యోగివెంట మోటారుకారులో లండను లోని ఫ్రెండ్సుమీటింగు హాలుకు మొదట బోయెను.

106. మహాత్ముడు ఆ 12-9-31 న అచ్చోట తనరాకకై కాచుకొని యుం డిన బ్రిటిషు పత్రికావిలేఖరుల నుద్దేశించి ప్రసంగించుచు వారి గవర్నమెంటా సమయ మున వారి దేశపు ఆదాయవ్యయ పట్టికలను సమపరచుకొనుటలో నిమగ్నులై యుండు టను ప్రస్తావించి, ఇండియాకును, ఇంగ్లండునకును గల సంబంధమును మొట్టమొదట సమపరుపనిదే దానిపై నాధారపడు వారిదేశపు ఆర్థికస్థితిని న్యాయముగా సమపరపు కొన జాలరని హెచ్చరించెను. తరువాత మహాత్ముడు తన నావరకెరిగిన మురియల్ లెస్టరు దొరసానిగారి కోరికపై లండనులో బీదలు కాపురమున్న ఈస్టుయెండులోని కింగ్లీహాలులో బసజేసెను. మహాత్ముడు లండనుజేరిన మరునాడే అనగా సెప్టెంబరు 13 వ తేదీన అమెరికావారి కోరికపై వారికి రేడియోప్రసంగము గావించెను. అదియే ఆయన తన జీవితములో మొదటిసారి రేడియోలో బ్రసంగించుట. ఆప్రసంగము భారత శాంతి సమరోద్యమమును గూర్చినదై యుండెను. ఆమరునాడే అనగా 14 వ తేదీన రెండవరౌండు టేబిలు కాన్ఫరెన్సు యొక్క ఫెడరలు స్ట్రక్చరు కమిటీ ప్రథమ సమావేశము జరిగెను. కడచిన సంవత్సరమున జరిగిన మొదటిరౌండు టేబిలు సమా వేశములో భారతదేశ రాజ్యాంగమును సంస్థానములతో గూడిన ఫెడరలు యూని యనుగా నేర్పరచుటకు నిర్ణయింపబడి యుండుటచే ఆ ఫెడరలు యూనియను యొక్కయు అందలి భాగములయిన రాష్ట్రముల యొక్కయు కార్యనిర్వాహక,

శాసన సభల నిర్మాణములను గూర్చి ఈసమావేశములో చర్చ లారంభమాయెను. సభ జరిగిన మొదటిరోజు సోమవారమగుటచే మహాత్ముడు, తన మౌనవ్రతము మూల మున నచ్చటి ఆరోజు చర్చనంతను మేధకమైన మేకపిల్లవలె మెల్లగ నుండి చల్లగ నాకర్ణించుచుండెను. మరునాటి సభలో మహాత్ముడు, తన జీవితములో నెన్నడు గావించియుండని అతిగంభీరమైన సింహగర్జనమును బోలిన మహోపన్యాస మును 50 నిమిషముల సేపిచ్చెను. ఆ ఉపన్యాసమును గూర్చి అప్పటి అమెరికను పత్రికలు వేనోళ్ళ శ్లాఘించెను. ఆ ఉపన్యాసము తాను ఏకైక ప్రాతినిధ్యము వహించిన కాంగ్రెసు నిజమైన సర్వభారత ప్రజాసంస్థయని సప్రమాణముగ ఋజువు జేసెను. రెండు దినములైన వెనుక అనగా 17 వ తేదీన జరిగిన మరుసటి కమిటీ సమావేశములో మహాత్ముడు తిరుగ నుపన్యసించుచు భారతదేశమునుండి వచ్చి తన సరసను గూర్చున్న భారతీయ సభ్యులందరును భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వము వారిచే నియమితులై వచ్చియుండుటచే వారెవరును భారతప్రజాప్రతినిధులుగారనియు రౌండుటేబిలు కాన్ఫరెన్సును సమకూర్చిన బ్రిటిషు ప్రభుత్వము వారు తాము భారత దేశ రాజ్యాంగవిషయమున నేమిచేయదలచుకొనియుండిరో దానిని ముందుగా దెలుప వలసినదనియు, అటుల దెలుపక తాము ప్రత్యేకముగా నిర్ణయించి తెచ్చుకొనిన సభ్యులచే నిచ్చవచ్చినట్లు మాట్లాడ నిచ్చినచో ఆసభ ఒక డిబేటింగు సొసైటీగా నేర్పడి మిగుల కాలహరణము కాగలదనియు అది సరియైన మార్గము గాదనియు హెచ్చరించెను.

107. సభ యజెండాలో వయోజన వోటింగుపద్ధతిగూడ నుండుటచే మహాత్ముడు అందునుగూర్చి ప్రశంసించుచు చదువురాని కడు బీదలలోసైతము జ్ఞానవంతులు గలరనియు, వోటింగుపద్ధతి సరిగా జరుగుటకు ప్రజలందరికి చదువవసరమని తాను దృఢముగా నమ్మియుండియు, అంతకాలమువరకు వారలకు వోటింగు పనికి రాదనుట యనగా యుగాంతమువరకు వేచియుండవలయుననుటయే యగుటచే తన కట్లు వేచియుండుట కిష్టములేదని స్పష్టముగా దెలియబరచెను. తరువాత వారములో జరిగిన మరుసటి కమిటీ సమావేశములో ఇండియా కార్యదర్శి ఇండియాలోని రూపాయి విలువను తగ్గించవలెనని చేసిన సూచనను మహాత్ముడు సహేతుకముగా ఖండించెను. అంతటితో రౌండుటేబిలు కాన్ఫరెన్సు అధికారులు దిగ్భ్రమగొని మహాత్ముని హేతువాదప్రతిఘటనలకు తట్టుకొనలేక ఆ ఫెడరలు స్ట్రిక్చరుకమిటీ సమావేశములను ఆపుజేసి, మూడవవారములో అనగా అక్టోబరు 8 వ తేదీన వివాదగ్రస్తమయిన మైనారిటీ కమిటీ సమావేశమును దెచ్చిబెట్టిరి. అందులో గవర్నమెంటువారిచే అప్పటి ఇండియా కాపురస్థులనుండి ఏరితేబడిన ఆరుగురు బ్రిటిషువారు, ఇండియనులగు

పదముగ్గురు ముస్లిములు, పదిమంది హిందువులు, ఇద్దరు పంచములు, ఇద్దరు కార్మిక నాయకులు, ఇద్దరు సిక్కులు, ఒక పార్శీ, ఇద్దరు యిండియను క్రైస్తవులు, ఇద్దరు ఇండియాలోని యూరపియనులు, ఒక ఆంగ్లో ఇండియను, ముగ్గురు స్త్రీలు వెరశి నలుబది నలువురు సభ్యులుండిరి. ఈకమిటీ కప్పలతక్కెడవలె ఎప్పటికిని నిలకడ సమాధానమును బొందలేకుండెను. వీరి సహజపరస్పర విభేదములను బ్రిటిషు అధికారులు గోరంతలను గొండంతలుగ జేసి ప్రపంచమును మోసపుచ్చదలచిరి. మహాత్ముడా అక్టోబరు 8 వ తేదీ మైనారిటీ కమిటీ మొదటి సమావేశములో ముచ్చటించుచు వేరు వేరు కులసంఘముల తరఫున గవర్నమెంటువారిచే నామినేటుకాబడి వచ్చిన భారతీయులు దేశముయొక్క స్వాతంత్ర్య ముఖ్య సమస్యను మరచిపోయి తమ తమ ప్రత్యేక కులస్థులకు ఎప్పుడో రాబోవు శాసనసభలలో కావలసిన ప్రత్యేక ప్రాతినిధ్య కోటాలనుగూర్చి ముందుగా తగవులాడు చుండుటనుజూచి తనకు గలిగిన అత్యంతసిగ్గును, అమితవిచారమును ఆసమావేశమునందే వెలిబుచ్చెను. ఆమైనారిటీ కమిటీ సమావేశము అతరువాత నవంబరు 13వ తేదీన తిరిగి కూడెను. ఆసమయమున మహాత్ముడు మరల మాట్లాడుచు కాంగ్రెసును ఆరెండవ రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు ప్రత్యేకముగా వైస్రాయిద్వారా ఆహ్వానించుటయొక్క యుద్దేశ్యము భారత భావి రాజ్యాంగ నిర్మాణమునుగూర్చి కాంగ్రెసుయొక్క అభిప్రాయమును దెలిసికొనుటయే మైయుండుటచే ముందుగా కాంగ్రెసు ప్రణాళికను తెలియజేయనిచ్చి, ఆప్రణాళికపై అక్కడజేరిన భారతీయ సభికుల అభిప్రాయములను కనుగొనుట సరియైనమార్గమనియు, లేదా ఆసభికుల ప్రత్యేక కోరికలను కనుగొని వాటి సబబునుగూర్చి విచారించుటకొక ట్రిబునలు నేర్పాటుజేయుట సమంజసమనియు సలహానిచ్చెను. కాని ఆసలహాలను బ్రిటిషు ప్రధాని తీసికొనలేదు. ప్రభుత్వమువారిచే ప్రత్యేకముగా యెంచి తీసికొని రాబడిన భారతీయ సభ్యులు తమతమ ప్రత్యేకకుల ప్రాతినిధ్యములను గూర్చి తమలోతాము యేదోయొక నిర్ణయమునకు రాలేకుండుటచే వారందరు అట్టి నిర్ణయమును విధించు బాధ్యతను బ్రిటిషు ప్రధానిపైననే బెట్టి యూరకుండిరి. తరువాత ఆర్థికాది యితర విషయములను గూర్చిన కమిటీ సమావేశములు జరుపబడి, ఆ రెండవ రౌండుటేబిలు కాన్ఫరెన్సు ఆసంవత్సరము (1931) డిసెంబరు ఒకటవ తేదీతో నంతమయ్యెను. మహాత్ముడు మొత్తముమీద రౌండు టేబిలు కాన్ఫరెన్సు సభలలో పదకొండుసార్లు ఉపన్యసించెను. ఆయన లండనులోనున్న రోజులలో నచ్చట ప్రజల కోరికపై కొన్ని బహిరంగోపన్యాసము లిచ్చెను. మరియు తన కొల్లాయితోనే బకింగుహాము భవనములో రాజదంపతులను వారి యాహ్వానముపై దర్శించెను. మహాత్ముడింగ్లండులోనున్న కాలములోనే ఆవరకు ఇండియాను గురించి మిస్ మేయో వ్రాసిన

'మదర్ ఇండియా' గ్రంథములో దెలుపబడిన మురికి విషయములనుగూర్చి కొందరు ప్రశ్నించగా ఆయన భారతదేశమున గొన్ని మురికి కొలువలున్నను ఆగ్రంథములో దెలుపబడినట్లు భారతదేశమంతయు మురికికొలవయేయని వర్ణించుట సత్యదూరమని తెలియబరచెను. కావున ఆగ్రంథ మంతయు మురికికొలువల ఇన్స్పెక్టరు నివేదిక వంటిది మాత్రమేనని స్పష్టపరచెను.

108. మహాత్ముడు డిసెంబరు 5 వ తేదీన ఇంగ్లాండు విడిచి దోవలో పారిసులో నొకరోజుండి తరువాత స్విట్జరులండులో 'రొమేయురోలండు'ను సందర్శించి అయిదురోజులక్కడ గడపి, 12 వ తేదీన రోముకుబోయి 'ముసులోని'ని గలిసికొని వెంటనే ఇండియాకు బయనమయ్యెను. వారిద్దరి కచట రహస్యసంభాషణ జరిగినట్టును ఆసంభాషణలో మహాత్ముడు తనకు బ్రిటిషు గవర్నమెంటుపైగల అక్కసును తాను ఇండియాకు తిరిగి బోయినవెంటనే తీర్చుకొనదలచినట్లు 'ముసులోని'తో జెప్పినట్లును ఒక అబద్ధపువార్త ఆదేశపు పత్రికలో బ్రచురింపబడెను. తరువాత దీనినివిన్న మహాత్ముడాశ్చర్యపడెను. కాని ఈవార్త బ్రిటిషు గవర్నమెంటువారిని చాల కలవర బరచెను.

109. మహాత్ముడు డిసెంబరు 28 వ తేదీన బొంబాయిరేవు జేరుసరికి ఇండియాలోని స్థితిగతు లీవిధమున నుండెను :—

(1) వైస్రాయి తన ఒడంబడికను పాలించకుండుటచే యునైటెడు ప్రావిన్సులో కాంగ్రెసు పన్నుల నిరాకరణోద్యమ మారంభించెను.

(2) పశ్చిమోత్తర పరగణాలలోను, యునైటెడు ప్రావిన్సులోను, బెంగాలులోను నూతన ఆర్డినెన్సుల పరిపాలన జరుగుచుండెను.

(3) అబ్దులు గఫరుఖాను, జవహరులాలు నెహ్రూ బందీకృతులై యుండిరి.

(4) తొంబదివేలమంది సత్యాగ్రహులు కారాగారమున నిర్బంధింపబడియుండిరి.

ఈ పైసంగతులను మహాత్ముడు బొంబాయిరేవులో దిగుటకు బూర్వమే స్టీమరు మీదనే అక్కడ తనను ముందుగా గలిసికొనినవారివలన దెలిసికొనియుండుటచే, స్టీమరు దిగినవెంటనే అక్కడజరిగిన యొక మహాసభలో నుపన్యసించి, మరునాడు వైస్రాయిని గలిసిగొనగోరి ఆయనకు తంతినిచ్చెను. వైస్రాయి మహాత్మునితో సంప్రదించుటకు నిరాకరించుటచే ఆడిసెంబరు 31 వ తేదీన బొంబాయిలోనే కాంగ్రెసు వర్కింగుకమిటీసభ్యులు సమావేశమై సత్యాగ్రహోద్యమమును దేశమునందంతట పునరుద్ధరింపవలసినదిగా మహాత్ముని గోరుచు, తీర్మానమొకటి జేసికొని దానిని బయలుపరచకనుంచి ఇంకొకమూడుదినములు మహాత్ముడు మరల వైస్రాయితో తంతి

మూలమున ఉత్తరప్రత్యుత్తరములను జరిపి, విఫలమనోరథుడైన వెనుకనే ఆతీర్మాన మును జనవరి 4 వ తేదీన బహిరంగ పరచిరి.

110. వెంటనే ఆ 1932 జనవరి 4 వ తేదీననే గవర్నమెంటువారు అప్పుడు కాంగ్రెసు ప్రెసిడెంటుగానుండిన వల్లభభాయి పటేలును యరెస్టుచేసి, దేశములోని కాంగ్రెసు సంస్థల నన్నిటిని అక్రమ సంస్థలనుగా ప్రకటించి, వాటి యాస్తులను స్వాధీనము జేసికొనిరి. మరియు నారాత్రియే మూడు గంటలకు మహాత్ముని 1827 సంవత్సరపు 25 రిగ్యులేషను క్రింద అరెస్టుచేసి విచారణ కాకుండ యరవాడ జైలులో చాలకాలముంచిరి. మహాత్ముడు లండనులో రౌండు టేబిలు కాన్ఫరెన్సులో ప్రసంగించి నపుడు హిందూపంచములను హిందువులనుండి వేరుపరచి వారలకు హైందవేతరులగు మహమ్మదీయులకువలె ప్రత్యేక ప్రాతి నిధ్యము నేర్పరచరాదని వాదించి అటుల జేసినచో తాను ప్రాయోపవేశ మొనరింతు ననియు దెలిపి యుండెను. అయినను బ్రిటిషుప్రధాని అయనను తృణీకరించి, ఆకాన్ఫ రెన్సులో తనపై వేయబడిన విధిని నిర్వర్తించు నెపమున తాను తరువాత ఒసగిన 'కమ్యూనలు అవార్డు'లో పంచములను హిందువులనుండి వేరుపరచి వారికి మహమ్మ దీయులకువలె ప్రత్యేక ప్రాతినిధ్యమిచ్చి దానిని అగస్టు 17వ తేదీన మహాత్ముడు జైలులో నుండగా ప్రకటించెను. వెంటనే మహాత్ముడు జైలునుండియే తానావరకు బ్రిటిషు ప్రధానితో జెప్పియుండినట్లు సెప్టెంబరు 20 వ తేదీనుండి యెడతెగని ప్రాయోపవేశ మొనర్తునని బ్రిటిషు ప్రధానికి ముందుగా దెలియపరచెను. బ్రిటిషు ప్రధాని సెప్టెంబరు 8వ తేదీన జవాబిచ్చుచు మహాత్మునికి పంచములయెడల దుర్బుద్ధి గలదని యారోపించెను. మహాత్ముడా 20వ తేదీ మధ్యాహ్నము ప్రాయోపవేశమారం భించిన వెంటనే పంచముల నాయకులగు డాక్టరు అంబేడ్కరు, యం. సి. రాజా గారలతోబాటు రాజాజీ, మాలవ్యాజీ, ఠక్కరుబాబా మొదలగు దేశనాయకులు పూనాకుబోయి యక్కడి యరవాడ జైలులో మహాత్ముని దర్శించి ఆనాటినుండి పంచములను హరిజనులని బిలువ నిశ్చయించుకొని వారిని హిందువు లందరితోబాటు జనరలుసీట్లకు నిలువనిచ్చుటకును, బ్రిటిషు ప్రధాని నిర్ణయించిన సీట్లకన్న నెక్కు విచ్చుటకును ఒప్పుకొని 24వ తారీఖున యరవాడ పాక్టు అను యొడంబడికను జేసికొని గవర్నమెంటువారికి బంపిరి. వారామోదించిన 'అవార్డు'ను మార్చినట్లు 26 వ తేదీ సాయంత్రము నాలుగున్నర గంటలకు వార్తవచ్చుటచే వెంటనే మహాత్ముడు తన ప్రాయోపవేశమును చాలించుకొనెను. కాని హరిజనుల యభివృద్ధిని గూర్చి తాపత్రయ బడుచునే యుండెను. తరువాత నాలుగు రోజులవరకు మహాత్మునితో నావిషయమై చర్చించుట కితరులను రానిచ్చిన ప్రభుత్వమువారు అకస్మాత్తుగా ఆరాకను బందు

జేసిరి. అందుపై మహాత్ముడు తానితరులతో జర్చించుచుండిన విషయము గవర్నమెంటు వారామోదించిన యరవాడ పాక్టుకు సంబంధించినదై యుండుటచేత అపాక్టును నిర్విఘ్నముగా నెరవేర్పింపవలసిన పూచీ గవర్నమెంటువారిదే యనియు, కావున నాసంభాషణలకడ్డుబెట్టదగదనియు బోధపరచినమీదట కొంతకాలమునకుప్రభుత్వము వారు మామూలుగా బయటివారితో హరిజనోద్యమమును గురించి సంప్రతింపులు జరుపుటకనుజ్ఞ యిచ్చినట్లు నవంబరు 7వ తేదీన శాసన సభలో దెలుపబడెను. ఆ హరి జనోద్ధరణ సందర్భముననే 1933 ఫిబ్రవరినెలలో మహాత్ముని 'హరిజన'పత్రిక స్థాపింప బడెను. హరిజనోద్ధరణ యుద్యమ పవిత్రతకై మహాత్ముడు మరల మూడువారములు మేనెల 8 వ తేదీనుండి ప్రాయోపవేశ మారంభించెను. వెంటనే ఆరోజుననే గవర్నమెంటువారాయనను బేషరతుగా జైలు నిర్బంధమునుండి విముక్తునిగ జేసిరి.

111. అయినను ఆమూడు వారములు పూర్తియగు వరకు అప్పటికింకను తీర్మానరూపముగా విరమింపబడక యమలులో నున్న శాసనోల్లంఘనోద్యమములో మహాత్ముడు పాల్గొనదలచలేదు. అందువలన అప్పుడు కాంగ్రెసు ఆక్టింగు ప్రెసిడెంటుగ నేర్పడియుండిన మాధవరావు అనే ఆయుద్యమమును ఆరువారములు ఆపినట్లు ప్రకటించెను. ప్రభుత్వము వారాప్రకటనను జూచి, అది కాంగ్రెసు ప్రభుత్వముతో సంధిని గోరిచేయబడినదని భ్రమించి అందులకు తామంగీకరింపము అని తామొక అనవసరప్రకటన జేసిరి. కాంగ్రెసు తాత్కాలిక ప్రెసిడెంటు యొక్క ప్రకటనను యూరపులో, వియన్నానగరమున తమ ఆరోగ్యములను గోలుకొనుచున్న విఠలభాయి సుభాసుగారలు విని దానిని నిరసించుచు దేశములో నొక నూతన రాడికలు పార్టీని స్థాపించవలసినదిగా గొందరికి కేబిలుగ్రాము నిచ్చిరి. అయినను మహాత్ముడు దేశములోని, కాంగ్రెసు వర్కర్ల యభిప్రాయమునుగూడ దెలిసికొనదలచి, ఆయుద్యమము యొక్క తాత్కాలిక నిలుపుదలను ముందుగా మరిమూడు వారములు పొడిగింపించెను. కావున మొదటి ఆరువారముల యనంతరమే అనగా జూలై 12 వ తేదీన ప్రెసిడెంటు పూనాలో కాంగ్రెసు వర్కర్ల సమావేశమేర్పరచెను. వారు సత్యాగ్రహోద్యమమును మరల సాగించుటకు పూర్వము మహాత్ముడు వైస్రాయని స్వయముగా గలిసికొనుట మంచిదని తీర్మానించిరి. ఆ ప్రకారము మహాత్ముడు జూలై 15 వ తేదీన వైస్రాయికి తంతినీయగా నాతడు కాంగ్రెసు తన శాసనోల్లంఘనోద్యమమును పూర్తిగా విరమింపలేదన్న మిషపై నిరాకరించెను. అంతనా కాంగ్రెసు వర్కర్ల సమావేశము కాంగ్రెసు నాయకులందరు జైళ్ళలో బందీకృతులై యుండుటచే సమిష్టి సత్యాగ్రహమును విరమించుటకును వ్యష్టి సత్యాగ్రహము నెలకొల్పుటకును నిర్ణయించెను.

---

జేసిరి. అందుపై మహాత్ముడు తానితరులతో జర్చించుచుండిన విషయము గవర్నమెంటు వారామోదించిన యరవాడ పాక్టుకు సంబంధించినదై యుండుటచేత ఆపాక్టును నిర్విఘ్నముగా నెరవేర్పింపవలసిన పూచీ గవర్నమెంటువారిదే యనియు, కావున నా సంభాషణలకడ్డుబెట్టదగదనియు బోధపరచినమీదట కొంతకాలమునకు ప్రభుత్వము వారు మామూలుగా బయటివారితో హరిజనోద్యమమును గురించి సంప్రదింపులు జరుపుటకనుజ్ఞ యిచ్చినట్లు నవంబరు 7వ తేదీన శాసన సభలో దెలుపబడెను. ఆ హరిజనోద్ధరణ సందర్భముననే 1933 ఫిబ్రవరి నెలలో మహాత్ముని 'హరిజన' పత్రిక స్థాపింపబడెను. హరిజనోద్ధరణ యుద్యమ పవిత్రతకై మహాత్ముడు మరల మూడువారములు మే నెల 8 వ తేదీనుండి ప్రాయోపవేశ మారంభించెను. వెంటనే ఆరోజుననే గవర్నమెంటువారాయనను బేషరతుగా జైలు నిర్బంధమునుండి విముక్తునిగ జేసిరి.

111. అయినను ఆమూడు వారములు పూర్తియగు వరకు అప్పటికింకను తీర్మానరూపముగా విరమింపబడక యములులో నున్న శాసనోల్లంఘనోద్యమములో మహాత్ముడు పాల్గొనదలచలేదు. అందువలన అప్పుడు కాంగ్రెసు ఆక్టింగు ప్రెసిడెంటుగ నేర్పడియుండిన మాధవరావు అనే ఆయుద్యమమును ఆరువారములు ఆపినట్లు ప్రకటించెను. ప్రభుత్వము వారాప్రకటనను జూచి, అది కాంగ్రెసు ప్రభుత్వముతో సంధిని గోరిచేయబడినదని భ్రమించి అందులకు తామంగీకరింపము అని తామొక అనవసరప్రకటన జేసిరి. కాంగ్రెసు తాత్కాలిక ప్రెసిడెంటు యొక్క ప్రకటనను యూరపులో, వియన్నానగరమున తమ ఆరోగ్యములను గోలుకొనుచున్న విఠలభాయి సుభాసుగారలు విని దానిని నిరసించుచు దేశములో నొక నూతన రాడికలు పార్టీని స్థాపించవలసినదిగా గొందరికి కేబిలుగ్రాము నిచ్చిరి. అయినను మహాత్ముడు దేశములోని, కాంగ్రెసు వర్కర్ల యభిప్రాయమునుగూడ దెలిసికొనదలచి, ఆయుద్యమము యొక్క తాత్కాలిక నిలుపుదలను ముందుగా మరిమూడు వారములు పొడిగింపించెను. కావున మొదటి ఆరువారముల యనంతరమే అనగా జూలై 12వ తేదీన ప్రెసిడెంటు పూనాలో కాంగ్రెసు వర్కర్ల సమావేశమేర్పరచెను. వారు సత్యాగ్రహోద్యమమును మరల సాగించుటకు పూర్వము మహాత్ముడు వైస్రాయని స్వయముగా గలిసికొనుట మంచిదని తీర్మానించిరి. ఆ ప్రకారము శ్రీమహాత్ముడు జూలై 15 వ తేదీన వైస్రాయికి తంతినీయగా నాతడు కాంగ్రెసు తన శాసనోల్లంఘనోద్యమమును పూర్తిగా విరమింపలేదన్న మిషపై నిరాకరించెను. అంతనా కాంగ్రెసు వర్కర్ల సమావేశము కాంగ్రెసు నాయకులందరు జైళ్ళలో బందీకృతులై యుండుటచే సమిష్టి సత్యాగ్రహమును విరమించుటకును వ్యష్టి సత్యాగ్రహము నెలకొల్పుటకును నిర్ణయించెను.

## ఇరువదిమూడవ ప్రకరణము

# వ్యక్తిసత్యాగ్రహము

## 1933 — 35

112. కాంగ్రెసు వర్కర్ల సమావేశ తీర్మానము ననుసరించి మహాత్ముడు తాను ముందుగా వ్యక్తిసత్యాగ్రహము నారంభింపదలచి 1933 జూలై నెల 26 వ తేదీన తన సబర్మతీ ఆశ్రమమును రద్దుచేసి ఆశ్రమవాసులతో గలిసి అక్కడనుండి ఆగష్టు 1 వ తేదీన "రాస్" గ్రామమునకు బోదలచియుండెను, కాని ఆ ఒకటవ తేదీ క్రిందటి రాత్రియే నిశీథమున అందరును నిద్రబోవుచుండగా ఆయనను, తోడి ముప్పది నలుగురు ఆశ్రమవాసులను గవర్నమెంటువారు అరెస్టుచేసి, యరవాడ జైలుకు దీసి కొనిపోయి మహాత్ముని మాత్రము నాలుగవతేదీ ఉదయమున వదలి ఆయనను వెంటనే యరవాడ సరిహద్దునుదాటి పూనాకుబోయి నివసించవలసినదిగా గట్టడిజేసిరి. కాని మహాత్ముడు నెమ్మదిగా నడచుచు జాగుచేసెనన్న నెపమున ఆయన నొక యరగంటలో తిరుగ యరెస్టుచేసి, ఆజ్ఞాతిరస్కారణయను నేరముపై నొకసంవత్సరము కారాగారశిక్ష విధించిరి. ఈ యుదంతమంతయు దేశమున వ్యాపించినంతనే పలుచోట్ల వ్యక్తిసత్యాగ్రహ ముపక్రమింపబడి 1934 మార్చి ఆఖరువరకు సాగుచుండెను. అనేకమంది సత్యాగ్రహులు జైళ్ళలో ద్రోయబడుచుండిరి. 1933 లో జైలులో సంవత్సర కారాగార శిక్ష ననుభవించుచుండిన మహాత్ముడు తానావరకు జైలులో నున్నప్పుడు హరిజనోద్ధరణ విషయమున ప్రభుత్వమువారు తనకు యిచ్చియుండిన పరులతో సంప్రదింపు సదుపాయములను తిరుగ నప్పు డిచ్చుటకు నిరాకరించుటచే ఆ 1933 ఆగష్టు 16 వ తేదీన ప్రాయోపవేశ మారంభించెను. 20 వ తేదీన ఆయన శరీరస్థితి సన్నగిల్లెను. 23 వ తేదీన మరింత యధ్వాన్నమయ్యెను. కావున నాదినమున గవర్నమెంటువా రాయనను బేషరతుగా వదలివేసిరి. అయినను తనకు ప్రభుత్వమువారు విధించియుండిన సంవత్సరపు శిక్షకాలములో, అనగా 1934 ఆగష్టు 3 వ తేదీవరకు తాను జైలు బయటనుండినను, రాజకీయసంబంధమైన సత్యాగ్రహములో పాల్గొనుటకు తన కర్హతలేదని వాదించి మధ్యపరగణాలలోని వార్ధాలో నొక యాశ్రమమును నూతనముగా నిర్మించుకొని యందుండెను. ఆ సంవత్సరకాలమును హరిజనోద్ధరణకై వినియోగింపదలచి 1933 నవంబరు 7 వ తేదీన బయలుదేరి, పదినెలలు దేశములో నలుదిక్కుల బ్రయాణముచేసి, ఆసందర్భములో ఆంధ్రదేశమునకుగూడ వచ్చి మొత్తముమీద హరిజన నిధికై ఎనిమిదిలక్షల రూప్యములను సమకూర్పగలిగెను. 1934 జనవరి 15 వ తేదీ మధ్యాహ్నము 2 గంటల 15 నిమిషములకు బీహారులో నేర్పడిన భీకర భూకంపము

వలనకలిగిన ఘోరనష్టమును స్వయముగా దిలకించుటకై మహాత్ముడచటికిమార్చి 11 వ తారీఖునజేరి, చూచి, అట్టిభూకంపములు మానవులొనరించిన పాపకార్య ఫలితములనియు హరిజనులయెడ జూపబడు అస్పృశ్యత అట్టి పాపకార్యమేఅనియు, తన పత్రికలో వ్యాసమునొకదానిని వ్రాసెను. కవి రవీంద్రుడా వ్యాసమును జూచి, దానిని నిరసించుచు మహాత్మునికొకలేఖ వ్రాసెను. ఆలేఖకు బదులుగా మహాత్ముడు "సృష్టిలోని పదార్థములకును, మానవ జీవాత్మకును విడదీయ వీలులేని వైవాహిక సంబంధము కలదనియు,కావున సృష్టిలోని మార్పులకును మానవుని మనోవాక్కాయ కర్మలకును గల సంబంధమునందు తనకు గాఢవిశ్వాసము కలదనియు, ఆ సంబంధమే సకలజీవాత్మలయందును అంతర్భూతమైయున్న పరమాత్మవైపుకుతన నెల్లప్పుడు లాగుచున్నదని"యుజవాబిచ్చెను, మానవునికార్యములవలెనే ఆలోచనలుగూడప్రకృతిలో స్పందనమును కలిగించి, తద్వారా సృష్టిలోమార్పులనుకలిగించును. కావున మన ఇరుగుపొరుగువారిఆలోచనలు, కార్యములు చెడ్డవైనపుడు అవిమనలను బాధించవు అని అనుకొనుటపారబాటు. అందువలననే సాధ్యమైనంతవరకు ఇతరులనుగూడబాగుచేసి, వారి నభివృద్ధిలోనికి దేవలసిన బాధ్యత ప్రతివానియడలనుగలదు. మహాత్ముడు ఏప్రెలు 7వ తేదీన నొక ప్రకటనజేయుచు, తానేమియు కల్పించుకొనని అంతవరకు జరిగిన వ్యక్తి సత్యాగ్రహోద్యమములో బెక్కండ్రు సత్యాగ్రహ పవిత్రతను సంపూర్ణముగా గ్రహించియుండకపోవుటచే ననేక హింసాపూర్వక చర్యలను గావించియుండిరని. తన యభిప్రాయమును వెల్లడించెను. వ్యక్తి సత్యాగ్రహోద్యమ మంతటితో నంతరించుటచే, ఆ 1934 మే నెల 18 వ తేదీన పాట్నాలో సమావేశమైన ఆల్ ఇండియా కాంగ్రెసుకమిటీ అవరకు డాక్టరు అన్సారీఆధిపత్యముక్రిందవిడిగా నేర్పడియుండిన స్వరాజ్యపార్టీని కాంగ్రెసులో నంతర్భాగముగ జేర్చికొని, కాంగ్రెసువారు శాసనసభలో జేరి, అచ్చట తమ దేశ స్వాతంత్ర్యపోరాటమును సాధించుటకు తీర్మానించెను.

113. ఇది యిట్లుండగా మహాత్ముని హరిజనోద్ధరణోద్యమమునకు బ్రతికూలు రనేకులుండిరి. వారిలోనొకడు ఆ సంవత్సరము (1934) జూను 25 వ తేదీన మహాత్ముడు 'పూనా'లో పాకీ పనివాండ్ర సభలో నుపన్యసించుచుండగా ఆయనపై బాంబు విసరెను. కాని అది ఆయనకు తగులలేదు. జూలై 10 వ తేదిని ఆ యుద్యమాను కూలుడొకడు అజిమీరులో కోపముచే నొడలుమరచి ప్రతికూలు నొకనిని బడితెతో బాదెను. అందుపై మహాత్ముడు మానవులు ఒండొరుల యభిప్రాయభేదములను మన్నించకుండుట మహాపాతకమనియు, అట్టి పాపకార్య మొనర్చిన ఆ హరిజనోద్ధరణోద్యమానుకూలుని పాపపరిహారార్థమై తాను వారముదినము లుపవసించెను.

ఈ "విక్టోరియసు పనిష్మెంటు" ను జీససు మహానుభావుడు గూడ యనుభవించి యుండెను. ఇట్టిది మహాత్ముల లక్షణము గాబోలును. ఇందువలన పాపుల పాపకార్యముల ప్రభావ మరికట్టబడి మొత్తముమీద సృష్టికి లాభమేర్పడ వచ్చును. మహాత్ముడు తరువాత అక్టోబరు 24 వ తేదీన బొంబాయిలోగూడిన కాంగ్రెసు మహాసభలో తన నాలుగణాల కాంగ్రెసు సభ్యత్వమును మానుకొనినట్లు దెలియబరచెను. కారణ మేనగా: కాంగ్రెసు మొదట 1920లో మహాత్ముని సలహాపైననే సంపూర్ణ స్వరాజ్య సాధనకై "శాంతియుతమైన, ధర్మబద్ధమైన పద్ధతుల ననుసరింప వలయునని తీర్మానించి కాంగ్రెసు మెంబరుషిప్పు దరఖాస్తు ఫారములో ఆ పరతును ముద్రింపించెను. 1930, 1934 సంవత్సరములలో జైళ్ళలో కాలము గడిపిన కొంతమంది కాంగ్రెసు మెంబర్లు ఆజైళ్ళలో తమతోగూడ నుండిన కాంగ్రెసేతరులగు హింసావాదులతో సాహచర్యమునుబొంది, హింసలో నూతన విశ్వాసమును బడసి, విడుదలైన వెనుక కాంగ్రెసు సోషలిస్టుపార్టీయని, కాంగ్రెసు కమ్యూనిస్టుపార్టీయని రెండు నూతనపక్షములను బయలుదేరదీసి దేశములో క్రొత్తగా యూత్ లీగులు, విద్యార్థి ఫెడరేషనులు మొదలైన సంస్థలను స్థాపింప మొదలిడిరి. దీనిని గ్రహించిన మహాత్ముడు కాంగ్రెసు క్రీడును మరింత స్పష్టపరుపదలచి పూర్వపు రెండు పదములకును మారుగా "సత్యవంతమైన, అహింసా పూర్వకమైన" అను పదములను జేర్చవలయునని ఆ వరకు జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సమావేశములో తీర్మానము నొకదాని నుపపాదించెను. అందు విశేషముగా జేరియున్న నూతన పక్షములవా రొప్పుకొనమిచే ఆతీర్మాన మోడిపోయి కాంగ్రెసు మెంబరుషిప్పు ఫారములో మార్పు యేర్పడకుండెను. హింసకు అవకాశమిచ్చు అట్టి పాతఫారములో తాను సంతకము చేయుటకు మనసొప్పక కాంగ్రెసు మెంబరుషిప్పును మాత్రము పైకి వదలుకొన వలసి వచ్చెను.

---

ఇరువదినాల్గవ ప్రకరణము

# మహాత్ముని ఇతర వ్యాపకములు

## 1935 — 37

**114.** మహాత్ము డనంతరము 1935 ఫిబ్రవరి మొదటి వారములో వార్ధాలో ఆల్ ఇండియా విలేజి ఇండస్ట్రీసు యసోసియేషనును నెలకొల్పెను. ఆసందర్భమున నొక చిన్నవింత జరిగెను. ఆ యసోసియేషను రూల్సు ననుసరించి అందలి మెంబర్లందరు అక్కడనే నివసించుచు వారివారి దినచర్యలకు సంబంధించిన గృహకృత్యముల యందు వంతుల ననుసరించి పాల్గొనవలసియుండెను. ఆకారణమున నొకదినమున వారి వంటపాత్రల యంట్లుతోముట, అక్కడనున్న జే. సి. కుమారప్పగారితో గలిసి చేయ వలసినవంతు మహాత్మునికి వచ్చుటచే ఆయన దట్టమైన మసితోడను, మట్టితోడను గూడిన పెద్దపెద్ద వంటహాండాలను, జేక్షాలను ఒక బావిదగ్గర జేర్చి కొబ్బరిపీచును బూడిదను చేతులనిండ ధరించి మిగుల ఆయాసముతో మొగమున ముచ్చెమటలు గారుచుండ అంట్లను దోముచుండెను. అంతలో నకస్మాత్తుగా మాతా కస్తూరిబాయి అక్కడి కరుదెంచుట సంభవించుటచే ఆమె మోచేతివరకు మసితోనున్న మహాత్ముని వింతవాలకమును కొంతసేపు తిలకించి భరింపజాలక ఉద్వేగముతో ఆయనచేతిలోని మసిపాత్రను లాగివైచి ఆయనను అవతలకు బొమ్మనెను. మహాత్ముడు నవ్వుచు కుమారప్పను వీక్షించి 'అయ్యా నీవు అదృష్టవంతుడవు. నీకు నాకువలె చివాట్లుబెట్టుటకు భార్యలేదు. ఆయినను గృహశాంతికై నేను నా భార్యకు లొంగిపోవలసివచ్చినది. ఇంక నీవును ఆమెయు అంట్లుతోముటను పూర్తిజేయుడు' అని చలోక్తిగా బలికెను. మహాత్ముడామాసాంతమున తన 'హరిజన' పత్రికలో సాత్వికాహారమునుగూర్చి రెండు వ్యాసములను వ్రాసెను. సాత్వికాహారము శాకాహారముతో ననువర్తింపబడి నది. అహింసాబోధకమగు బౌద్ధమతానంతరమే శాకాహారమునకు ప్రాధాన్యత వచ్చిన దని కొందరినుకొనుచున్నను గీతాకారుడు మానవునియందు దైవసంపదను ప్రవేశపించి తన్మూలమున మోక్షార్హతను గలిగించు సత్వగుణసాధనకై సాత్వికాహార మవసరమని దెలిపియున్నాడు. ఉత్తమపురుషార్థమగు మోక్షము నపేక్షించని మానవు డెవడు ? తరువాత మహాత్ముని యనుచరులు మార్చినెల 10 వ తేదీన వార్ధా పరిసరగ్రామము లలో గ్రామపారిశుద్ధ్యమును సాగించిరి. ఆనెల 23 వ తేదినుండి నాలుగు వారములు మహాత్ముడు తనవద్ద విశేషముగా నిలిచియున్న ఉత్తరప్రత్యుత్తరములపనిని నిర్వర్తించుకొనుటకై మౌనవ్రతము వహించెను. ఆతరువాత ఇందూరులోజరిగిన హిందీ సాహిత్యసమ్మేళనమున కధ్యక్షుడై ఆల్ ఇండియా విలేజి ఇండస్ట్రీసు యసోసి

యేషను ఎగ్జిబిషనును ప్రారంభించుచు నాగరికులమని గర్వించుచున్న విద్యాధికులగు మనమే గ్రామపరిశ్రమల నిర్మూలనమునకు బూర్తిగ బాధ్యులమని నొక్కి వక్కాణించెను. జూను నెలలో బోర్సాదుకుబోయి యక్కడ గొంతకాలముండి ఎలుకలకు దుర్భేద్యమగు గృహనిర్మాణమునుగూర్చియు, రోగములకు దుర్భేద్యమగు మానవశరీర స్థితినిగూర్చియు ననేక కరపత్రములను వ్రాసి ప్రచురించెను. అక్టోబరు 11 వ తేదీన మగన్‌వాడీనగరమున గూడిన ఆల్ ఇండియా స్పిన్నర్సు యసోసియేషను కౌన్సిలు సమావేశమున కధ్యక్షుడై నూలువడకు కూలీలవేతనములను హెచ్చించెను. ఆనెల 22 వ తేదీన వార్ధానగరసమీపమున "సేవాగ్రామ" కుటీరమును నెలగొల్పెను.

115. సుప్రసిద్ధ జపాను కవివరుడు "యోనేనోగూచి" 1936 జనవరి 5 వ తేదీన మహాత్ముని ఆయన సేవాగ్రామములో గలిసికొనెను కొలది రోజుల తరువాత జపానుదేశనాయకులలో నొకరగు డాక్టరు 'తోమికాకోరా' మహాత్ముని సందర్శించి తన దేశమున కాహ్వానించెను. ఆనెల 25వ తేదీన మిస్ట్రెసు మార్గిరెటు శాంగరు దొరసాని వార్ధాలో మహాత్మునితో "బర్తుకంట్రోలు" ఉద్యమమును గూర్చి ప్రసంగించెను, మహాత్ముని యుద్దేశ్యములో మానవుని నిజమైన నాగరికత అనగా అభివృద్ధి అతడు ఎంతవరకు తన ఇంద్రియములను తన అదుపు ఆజ్ఞలలో నుంచుకొనగలడో దానిని బట్టి యుండును. బర్తుకంట్రోలు ఉద్యమాభిమానుల ఉద్దేశ్యము పిల్లలు కలుగకుండ జేయుట మాత్రమే అయియుండుటచే అట్టి నిర్భయమున మానవుల ఇంద్రియలోలత్వమునకు ఎక్కువ అవకాశమేర్పడును. కావున ఆపద్ధతి మానవుని నిజమైన యభివృద్ధికి ఆటంకమని మహాత్ముని యభిప్రాయము. మహాత్ముడు మార్చి నెలలో 'శాంగ్లి' లో జరిగిన గాంధిసేవాసంఘము యొక్క ద్వితీయ వార్షికోత్సవమున కధ్యక్షుడై అప్పుడు కొందరనుకొనుచున్న "గాంధిజము" అను ప్రత్యేకమతము లేదనియు తన తదనంతర మట్టి మతశాఖ యేర్పడుట తనకిష్టము లేదనియు స్పష్టముగా జెప్పెను ఆ నెలలోనే బార్డోలీలో నొక నీగ్రోజాతి ప్రతినిధికి మహాత్ముడు రెండుగంటల సమావేశమిచ్చెను. ఏప్రెలు నెలలో నాగపూరునందు జరిగిన "ఆల్ ఇండియా లిటరరీ కాన్ఫరెన్సున కధ్యక్షతవహించి తనకు దగిన యధికారమున్నచో మతద్వేషమును మతమూర్ఖతను వ్యక్తులమధ్యను, వర్గములమధ్యను, జాతులమధ్యను ద్వేషమును ప్రబోధించు సారస్వతమును బూర్తిగా బహిష్కరించువట్లు జేయుదునని తన ఆశయమును వెల్లడించెను. మే నెలలో మహాత్ముడు 'మాగన్‌వాడి' లో, గ్రామములలో బనిచేయు కాంగ్రెసు వర్కర్ల కొఱకు ఒక ట్రైనింగు స్కూలు స్థాపించెను. ఆ 1936 సంవత్సరము ఆగష్టు నెలలోనే ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ మహాత్మునితో నాలో

చించి శాసనసభల ఎన్నికల మానిఫెస్టోను ప్రకటించెను. అక్టోబరు నెలలో మహాత్ముడు సేవనలు ఎడ్యుకేషనలు కాన్ఫరెన్సున కధ్యక్షత వహించెను. నవంబరులో అహమ్మదాబాదునందు గుజరాతు సారస్వత కాన్ఫరెన్సున కధ్యక్షుడై దేశములోని కోటానుకోట్ల సామాన్య ప్రజల కందుబాటులో నుండదగు కళ సారస్వతములను గూర్చిన గ్రంథములు రచింపబడవలెనని యుద్బోధించెను.

116. ఆవరకు 1934 అక్టోబరులో బొంబాయియందు జరిగిన కాంగ్రెసు మహాసభానంతరము పాత యిండియా రాజ్యాంగము ననుసరించి యేర్పడిన సెంట్రలు యస్సెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెసు వాదులు పాల్గొనిరి. నూతన ఇండియా రాజ్యాంగ చట్టము 1935 ఆగస్టు నాల్గవ తేదీన బ్రిటిషురాజు యనుమతిని బొందెను. వెంటనే కాంగ్రెసు కార్యవర్గము సమావేశమై ఆచట్టమును ఖండించెను. ఆ చట్టము భారతదేశమునకు కొంత స్వాతంత్ర్యమును గల్పించుచున్నట్టు గన్పించుచుండినను అది ఒకడు తన గృహమును ఒరునకిచ్చినట్టు నలుపురితో జెప్పి తాళాయింటి తాళములను తనవద్దనే యుంచుకొన్నట్టు ఉన్నదని మహాత్ముడువ్యాఖ్యానించెను. ఇంతలో 1936 మార్చి నెలలో జవహరులాలు నెహ్రూ జర్మనీలో తనభార్య మరణించిన వెనుక ఇండియాకుతిరిగి వచ్చెను. ఆయన అప్పుడు యూరపులోని వర్గపోరాటమునుగూర్చిన కారల్ మార్క్సు అభిప్రాయములతో నిండియుండెను. మహాత్ముని ధనికవర్గధర్మకర్తృత్వ సిద్ధాంతమాయనకు నచ్చలేదు. మహాత్ముని సిద్ధాంతము ఏకైక ఆత్మయందు విశ్వాసముగల ఆర్యఋషుల పవిత్ర వర్ణాశ్రమ ధర్మముపై ఆధారపడెను. వివిధవర్ణములతోబాటువివిధవర్గములునుఒండొంటిపై యాధారపడి పరస్పర సహకారముతో వర్ధిల్లునట్లు ఆర్యసంఘము మొదట నిర్ణయింపబడి యుండుటచే ఆసంఘములో హెచ్చు తగ్గులకుగాని, పరస్పర ఈర్ష్యలకుగాని తావులేకుండెను. మరియు ఆశ్రమ విధానమున వయసుచెల్లి ప్రపంచానుభవమున ఆత్మోన్నతిని బొందినవారు యువకులతో పోటీలు చేయకుండ తమ గౌరవ మర్యాదలను నిలుపుకొన గలుగుచుండిరి. ప్రకృతము కేవల ప్రకృతి దృష్టిగల పాశ్చాత్య నాగరికత సమిష్టికన్న వ్యష్టికి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చుటచే ఎవరికివారు, ఏవర్గమునకు ఆవర్గమువారు స్వార్థపరులై తమతమ ప్రత్యేక స్వయం సమృద్ధత్వమునుమాత్రము సంపాదించుకొనగోరుటయేగాక మీదుమిక్కిలి (ఇతరులతోపోటీలలోదిగుటచే) వర్గవైరములు, వర్ణవైరములుచెలరేగి, సంఘమును చీకాకుపరచి అశాంతినినెలకొల్పుచుండెను. అట్టిపాశ్చాత్యవర్గవైర అభిప్రాయములతో నెహ్రూ ఆసమయమున గూడియున్నను, మహాత్ముడు ఆయన మృదువైన మనస్సును గ్రహించిన వాడగుటచే ఆ సంవత్సరము లక్నోలో ఏప్రెలు మాసమున జరిగిన కాంగ్రెసు మహా

సభకు అధ్యక్షు పట్టమును ఆయనకే గట్టించెను. ఆయన యధ్వర్యమున కాంగ్రెసు మహాసభ 1935 వ నూతన రాజ్యాంగచట్టమును మొగమాటము లేకుండ ఖండితముగా నిరసించెను. అయినను ఆ సంవత్సరము డిసెంబరు నెలలో మరల నెహ్రూ అధిపత్యము క్రిందనే జరిగిన ఫైజపూరు కాంగ్రెసులో ఆ నూతన చట్టము ననుసరించి జరుగబోవు రాష్ట్రశాసనసభల యెన్నికలలో మాత్రము కాంగ్రెసువాదులు పాల్గొనవచ్చునని తీర్మానింపబడెను. ఏలననగా ఆ నూతన చట్టములో, కేంద్రప్రభుత్వములో బాధ్యత యీయబడకున్నను రాష్ట్రములకు మాత్రము బాధ్యతాయుత ప్రభుత్వము ఈయబడియుండెను.

117. అందువలన తరువాత జరిపిన కాంగ్రెసు కమిటీ సమావేశములో రాష్ట్రశాసనసభలలో మెజారిటీగానున్న కాంగ్రెసు సభికులు మంత్రిత్వాధికారములను స్వీకరించుట కనుజ్ఞ యీయబడినది. అయినను రాష్ట్రగవర్నర్లు నూతనరాజ్యాంగ చట్టములో చేర్కొనబడిన తమ ప్రత్యేక అధికారములను తమ ఇచ్చకువచ్చినట్లు ఉపయోగించరు అని ప్రభుత్వమువారు హామీ ఇచ్చినమీదటనే మంత్రిత్వములను స్వీకరింపవలయుననిగూడ నిర్ణయింపబడెను. మరియు అట్టి కాంగ్రెసు మంత్రులు రాష్ట్ర శాసనసభల మూలమున ఈక్రింది 11 విషయములలో తప్పక శ్రద్ధ వహించవలసినదని గూడ, మహాత్ముని ఆదేశముపై నిర్ణయింపబడెను.

(1) భూమిశిస్తు భారమును తగ్గించుట
(2) వ్యవసాయదారులపై రాబడిపన్ను విధించుట (కనిష్ఠ ఆదాయమును నిర్ణయించి విడిచిపెట్టుట)
(3) వ్యవసాయపు హక్కులను నిలబెట్టుట
(4) వ్యవసాయదారులను ఋణవిముక్తులను జేయుట
(5) నిర్బంధశాసనములను రద్దుచేయుట
(6) రాజకీయ నిర్బంధితులను విడుదలచేయుట
(7) శాసనోల్లంఘన కాలమున ప్రభుత్వమువారిచే గైకొనబడిన ప్రజల ఆస్తులను తిరిగి ఆ ప్రజలకు ఇచ్చివేయుట
(8) పరిశ్రమల కార్మికుల పనిచేయు కాలమును 8 గంటలకు మించకుండ చేయుట; కార్మికులకు కనిష్ఠ జీవితప్రమాణ జీతములను నిర్ణయించుట
(9) కల్లు మొదలగు మత్తుపదార్థ వినియోగమును నిషేధించుట
(10) నిరుద్యోగసమస్యాపరిష్కారమును చేయుట
(11) పెద్ద ఉద్యోగస్థుల జీతములను తగ్గించుట, ప్రభుత్వ వ్యయమును తగ్గించుట.

118. ఆ సంవత్సరము (1937) ఏప్రెలు నెలలో హుబ్లీయందు గూడిన గాంధిసేవాసంఘ వార్షికోత్సవ సమయమున మహాత్ముడు మాట్లాడుచు కాంగ్రెసు వారు ఆ వరకు గావించియుండిన శాసనసభ యొక్క బహిష్కారము సత్యము అహింసలవలె శాశ్వతధర్మము గాదనియు, కావున వారు ప్రస్తుతపు సందర్భములను బట్టి శాసనసభలకు బోవచ్చుననియు ఆ శాసనసభలలోని సభ్యులు తప్పక శాశ్వతధర్మములైన సత్య అహింసలను ఆ శాసనసభలలో ఉపయోగించవలయుననియు హెచ్చరించెను. మహాత్మునితో సంప్రదించిన వైస్రాయి సలహాపై రాష్ట్రగవర్నర్లు కాంగ్రెసు కోరినహామీని అనగా గవర్నర్లు తమయిష్టము వచ్చినట్లు మంత్రుల చర్యలలో జోక్యము కలిగించుకొన కూడదు అను హామీని మాజువాణీగా నిచ్చినవెనుకనే కాంగ్రెసు మంత్రివర్గములు జూలై 7వ తేదీన యేర్పడెను. ఆ మంత్రిత్వములను గూర్చి మహాత్ముడు తన పత్రికలో వ్యాఖ్యానించుచు కాంగ్రెసు మంత్రులు దేశములోని కూటికి పేదలైన కోటాను కోటుల యథార్థక్షేమము నపేక్షించుచు న్యాయముగను, స్వార్థరాహిత్యముగను, శ్రద్ధాళువులుగను జాగరూకులుగనుమాత్ర మున్నయెడల దేశమత్వరలో సంపూర్ణస్వాతంత్ర్య మనుభవించు మహదవకాశ మేర్పడునని తనకు దృఢముగా దృగ్గోచరమగుచున్నట్లు తెలిపెను. మరియు కాంగ్రెసు ప్రభుత్వములు వెంటనే ప్రజాసౌఖ్య జీవనమున కత్యవసరమగు మద్యపాన నిషేధము, వ్యవసాయదారులకుసహాయము, మూలవిద్యావ్యాపకము, జైళ్ళసంస్కరణము మున్నగుశాసనములను జేయవలయునని గూడ హెచ్చరించెను. ఆ తరువాత అక్టోబరు నెలారంభమున కలకత్తాకుబోయి, యూరపునుండి అప్పుడే తిరిగివచ్చిన సుభాసునింట బసజేసెను. ఆ నెల 21 వ తేదీన వార్ధాలో జరిగిన ఎడ్యుకేషనలు కాన్ఫరెన్సున కధ్యక్షత వహించి తన మూల విద్యావిధానమును గూర్చి ముచ్చటించెను. నవంబరు 20 వ తేదీన కాంగ్రెసు ప్రభుత్వముల చర్యలను విమర్శించుచు, కొన్నిచోట్ల కాంగ్రెసు మంత్రులు కార్మిక తగాదాల సందర్భమునను, మతకలహముల సందర్భమునను దీసికొనిన కఠిన చర్యలను ఖండించెను. డిసెంబరు నెలలో తన సేవాగ్రామమును విడిచి ఆరోగ్యార్థమై 'జూహూ' కు బోయి 1938 జనవరి 8 వ తేదీన తిరిగి సేవాగ్రామము జేరుకొనెను.

---

## ఇరువది యైదవ ప్రకరణము

# కాంగ్రెసు మంత్రిత్వముల కాలము
## 1937–39

119. కాంగ్రెసు 1937 జూలై 7 వ తేదీన మంత్రిత్వములను స్వీకరించిన మరు సంవత్సరమే అవరకు మాజువాణి హామీ యిచ్చియుండిన బీహారు, సంయుక్త పరగణాల గవర్నర్లు రాజకీయ ఖైదీల విడుదలనుగూర్చి మంత్రులు తీసికొనిన చర్యలలో ప్రతిబంధ సంబంధమును కలిగించుకొని యుండుటచే ఆ గవర్నర్ల కార్యములను మహాత్ముడు ఖండించెను. ఆ తరువాత మహాత్ముడు 1938 ఏప్రిలు నెలలో పశ్చిమోత్తర పరగణాలలోని స్థితిగతులను దెలిసికొని తనకు దెలుపవలసినదిగా మహాదేవ దేశాయిని బంపి, తాను మే 15 వ తేదీన పెషావరు జిల్లాలో ఖాన్‌సాహేబుతో గలిసి ప్రయాణముచేయుచు నక్కడక్కడ నహింసా తత్వమును బ్రబోధించెను. ఆ నెలలోనే మధ్యపరగణాల గవర్నరు అప్పటి కాంగ్రెసు గవర్నమెంటు ప్రధానిగా నుండిన ఖారేతోగలిసి కాంగ్రెసు ఆదేశములకు విరుద్ధముగా నాతడు బ్రవర్తించునట్లు జేసినందులకు వారలనిద్దరిని నిరసించెను. జూలై 9 వ తేదీన దేశములోని యప్పటి స్థితిగతులనుబట్టి కాంగ్రెస్ స్వదేశ సంస్థానముల విషయములలో జోక్యము కలిగించుకొన కుండుట మంచిదని మహాత్ముడు తన "హరిజన" పత్రికలో వ్యాసమును వ్రాసెను. అక్టోబరు నెలలో యూరపుఖండమున జెకోస్లోవేకియా ప్రజలు హిట్లరుకు లొంగిపోవలసినప్పుడు నిరాయుధులైన పురుషులు, స్త్రీలు, పిల్లలు క్రోధవర్జితులై అహింసాపూర్వకముగ నెదుర్కొనుట వారికి వింతయనుభవముగా దోచవచ్చుననియు, అయినను పిరికి వారలదిగాక ధైర్యవంతులదేయైన యావింత యాయుధమును ఆ జెకోస్లోవేకియా నాయకుడగు డాక్టరు బెనిసికు బహుమతిగా బంపుచుంటినని తన పత్రికలో బ్రచురించెను. ఈ సందర్భమున శ్రీకృష్ణుడు అర్జునుని క్రోధవర్జితుడై సమర మొనర్పుమని బోధించిన బోధ జ్ఞప్తికి వచ్చును. అప్పుడు హింసభావముండుట అసంభవము. మహాత్ముడు మరియు బ్రిటిషు ప్రధాని ఛేంబర్లేను హిట్లరుతో జేసికొనిన మ్యూనిక్ పాక్టును గురించి వ్యాఖ్యానించుచు, ఆ పాక్టు వలన కలిగిన తాత్కాలికపుశాంతి, హింసయొక్క జయముమాత్రమే గాక, శాశ్వతశాంతియొక్క యోటమి గూడ ననియు, తన పత్రికలో వ్రాసెను. మరియు విరోధి నెదుర్కొని చనిపోవలసి వచ్చుట సాహస కార్య మేయయినను, అట్లెదుర్కొనక వానికి ఏ మాత్రము లొంగుటకును ఒప్పుకొనక, నిలిచియుండుట యొక్కవ సాహస కార్యమని కూడ మహాత్ముడా పత్రికలో వ్రాసెను. హిట్లరు జర్మను కాపురస్తులైన యూదుల నవతలికి బారదోలు బ్రయత్నమును మహాత్ముడు తనపత్రికలో ఖండించుచు

తానే యక్కడి యూదుడై యుండినచో, అనగా జర్మనీలోనే బుట్టి, యక్కడనే జీవనోపాధిని గలిగియుండినయెడల అదేశములోని యూదేతరులగు జెంటైల్సు వలెనే ఆదేశము తన మాతృదేశమన్న తన హక్కును వదలుకొనక, అక్కడి జెంటైల్సు తనను తుపాకితో గాల్తుమని గాని, జైలులో వేతుమని గాని బెదరించినను, దేశమును వదలకయుందునని చెలిపెను. డిసెంబరు 3 వ తేదీన, స్వదేశ సంస్థానాధీశుల నుద్దేశించి, వారు భారత కాంగ్రెసుయొక్క సలహాలను దీసికొనుట మంచిదని తెలియబరిచెను. మద్యపాన నిషేధమునుగూర్చి కాంగ్రెసుమంత్రులు దీసికొనుచుండిన మెల్లని జాగు చర్యలను గర్హించుచు, ఆ సంస్కారణముయొక్క మూల రహస్యమును వారు సరిగా గ్రహించలేదనియు ప్రజలు త్రాగుడుకు బానిసలుగా నున్నంతకాలము దేశమునకు స్వాతంత్ర్యమేర్పడినను, అది బానిసల స్వాతంత్ర్యముగా నుండుననియు, తన యభిప్రాయమును వెలువరించెను. మరియు మహాత్ముని యభిప్రాయములో నిజమైన జాతీయ ప్రభుత్వమునకు పర ప్రభుత్వమువలె కేవలము రివిన్యూ మీదనే దృష్టినుంచుకొని, పౌరుల నైతికాభివృద్ధిని సరకుచేయకుండుట అధర్మము. అటులచేయుట పంచమహాపాతకములలో నొకదానిని ప్రయత్న పూర్వకముగా ప్రోత్సహించుట యగును. ఈ సందర్భమున మహాభారతములోని శుక్రాచార్యుని సురసేవను గూర్చిన ఆర్డినెన్సు జ్ఞప్తికి రావచ్చును. ఆ డిసెంబరు నెలలోనే జపాను పార్లమెంటు మెంబరొకడు మహాత్ముని దర్శించి, జపానువారి 'ఏషియా ఫర్ యేషియాటిక్సు' సిద్ధాంతమును ఆయనకు దెలుపగా అది "యాంటీయూరపియను కాంబినేషను" అను సర్థమిచ్చి లోకమును జీకాకుబరచునని హెచ్చరించెను.

120. మహాత్మునకు 1939 సంవత్సరారంభమున రెండు వింతసంఘటనలు సంభవించెను. అందొకటి రాజకోటవ్యవహారము. రెండవది ఆసంవత్సరము కాంగ్రెసు ప్రెసిడెంటు నిర్ణయము. రాజకోట సంస్థానాధీశుడు బ్రిటిషు యధికారులతో నేకీభవించి, యాసంస్థానప్రజల నిబ్బందిబరచుచుండుటచే సర్దారు పటేలు కల్పించుకొని యాయనతో నొక యొడంబడికకు వచ్చెను. కాని యా సంస్థానాధీశు డాయొడంబడికను పాటింపకుండుటచే మహాత్ము డాయనను బాల్యమునుండియు బాగుగా నెరిగియున్నవాడగుటవలన, చనువుచే నాయనను మందలించదలచి, ఆవ్యవహారములో జోక్యముకలిగించుకొని, విఫలమనోరథుడై మొదట వైస్రాయియొక్క యొత్తిడి నపేక్షించి సత్యాగ్రహ మొనరించి తరువాత నట్టి బలవంతమును యా సంస్థానాధీశునిపై బయటనుండి దెప్పించుట తప్పు అని తెలిసికొని పశ్చాత్తప్తుడయ్యెను. సత్యాగ్రహుని యాశయ మెప్పుడును ఎదుటవాని మనస్సులో స్వాభావికమైన పరివర్తన మొనరింపవలయుననుటయే. అట్టిది బయటి బలవంతము మాత్రముచే జేకూరదు. ఇంక రెండవది

యగు కాంగ్రెసు ప్రెసిడెంటు యెన్నిక విషయమున అవరకు సర్వసాధారణముగ మహాత్ముని సలహా ననుసరించియే యట్టి యెన్నికలు జరుగుచుండెను. 1938 లో హరిపురమున జరిగిన కాంగ్రెసు మహాసభకు మహాత్ముని ప్రోత్సాహముమీదనే సుభాసధ్యక్షుడయ్యెను. 1939 మార్చిలో త్రిపురియందు జరుగవలసిన కాంగ్రెసు మహాసభకు అప్పుడు దేశములోనున్న హిందూ-మహమ్మదీయుల కలతలను దగ్గించు నుద్దేశ్యముతో మహాత్ముడు కలకత్తానివాసియగు అబ్దులు కలాము అజదును ప్రెసిడెంటుగానుండుటకై యెంతో కష్టముమీద ఒప్పించెను. అయినను అనుమానముచే అవసరమగునేమోయని అస్థానమునకు పట్టాభినిగూడ గోరి ఆయన పేరునుగూడ సూచించెను. ఆ పేర్లు పత్రికలలోబడెను. అంత గొంతకాలమునకు స్నేహితుల ప్రోద్బలమున సుబాసు తాను రెండవమారుగూడ కాంగ్రెసు అధ్యక్షపదవి నధిష్ఠింపదలచినట్టు ప్రచురించెను. అందువలన బంగాళారాష్ట్రమునుండి ఇద్దరు నిలబడుట తగదని అజదు విరమించుకొనెను. కావున ముందుగా నామినేటు కాబడిన పట్టాభి పేరుతోబాటు సుబాసు పేరుగూడ పత్రికలలో బ్రచురపడెను. వారిద్దరిలో సుబాసు కెక్కువ ప్రఖ్యాతి యుండుటచే పట్టాభికి తక్కువవోట్లు వచ్చుట వింతగాదు. అయినను ఆయనపేరును మహాత్ముడు మొదట సూచించియుండుటచే నాతనియోటమి తనదే యని మాట వరుసగననెను.

121. మహాత్ముడా 1939 సంవత్సరము మేనెల 7 వ తేదీన బృందావనమునందుగూడిన గాంధీ సేవాసంఘమునందు మాటాడుచు, ఆసంఘసభ్యులను ఆత్మపారిశుధ్యమును ముందుగా నలవరచుకొనుడని హెచ్చరించెను. అప్పటి కాంగ్రెసు ప్రెసిడెంటు అయిన సుబాసు తానుకోరిన కార్యవర్గమును నిర్మించుకొనలేక ఆప్రెసిడెంటు పదవిని మాత్రము తరువాత త్యజించెను. అంతటితో నూరుకొనక తాను కాంగ్రెసు మెంబరై యుండియు అవరకు కాంగ్రెసు తీర్మానము ననుసరించి ఏర్పడిన కాంగ్రెసు ప్రణాళికలోని మద్యపాననిషేధమును తిరస్కరించుచు బొంబాయిలో ప్రబోధము సాగించుచుండుటచే మహాత్ముడాయనను జూలై 13 వ తేదీన మందలించెను. ఆతరువాత మహాత్ముడు సేవాగ్రామమున కేగి, సెప్టెంబరు నెలాఖరున అబ్దుల్ గఫర్ ఖాను కోరికపై సరిహద్దురాష్ట్రమునకుబోయి యక్కడ నొకనెలదినములు గడపెను. ఆరోజులలో ఆయన అబ్దుల్ గఫరుఖానుయొక్క ఖుదైఖిద్ మత్ గార్ల నుద్దేశించి అనేక సలహాల నిచ్చెను. ఖుదై ఖిద్ మత్ గార్లనగా భగవంతుని సేవకులని యర్థము. వారిలో ప్రతియొకడును ముందుగా ఈక్రింది దశవిధప్రతిజ్ఞలను గైకొనియుండెను :-

(1) నేను నిష్కపటముగను, మనస్ఫూర్తిగను, ఈభగవత్సేవకుల సంఘములో చేరదలచినాను.

(2) నేను భారతజాతికి సేవజేయుటకును, దేశస్వాతంత్ర్యమును పొందుటకును గాను నా వ్యక్తి సౌఖ్యమును, ఆస్తిని, ప్రాణమును సైతము వదలుకొనుట కెప్పుడును సిద్ధముగా నుండెదను.

(3) నేను యే కక్షలలోను పాల్గొనను; యెవరితోను విరోధము పెట్టుకొనను; కలహింపను; బాధితులను వారిని బాధపెట్టువారి క్రూరత్వమునుండి రక్షింతును.

(4) నేను యే యితర రాజకీయ సంఘములలోను చేరను. మరియు 'అహింసా పూర్వకమైన జాతీయ పోరాటములో నెప్పుడును పరప్రభుత్వమును క్షమా పణ కోరుకొనుటగాని, జామీను యిచ్చుటగాని చేయను.

(5) నేనెల్లప్పుడును నా పైఅధికారుల న్యాయమైన ప్రతి ఉత్తరువును పరి పాలింతును.

(6) నేనెప్పుడును అహింసాసూత్రము ననుసరించియే జీవింతును.

(7) నేను మానవులందరిని సమానముగా సేవింతును. నాజీవితము యొక్క ముఖ్యోద్దేశ్యము : సంపూర్ణ స్వరాజ్యమును, మత స్వాతంత్ర్యమును సంపాదించుటయే.

(8) నేనెల్లప్పుడును నా అన్ని విషయములందును సత్యమును, శుచిత్వమును అనుసరింతును.

(9) నేను చేసిన సేవకు ప్రతిఫల మాపేక్షించను.

(10) నేను చేయు సేవలన్నిటిని భగవదర్పితము చేయుదును; ఆ సేవలు యేదో ఘనతను సంపాదించుటకుగాని, దంభమునకుగాని కాకూడదు.

122. మహాత్ముడు ఆ 1939 అక్టోబరు 23వ తేదీన అబటాబాటునుండి హిట్లరునకొక లేఖ వ్రాయుచు ప్రపంచమును యుద్ధమహా సాగరమున ముంచవలదని ప్రార్థించెను. మరియు తానప్పుడు ఇండియా స్వాతంత్ర్యమును గూర్చి యోచించుట లేదనియు, అదిరాక తప్పదనియు, కాని ఇంగ్లండు, ఫ్రాన్సు దేశములు ఓడిపోయి నను జర్మనీపై అవి విజయమునుపొందినను, ఇండియాకు స్వాతంత్ర్యము లభించి మాత్ర మేమిప్రయోజనము అనికూడ ఆలేఖలో దెలిపెను. అనగా మహాత్ముడు ప్రపంచ మంత టకు శాంతిని గోరుచుండెను.

---

ఇరువదియారవ ప్రకరణము

# యుద్ధము - ప్రభుత్వముతో సంప్రదింపులు

## 1939-42

**123.** ద్వితీయ యిరోపా సంగ్రామము 1939 సెప్టెంబరు 3 వ తేదీన ఆరంభించెను. అంతకుముందు ఆగష్టు 24 వ తేదీన జర్మనీకిని రష్యాకును పరస్పర సహాయార్థమై ఒడంబడిక జరిగెను. ఆమరునాడే బ్రిటనుకును పోలండునకును పర్స్పర సహకారసంధి జరిగినట్లు ప్రకటింపబడెను. ఆ కారణమున బ్రిటను ఆ వరకు పోలండు లోనికి వచ్చియుండిన జర్మను సైన్యములను ఉపసంహరించుకొనవలసినదనియు లేకున్న సెప్టెంబరు 3 వ తేదీన జర్మనీపై యుద్ధము ప్రారంభింపబడినదిగా తెలిసికొన వలయుననియు జర్మనీకి తెలిపెను. జర్మనీ లక్ష్యపెట్టనందున యుద్ధమారంభ మయ్యెను వెంటనే ఇండియాలోని బ్రిటిషు వైస్రాయి జర్మనీ బలవంతముగా పోలండులో చేయ దలచిన తమ పరిపాలనకు ప్రతికూలముగా పోలండు ప్రజల స్వాతంత్ర్యమునకై బ్రిటను చేయదలచిన యుద్ధప్రయత్నములో తాము పరిపాలించుచుండిన ఇండియా ప్రజలు కూడ తమతోజేరి అట్టి ప్రజాస్వాతంత్ర్యము కొరకు తమ యుద్ధములో పాల్గొనునని బ్రిటను తరఫున తాను విశ్వసించుచున్నట్లు ఒక ప్రకటనజేసెను. ఆ వరకే హిందూదేశపు ప్రజలు, ఇంగ్లీషువారికి పోలండు ప్రజలు జర్మనీకి బానిసలయినట్లే యుండిరని ఆయన గ్రహించెను. తరువాత నామరునాడే వైస్రాయి మహాత్ముని శిమ్లాకు పిలిపించుకొని ఆయనతో మంతనములు జరిపెను. మహాత్ముడు తిరిగివచ్చి తాను వైస్రాయి భవనమునుండి రిక్తహస్తుడై వచ్చెననియు వైస్రాయి కాంగ్రెసుతో సంప్రదింపులు జరుపదలచిన యెడల దనతోగాక, ఆ సంస్థతోనే జరుపవలసినదిగా తెలిపితిననియు, తాను మాత్రము ఆ యుద్ధములో బ్రిటిషు వారికి తన సానుభూతిని మాత్రము తెలిపితిననియు 5 వ తేదీన వెల్లడించెను. ఆ నెల 8 వ తేదినుండి వారము దినములు వార్ధాలో మహాత్ముని సమక్షమున జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటి సమావేశమునకు ప్రత్యేక యాహ్వానముపై సుభాసు, మాధవరావుయానీ, నరేంద్రదేవు జయప్రకాశ నారాయణగారలు వచ్చినను జిన్నా మాత్రము వచ్చుటకు నిరాకరించెను ఆ సమావేశములో భారతదేశమునకు సంబంధించినంతవరకు యుద్ధమును గురించి గాని శాంతిని గురించి గాని, ఏ నిర్ణయము నైనను భారతీయులే జేసుకొనవలయుననియు ఇంగ్లాండుకు ఇండియా యొక్క సహకారము గావలసియున్న యెడల సమానత్వపు హోదాలోనే యపేక్షింప వలయుననియు, బ్రిటిషువారు హిట్లరుచే నణగద్రొక్కబడు చుండిన పోలండు దేశములో స్వయం నిర్ణయాధికారముతో గూడిన ప్రజాపరిపాలన

స్వాతంత్ర్య సిద్ధాంతస్థాపనకై తామీయుద్ధమును సాగించదలచినట్లు జెప్పుచు, అట్టి సిద్ధాంతమును భారతదేశమున కన్వయించదలచని యీ యుద్ధములో బాల్గొనుటకు భారతదేశము సంసిద్ధముగా నుండలేదనియు దీర్మానించబడెను. మరియు 1939 మార్చి నెలలోజరిగిన కాంగ్రెసు మహాసభ కధ్యక్షుడైన సుబాసు తనపదవికి రాజీనామా నిచ్చుటచే ఆల్ యిండియా కాంగ్రెసు కమిటీ తాత్కాలికముగా రాజేంద్రప్రసాదునాపదవికి నియోగించెను. యుద్ధాదిని కాంగ్రెసు తరఫున వైస్రాయితో సంప్రదింపులు జరుపుటకు ప్రసాదు తగిన యారోగ్యస్థితిలో లేనందునను, వేరొకనిని వెంటనే ఆ పదవికి నియోగించుటకు కార్యవర్గమునకు అధికారము లేనందునను, ఆ కార్యవర్గము యుద్ధోపసంఘము నొకదానిని సృష్టించి దానికి నెహ్రూను నాయకునిగజేసి ఆజాదు, పటేలులను సభ్యులనుగా నియమించెను. మహాత్ముడు కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానమును శ్లాఘించి యథార్థముగా గావలసినదంతయు బ్రిటిషు రాజనీతిదురంధరులలో మానసిన పరివర్తనమని తన పత్రికలో 15 వ తేదిన వ్రాసెను. మరియు లండను లార్డ్సు సభలో కాంగ్రెసువర్కింగు కమిటీతీర్మానమును గూర్చి జట్లండు ప్రభువుచే జేయబడిన ప్రసంగమును ఆధిక్షేపించుచు మహాత్ముడు తాను బ్రిటిషువారికి నిజమైన స్నేహితుడగుటచే ఆంగ్లేయ రాజ్యాంగనిపుణులికమీద తమ పూర్వపు సామ్రాజ్యతత్వపరిభాషను మరచిపోయి తమ జీవితచరిత్రలో నూతనాధ్యాయము నారంభింతురుగాక యని ప్రార్థించుచుంటినని ఆ నెల 28 వ తేదీన మరియొక వ్యాసమును తన పత్రికలో బ్రకటించెను. మరునెల అక్టోబరు 9 వ తేదీన వార్ధాలో గూడిన ఆల్ ఇండియా కాంగ్రెసుకమిటీ, కాంగ్రెసుకార్యవర్గమువారి సెప్టెంబరుతీర్మానము నామోదించెను. అందుపై వైస్రాయి ఆ అక్టోబరు 17వ తేదీని నొక ప్రకటనజేయుచు యుద్ధానంతరమున హిజ్ మెజస్టీసు గవర్నమెంటు భారతీయ రాజ్యాంగమునొక్క మార్పు విషయములో భారతీయ నాయకులతో సంప్రదించుటకు సానుకూలురై యుందురని తెలియబరచెను. అందుపై నామరునాడే మహాత్ముడా వైస్రాయి ప్రకటన మిక్కుటముగ నాశాభంగకరమైనదనియు, కావున కాంగ్రెసు తన ఆశయమును బొందుటకు అవసరమైన శక్తి సామర్థ్యములను సంపాదించుకొనుటకై తిరిగి సత్యాగ్రహ ఘోరారణ్యమున బ్రవేశించి యందలి ఘాతుక మృగములు అను బ్రిటిషు యధికారుల యమానుష ఘోరచర్యలకు గురికావలసి వచ్చునని యు, కాంగ్రెసు రొట్టెను గోరగా రాతిని యిచ్చినట్లు వైస్రాయిప్రకటన యున్నదనియు ధైర్యముతో వైస్రాయికి దెలియబరచెను. ఆకారణమున కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆ అక్టోబరు 22 వ తేదీన సమావేశమై మొదట్లో కాంగ్రెసు మంత్రులను నిర్ణయించి యుండిన కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డుద్వారా రాష్ట్ర మంత్రులకు వారువారు యథావిధిగా

తమతమ శాసనసభల యామోదమునుబొంది తమతమ పదవులను ఆనెల 31 వ తేదీన పరిత్యజించుటకు సంసిద్ధులై యుండవలయునని మాత్రము ఆదేశమంపెను. అందుమీద వైస్రాయి నవంబరు మొదటి తేదీన అప్పటి కాంగ్రెసు ప్రెసిడెంటు రాజేంద్ర ప్రసాదును, ముస్లింలీగు ప్రెసిడెంటు జిన్నాను ఢిల్లీకి ఆహ్వానించి మహాత్ముని గూడ రమ్మని గోరెను. మహాత్ముడు వెంటనే జిన్నాను కలిసికొని, వైస్రాయితో మాట్లాడుటకు ముందుగా తాము మువ్వురు మొదట ఏకాభిప్రాయమునకు వచ్చుట మంచిదనియు, కాంగ్రెసు, ముస్లింలీగుకలిసి ఐక్యకంఠముతో దేశమునకు స్వాతంత్ర్యము కోరవలసినదనియు దెలుపగా జిన్నా తనకప్పుడు దేశస్వాతంత్ర్య మక్కరలేదని స్పష్టముగా వాదించెను. కావున వైస్రాయితోడి వారి సంప్రదింపులు నిష్ఫల మగుటయేగాక కొన్ని నూతన సమస్యలుగూడ ఉద్భవించెను.

124. ఆవరకు సెప్టెంబరులో గూడిన కాంగ్రెసు వర్కింగు కమిటీ యీక్రింది విషయములను గోరియుండెను:—

(1) బ్రిటిషువారి యుద్ధాశయములను బ్రకటించుట.

(2) భారతదేశమున కా యాశయములను ఏవిధముగా వర్తింపజేయదలచుట.

(3) బ్రిటిషువారి జోక్యములేక భారతీయులే తమ రాజ్యాంగపరిషత్తును నిర్మించుకొననిచ్చుట.

(4) భారతదేశమును ప్రస్తుతము స్వతంత్రదేశముగా గుర్తించి, ఆస్థితికి తగినట్టు వెంటనే ఆచరించుట.

(5) భారతీయ స్వాతంత్ర్యము, భారతదేశ ఐక్యతకును, ప్రజాస్వామ్య సిద్ధాంతమునకును (డెమొక్రసీ పద్ధతికి) అనుగుణముగా నుండుటయేగాక దేశములోని అల్పసంఖ్యాకులందరిహక్కులను గుర్తించి వాటికి రక్షణనిచ్చునట్టిదిగా కూడ నుండుట.

అయినను వైస్రాయి పైవిషయములను గురించి ఆముగ్గురితోడను ఏమియు తేల్చక, రాజీనామాల నియ్యనున్న రాష్ట్రప్రభుత్వములలో కాంగ్రెసు, లీగు కలిసి పనిచేసి తద్వారా కేంద్రప్రభుత్వములోగూడ ఇరుసంస్థలకు జెందినవారును వైస్రాయి కార్యనిర్వాహకవర్గములో సభ్యులుగాజేరి, పరస్పరసుహృద్భావముతో పనిచేయుటకై ఆరెండు సంస్థలవారును ముందుగా ఆలోచించుకొని ఒక ఒడంబడికకు రావలసినదని వారిని గోరి బంపించివైచెను. అనగా ఇంతవరకు యుద్ధసహాయార్థమై భారతదేశమును స్వాతంత్ర్యదేశముగా గుర్తించి, అందుకై వెంటనే కేంద్రమున బాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పవలయునన్న కాంగ్రెసు కోరికపై చర్చను, నెమ్మదిగా రాష్ట్ర

ములలోగూడ కాంగ్రెసు, ముస్లింలీగుతో ఒడంబడికను కుదుర్చుకొనవలయునను నూతనధోరణిలోనికి వైస్రాయి మార్చెను. కాంగ్రెసువారు రాష్ట్రములవిషయమై జిన్నాతో సంప్రదించుట కియ్యకొననందున అసంగతిని వైస్రాయి జిన్నావలన దెలిసికొని, తానా మువ్వురితో సలిపిన సంప్రదింపులు నిరర్థకమగుటను వగచుచు, ఆ నవంబరు 5 వ తేదీన రేడియోద్వారా నొకప్రకటన జేసెను.

125. మహాత్ముఁడాప్రకటనపై నీవిధముగా వ్యాఖ్యానించెను :—

“వైస్రాయి పరిష్కారమున కెంతమాత్రము వీలుకానట్టు స్పష్టముగా కనుపడు సమస్యను అనగా రాష్ట్రములలో కాంగ్రెసు తమ ఆశయములకు భిన్నమైన ఆశయములుగల ముస్లింలీగుతో గలిసి సంకీర్ణప్రభుత్వములను నడిపింపవలయునను సమస్యను తాను పరిష్కరింపబూనుకొని వ్యర్థుడయ్యెను. యుద్ధాశయములనుగూర్చి భారతదేశమునకు సంబంధించినట్టియు, సర్వజనాంగీకృతమైనదియు, ప్రభుత్వ ప్రకటన వెలువడునంతవరకు ఈ కాంగ్రెసు-లీగుసమస్య పరిష్కరింపబడజాలదు. నిజముగా బ్రిటిషువారికి వారు బైటికి చాటుకొనుచుండునట్టు సామ్రాజ్యవిధానము నశించిపోయి యుండినయెడల వారు తమ పూర్వవాసనలను పూర్తిగా విడువవలయును. బానిసవ్యాపారము చేయుమనిషి తనవ్యాపారమును వదలిపెట్టదలచినప్పుడు తన బానిసలందరితోడను వారికి స్వాతంత్ర్యము కావలెనా, అక్కరలేదా అని యడుగునా ? అదేవిధముగా బ్రిటిషువారి ఆధీనములోనున్న భారతదేశము క్రమక్రమముగాగాక, వెంటనే స్వతంత్రదేశముగా ప్రకటింపబడుట మాత్రము ప్రస్తుతము చేసినయెడల ఆ స్వాతంత్ర్యము అనుభవములోనికి వచ్చులోపున జేయవలసిన కార్యవిధానము తేలికగా బరిష్కరింపబడగలదు. బ్రిటిషువారు పైకి గనబరచు తమ ఆదుర్దాయగు అల్పసంఖ్యాకుల హక్కులరక్షణసమస్య అప్పుడు మిగుల తేలికగును. అధికసంఖ్యాకులని చెప్పబడేవారికి ప్రతికూలముగా అల్పసంఖ్యాకులను ప్రయోగించి వారిలోవారికి పరస్పర ఒడంబడికను అసంభవముచేయుచున్న బ్రిటిషు ప్రభుత్వమువారి వైఖరిని జూడగా వారు ఇంకను తమ సామ్రాజ్యతత్వమును వదలుకొననట్టు స్పష్టమగుచున్నది. ఆఒడంబడికను జరుపవలసిన బాధ్యత తమ నెత్తిమీద నేయున్నట్లు బ్రిటిషువారు భావించుకొనుచున్నంతకాలము వారు ఇండియాను తమ పరాధీనములోనే నుంచుకొననూహించినట్లు తేటబడును. కావున భారతీయు లిట్టివిషమదశనుండి విముక్తులగుటకు భారత వివిధరాజకీయసంస్థల ప్రతినిధులతోగూడిన రాజ్యాంగ పరి

షత్ నిర్మాణ మొక్కటియే తగుమార్గము. అందువలన భారతీయులు రాజ్యాంగపరిషత్ నిర్మాణమునకు సర్వప్రయత్నములుచేసి విఫలులైన తరువాతనే శాసనోల్లంఘనమను ప్రత్యక్షపోరాటమును సాగించదగును. ఒకవేళ అట్టి పరిషత్ నిర్మాణమునకు ముందుగనే నాందిగా ప్రత్యక్షపోరాట మవసరమగునేమో".

126. మహాత్ముడావిధముగా తన అభిప్రాయమును దెలిపినవెనుక ఆ నవంబరు 19 వ తేదీ మొదలు అయిదుదినములు అలహాబాదులో అఖిలభారత కాంగ్రెసు సంఘము సమావేశమై భారతరాజ్యాంగ నిర్ణయమునకై వెంటనే ప్రభుత్వమువారు కన్‌స్టట్యూయంటు యస్సెంబ్లీ నొకదానిని నిర్మించవలసినదని తీర్మానించి ప్రభుత్వమువారికి దెలియబరచెను. కాంగ్రెసు సమావేశము జరుగు రోజులలోనే, ఆ నెల 22 వ తేదీ ముస్లింలీగుకు కాంగ్రెసు ప్రభుత్వమునుండి బయటపడిన మోక్షదినముగా జిన్నా ప్రకటించెను. భారతీయులలోగల ఈపరస్పర అభిప్రాయభేదవిషయములను పురస్కరించుకొని ఇండియా కార్యదర్శి లార్డు జెట్లండు డిసెంబరు 14 వ తేదీన పార్లమెంటులో ఉల్లాసముతో ముచ్చటించుచు, యుద్ధమునకు కాంగ్రెసు సాయము చేయకున్నను, అనేకమంది సంస్థానాధీశులు, భూస్వాములు మొదలగు భారతీయులెందరో యుద్ధనిధికై యనేక బహుమతుల నిచ్చిరనియు, కాంగ్రెసుమంత్రుల రాజీనామాల వలన ఇండియా రాజకీయాభివృద్ధి, మింటో - మార్లీ సంస్కరణముల స్థితికికన్న చాల వెనుకకుబోయినదనియు దెలిపెను. అలహాబాదులో జరిగిన కాంగ్రెసు సంఘ సమావేశములో, రాజ్యాంగపరిషత్ నిర్మాణతీర్మానముతోబాటు కాంగ్రెసు, బ్రిటిషు ప్రభుత్వముతో గౌరవ ప్రదమైన రాజీచేసికొనుటకు ఎల్లప్పుడును సిద్ధముగా నున్నదనియు, కాంగ్రెసు కోరికయగు భారతస్వాతంత్ర్యమును ప్రభుత్వము గుర్తించుటకు హిందూ, ముస్లిము సాంఘికభేదములడ్డు రావనియుగూడ తీర్మానములు చేసి, వాటిని ప్రభుత్వమునకు బంపియుండెను. జట్లండుప్రభువు రాజీవిషయమునకు సంతసమును దెలుపుచు, సాంఘికభేదము అడ్డురావను విషయమున తనకు నమ్మకములేదని వ్యక్తబరచెను. దీనికి జవాబుగా నెహ్రూ, జట్లండుకు గలిగిన సాంఘికచిక్కులన్నిటిని బరిష్కరించుటకు ఒక్కరాజ్యాంగ పరిషత్తుయే తగిన సంస్థయనియు, ఆ పరిషత్తులో జట్లండు భయపడుచుండిన భేదాభిప్రాయము లేర్పడియెడల వాటిని స్వతంత్రమైన ఏమధ్యవర్తి పరిష్కారమునకైనను వదలివేయుట ఉచితమనియు, అటుల జేసిన యెడల, అధికసంఖ్యాకుల యభిప్రాయములను అల్ప సంఖ్యాకులమీదగాని, అల్ప సంఖ్యాకుల కోర్కెలను అధిక సంఖ్యాకులపైన గాని పరస్పరాంగీకారము లేకుండ

బలవంతముగా రుద్దబడియుండదనియు దెలిపెను. మరియు భారతరాజ్యాంగ పరిషత్తు బ్రిటిషుసామ్రాజ్యమునకు స్వస్తి చెప్పగల సంస్థయగుటచే, దాని నిర్మాణమునకు బ్రిటన్ ప్రతికూలముగా నుండుట సహజమనియుగూడ చివరమాట చెప్పెను.

127. మహాత్ముడు మరల వైస్రాయి కోరికపై 1940 ఫిబ్రవరి 5 వ తేదీన ఆయనను దర్శించి, తిరిగివచ్చి శాంతియుత మైనదియు, గౌరవనీయ మైనట్టియు పరిష్కార సూచనలు తనకు గోచరమగుటలేదని మిగుల విలపించెను. తరువాత ఆయన భార్యతోగలిసి ఆనెల 17వ తేదీన శాంతినికేతనమున కేగెను. 21వ తేదీన కలకత్తాకు వెళ్ళి అక్కడ నస్వస్థతగనుండిన ఆండ్రూసును కలిసికొనెను. తదనంతరము మార్చి 5 వ తేదికి తిరుగ తన సేవాగ్రామము జేరెను. అక్కడనుండి ఆ నెల 19 వ తేదీన రాంఘర్‌లోజరిగిన కాంగ్రెసు మహాసభకు హాజరై సబ్జక్టుకమిటీలో నుపన్యసించుచు, దేశములోని ప్రతి చిన్న కాంగ్రెసు కమిటీయు సత్యాగ్రహ కమిటీగానే ఏర్పడుటకు సంసిద్ధమై యుండవలయునని సంబోధించెను. మరునాడు జరిగిన కాంగ్రెసు బహిరంగ సమావేశములో కాంగ్రెసీయులుగాని, వారి పలుకుబడిలోనున్న వారలుగాని బ్రిటిషువారి యుద్ధమున మనుష్య సహాయమునుగాని, ధన సహాయమునుగాని, వస్తు సహాయమునుగాని చేయజాలరని తీర్మానమొకటి గావింపబడెను. అయినను జూన్ 17 వ తేదీ మొదలు నాలుగురోజులు వార్ధాలో గూడిన వర్కింగు కమిటీ రాజాజీ సలహాననుసరించి కొత్తదోవ ద్రొక్కెను. అప్పట్లో హిట్లరు ఫ్రాన్సు నాక్రమించి ఇంగ్లండుపై దుముక బోవుటను గమనించిన రాజాజీ ప్రభృతులు ఇండియాకు గూడ నట్టిదుర్గతి బట్టునేమోయని భయపడి చేతులను ముడుచుకొని యూరక జూచుచుండుట కిష్టపడక యుద్ధమున నింగ్లీషువారికి సాయమొనర్చి తద్వారా ఇండియాను గూడ రక్షించుకొన వచ్చునను యాశచే కాంగ్రెసు వర్కింగు కమిటీలో తాము మెజారిటీగా నున్నందున ప్రభుత్వముతో రాజీ కొదుర్చుకొనుటకై యొకతీర్మానమును గావించిరి. అది యిది : బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశము సంపూర్ణ స్వాతంత్ర్యమున కర్హమైనదనిమాత్ర మొప్పుకొని ప్రస్తుతము వైస్రాయి కౌన్సిలును తాత్కాలిక జాతీయ ప్రభుత్వముగా మార్చినచో దేశనాయకులా ప్రభుత్వములోజేరి యుద్ధసహాయముకై ప్రజలను ప్రోత్సహించుటకు అవకాశ మేర్పడునని యనుట. యుద్ధము హింసాపూర్వక మగుటచే అహింసా దీక్షాపరుడగు మహాత్ముని నాతీర్మాన బాధ్యతనుండి తప్పించిరి. వెంటనే వైస్రాయి మహాత్ముని బిలిపించుకొని శిమ్లాలో చాలదూరము ప్రసంగించెను. ఆప్రసంగానంతరమున మహాత్ముడు జూలై 2 వ తేదీన "ప్రతి బ్రిటిషు పౌరున కొక మనవి" యను సుప్రసిద్ధ లేఖను తన పత్రికలో బ్రచు

రించెను. ఆలేఖలో హింసనుమాని అహింసాపద్ధతి నవలంబింపవలెనని వారలను సంబోధించెను. ఆ నెల 3వ తేదీ మొదలు నాలుగు దినములు ఢిల్లీలో కాంగ్రెసు వర్కింగు కమిటీ తిరుగ సమావేశమై రాజాజీదెచ్చిన యుద్ధసహాయ తీర్మానమును పునరుద్ఘాటించెను. ఆ తీర్మానము నా నెల 27 వ తేదీ పూనాలో గూడిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ ఆమోదించెను.

128. ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ తీర్మానముపై వైస్రాయి ఆ 1940 ఆగష్టు ఎనిమిదవ తేదీన నొక ప్రకటన జేయుచు బ్రిటిషు గవర్నమెంటు వారు తనను తన కౌంసిలులో గొందరు భారతీయ నాయకులను జేర్చుకొనవలసినదని మాత్రము నియోగించి నట్లు దెలిపెను. అందుపై వార్ధాలో నా నెల 18 వ తేదీన గూడిన కాంగ్రెసు వర్కింగు కమిటీ తాము గోరియుండిన తాత్కాలిక జాతీయ ప్రభుత్వమునకు మారుగా వైస్రాయికి లోబడిన కౌంసిలులో నిద్దరు ముగ్గురు సభ్యులను మాత్రము జేర్చుకొనుట వలన ప్రయోజనము లేదని దెలిసికొని, యుద్ధమునకు సాయము చేయుట మానుకొని తిరిగి మహాత్ముని బిలిచి యాయన యాజమాన్యమున కాంగ్రెసును అహింసా మార్గమున నడుపుటకు నిశ్చయించిరి. మహాత్ముడా నిశ్చయమును గూర్చి విమర్శించుచు తాను యుద్ధములో ఇంగ్లండు ఓడిబోవుటను గోరుటలేదనియు స్వాతంత్ర్యవిహీనులైన భారతీయులు బ్రిటిషు వారి కష్టములను దీర్చగలరనుట పట్టి కల్ల యనియు స్వాతంత్ర్య చిహ్నమైన డెమొక్రటిక్ జీవితమునకు వాక్స్వాతంత్ర్యము ఊపిరివంటి దనియు కాంగ్రెసు అట్టి వాక్స్వాతంత్ర్య ముపయోగించ వలెననియు అందుకు గాను భారతీయులందరి మనములలో నున్న యభిప్రాయమును ధారాళముగా బయటికి దెలుప వలయుననియు స్పష్టపరచెను. ఆ నెలాఖరున మహాత్ముడు మరియొకసారి వైస్రాయిని శిమ్లాలో గలసికొని తిరిగివచ్చి భారతీయుల ప్రస్తుత కర్తవ్యము జీవించుటకు హక్కును కలిగియుండుటయే యనియు అనగా మనసులోని యభిప్రాయమును బయటికి దెలుపుటకు వాక్స్వాతంత్ర్యమును గలిగియుండుటయే యనియు కాంగ్రెసు ఊరు పేరు లేకుండ నశించవలసి వచ్చినచో తన యాదర్శమును ధారాళముగా బ్రకటించుటను నిర్వర్తించుటలో నే సమసిపోవలెననియు ఘంటాపథముగా బలికెను. కాంగ్రెసు ఆదర్శమైన సంపూర్ణస్వాతంత్ర్యములో నంతర్భాగమైన వాక్స్వాతంత్ర్యము నుపయోగించవలెనని మహాత్ముని అభిప్రాయము. అది "ప్రస్తుతము అస్వతంత్రమైన భారతదేశము దాని నణచి పట్టియున్న బ్రిటిషు ప్రభుత్వమునకు యుద్ధములో సహాయము చేయగూడదనుట." మహాత్ముని యా ప్రణాళికను కాంగ్రెసు కార్యవర్గము అక్టోబరు 11 వ తేదీన ఆమోదించుటచే యాయన యనుమతిని మొట్టమొదట

ఆచార్య వినోభాభావే 17 వ తేదీన వార్ధాకు ఏడుమైళ్ళ దూరముననున్న నొక గ్రామములో మహాత్ముని ప్రణాళికలోని ప్రమాణవాక్యముగు "బ్రిటిషు వారి యుద్ధ ప్రయత్నములకు మనుష్యులనుగాని, ధనమును గాని, సహాయముచేయుట తప్పు; మరియు అన్ని యుద్ధములను అహింసాయుతముగా నిరోధించడము మాత్రమే యుద్ధమునకు తగిన ప్రతిక్రియ" అని బహిరంగముగానుచ్చరించెను. అందుకు ప్రభుత్వమువారాయనను 21 వ తేదీన యరెస్టుచేసి యుద్ధ ప్రతికూలోపన్యాసమునకై మూడు నెలలు కారాగార శిక్ష విధించిరి. అట్టి యుపన్యాసములు క్రమేపి దేశమున పలుచోట్ల వ్యాపించెను. నెహ్రూ మహాత్మునితో మాటలాడి తిరిగి పోవుచుండగా 31 వ తేదీన యరెస్టు కాబడి అవరకెప్పుడో రాజద్రోహోపన్యాసము లిచ్చెనన్న నెపముపై నాలుగు సంవత్సరముల కారాగార శిక్ష విధింపబడెను. గవర్నమెంటు వారు వాక్స్వాతంత్ర్య సత్యాగ్రహులపై దీనికొనుచుండిన చర్యలను పత్రికలలో బ్రచురింపరాదని కట్టడి జేయుటచే మహాత్ముడు తన హరిజన పత్రికను చాలించెను.

129. ఆ సంవత్సరము (1940) క్రిస్టుమసు పండుగదినములలో మహాత్ముడు క్రైస్తవుల యెడ తనకు గల సానుభూతి సూచకముగ, డిశెంబరు 25 మొదలు 1941 జనవరి 4 వరకు వాక్స్వాతంత్ర్య సత్యాగ్రహోద్యమును సస్పెండు జేసెను. తరువాత నాయుద్యమము 1941 సంవత్సరాంతము వరకు సాగెను. ఆ యుద్యమ సందర్భమున సర్కారువారు ఇరువదివేల మందిని శిక్షించి, ఆరులక్షల రూపాయల జుల్మానాలను విధించిరి. 1941 డిసెంబరు 3 వ తేదీన, గవర్నమెంటువారు నిరాశాపూరితులై, తమంతటతామే జైళ్ళలో నున్న సత్యాగ్రహుల నందరిని వదలివేయ నిశ్చయించినట్లు బ్రకటించిరి. ఆ ప్రకటనపై మహాత్ముడు వ్యాఖ్యానించుచు, ఆ నిశ్చయమునకు గాను ప్రభుత్వము వారి నభినందించుటకు బ్రోత్సహించు ప్రవృత్తి తనలో కలుగలేదని స్పష్టముగా దెలియబరిచెను. ఇంతలో నా డిసెంబరు 7 వ తేదీన జపాను ఇంగ్లీషువారి పెరల్ హార్బరును ముట్టడించినట్లు దెలియవచ్చెను. అందువలన కాంగ్రెసు కార్యవర్గము తిరిగి భయభ్రాంతులై, ఆ డిసెంబరు 23 మొదలు 30 వరకు బార్డోలీలో సమావేశములు జరిపి, ఇండియాను జపాను దాడినుండి, బ్రిటిషువారి హింసాపూర్వక యుద్ధములో బాల్గొని, రక్షించుకొనదలచి యుండెను. ఆ కారణమున కాంగ్రెసు కార్యవర్గము మహాత్ముని మరల తమ యుద్ధప్రణాళిక బాధ్యతనుండి తప్పించెను. మరియు దేశములో శాంతిని నెలగొల్పుటకై వాలంటీరు దళములను స్థాపింపదలచెను. కావున మహాత్ముడు 1942 జనవరి 15 వ తేదీన వార్ధాలోగూడిన ఆల్ ఇండియా కాంగ్రెసు సమావేశమునకు హాజరై, వాలంటీరు శాంతిదళ నిర్మాణ

మున కంగీకరించి, తద్వారా గ్రామగ్రామములలో నున్న సామాన్య ప్రజలకు కాంగ్రెసు ఆదర్శములను బోధించునవకాశ మేర్పడునట్లు జేసెను. మహోత్సవుడా సందర్భమున నే, జవహారులాలు నెహ్రూ తనకు కాంగ్రెసు నాయకత్వమున వారసుడని మొట్టమొదట వాకొనెను. ఆ నెల 18 వ తేదీన తన హరిజన పత్రికను, 15 నెలల తరువాత తిరిగి ప్రారంభించెను. 21వ తేదీన బెనారిసుకు బోయి, యచ్చటి హిందూ యూనివర్సిటీ విద్యార్థుల సిల్వరు జూబిలీ యుత్సవములో నుపన్యసించుచు, ఆంగ్లేయభాషామూలమున దమయభిప్రాయములను వెల్లడించదలచుటను నిరుత్సహించెను. ఆ తరువాత ఫిబ్రవరి 18 వ తేదీన ఛాంగ్ కై షేకు దంపతులను కలకత్తాలో గలిసికొని వారితో సంప్రదించెను.

## ఇరువదియేడవ ప్రకరణము

# క్రిప్సు రాయబారము - ఆగష్టు తీర్మానము - నిర్బంధము

## 1942 — 43

130. ఆ సంవత్సరము (1942) మార్చి 7 వ తేదీన జపాను సేనలకు రంగూను వశమగుటచే బ్రిటిషు గవర్నమెంటు ప్రధానియైన చర్చిలు 11 వ తేదీన తమ ఇండియాను సంరక్షించుకొనుటకై భారతీయులసహాయ మభ్యర్థించి, వారికేవో కొన్ని రాజకీయసంస్కరణముల నియ్యదలచినట్టును, అందుకై క్రిప్సు రాయబారమును బంపదలచినట్టును బ్రకటించెను. ఆప్రకటన ప్రకారము క్రిప్సు ఆనెల 22 వ తేదీన కరాచి తీరముజేరి మరునాడు ఢిల్లీకి వచ్చి రెండురోజుల తరువాత భారతదేశ రాజకీయనాయకులతో సంప్రదింపులు జరిపెను. మహాత్ముడాయనను 27 వ తేదీన కలిసికొని యాయన సూచనలను విని, తిరిగి బోవుచు దోవలో పత్రికావిలేఖరు లాయన యభిప్రాయము నడుగగా క్రిప్సు సూచనలు "పోస్టు డేటెడు ఛెక్కు"వలె నున్నవని ఒక్కముక్కలో జవాబిచ్చెను. అనగా ఎప్పుడో రాబోయే సంస్కరణము లన్నమాట. క్రిప్సు తాను దెచ్చిన రాయబారపు వివరములను ఆనెల 29 వ తేదీన బ్రచురించెను. ఆవివరము లీవిధమున నుండెను :—

(1) యుద్ధానంతరమున ఏకైక భారతరాజ్యాంగ ప్రణాళికను తయారుచేసికొనుటకు భారతీయులవలననే యెన్నుకొనబడిన యొకశాసనసభ నిర్మింపబడును. అందు భారతదేశములో భాగమైన స్వదేశసంస్థానములుగూడ పాల్గొనును. ఆసభవారుచేసిన ప్రణాళికను బ్రిటిషు ప్రభుత్వమువారు తు.చ. తప్పకుండ ఆమోదించి దాని నమలుజరిపింతురు. మరియు ఆప్రణాళిక నంగీకరింపని రాష్ట్రముల ప్రత్యేకతకు అడ్డుపడరు.

(2) ప్రస్తుతమున యుద్ధమును జరిపించు బాధ్యత బ్రిటిషు గవర్నమెంటువారిదే యగుటచేతను, అందువలన భారతదేశ సంరక్షణ బాధ్యతగూడ వారిదే యగుటచేతను, వైస్రాయి కౌంసిలులో కొందరు భారతీయులు వెంటనే సభ్యులుగా జేర్పబడినను వారిపని యంతయు యుద్ధమునకు గావలసిన మనుష్యులను, ధనమును సమకూర్చుట మాత్రమే".

ఆరెండు విషయములను విన్న కాంగ్రెసు నాయకులు మొదటి విషయములో వృశ్చికమునకువలె తోకలోనున్న విషమునుగుర్తించి, అయినను ఆవిషయమంతయు యుద్ధానంతర సమస్య యగుటచే దానిని గురించి క్రిప్సుతో తగవులాడక వెంటనే జరుగకల

సిన విషయమగు యుద్ధసహాయార్థము ప్రజలకు నచ్చజెప్పవలసిన వైస్రాయి కౌన్సిలు లోని రక్షణశాఖ మెంబరు భారతీయుడై యుండవలెనని వాదించిరి. వారివాదన సబబును గ్రహించిన క్రిప్సు మొదట సమ్మతించి తరువాత వెంటనే వైస్రాయి నిరాకరణచే వెనుదీసి, అంతలో జపానుదాడి తగ్గుటను గమనించిన బ్రిటిషు ప్రధాని చర్చిలు ఆదేశముపై ఏప్రిలు 12 వ తేదీన తనదేశమునకు సత్వరముగ మగిడిపోయెను.

131. ఆ తరువాత మహాత్ముడు బ్రిటిషు ప్రభుత్వమువారంపిన సూచనలు పరిహాస పాత్రములగుటచే ననంగీకారములని ఏప్రెలు 19వ తేదీన 'హారిజన' పత్రికలో వ్రాసెను. ఆ సూచనలను గూర్చి చర్చించి, కర్తవ్యమును నిర్ణయించుటకు అలహాబాదులో ఆనెల 28 వ తేదీనగూడిన కాంగ్రెసు వర్కింగు కమిటీ మీటింగునకు మహాత్ముడు స్వయముగా పోవుటకు వీలులేక చిత్తుతీర్మానము నొకదానిని వ్రాసి బంపించెను. దానిలోకొన్ని సంగతులు ముఖ్యముగా జపాను సైన్యాను విషయమున స్పష్టముగ లేకుండుటచే నెహ్రూ దానినిమార్చి కొత్తతీర్మానమును దేవలసి వచ్చెను. ఆ సందర్భమున నెహ్రూ మొదలగు నాయకులు గొందరు మహాత్ముని చిత్తు తీర్మానముపై మాటాడిన స్వేచ్ఛా వాక్యములను గొన్నిటిని సందర్భ రాహిత్యముగ అక్కడి కార్యదర్శులలో నొకరు వ్రాసికొని కాంగ్రెసు ఆఫీసులో నుంచియుండుటచే తరువాత గవర్న మెంటువారు మే 26 వ తేదీన కాంగ్రెసు ఆఫీసుపై దండెత్తి, ఆ కాగితములను దొంగిలించి, తరువాత వాటినాధారముజేసికొని మహాత్ముడు భారతదేశమును జపానువారికి నప్పగించతలచిన దురుద్దేశ్యమును కలిగియున్నాడని ఆరోపించిరి. మహాత్ముడును, నెహ్రూయును తరువాత గవర్న మెంటువారి చర్యను నిరసించిరి. ఈలోగా మేనెల 24 వ తేదీన అమెరికను జర్నలిస్టు యొకరు మహాత్ముని సేవాగ్రామములో దర్శించి ఆయన హారిజన పత్రికలో ఆ నెలలో వ్రాసినట్లుగా బ్రిటిషు అధికారులు భారతదేశమును వదలి వెళ్ళవలసి వచ్చినచో నెవరి కాదేశమును వప్పగించవలసి యుండునని యడుగగా భగవంతుని చేతిలో అనగా నవీన భాషలో అరాజకమునకు వదలి వెళ్ళవచ్చునని జవాబిచ్చెను. మరియు అట్టి అరాజక స్థితివలన అప్పటియబద్ధపు భారతదేశమునుండి యథార్థమైన భారతదేశ ముద్భవించుననిగూడ దెలిపెను. జూను 3వ తేదీ మొదలు 10వ తేదీవరకు వేరొక యమెరికను జర్నలిస్టు లూయీఫిషరు మహాత్మునితో గాలముగడపి, "మహాత్మునితో నొకవారము" అను గ్రంథమును బ్రచురించెను. మహాత్ముడు జూలై 6వ తారీఖున మొదలు వార్ధాలో జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశములో బాల్గొని "క్విట్ ఇండియా" తీర్మానమును వ్రాసు చేయించెను. 14 వ తేదీన బహిరంగపరుపబడిన ఆ తీర్మానములో తానావరకు అలహా

బాదుకు బంపియుండిన చిత్తుతీర్మానములోని అనుబూవ భాగమును స్పష్టపరచెను. చిత్తు తీర్మానములో యుద్ధసందర్భమున దేశమునందప్పుడున్న ఆంగ్లేయ అమెరికను సేనలన్నియు తత్క్షణమే దేశమును వదలి పోవలయునని సూచింపబడి యుండెను. అందువలననే నెహ్రూ మొదలగువారు అలహాబాదు సభలో ఆటులబోయినచో వెంటనే దేశము జపానీయుల పాలగునని దెలిపియుండిరి. వారి యామాటల నాధారము జేసికొని మహాత్మునికి భారతదేశమును జపానువారి వశముజేయ గోరికయున్నట్లు బ్రిటిషు గవర్నమెంటువారు ప్రపంచమున జాటిరి. మహాత్ముని యుద్దేశ్య మెప్పటికిని యదిగాకుండుటచే పైమాటలకు బదులుగా నూతన తీర్మానములో బ్రిటిషు అధికార విరమణ మాత్రము జరుగవలెననియు, యుద్ధమున్నంత కాలమా సేనలను భారతీయులతో సంబంధములేక యుంచుకొనవచ్చుననియు స్పష్టపరచెను. అప్పటి కాంగ్రెసు ప్రెసిడెంటుగానున్న అజదు ఆగస్టు రెండవ తేదీన ప్రసంగించుచు బ్రిటిషువారు తమ యధికారమును వారికిష్టమున్నచో ముస్లింలీగుకైనను, మరియేయితర రాజకీయ వర్గముకైనను వప్పగించి వెళ్ళిపోయినచో కాంగ్రెసునకేమాత్ర మభ్యంతరములేదని తెలిపిన వాక్యములతో మహాత్ముడు తాను మనస్ఫూర్తిగా నేకీభవించినట్లు ప్రచురించెను. ఆగస్టు 5 వ తేదీన బొంబాయిలో గూడిన కాంగ్రెసు కార్యవర్గము ఆల్ ఇండియా కాంగ్రెసు ఆమోదమునకై మూడు విషయములుగల తీర్మాన మొకదానిని జేసెను. ఆ మూడు విషయములు :

(1) కాంగ్రెసు కోరిన స్వతంత్రభారతము యుద్ధకాలములో నేర్పడిన సంయుక్తరాజ్యములకు మిత్రముగానుండును.

(2) భారతదేశమునకు పరిపాలానాధికారము సంక్రమించినప్పుడు ఆ యధికారము జాతి వివక్షత లేక భారతీయులగు సర్వపౌరులకును జెందును.

(3) కావున భారతస్వాతంత్ర్య సంపాదనార్థమై భారతీయులెల్లరును మహాత్ముని యాజమాన్యమున నడుము గట్టుకొని క్రమశిక్షితులైన యోధులవలె ఆయన యాజ్ఞలను శిరసావహించుటకు సంసిద్ధులైయుండవలెను.

134. మరిమూడు దినములకు అనగా ఆగస్టు 8 వ తేదీన బొంబాయిలో జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెసు సభలో నా తీర్మాన మామోదింపబడెను. కొందరు కాంగ్రెసు-కమ్యూనిస్టు మెంబర్లు మాత్రము వ్యతిరేకముగ వోటుజేసిరి. ఆ తీర్మానానంతరము మహాత్ముడు మాట్లాడుచు ఉపోద్ఘాతములో వైస్రాయి లింలిత్ గో కును తనకును గల మైత్రిని, ఆయన కుమార్తెయు అల్లుడును తనను తన ఆశ్రమములో గలిసికొని మెలగిన విషయమును, మహాదేవ దేశాయి యెడల వైస్రాయికిగల మక్కు-

వను ప్రేమపూర్వకముగా జేర్కొనెను. అయినను గవర్నమెంటువారా వాక్యములు పత్రికలలో బడకుండ సెంసారు చేసిరి. మిగిలిన యుపన్యాసములో తాను వైస్రాయితో సంప్రదించిన మీదటనే తానే చర్యదీసుకొనవలయునో నిర్ణయించుకొందుననియు అప్పటికి తనకేమియు తోచలేదనియు జెప్పిన వాక్యములను బత్రికలలో బ్రచురింప నిచ్చినను, అంతకు ముందే జూలై 14 వ తేదీనుండియే యాయనను నిర్బంధించుటకై ప్రభుత్వము వారు కట్టుదిట్టములను జేసియుండుటచే నా ఎనిమిదవ తేదీ రాత్రి తీర్మానము ప్యాసయిన వెంటనే, మహాత్ముని యుపన్యాసమును దెలుసుకొనకనే ఆ రాత్రియే వైస్రాయి కౌంసిలు సమావేశమై కాంగ్రెసు నాయకుల నరెస్టు చేయుటకు తీర్మానించి, బొంబాయి గవర్నమెంటుకు ఆజ్ఞలను బంపిరి. అందువలన తెల్లవారక మునుపే మహాత్మునితో బాటు వర్కింగు కమిటి మెంబర్ల నందరిని ప్రభుత్వము వారు బంధించి ఎక్కడికో బంపివేసిరి. మహాత్ముడు మాత్రము కొందరనుచరులతో పూనా సమీపమున నున్న ఆగాఖాను పాలేసులో నుంచబడెను. మిగిలిన వారలు అహమ్మదు నగరుకోటకు గొనిపోబడినట్టు తరువాత దెలియవచ్చెను. మహాత్మునితో నిర్బంధింపబడిన మహదేవ దేశాయి కొద్దిదినములకే నకస్మాత్తుగా నక్కడనే మరణించెను. మహాత్ముడు తన నిర్బంధమును వారముదినము లోర్చుకొని ఆనెల 14 వ దేదీన వైస్రాయికొక లేఖనువ్రాయుచు ప్రభుత్వము వారు తొందరపడి తమ్ము నిర్బంధించుటను నిందించుచు, అయినను తానింకను పూర్వమువలెనే వైస్రాయికి హృదయపూర్వక మిత్రుడనని యుద్ఘాటించుచు భగవంతుడాయనను మంచిమార్గమున మసలునట్టు చేయుగాత యని యాశీర్వదించెను. గవర్నమెంటువారికి తగిన జవాబిచ్చుటకు మహాత్ముడు అప్పట్లో బైటలేకుండుటచే, ధైర్యమువహించి లండను పార్లమెంటులో చర్చిలు, ఇండియను శాసనసభలో హోంమెంబరు యిచ్చవచ్చినట్లు మహాత్మునిపై యనేక యారోపణలను జేయుచుండిరి. అయినను ఆయారోపణలను పత్రికలలో జూచిన మహాత్ముడు సెప్టెంబరు 23 వ తేదీన తన నిర్బంధమునుండియే ఇండియా హోంమెంబరు యొక్క సెక్రటరీకొక లేఖ వ్రాయుచు ఆ మెంబరు చేసిన యుపన్యాసమును ఖండించెను. నవంబరు 12 వ తేదీన మహాత్ముని గలిసికొన దలచిన రాజాజీ కోరికను వైస్రాయి నిరాకరించెను. డాక్టరు శ్యామప్రసాదుయొక్క కోరికను గూడ నదేవిధముగా నిరాకరించెను. తరువాత ప్రభుత్వమువారు కాంగ్రెసు నిర్బంధితులనుగూర్చి ఏవిషయమును బత్రికలలో బ్రచురింపరాదని ప్రకటించుటచే చెక్కు భారతీయ పత్రికలు ఆప్రకటన యెడల తమ నిరసన సూచకముగా 1943 జనవరి నెలలో నొకరోజు హరతాళమును జరిపిరి. మహాత్ముడు నిర్బంధమందుండి తాను వైస్రాయితో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరముల వలన నిరాశ జనించుటచే వేరు దిక్కు

లేక భగవంతునితో మొరబెట్టుకొనదలచి 1943 ఫిబ్రవరి 10 వ తేదీన మూడు వారములు ప్రాయోపవేశ మారంభించెను. మూడురోజులకే యాయనస్థితి క్షీణించుటచే నిక బ్రతుకడని యూహించి గవర్నమెంటువారు మహాత్మునిపై గొన్ని యబద్ధపు యారోపణలను పుస్తకరూపమున నచ్చొత్తించి, తమగవర్నమెంటు సెక్రటరీ టాటను హోము పేర ఆ రోజున అనగా 13 వ తేదీన ఆపుస్తకమును బ్రచురించిరి.

133. మహాత్ముని స్థితి 17 వ తేదీకి మరింత హీనమగుటచే, అయనను వదలివేయుమని వైస్రాయి కౌన్సిలు సభ్యులు ముగ్వురు. మోడీ, సర్కారు, యానీగారలు కోరగా, వైస్రాయి అందులకు సమ్మతింపనందున నాముగ్గురును తమ పదవులకు రాజీనామాల నిచ్చిరి. తరువాత నాఫిబ్రవరినెల 19, 20 తేదీలలో ఆల్ ఇండియా లీడర్సు కాన్ఫరెన్సొకటి ఢిల్లీలో సమావేశమై మహాత్ముని విడుదలను గోరగా, వైస్రాయి వారికోరికనుగూడ నిరాకరించెను. 21 వ తేదీన మహాత్ముని జీవితమును గురించి ఆశవదలుకొనవలసిన స్థితి యేర్పడెను. కావున గవర్నమెంటువారారోజున బహుజాకరూకులై, దేశములో నల్లరులు జరుగకుండ పోలీసు, మిలిటరీ బందోబస్తులను గావించిరి. ఆ దినముననే అమెరికను ప్రెసిడెంటు రూజ్వెల్టు ప్రతినిధియగు ఫిలిప్సు ఇండియాలో నుండుటచే, భారతదేశములోని యప్పటి దుస్థితికి అమెరికా ఇంగ్లాండులలో నుండిన ప్రభుత్వాధికారులే కారకులని బాహాటముగా దెలిపెను. 23 వ తేదీన మహాత్మునికి కొంత స్వస్థత యేర్పడుటచే, ఆయనను సందర్శించుటకు గోరిన హోరేసు అలెగ్జాండరు కోరికను వైస్రాయి మన్నించకుండెను. మార్చి 3 వ తేదీన మహాత్ముని మూడువారములు ప్రాయోపవేశ గడవు సమాప్తమగుటచే, ఆయనను సందర్శింప గోరిన పరదేశ పత్రికా ప్రతినిధుల కనుజ్ఞ యీయబడలేదు. మార్చి 10 వ తేదీన దేశములోని ముప్పదియైదుమంది ప్రముఖ నాయకులు సంతకములు చేసి. మహాత్ముని విడుదలను గోరుచు ప్రభుత్వమువారికి బంపిన మహజరు బుట్టదాఖలయ్యెను. ఏప్రెలు ఒకటవ తేదీన సప్రూయాధ్వర్యమున దేశనాయకు లనేకమంది సమావేశమై, కాన్ఫరెన్సొకటి జరిపి, డెప్యుటేషను నొకదాని నేర్పరచి, వైస్రాయితో నా డెప్యుటేషను సంప్రదించుట కనుజ్ఞవేడగా, వైస్రాయి నిర్మోహమాటముగా నిరాకరించెను. విలియం ఫిలిప్సు, 25 వ తేదీన ఇండియాను విడిచిపోవుచు, తాను ప్రెసిడెంటు రూజ్వెల్టు ప్రతినిధియై మహాత్ముని స్వయముగా జూడగోరిన యాశలన్నియు నిరర్థకమయ్యెనని మిగుల విలపించెను. మేనెల 24 వ తేదీన నాన్ పార్టీ లీడర్సు కొందరు మహాత్ముని వదలవలసినదని యుద్ఘోషించిరి. వారి ఘోషలు గూడ పెడచెవిని బెట్టబడెను, వైస్రాయియొక్క ఇట్టి మొండితనమునకు గారణము

తాను, తన గవర్నమెంటు, మహాత్ముడు ఆగష్టు 8 వ తేదీ రాత్రి ఇచ్చిన యుపన్యాసమును దెలిసికొనక తొందరపడి, యాయనను నిర్బంధించిన తమ యకార్యమును సమర్థించుకొనుటకై యనేక యబద్ధపు యారోపణలను మహాత్మునిపై రుద్ది, తనపై యధికారులను మోసబుచ్చిన మోసమును మహాత్ముడు పటాపంచలు చేయునేమో యన్న భయమే, యని పలువురయభిప్రాయమై యుండెను. ప్రభుత్వమువారు, తమకు ఆంధ్రదేశములో దొరికినదని ప్రచురించిన ఆగష్టు 8 వ తేదికి బూర్వపు, ఆంధ్ర సర్క్యులరులోలేని, హింసాపూర్వకమైన రైలుపట్టాలను దొలగించు విషయమునందు లోజొనిపి, వైస్రాయి కౌంసిలులో భారతీయ మెంబరయిన ఉస్మానుసాహేబుగారిచే కేంద్రశాసనసభలో చిలుకబలుకులను బలికించుట యట్టి బుద్ధిపూర్వక యబద్ధపు ప్రచారమునకొక గట్టి తార్కాణము అయివున్నది.

134. ఆసంవత్సరము మేనెల 26వ తారీఖున, గవర్నమెంటువారు మహాత్ముడు జైలులో నుండి 8 వ తేదీన జిన్నాకు వ్రాసి జైలు యధికారుల కిచ్చిన లేఖ తమ కందినదనియు, దానిని జిన్నాకు బంపదలచుకొన లేదనియు ఆ శాసనసభలో ప్రకటించిరి. జిన్నా ఆ వరకు ఏప్రెలు 24 వ తేదీన ఢిల్లీలో ప్రసంగించుచు భారత స్వరాజ్య సంపాదనకై మహాత్ముడు ప్రభుత్వము వారితో సంప్రదించుటకన్న తనతోనే సంప్రదించి యుండిన బాగుండెడిదని దెలిపిన వాక్యములను మహాత్ముడు జైలులో నుండియే 'డాన్' పత్రికలో జూచియుండుటచే వెంటనే అందుకు సమ్మతించుచు వ్రాసినదే యాలేఖతరువాత జూను 18 వ తేదీన వేవెలు నూతన వైస్రాయిగా వచ్చెను.

135. ఆ వరకు 1941 సంవత్సరారంభమున ప్రచ్ఛన్న వేషముతో బరారియైన సుభాసాకాలమున అనగా 1943 అక్టోబరు నెలలో బాంకాకు నగరమునందుండి ఇండియాలోని సంగతులనన్నిటిని నెప్పటికప్పుడు దెలిసికొనుచుండి ఆనెల 2 వ తేదీన మహాత్ముని 75 వ పుట్టినదినమును బురస్కరించుకొని, యాయన భారతదేశము నకు జేసిన యసామాన్యమైన యత్యంత సేవను మిగుల గొనియాడి, యాయన పేరు సువర్ణాక్షరములతో భారతజాతీయ చరిత్రలో శాశ్వతముగ లిఖింపబడి యుండుననియు 1920 లో మహాత్ముడు తన సత్యాగ్రహమను నూతన యాయుధముతో ముందుకు వచ్చియుండని యడల భారతదేశమింకను యధోగతి బాలై యుండెడిదనియు, ఆయన నలుదెసల వెదజల్లిన స్వాతంత్ర్య తృష్ణ బీజములు మొలకలెత్తి మూలమూలల వ్యాపించి దేశీయుల నుత్తేజింప జేసి వారి నన్నివిధముల యుద్ధసన్నద్ధులుగ నొనరించి

యుండుటచే భారతీయుల బంధవిముక్తికై లోపలనుండిగాక, బయటనుండియే సేనా వ్యూహము రావలసియున్నందున తానా పనికి బూనినట్టును రేడియోలో ప్రస్తావించెను. ఆ కారణముననే సుభాసు ఆ అక్టోబరు 21 వ తేదీన సింగపూరులో మొదట స్వతంత్ర ఇండియాప్రభుత్వమును స్థాపించి, దాని నితరప్రముఖ ప్రభుత్వములు గుర్తించునట్లు జేసి, తరువాత నా ప్రభుత్వమునకు సేనలను సమకూర్చి బ్రిటిషు వారి స్వాధీనములోనుండిన ఇండియాపై దాడివెడలి, అధి భౌతిక కారణములచే వెనుదిరుగ వలసి వచ్చెను.

---

## ఇరువది యెనిమిదవ ప్రకరణము

# కస్తూరిబాయి అస్తమయము
# మహాత్ముని విడుదల — జిన్నాతో సంభాషణ

## 1944

136. మహాత్మునితోబాటు ఆగాఖాను భవనములో నిర్బంధింపబడిన మాతా కస్తూరిబాయి హృద్రోగమునుబొంది, చాలరోజులు బాధపడి, మహాత్ముకుకోరిన వైద్యసహాయమును ప్రభుత్వమువారు నిరాకరించినందున, వారు నిర్ణయించిన వైద్యము నేబొంది, తుట్టతుదకు 1944 ఫిబ్రవరి 22 వ తేదీన శివరాత్రి రోజున రాత్రి 7 గంటల 35 నిమిషములకు అస్తమించెను. మాలవ్యాజీ కోరికపై దేశమునందంతటను ఆసంవత్సరము మార్చి 5 వ తేదీన కస్తూరిబాయి స్మారకదినము జరుపబడెను. ఏప్రిలు 6వ తేదీన బొంబాయి గవర్నమెంటువారొక ప్రకటన జేయుచు, అందులో మహాత్ముడు మలేరియాతో బాధపడుచుండెననియు, అయినను ఆయన వయసుకు దగినట్టు యాయన శరీరస్థితి తృప్తికరముగా నున్నదనియే చెప్పవచ్చుననియు చెలిపిరి. 28 వ తేదీన మరియొక ప్రకటనజేయుచు మహాత్ముని శరీరస్థితి దుర్భరమైనదనియు, ఆయన జీవితమును గూర్చి మనోవ్యాకులమున కవకాశ మిచ్చుచున్న దనియు వెలిబుచ్చిరి. మేనెల మూడవ తేదీన డాక్టరు విధాన చంద్రరాయి మహాత్ముని బరీక్షించి, ఆయన నీరసస్థితినిగూర్చి యాతురతతో జేసిన వర్తమానమును వినిన భారతీయులెల్లరు దేశమున బలుచోట్లగూడి మహాత్ముని విడుదల జేయవలసినదని మరుదినముననే గగ్గోలు బెట్టిరి. ఢిల్లీలోని గవర్నమెంటువారు ప్రజలఘోష నాపలేకను కొత్త వైస్రాయి కస్తూరిబాయి వైద్యవిషయమున తన గవర్నమెంటువారి యశ్రద్ధను జ్ఞప్తికి తెచ్చుకొని మహాత్ముని గతిగూడ నట్లేయగునేమోయని భయపడుటచేతను ఆ మేనెల 6 వ తేదీననే మహాత్ముని ఉదయము 8 గంటలకు 'మెడికలు గ్రౌండ్సు' అను మిషబెట్టి బేషరతుగా వదలివేసిరి. మహాత్ముడు 9 వ తేదీన గొంత తేరుకొని ఆగాఖాను పాలెసుకు బోయి దాని యావరణలో నేర్పరుపబడిన మహాదేవ దేశాయి, కస్తూరిబాయి గారల సమాధులపై పుష్పముల నుంచి వారి యాత్మశాంతికి భగవంతుని ప్రార్థించి తిరిగి వచ్చెను. తరువాత రెండు రోజులకు పూనానుండి బొంబాయికి బోయి అక్కడనుంచి 'జూహూ' చేరి యచ్చటి గాంధిగ్రామములో పక్షము దినములు ఆరోగ్యార్థమై మౌనవ్రతమవలంబించెను. జూహూలో నున్నప్పుడే మహాత్ముడు తనకై ప్రత్యేకముగా దెచ్చిన సినీమాను ఆ మేనెల 21 వ తేదీన మొదటిసారి వీక్షించుట సంభవించెను.

మహాత్ముడు తన కొవరకు ఆగష్టు క్విటుఇండియా తీర్మాన మపసంహరింపుకొనుమని ప్రభుత్వము వారి కోరికపై జయకరు వ్రాసిన లేఖకు ప్రత్యుత్తరముగా తానా సలహా నంగీకరించలేనని వ్రాసిన తన లేఖను, ఆ మేనెల 31 వ తేదీన ప్రచురించెను. మహాత్ముడు జూను 15 వ తేదీన పూనాకుబోయి యక్కడి డాక్టరు దిన్షా మెహతాగారి జలచికిత్స వైద్యాలయములో చేరెను. అక్కడ నొక కొంత యారోగ్యమును సంపాదించి ఆ నెల 29 వ తేదీన వైస్రాయి వేవెలును జూడదలంచి తంతినంపగా నాతడియ్య కొనకుండెను. ఆ తరువాత మహాత్ముడు జూలై 2 వ తేదీన విశ్రాంతికై పంచగనికి బోగా నచటికి రాజాజీ యేతెంచి యా యనను సందర్శించి కాంగ్రెసు-లీగు సెటిల్ మెంటును గురించి యా యనతో యోచించి తన ప్రణాళిక కాయన యామోదమును బొంది యున్దాని నా నెల 9 వ తేదీన బయల్పరచెను. ఆ జూలై నెలలోనే లండను లోని 'న్యూస్ క్రానికిలు' ఇండియా విలేఖరి మహాత్ముని దర్శించగా ఆయన ఆ దొరగారి కిచ్చిన సందేశము 12 వ తేదీన బ్రచురింప బడెను. ఆసందేశములో మహాత్ముడు ఆవిలేఖరి తనను గోరిన ఆగష్టు క్విటు ఇండియా తీర్మానోప సంహారణమునుగూర్చి తాను కాంగ్రెసు కార్యవర్గ సభ్యులందరితో సంప్రదించిననేగాని యిదమిద్ధమని నిర్ధారణ చేయుటకు వీలులేదనియు, యీలోగా వెంటనే ప్రభుత్వమువారు కాంగ్రెసు కోరియుండిన తాత్కాలిక జాతీయ ప్రభుత్వమును స్థాపించుట మంచిదనియు చెప్పెను. ఆనెల 25 వ తేదీన లార్డ్సు సభలో మన్స్టరుప్రభువు మాట్లాడుచు మహాత్ముని తాత్కాలిక జాతీయ ప్రభుత్వ గోరికయే క్రిప్సురాయబారమును నిష్ఫల మొనరించెననియు, అట్టి తాత్కాలిక ప్రభుత్వములో వైస్రాయికి అప్పుడమలులోనున్న ఇండియా రాజ్యాంగ చట్టమునుబట్టి విధింపబడిన ప్రత్యేక యధికారములు చెలాయింపబడ గూడదని మహాత్ముడింకను గొంతెమ్మ గోరికను గోరుచున్నాడనియు ఆసభికులకు విన్నవించెను. 28 వ తేదీన కామన్సు సభలో ఇండియా కార్యదర్శి యెమరీ కొంచెమించుమించుగా నామాటలనే నేకరువుబెట్టెను. మహాత్ముడు బ్రిటిషు పార్లమెంటుసభలలోని ప్రసంగములనుగూర్చి వెంటనే వ్యాఖ్యానించుచు బ్రిటిషు గవర్నమెంటువారికప్పటికినిగల భావముల కచ్చెరువొంది, కాంగ్రెసు క్విటు ఇండియా తీర్మానమును చేయుటలో త్వరపాటేమియు జరుగలేదని తనకిప్పుడు స్పష్టమయ్యెననియు, మరియు దేశములోని ఆర్థిక దురవస్థను బోగొట్టుటకు తక్షణజాతీయ ప్రభుత్వ మవసర మనియు, బాహాటముగా జాటెను.

137. మహాత్ముడు తాను జిన్నాకు నిర్బంధముననుండి 1943 మేనెల 8 వ తేదీన వ్రాసిన యుత్తరమును, తాను విడుదలైనవెనుక, 1944 మే 18 వ తేదీన

బయలుపెట్టుటచే ముస్లింలీగువారు జూలై 29 వ తేదీన సమావేశమై, జిన్నాకు, మహాత్మునితో సంప్రదించుట కనుజ్ఞనిచ్చిరి. అందువలన జిన్నా ఆగష్టు 5 వ తేదీన లాహోరులో పత్రికా ప్రతినిధులతో ప్రసంగించుచు, దేశములోని యన్ని వర్గముల వారికిని స్వాతంత్ర్యమును సమకూర్చుటయే ముస్లింలీగు యాదర్శమనియు, తాను మహాత్ముని కొద్దిరోజులలో గలిసికొన నుద్యమించితిననియు, కాని మూడవ పార్టీ యగు బ్రిటిషు గవర్నమెంటు తమ ఇరువురినడుమ స్వార్థముతో కుయత్నములు సలుప వచ్చుననియు తెలిపెను. ఆ తరువాత జిన్నా బొంబాయిబోయి, 17 వ తేదీన మహాత్మునికొక తంతినిచ్చుచు, అందు తానప్పుడు జ్వరపీడితు డగుటచే, మున్ను నిర్ణయించిన 19 వ తేదీన తానాయనను గలిసికొనజాలనని తెలియజేసెను. 20 వ తేదీన మరియొక టెలిగ్రామునిచ్చుచు, సెప్టెంబరు 7వ తేదీ వీలగునా యని ప్రశ్నించి, తుదకు మహాత్ముని వీలునుబట్టి 9 వ తేదీని నిర్ణయించెను. ఆ ప్రకారము మహాత్ము డాదినమున తన సేవాగ్రామమునుండి ప్యారీలాలుతో గలిసి, బొంబాయిబోయి ఆ సాయంత్రము 3 గంటల 55 నిముషములకు సరిగా జిన్నా గృహమున కరిగి, ఆ రాత్రి 7 గంటలవరకు సమాలోచనలు జరిపెను. మరునాడు రంజాను పండుగ యగుటచే సమావేశమేర్పడలేదు. 11 వ తేదీన తిరిగి ప్రసంగము లారంభమయ్యెను. ఇంతలో నీ సంగతిని విన్న బ్రిటిషుమంత్రులలో నొకరుగానున్న క్రిప్సు ఈర్ష్యా పూరితుడై కడుపుబ్బరముచే తబ్బిబ్బుజెంది యా దినముననే నొక యమెరికను పత్రికా ప్రతినిధితో ప్రసంగించు నెపమును గల్పించుకొని, ఇండియాలో మెజారిటీ రాజకీయ పార్టీలగు కాంగ్రెసు, ముస్లిములీగు పార్టీనాయకు లిద్దరు సంప్రదించుకొని యొక యొడంబడికకు వచ్చినను, దేశములోని మిగిలిన పెక్కు మైనారిటీ రాజకీయపార్టీలను గూడ బ్రిటిషుప్రభుత్వము తృప్తిపరుపవలసియున్నదని, తన మొండిచేతిని బైట బెట్టెను. అయినను మహాత్ముడు ఆ నెల 25 వ తేదీవరకు, మధ్యమధ్య కొన్ని నాగాలతో, జిన్నాతో సంప్రదింపులు జరిపి విఫల మనోరథుడయ్యెను. కారణ మేమనగా : జిన్నా భారతీయ పౌరులలో క్షీరోదక న్యాయమున దేశమునందంతటను హిందూ మహమ్మదీయులు కలిసి మెలసి నివసించుచున్నను, వారలిద్దరు ప్రత్యేక జాతులకు జెందినవారనియు, కావున వారికి ప్రత్యేక రాజ్యము లుండవలయుననియు వాదించి మొండిపట్టు బట్టియుండుటచే, నట్లు కలగాపులగముగా గలిసి నివశించుచున్న మహమ్మదీయు లందరికిని ఒక్కరినైనను విడువకుండ ప్రత్యేకరాజ్యభాగమును విడగొట్టదలచుట యసాధ్యమను మాట యటుండగా, వారిరువురకును గల మతభేదములు వ్యక్తిగతములనియు, అందరకును సమానముగా సంబంధించిన ఆర్థికాది పౌర

హక్కునుగూర్చిన రాజకీయవిషయములలో నా వ్యక్తి భేదములను బురస్కరించుకొని దేశమును విభజించజూచుట యర్థరహితమనియు, మహాత్ముఁడెంత గొంతుచించుకొని బోధించినను జిన్నా, తాను బట్టిన కుందేలుకు మూడేకాళ్ళని వాదించుట మానకుండెను. అంతేగాక జిన్నాసూచించిన పాకిస్తాను రాష్ట్రములలో రాజాజీ ప్రణాళికలో దెలిపినట్లు అందలి పౌరులందరి యభిప్రాయములను దెలిసికొనుటకు జిన్నా యిచ్ఛగించలేదు.

---

## ఇ రు వ ది తొ మ్మి ద వ ప్ర క ర ణ ము

# వేవెలుతో వ్యవహారము

## 1944 — 1945

138. మహాత్ముఁడు జిన్నాతో సంభాషణలను జరుపుటకు బూర్వమే తాను ఆవరకు జూలై 2 వ తేదీనుండియుండిన 'పంచగని'నుండి పూనాకు ఆగస్టు (1944) మొదటి తేదీన జేరియుండి మరుదినము ఆగాఖాను భవన యావరణలోఁగల దేశాయి, కస్తూరిబాయిగారల సమాధులను మరల దర్శించి వార్ధాకు బోవుచు పూనాలో లండనులోని 'డైలీ వర్కరు' పత్రికయొక్క ఇండియా విలేఖరితో బ్రసంగించుచు భారతదేశ మాసమయమున ననుభవించుచున్న దుర్భర ప్రభుత్వమును మున్నెన్నఁడనుభవించియుండి యుండలేదని దేశములోని యన్ని పార్టీలవారును ఏకగ్రీవముగా నొప్పుకొనుచున్నట్టు దెలియబరచెను. వార్ధానుండి 3 వ తేదీన ఉదయము మహాత్ముఁడు తన కొరకై ప్రత్యేకముగా నలంకరింపబడిన యొక పల్లెటూరి యెద్దులబండిపై నెక్కి వాలంటీరు దళము లిరుప్రక్కల బారులుదీరి నడచుచుండ 9 గంటలకే తన సేవాగ్రామముచేరి యక్కడ బావురుమనుచున్న కస్తూరిబాయి కుటీరమును దిలకించి దుఃఖాతిరేకముచే స్తబ్ధుఁడయ్యెను. ఆ నెల 9 వ తేదీని దేశనాయకుల యన్యాయపు నిర్బంధ నిరసన దివసముగ దేశములో జరుపదలచిన వారలకు మహాత్ముఁడు 5వ తేదీన సలహానిచ్చుచు తాను కాంగ్రెసు మానసమును యెల్లప్పుడును ప్రతిఫలించు వాఁడను గానినియు, కాంగ్రెసు కార్యవర్గము మాత్రమే కాంగ్రెసుయొక్క మానసమును యథార్థముగను, న్యాయముగను వ్యక్తీకరించుటకు హక్కును గలిగియున్నదనియు, అయినను, ఆ కార్యవర్గమప్పుడు బందీకృతమై యుండుటచే, తాను ఆ కార్యవర్గము తరఫున రెండు సంగతులను మాత్రము చెప్పనిశ్చయించితిననియు, అవి: (1) ఆ సంవత్సరము ఆగష్టు 9 వ తేదీన జరుపదలచిన ప్రజా ప్రదర్శనములను సర్కారువారెక్కడనైనను నిరోధించినయెడల, వారి యాజ్ఞల నుల్లంఘించగూడదనియు, (2) ఆగష్టు అల్లరుల సందర్భమున 1942 నుండియు పోలీసువారలకు జిక్కకుండ దాగియున్నవారు ధైర్యముతో బయటికివచ్చి పోలీసులకు తమంతట తామే రిపోర్టు చేసికొనవలయుననియు, దెలుపుచు స్టేటుమెంటు నొకదానిని బ్రకటించెను. 8 వ తేదీన గొందరు పత్రికావిలేఖరులు ఆగష్టుతీర్మానములోని 'సివిలుడిజొబిడియన్సు' విరమించుకొనబడినదా అని అడుగగా మహాత్ముఁడది అనగా ప్రభుత్వశాసన ధిక్కారము ప్రజాస్వామ్యముకాని, ప్రతిప్రభుత్వములోని ప్రజలకు సార్వజనీనమైనట్టి, శాశ్వతమైనట్టి

సాక్ష్యమనియు, అది అట్టి ప్రభుత్వమువారు కోరునపుడే, అనగా వారి ప్రజా వ్యతిరేకచర్యలవలననే యేర్పడుననియు స్పష్టముగా దెలియబరచెను.

139. మహాత్ముడు నిర్బంధము నుండి ఆ సంవత్సరము (1944) మే నెలలో విడుదలైన వెనుక జూలై నెలలో వైస్రాయి వేవెలుతో ఉత్తర ప్రత్యుత్తరములను జరిపెను. వాటిని గవర్నమెంటువారు ఆగష్టు 18 వ తేదీన ప్రచురించిరి. గవర్న మెంటు వారు జయకరుద్వారాను, ఆంగ్లేయ పత్రికా ప్రతినిధులద్వారాను తనకు దెలిపిన వారి కోరికలపై మహాత్ముడు జూలై 15 వ తేదీన వైస్రాయి కొక లేఖ వ్రాయుచు తనకు జైలులోనున్న కాంగ్రెసు కార్యవర్గముతో సంప్రదించుటకు గాని లేక వైస్రాయితో స్వయముగా ముచ్చటించుటకు గాని యవకాశమిక్వవలసినదని తెలిపెను. అందుపై వేవెలు 22 వ తేదీన జవాబిచ్చుచు మహాత్ము డొక నిర్దిష్ట ప్రణాళికను ముందుగా బంపిన యెడల తానావిషయము నాలోచించెదననెను. అందుపై మహాత్ముడు 27 వ తేదీన తిరుగు జవాబిచ్చుచు వైస్రాయి కోరిన నిర్దిష్ట ప్రణాళికను బంపెను. అందు గవర్నమెంటు వారు భారతదేశము ప్రస్తుతమున సంపూర్ణ స్వాతంత్ర్యమున కర్హతను గలిగియున్నదని యొప్పుకొనుటకును అయినను యుద్ధము ఇంకను జరుగుచుండుటచే అందుకు గావలసిన మిలిటరీ ఆపరేషనులను యథావిధిగా నిర్వర్తించుకొనుచు ఆఖర్చును మాత్రము ఇండియాపై దుద్దకుండుటకును ఇతర పరిపాలనా విషయములలో సెంట్రలు యస్సెంబ్లీకి బాధ్యత వహించు తాత్కాలిక జాతీయ ప్రభుత్వమును నెలకొల్పుటకును అంగీకరించి ఆ ప్రకారము ఒక డిక్లరేషను జేసిన యెడల 1942 ఆగష్టు తీర్మానములోని శాసనోల్లంఘనమును విరమించు కొనునట్లును యుద్ధప్రయత్నములో పూర్తి సహకారమిచ్చునట్లును తాను కాంగ్రెసు వర్కింగు కమిటీకి సలహానిచ్చుటకు సంసిద్ధుడనై యుంటినని దెలిపెను. అందుపై వైస్రాయి ఆజవాబును లండనులోని బ్రిటిషు ప్రభుత్వము వారికిబంపి వారి యభిప్రాయమును దెలిసికొని మహాత్ముని ప్రతిపాదనలు అనంగీకారములనియు కాంగ్రెసునకును దేశము లోని ఇతర రాజకీయ మైనారిటీ వర్గములకును మధ్య యథార్థమైన భేదములు గల వనియు వాటిని ముందుగా సమన్వయించిననే గాని గవర్నమెంటు వారేమియు చేయు జాలరనియు కుంటి జవాబిచ్చెను. ఈ యుత్తర ప్రత్యుత్తరములన్నియు గవర్నమెంటు ఆగష్టు 18 వ తేదీన ప్రచురించుటచేత వెంటనే మహాత్ము డాదినముననే యీ ప్రచు రణపై వ్యాఖ్యానించుచు తాను వైస్రాయి గోరిన నిర్దిష్ట ప్రణాళికను బంపినను దాని నావలకు ద్రోసిపుచ్చి రాజకీయవర్గములలో భేదము గలదను యసందర్భపు విషయము నొక దానిని దెచ్చిపెట్టి దానిని గూర్చి ముచ్చటించుట జూడగా బ్రిటిషు

గవర్నమెంటు వారెంతమాత్రము తమ యుద్ధకార్యమునకు ప్రజల యిష్టాపూర్వకమైన సహాయమును గోరుటలేదనియు కావున ప్రజలు బలవంతముగ పరప్రభుత్వము నుండి యధికారమును లాగికొనుటకు తగిన నైతికబలమును పెంపొందించుకొను నంతవరకు ప్రభుత్వము వారు తమ యధికారమును వదలుకొనదలచనట్లు తనకు స్పష్టమగుచున్నట్లు దెలిపెను.

140. మహాత్ముడు జిన్నాతోడి సంభాషణలు సెప్టెంబరు 25 వ తేదీన ముగిసినవెనుక బొంబాయిలో ఆనెలాఖరువరకుండి అక్టోబరు మొదటి తేదీని వార్ధాకు వెళ్ళి వెంటనే మోటారుపై సేవాగ్రామము జేరెను. మరునా డచ్చట మహాత్ముని 76 వ జన్మదినపు పండుగ జరుపబడెను. ఆసందర్భమున పైదేశములలోని బెర్నార్డ్ షా, ఎడ్వర్డు బెనిసు, హరాల్డు లాక్సీ మొదలగు ప్రఖ్యాతపురుషులు ధన్యవాదసందేశముల నంపిరి. ఆదినమున కొలాంబోలో మాధవరావు అనే మాట్లాడుచు, మహాత్ముడు భారతదేశమును పరప్రభుత్వమునుండి విముక్తి నొందించుటకు మాత్రమేగాక మానవ జాతినంతను తరింపజేయుటకై గూడ జననమందెననియు, కావున ఆయనకు భారత స్వాతంత్ర్యము లక్ష్యముగాక సాధనముమాత్రమే యనియు ఆయన సత్యాగ్రహ యుద్ధము 'రఘువంశము'లో కాళిదాసు, అజరాజుపయోగించినట్టు దెలిపిన అహింసా రూపకమైన సమ్మోహనాస్త్రమువంటిదనియు, అట్టి సమ్మోహనాస్త్ర కాశలమున కెంత ఆత్మశక్తి యవసరమని దెలిపియుండెనో మహాత్ముని సత్యాగ్రహయుద్ధ కాశలము నకును అంత ఆత్మశక్తి యవసరమనియు దెలియబరచెను. మహాత్ముడు అప్పటికే కస్తూరిబాయి స్మారకార్థమై వసూలైయుండిన కోటిరూపాయలకు పైబడిన నిధి వినియోగమార్గములనుగూర్చి ఆరోజుననే కట్టుదిట్టములను జేసెను. తరువాత ఆనెల 27వ తేదీన బొంబాయిలో జరిగిన కాంగ్రెసు వర్కర్ల సమావేశమునకు మహాత్ముడు సందేశమంపుచు, నిర్మాణకార్యక్రమావశ్యకతనుగూర్చియు, కిసానులకును,భూఖామందులకును, కార్మికులకును పెట్టుబడిదారులకును, విద్యార్థులకును, కాంగ్రెసు వర్కర్లకును మధ్య నుండవలసిన సంబంధములనుగూర్చి విపులముగా దెలిపెను. నవంబరు 18వ తేదీన బీహారు కాంగ్రెశీయుల కొకసర్క్యులరు బంపుచు నందులో గవర్నమెంటు వారు కాంగ్రెసు నిర్మాణకార్యక్రమమున కడ్డుతగిలినప్పుడు మాత్రమే వారు శాసనోల్లంఘన మొనరింపదగునని సలహా నిచ్చెను. డిసెంబరు మొదటి తేదీన మహాత్ముడొక స్టేటుమెంటును బ్రకటించుచు, సామాన్యముగా నందరి యనుభవములోనూ ఉన్నట్టు, తానొకటిదలచిన దైవ మింకొకటిదలచెనన్న సామ్యము ననుసరించి తా నిటీవల సెన్నియోసాగులు తన ఆత్మపారిశుధ్యమునకై యుపవాస మొనరింప

ప్రయత్నించినను ఆప్రయత్నము కొనసాగక, అందుకుబదులుగా దినదినము యెడతెగని పని యేర్పడుటచే శరీరములో బహునీరస మేర్పడెననియు అందువలన తాను ఆనెల 4 వ తేదీ మొదలు నెలాఖరువరకు పూర్తి విశ్రాంతిని దీసికొనదలచితిననియు దెలియ బరిచెను.

141. కడచిన యాగష్టు నెలలో వైస్రాయి వేవెలు కాంగ్రెసుకును ముస్లింలీగు మొదలగు నితరరాజకీయవర్గములకును మధ్య యథార్థ భేదము లున్నవని మహాత్మునికి సాకుజెప్పి భారతరాజకీయ సంస్కరణములవిషయమై యేకీభావమును గలిగియుండుటను గమనించిన కేంద్రశాసనసభలోని యీ యిరువర్గములవారి నాయకు లైన బుల్లాభాయి దేశాయి, లియాకత్ ఆలీఖానుగార లేకమై దేశములో నేర్పడిన రాజకీయప్రతిష్ఠంభనమును తొలగింపదలచి, 1945 జనవరి మొదటి తేదీన నొక సంయుక్తప్రణాళికను దయారుజేయుటచే నద్దానిని బుల్లభాయి, మహాత్ముని కానెల 4 వ తేదీన గనుపరచి యాయన యామోదమును బొంది కొన్నిరోజు లైనవెనుక వేవెలున కందజేసెను. ఆప్రణాళికలోని విషయములు : వైస్రాయి కౌన్సిలును భారతీయు లతోగూడిన తాత్కాలిక జాతీయప్రభుత్వముగా మార్చుటయు, ఆప్రభుత్వములో జేరు కాంగ్రెసు, ముస్లింలీగు సభ్యులు సమానసంఖ్యాకులై యుండుటయు, ఆజాతీయ ప్రభుత్వము తన స్వంతబాధ్యతపై కాంగ్రెసు కార్యవర్గ సభ్యులను నిర్బంధములనుండి విడుదలజేయు నధికారమును గలిగియుండుటయు. ఈ సంయుక్త ప్రణాళికను లియ కత్ ఆలీఖాను జిన్నాకు దరువాత జూపినపుడు తనకు ముందుగా జూపలేదని కోప గించుకొనెను. మహాత్ముడు మార్చి 20 వ తేదీన బొంబాయిలో నొక పత్రికా విలే ఖరితో బ్రసంగించుచు కాంగ్రెసు వర్కింగు కమిటీ మెంబర్లు, తదితర ముఖ్యనాయ కులును నిర్బంధితులై యున్నంతకాలము భారత రాజకీయ ప్రతిష్ఠంభనమును బరిష్క రింపజేయు బ్రయత్నము లన్నియు నిరుపయోగములని స్పష్టపరచెను. అమరునాడే ఆసంగతినివిన్న లండనులోని బ్రిటిషు యధికారులు వేవెలును వెంటనే రమ్మని బిలు చుటచే ఆయనబోయి వారితో సంప్రదించి జూను మొదటివారములో తిరిగివచ్చి ఆనెల 14 వ తేదీన నొక ప్రకటన జేసెను. అందులో ముఖ్యముగా భారత రాజకీయ ప్రతిష్ఠంభనమును తొలగించుటకై యన్నివిషయములను సమగ్రముగా జర్చించుటకు గాను ఆనెల 25 వ తేదీన తనను సిమ్లాలో గలిసికొనవలసినదిగా కేంద్ర రాష్ట్రీ రాజ కీయజ్ఞుల గొందరి కాహ్వాన మంపదలచినట్లును, ఆకారణమున కాంగ్రెసు కార్యవర్గ సభ్యులను విడుదలజేయ నాజ్ఞలను బంపినట్లును దెలుపబడెను. ఆవిధముగా జరిగిన తరువాత ముస్లింలీగు నాయకుడగు జిన్నాతోబాటు కాంగ్రెసు నాయకుడుగ

సాహ్వానింపబడిన మహాత్ముడు తనకట్టి యధికారములేదనియు అప్పటికే కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులతోబాటు విడుదలైన అజదు కాంగ్రెసు ప్రెసిడెంటై యుండుటచే నాయనను బిలువవలసినదనియు సూచించి, తాను వచ్చుటకు నిరాకరించెను. అందుపై వేవెలు అజదు సాహ్వానించి తనకు సలహా నిచ్చుటకై మహాత్ముని రమ్మని కోరెను. వైస్రాయి ప్రకటనలో పైవిషయములేగాక తన కార్యవర్గమును దేశములోని ముఖ్యరాజకీయపక్షముల ప్రతినిధులతో గూడినదిగా మార్చదలచినట్లును అందు చేర్చబడు సభికులు హిందూకులమునకు జెందినవారును, ముస్లిము కులమునకు జెందినవారును, సమానసంఖ్యాకులుగా నుందురనియు గూడ దెలుపబడుటచే మహాత్ముడు 17 వ తేదీన వేవెలు కొకలేఖ వ్రాయుచు ఆయన ప్రకటనలో దెలుపబడిన "హిందూకులమునకు జెందినవారు" అనుమాటను విస్పష్టము చేయుమనికోరి మరునాడాయనను స్వయముగా సందర్శించి, కేంద్రమున నిర్మింపబోవు తాత్కాలిక ప్రభుత్వమునుగూర్చియు శిమ్లాలో 25 వ తేదీన జరుగబోవు నాయకుల సమావేశమును గూర్చియు చర్చించెను. నిర్బంధమునుండి విడుదలైన కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు యథావిధిగా బొంబాయిలో జూను 21వ తేదీన సమావేశమై వైస్రాయి ప్రకటనను జర్చించి శిమ్లా కాన్ఫరెన్సుకు బోవుటకు అజదున కనుజ్ఞ నిచ్చిరి. మరియు నావర్కింగు కమిటీ సమావేశము 1942 ఆగస్టు 8 వ తేదీ తీర్మానమును పునర్విమర్శించి అందలి మొదటి భాగమగు సంపూర్ణ స్వరాజ్యాదర్శము నాలాగున నేయుంచి, రెండవ భాగమగు శాసనోల్లంఘనము అప్పటి స్థితిగతులనుబట్టి యనవసరమని తోచుటచే దానిని మాత్రము తొలగించెను. శిమ్లాకు ప్రత్యేక ఆహ్వానముపై బోయిన మహాత్ముడు అక్కడి కాన్ఫరెన్సుకు ముందురోజుననే వైస్రాయిని కాంగ్రెసు, లీగు ప్రెసిడెంట్లతోబాటు ప్రత్యేకముగా గలిసికొని సంప్రదించెను. ఆకాన్ఫరెన్సు ఆనెల 25 వ తేదీనుండి మధ్య మధ్య వాయిదాలతో జూలై 14 వరకు జరిగెను. ఈలోగా మహాత్ముడు జూలై 11వ తేదీన వైస్రాయిని మరియొకమాటు గలిసికొని శిమ్లాను విడిచి వెడలిపోయెను. ఆ కాన్ఫరెన్సులో జరిగిన చర్చలో జిన్నా ఒక విపరీత వాదనను దెచ్చెను. అది : వైస్రాయి కార్యనిర్వాహక సభలో ముస్లిము కులస్థులకై నిర్ణయింపబడిన సీట్లకు ముస్లింలీగుకు జెందినవారే యుండవలయు ననుట. అందుకు కాంగ్రెసంగీకరించనందున శిమ్లాకాన్ఫరెన్సు విఫలమయ్యెను. అవిఫలముపై మహాత్ముడు సేవాగ్రామము నుండి 19 వ తేదీన వ్యాఖ్యానించుచు యందుకై నగవబని లేదనియు, నిర్మాణ కార్యక్రమమును కాంగ్రెసు కొనసాగించవలెననియు సలహానిచ్చెను. బుల్లభాయి, లియాకత్ అలీ గారలు కలిసిచేసుకొన్న కాంగ్రెసు-ముస్లింలీగు సమాన సభ్యత్వ ప్రణాళికను వేవెలు లండనుకు దీసికొనిపోయి దానినిహిందూ మహమ్మదీయ మతస్థుల సమాన సభ్యత్వ

ప్రణాళికగా మార్చుటయేగాక శిమ్లా కాన్ఫరెన్సులో హిందూపదమటులనే యుంచి మహమ్మదీయ పదమునకు మాత్రము ముస్లింలీగు అనియే యర్థమిచ్చునట్లు జేయు ప్రయత్నము జరిపించుట గమనింపదగిన విషయము. కాంగ్రెసు నొక ప్రత్యేక మత సంస్థగా నిరూపింపగోరిన కోరికయే దీనికి గారణము.

142. ఇంతలో ఆ 1945 జూలై నెలలోనే బ్రిటిషు పార్లమెంటుకు నూతన యెన్నికలేర్పడి లేబరుపార్టీ జయమందెను. అకస్మాత్తుగా ఆగస్టు 15 వ తేదీన జపాను యుద్ధ మంతరించెను. అందువలన లేబరు ప్రభుత్వము తమకు ఇండియా యెడల సానుభూతి గలదని ఆ ఆగస్టు 21 వ తేదీన బ్రకటించి, ఇండియా రాజ్యాంగమార్పు విషయమై యాలోచించుటకు వైస్రాయిని లండనుకు బిలిపించుకొనిరి. ఆయన సెప్టెంబరు 19 వ తేదీన ఇండియాకు దిరిగివచ్చి వెంటనే యొక ప్రకటనను జేసెను. అందు ఇండియాలోని శాసన సభలకు త్వరలో జరుపబోవు నూతన యెన్నికల యనంతరము వెనువెంటనే రాష్ట్రములలో తిరుగ బాధ్యతాయుత మంత్రిత్వ ప్రభుత్వములను నెలకొల్పుటకును, భారతనూతన రాజ్యాంగ విధానము నేర్పరచుటకై కంస్టిట్యూయంటు యసెంబ్లీ నొకదానిని నిర్మించుటకును, వైస్రాయియొక్క యెగ్జిక్యూటివు కౌన్సిలును తాత్కాలిక జాతీయ ప్రభుత్వముగా మార్చుటకును బ్రిటిషు ప్రభుత్వమువారు నిశ్చయించినట్లు తెలుపబడెను. మహాత్ముడా ప్రకటనపై నేమియు వ్యాఖ్యానించక తన పనిని దాను జేసికొనుచుండెను.

---

ము ప్ప ది వ ప్ర క ర ణ ము

# మహాత్ముని దేశసంచారము

## 1945 - 46

143. ఆ సంవత్సరము (1945) సెప్టెంబరు 14 వ తేదీన పూనాలో గూడిన కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశములో మహాత్ముడు మాటాడుచు, కాంగ్రెసీయులు రాబోవు కేంద్రరాష్ట్ర శాసనసభల యెన్నికలలో బాల్గొనవచ్చునని సలహానిచ్చెను. అక్టోబరు 8 వ తేదీన అలహాబాదునుండి తనకువచ్చిన యొక విలేఖరి లేఖకు సమాధానమిచ్చుచు, ఖాదీవస్త్రాలయములు అక్కడి వస్త్రముల గొనువారా వస్త్రముల ఖరీదులో గొంత స్వల్పభాగము నూలురూపమున నీయవలయునని విధించిన నిబంధనను సమర్థించెను. మహాత్ముడావరకు 1942 సంవత్సరమునుండి పదమూడు దేశభాషలను నేర్చుకొనుటకు ప్రక్రమించియుండుటచే నా 1946 యక్టోబరు నెలలో జరిగిన తన 77 వ జన్మదినోత్సవముసరికి వాటియన్నిటిలో వ్రాయుటకును, చదువుటకును తగిన చతురతను సంపాదించెను. ఆ అక్టోబరు 19 వ తేదీన మహాత్ముడు తన యధ్వర్యమున నే ఆవరకు పూర్వము సేవా గ్రామములో జరుపబడిన డాక్టరు తెండూల్కరు వివాహమునుగూర్చి పత్రికలలో బ్రకటింపబడిన హేళనపూర్వకమైన యబద్ధపు వ్రాతలను ఖండించుచు, నా డాక్టరు తనకు వ్రాసిన యుత్తరములోని నిజస్థితిలో నేకీభవించుచు దానిని బ్రచురించెను. అందు పత్రికలలో బ్రకటింపబడినట్లు వివాహమైనను భార్యతో గలయికను మహాత్ముడు నిషేధించుట జరుగలేదనియు, ఆయన అప్పుడు చెప్పినదంతయు భార్యాభర్తలు కేవల కామసౌఖ్యముతో గాలముగడుపక, దేశసేవ జేయవలయుననుటమాత్రమే ననియు ఆ యుత్తరములో దెలుపబడెను. ఆనెల 27 వ తేదీన మహాత్ముడు వేరొక విలేఖరి ప్రశ్నలకు జవాబిచ్చుచు, 1942 ఆగస్టు తీర్మానము ననుసరించి తానే 'సివిల్ డిజోబిడియన్సును' మొదలుపెట్టవలసి యుండుటచేతను, తానాప్రకారము మొదలుపెట్టి యుండనందునను, అప్పటి యల్లరులకు కాంగ్రెసెంతమాత్రము బాధ్యురాలుగాదనియు; రాజాజీ యొక్క పాకీస్తాను ప్రణాళికను దానునమ్మి యంగీకరించి, అనగా ఆ ప్రణాళికను తనదిగా జేసికొని, జిన్నాతో సంప్రదింపులు జరిపి, వ్యర్థతను బొందినందున, ఆ వ్యర్థతకు రాజాజీని బాధ్యునిజేసి ఆయనను తూలనాడుట తగనిపనియనియు తెలిపెను. 29 వ తేదీన ఆవరకు బర్మాలో పట్టుబడి విచారణకు దేబడిన నేతాజీ సుభాసు యొక్క ఇండియను సేనలు ఆర్మీ ఆఫీసరులయెడల గనికరమును జూపవలసినదని వైస్రాయికి రెండుజాబులను వ్రాసెను.

144. మహాత్ముడావిధముగా ఉత్తరప్రత్యుత్తరములను జరపుచు మూడు నెలలు పూనాలో జలచికిత్సాలయములో గడిపి నవంబరు 21వ తేదీన మరల స్వగ్రామ మగు సేవాగ్రామము చేరెను. మొదట పూనాకు బోయినపుడాయన తూనిక 107 పౌనులుండెను. పూనాను వదలు నప్పటికి 113½ పౌనులయ్యెను. సేవాగ్రామములో నామరునాడు అక్కడి సమగ్ర గ్రామసేవా విద్యాలయములోని 61 మంది విద్యార్థుల నుద్దేశించి 25 నిముషము లుపన్యాసమిచ్చి వారచ్చట నేర్చుకొను విద్యవలన గవర్న మెంటు వారి కళాశాలలలో విద్య నేర్చుకొను విద్యార్థులవలె గొప్ప వేతనముల నార్జించు యుద్యోగములను బొందుట కర్హులు గాకున్నను, స్వరాజ్యసాధనకై సత్య, యహింస లను వహించి అట్టి మానసిక స్థితి తోడనే ఖద్దరు వడకు నిష్ట నవలంబించి స్వార్థ త్యాగులై గ్రామ గ్రామములకు బోయి యందలి సామాన్య జనులతో గలిసి వారికి తమ యెడల నమ్మకమును ప్రేమపూర్వకముగా నార్జించుకొనవలెనని యుద్బోధించెను.

145. ఆ 1945 సంవత్సరము డిసెంబరు మొదటి తేదీన మహాత్ముడు కల కత్తాకేగి, యక్కడి క్షామపీడితుల దురవస్థనుగూర్చి బెంగాలు గవర్నరుతో మూడవ తేదీన నొక గంటన్నరకుపైగా బ్రసంగించి యారాత్రి 9 గంటలకు 'సోదేపూరు' ఆశ్రమము జేరి యచ్చటకు దనను జూచుటకై వచ్చి, తనసంతకము నపేక్షించినవారి వద్దనుండి అయిదేసి రూప్యముల జొప్పున తన హరిజనఫండుకై వసూలుజేసెను. తిరిగి బెంగాలు గవర్నరును 4 వ తేదీన గలిసికొనెను. 10 వ తేదిన తనను గలిసికొనుటకై ప్రత్యేకముగా ఢిల్లీనుండి కలకత్తాకే తెంచిన వైస్రాయి వేవెలు నా సాయంత్రము ఆరున్నరగంటలకు గలిసికొని 50 నిముషములు మాట్లాడి ఆ గవర్న మెంటు హౌసులో నున్న ఇతరయధికారులనుగూడ బలుకరించి రాత్రి 8 గంటల 48 నిముషములకు బయ టికివచ్చి యచ్చటగుమిగూడి తనను ముందుకుబోకుండ నభిమానముతో గందరగోళము చేయుచుండిన ప్రతీక్షకుల నుద్దేశించి భారతదేశ ప్రత్యేక మహాదాదర్శమైన శాంతిని విడనాడగూడదని బోధించి, క్రమశిక్షితులై బారులుదీరి గందరగోళములేక యుండ వలెనని మందలించి, కాలినడక నాదట్టమైన గుంపుగుండ దారిచేసికొని గొంతదూరము సాగిపోవలసివచ్చెను. 'సోదేపూరు' ఆశ్రమములో బసజేసిన మహాత్ముడు ఆ నెల 15 వ తేదీన నక్కడి తేనెపట్టు తోటలో షికారు జేయుచుండగా నాలుగడుగుల పొడవు గల నల్లత్రాచొకటి పడగవిప్పి మహాత్ముని కెదురుగా నాగి, యాయనను నిక్కించి చూచుచుండెను. దానిని గమనించిన, వెంటనున్న డాక్టరు సుశీలానయరావిషయ మును మహాత్మునకు దెలుపగా ఆయన నవ్వుచూ దానిని తనదారిని బోనివ్వుమని చెప్పి తాను వెనుకకు మరలిపోయెను.

146. మహాత్ముడు మరియొకతూరి బెంగాలు గవర్నరు నొకగంట సేపు 22 వ తేదీన సాయంత్రము గలిసికొని రాత్రి 10 గంటలకు తిరిగి తన సోదేపూరు ఆశ్రమము జేరగనే తనను గార్డు ఆఫ్ ఆనరుతో సమీపించిన ఇండియను నేషనలు ఆర్మీకోరులోని 50 మంది సైనికుల నుద్దేశించి శ్రీమద్భగవద్గీతలో నుద్ఘోషించినట్లు ప్రతిమానవుడును ధృతివంతుడై యుండుటకు దప్పక బ్రయత్నింపవలయుననియు భగవంతునియొక్క దయపైతప్ప వేరెవరియొక్క దయపై నాధారపడరాదనియు వారికి బోధించెను. 24 వ తేదీ సోమవారము తన మౌనవ్రతదినమగుటచే నాదినమున ప్రార్థనానంతర మివ్వవలసిన సందేశమును కాగితముమీద వ్రాసియిచ్చి వేరొకనిచే జదివించెను. ఆసందేశములో నాదినమున బ్రార్థనలో బాడిన బైబిలు కీర్తనలోని "తండ్రినివిడిచి, దారితప్పి, చెడమార్గ మవలంబించి పశ్చాత్తప్తుడై తిరుగ తండ్రిని జేరిన" కథను విపులపరచి లోకములోని మతములన్నియు నా యాదర్శమునే బోధించుచున్నవనియు గావున పరమతద్వేషణ పనికిరాదనియు దెలియబరచెను.

147. మరి రెండు రోజుల తరువాత (26-12-45) మహాత్ముడు ఆ వరకు 1942 ఆగష్టు అల్లరుల సందర్భమున సర్కారు వారి యమానుష చర్యలకు గురియై యుండి తరువాత సైక్లోను వరదలచే క్షామబాధననుభవించుచుండిన మిడ్నపూరు జిల్లాలోని మహిషదళ పురమున కరిగి యక్కడి సాయం ప్రార్థన సమావేశమున కరుదెంచిన పెక్కుపల్లె గ్రామవాసుల శాంతియుత ప్రవర్తనకు సంతసించి దీవించి వారల యొద్దనుండి హరిజన ఫండుకై చిల్లరడబ్బులను వసూలుచేసి రు 613-9-3 లను సేకరించ గలిగెను. ఆ డిసెంబరు 28 వ తేదీన సింధురాష్ట్రములోని హైదరాబాదులో జరుగబోవు ఆల్ ఇండియా విమెన్సు కాన్ఫరెన్సు యొక్క 18 వ సమావేశమునకు రాజకుమారి అమృతకౌరు ద్వారా మహాత్ముడు సందేశమంపుచు, స్త్రీలు కాంగ్రెసు యొక్క నిర్మాణ కార్యక్రమమునందు ముఖ్యముగా ఖద్దరు నూలు వడకుటయందు శ్రద్ధవహించవలసినదిగా గోరెను. ఆదినముననే మహాత్ముడు మహిషదళపురములోని శిశుసదనమున తన నూతన వార్ధావిద్యావిధానమును బోధపరచి, ఆ విధానము సర్కారు విద్యాశాలలలో సాధారణముగ నట్టిచిన్న తరగతులలో నేర్పు అక్కరముల లెక్కల నేర్పరితనమునేగాక, యా చిన్ని విద్యార్థుల దైనందిక జీవితములో మంచిమార్పును గలిగించు శుచిత్వము క్రమ నడవడికను గూడ నలవడ జేయుననెను. 31 వ తేదీన 'కాంటాయి' నగరమునకు బోయి యచ్చట సాయంప్రార్థన సమయములో బ్రసంగించుచు గవర్నమెంటు వారు తాము భారతీయుల స్వాభావికపు స్వాతంత్ర్య కోరిక నణచుటచే వారిలో తద్వారా నిరాశచే జనించిన 'క్విటు ఇండియా నినాదమును

తత్సందర్భమున నుద్భవించిన ఆగస్టు అల్లరులను బాగుగా గుర్తించి భారతీయుల మానవ నైసర్గిక వాంఛను దీర్చుటకు బ్రయత్నించి వారితో సహకరించి యుండిన యెడల ఇండియా యొక్క ఇటీవలి చరిత్ర చాల భిన్నముగ నుండియుండెడిదని నుడివెను.

148. మహాత్ముడు 1946 జనవరి 5 వ తేదికి తిరిగి సోదేపూరు ఆశ్రమము చేరి కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమునుగూర్చి అగర్వాలాగారు ప్రచురించిన గ్రంథమున కుపోద్ఘాతము వ్రాయుచు, ఆ కార్యక్రమమునకు సంబంధించిన అష్టోత్తర దశ విషయములను విపులబరచి తాను తెలిపిన సత్యాగ్రహము వ్యష్టిదైనను, సమిష్టిదైనను, నిర్మాణకార్యక్రమ నిర్వహణమునకు సహకారియనియు, అదియే సాయుధ తిరుగుబాటుకు ఉత్తమమైన ప్రత్యామ్నాయమనియు విశదీకరించెను. ఆ పదునెనిమిది విషయములు యీ క్రింద పొందుపరుప బడినవి:—

1. సాంఘిక సామరస్యము
2. అస్పృశ్యతానివారణ
3. మద్యవస్తు నిషేధము
4. ఖద్దరు ఉత్పత్తి
5. ఇతరగ్రామ పరిశ్రమలు
6. గ్రామపారిశుద్ధ్యము
7. మూలవిద్యాభిషానము
8. వయోజన విద్య
9. స్త్రీజన సముద్ధరణ
10. ఆరోగ్యవిద్య
11. ప్రాంతీయభాషలు
12. జాతీయభాష
13. ఆర్థిక సమత్వ సదుపాయము
14. వ్యవసాయపు కూలీలు
15. కర్మాగారమందలి కూలీలు
16. అనాగరికులైన కొండజాతులు
17. చర్మవ్యాధిబాధితులు
18. విద్యార్థులు

తరువాత మహాత్ముడు అస్సాములో అయిదు దినములు సంచారముచేసి 15 వ తేదీన తిరిగివచ్చుచు గౌహాతీ, ధుబ్రీ నగరములమధ్య జేసిన స్టీమరు ప్రయాణములో దన వెంట వచ్చుచుండిన "యునైటెడు ప్రెసు ఆఫ్ ఇండియా" రిప్రజెంటెటివుతో మాటలాడుచు సందర్భవశమున దేశభక్త సుభాసు ప్రస్తావన వచ్చినందున, ఆయనకును తనకునుగల సంబంధ మెల్లప్పుడును అతిపవిత్రవంతమై యున్నదనియు ఆయన అత్యుత్తమ స్వార్థత్యాగశక్తి తనకావరకే బాగుగా బోధపడి యున్నను, ఆయన ప్రచ్ఛన్న వేషమున ఇండియాను వదలివెళ్ళిన వెనుకనే ఆయనయొక్క అసామాన్యమైన సమయస్ఫూర్తి, యోధత్వము, నిర్మాణకౌశలము తనకు మరింతవిస్ఫుటముగా తేటబడెననియు తెలియబరచెను. మహాత్ముడు జనవరి 17 వ తేదీన కలకత్తాలోని 'డండం' జైలును దర్శించి అందలి సెక్యూరిటీ ఖైదీలను గలిసికొని వారల నోదార్చెను.

149. తరువాత మహాత్ముడు దక్షిణభారత హిందీప్రచారసభ సిల్వరు జూబిలీ యుత్సవ సందర్భమున మద్రాసుకు స్పెషలు ట్రైనులో బోవుచు, దోవలో 20 వ తేదీన ఆంధ్రదేశములోని వాల్తేరులో గొంతసేపాగి, రైల్వేగ్రౌండ్సులో నచ్చట గుమిగూడిన 25 వేల ప్రజలనుద్దేశించి, శాంతి నిశ్శబ్దతలతో గూడిన క్రమ శిక్షణావశ్యకతనుగూర్చి ముచ్చటించి ముందు ప్రయాణములో రాజమండ్రి, ఏలూరు, విజయవాడ, చీరాల, నెల్లూరు మొదలగు స్టేషనులలో దూరదూరములనుండి పరిసర గ్రామవాసులు గుంపులు గుంపులుగ బయలుదేరి, తన దర్శన కుతూహలమున ఆయా స్టేషనులకువచ్చి, ప్లాటుఫారములపై జేరియున్న ఆంధ్రుల యనురాగమును తనివిదీర జూరగొని మరునాడు సాయంత్రము 4 గంటల 15 నిముషములకు మద్రాసు పుర జనులకు దెలియకుండ పదిమైళ్ళవెనుకనున్న అంబత్తూరను చిన్నస్టేషనులోదిగి స్థానిక కాంగ్రెసు నాయకుల స్వాగతమును స్వీకరించి, వారివెంట మోటారులోబోయి, మాంబలములో నిర్మింపబడిన హిందూస్తాన్ నగరమున బసజేసెను. 24 వ తేదీ యుద యమున నొక ప్రత్యేకముగా నిర్మింపబడిన పందిరిలో నచ్చట కంస్ట్రక్టివు వర్కర్ల కాన్ఫరెన్సు నుపక్రమించుచు తన నా నగరమున గడచిన దినములను, తిరిగి యా యుదయమునను జూడవచ్చిన బ్రిటిషు పార్లమెంటరీ డెలిగేషనువారితో దాను సంప్రదించిన విషయమును వెల్లడించి, తాను భారతస్వరాజ్య సంపాదనకై ఇతర దేశీ యులపై ఆధారబడుటలేదనియు, స్వరాజ్యము ఇతరులవలన నీయబడు దానముగా దనియు, ప్రజలు స్వశక్తిచేతనే బొందదగినదనియు మరియు మనము బ్రిటిషు అధికారులను స్నేహపూర్వకముగానే మనదేశమును వదలి వెళ్ళుమని గోరుచుంటి మనియు, అందువలన ఇంగ్లండునకును ఇండియాకును మాత్రమేగాక ప్రపంచమున కునుగూడ క్షేమముచేకూరుననియు వక్కాణించెను.

150. మద్రాసులో మహాత్మునితో బ్రసంగించిన బ్రిటిషు ఎంపైరు పార్ల మెంటరీ డెలిగేషను భారతదేశమున కప్పుడువచ్చుటకు గారణమేమనగా: 1945 సెప్టెంబరు మాసములో లేబరుపార్టీ గవర్నమెంటు ఇండియాయెడల దమకుగల సానుభూతిని బ్రకటించినను, ఆప్రకటనపై మహాత్ముని ఉలుకుబలుకులేమియులేమిచే గొంతకాలముచేచి డిసెంబరు 4 వ తేదీన బ్రిటిషు కాబినెటు సమావేశమై 1946 జనవరి నెలలో పార్లమెంటులోని వివిధపార్టీల ప్రతినిధులతో గూడిన డెలిగేషను నొకదానిని ఇండియాకు బంప నుద్యమించినట్లు ప్రకటించిరి. ఆప్రకారం మేతెంచిన పదిమంది మెంబర్లతోగూడిన ఆ డెలిగేషను జనవరి 2 వ తేదీన లండనునుండి విమా నములపై బయలుదేరి దోవలో నొకచో నాగి, 5 వ తేదీన మధ్యాహ్నము కరాచిలో

దిగి ఆ సాయంత్రమే ఢిల్లీ చేరి అచ్చట మరునాడు పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రసంగించి, ఆమరునాడు వైస్రాయి భవనములో ముందుగా జిన్నాను కలిసికొని తరువాత నితర నాయకులతోగూడ సంప్రదించి 12 వ తేదీన లాహోరుకు బోయి అక్కడి నాయకులనుగూడ కలిసికొనిరి. తరువాత వారు వాయువ్యరాష్ట్రమున కేగి ఖాన్ అబ్దుల్ గఫరుఖానును సందర్శించి 16 వ తేదీని ఢిల్లీకి తిరుగ జేరిరి. 20 వ తేదీన వారిలో గొందరు బొంబాయికిని, మరికొందరు బెంగుళూరునకును జని అందరును 22 వ తేదీన మద్రాసుచేరి మహాత్ముని రెండుసార్లు దర్శించిరి. తరువాత ఆడెలిగేషను 26 వ తేదీన కలకత్తా కేగి, 29 వ తేదీన తాతానగరమున కరిగి, 31 వ తేదీన అలహాబాదు చేరి, ఫిబ్రవరి 4 వ తేదీన ఢిల్లీకి మరలివచ్చి 10 వ తారీఖున కరాచిలో విమానమెక్కి తమదేశమునకు మగిడిపోయిరి.

151. మహాత్ముడు మద్రాసులో 1946 జనవరి 26 వ తేదీని దక్షిణభారత హిందీ ప్రచారసభ జూబిలీయుత్సవములోను 29 వ తేదీన కాంగ్రెసు వర్కర్ల సమావేశములోను బాల్గొని యనేక ముఖ్య విషయములను గూర్చి ముచ్చటించి 30 వ తేదీన నయతాలిమి యను నూతన విద్యావిధాన బోధనాలయము యొక్క కాన్వొకేషను ఉపన్యాస మిచ్చుచు నిజమైన విద్యోద్దేశమగు జ్ఞానసంపాదన కేవల వాక్పఠన మూలముననే గాక చేతిపరిశ్రమ మూలముననుగూడ బొందదగినదని నిరూపించెను. తరువాత మహాత్ముడు దక్షిణమున "పళిని" మొదలగు గొన్ని ప్రదేశముల సందర్శించి వెంటనే తన సేవాగ్రామమును తిరిగి చేరుకొనెను. ఫిబ్రవరి 11 వ తేదీన వైస్రాయి అప్పుడు దేశములో ఆహారకొరత వలన గలుచుండిన దుర్భరదురవస్థ నిస్తరణను గూర్చి మహాత్ముని సలహా నర్థించి యాయన యొద్దకు దనయాంతరంగిక కార్యదర్శి నంపెను. మహాత్ముడు అప్పటి కేంద్రశాసన సభాసభ్యుల నుండి పార్టీ భేదములను పాటింపక వారిచే ఎన్నుకొనబడిన ప్రతినిధులతో గూడిన జాతీయప్రభుత్వమును నెలకొలిపి తద్వారా దేశములోని ఆహార క్లిష్టసమస్య నెదుర్కొనవలసినదని ఆయనకు సలహా నిచ్చి పనిచెను. 12 వ తేదీన ఆ వరకు 1942 ఆగష్టు అల్లరుల సందర్భమున పోలీసు వారికి దొరకకుండ దాగియుండి సుమారు మూడున్నర సంవత్సరములుగ ఆనేక కష్టములకు లోనై, కుషించిన శరీరముతో చింపిరి తలతో కన్నీరు మున్నీరుగా గార నేడ్చుచు ఎక్కడనుండియో నకస్మాత్తుగా వచ్చి తనకు సాగిలి మొక్కి పాదములను గట్టిగా బట్టుకొనిన, అరుణనుజూచి, కరుణతో తలనిమిరి వెన్నుపై దట్టి లేవదీసి దుఃఖము నాపుకొనలేక తన భుజముపై వ్రాలిన యామె నూరడించి "బేటీ నీ వింత కాలమెట్చుట నుంటివి" ని మహాత్ముడు గద్గదస్వరముతో బలుకరించెను. అప్పుడచ్చటి దృశ్యము వర్ణనాతీతము.

152. మహాత్ముఁడు ఫిబ్రవరి 17 వ తేదీన తన "హరిజన" పత్రికలో తన కావరకు "పళని"లో రైల్వేకార్మికులు సమర్పించి యుండిన వినతి పత్రములోని వారి పదునారు సమస్యలనుగూర్చి వ్యాఖ్యానించుచు అందులో ముఖ్యముగా ఆసమయమున అచ్చటి రైల్వేయధికారులు యుద్ధములో బాల్గొని తిరిగి వచ్చియుండిన సోల్జర్లు తమ జీతములకుతోఁడు ప్రత్యేక ప్రతిఫలమునుగూడ గోరికొనినందున వారికొరకై ఆవరకు రైల్వే యుద్యోగములలో నుండిన రైల్వేకార్మికులను తొలగించబూనిన ప్రభుత్వపు ప్రయత్నమును ఖండించుచు దేశసేవకై స్వార్థరాహిత్యులై తమ యశువులనైన నర్పింప గంకణము కట్టుకొనవలసియున్న సోల్జర్లు అట్టిప్రత్యేక ప్రతిఫలముకై పెనగు లాడుట పరమనీచమనియు, ఆవరకు ఉద్యోగములోనున్నవారు హంగామ నౌకర్లు అయినను వారియెడ తప్పేమియు లేకనే వారిని తమ ఉద్యోగములనుండి తొలగించుట పాపకార్యమనియు ప్రభుత్వమువారు నిరుద్యోగులైన పౌరుల నందరికిని ఏదో యొక వృత్తిని గల్పింపవలసిన బాధ్యతను గలిగియున్నారనియు దెలియబరచెను. మహాత్ముఁడానెల 24 వ తేదీన పూనాలోనుండగా అక్కడకు ఆగాఖాను, భోపాలు నవాబుగారలరుదెంచి యాయనతో తొంబది నిముషములకుపైగా కాంగ్రెసు లీగు సఖ్యతావశ్యకతనుగూర్చి రహస్య సమాలోచనలు జరిపిరి.

ముప్పదియొకటవ ప్రకరణము

# కాబినెటు మిషను
# 1946

153. లండనులో 1946 ఫిబ్రవరి నెలలో దిరిగిపోయిన పార్లమెంటరీ డెలిగేషను వారి సలహాపై ఆ నెల 19 వ తేదీన బ్రిటిషు గవర్నమెంటువారొక ప్రకటన జేయుచు, భారతదేశములో వైస్రాయితోను, జాతీయ నాయకులతోను, భారత రాజ్యాంగ సంస్కరణమునుగూర్చి మంతనంబుల జరుపుటకై కాబినెటుమంత్రులు ముగ్గురు త్వరలో బోనున్నారని తెలియబరచిరి. ఆ ప్రకారము ఇండియామంత్రి లార్డు పెథిక్ లారెన్సు, వాణిజ్యమంత్రి సర్ స్టాఫర్డు క్రిప్సు, నావికామంత్రి ఏ. వి. అలెగ్జాండరు గారలు బ్రిటిషు కాబినెటు మిషనను పేరుతో మార్చి 19 వ తేదీన లండనునుండి పయనమై మధ్యలో గొన్నిచోట్ల నాగి 23 వ తేదీన కరాచిలో దిగి మరునాడు ఢిల్లీకివెళ్ళి ముందుగా 25 వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రసంగించి తరువాత రెండురోజులలోను వైస్రాయియొక్క కౌంసిలు మెంబర్లతో రెండు సార్లు సంప్రదించి 28 వ తేదీన అక్కడ గూడిన రాష్ట్రగవర్నరుల సమావేశమును సంబోధించి అప్పుడు పూనాలోనున్న మహాత్మునితో మాటాడుటకై యాయనను ఢిల్లీకి 30 వ తేదీన బిలిపించుకొనిరి.

154. మహాత్ముడు ఢిల్లీలో మ్యునిసిపలు పాకీవాండ్ర గుడిసెలమధ్య నొక శుభ్రమైన హరిజనవాడలో బసజేసియుండుటచే క్రిప్సు ఆయన నక్కడ ఏప్రెలు మొదటితేదీన ముందుగా సందర్శించి, ఉభయకుశలోపరి, గంటన్నరసేపు సంభాషించి మహాత్ముని దనవెంటనిడుకొని మోటారుపై ఇండియామంత్రి విడిదికి దోడ్కొనిపోయెను. మహాత్ముడచ్చట వారితో తనను బ్రశ్నించిన "క్విటు ఇండియా" నినాదయంతరార్థమును గూర్చి ముచ్చటించి, పిమ్మట వైస్రాయి కోరుపై తన సదనమున కరిగెను. ఏప్రెలు 3 వ తేదీన బ్రిటిషు మంత్రులు ముగ్గురు వైస్రాయి భవనమున కాంగ్రెసు ప్రెసిడెంటు అజదుతోబాటు మహాత్మునితోగూడ సంప్రదింపులు జరిపిరి. ఆ ఏప్రెలు ఆరవతేదీ మొదలారంభించిన జాతీయవారస్మారకసందర్భమున మహాత్ముడు తానున్న హరిజనవాడలోనే సూత్రయజ్ఞము నారంభించెను. ఆయజ్ఞమునందు రెండువందలమంది కాంగ్రెసీయులు బాల్గొనిరి. వారిలో జవహరుగూడజేరి కనుల పండువుగ రాటముపై నూలు వడకుచుండెను. మహాత్ముడాదినమున ప్రార్థనానంతరమున బ్రసంగించుచు మొదట 1920 లో నేర్పడిన జాతీయవారము 1946 వరకు దేశమందంతట నప్పటినుంచి జరిగియుండిన స్వాతంత్ర్యసమరచరిత్రలో ప్రథమాధ్యాయ

మని పేర్కొనెను. అజాతీయు వారాంతమున 13వ తేదీన మహాత్ముడు మరల సాహారి జనవాడలోనే ప్రసంగించుచు ఆదినము 1919 సంవత్సరపు జలియనువాలాబాగు ఘోర దురంతములను జ్ఞప్తికి దెచ్చుచున్నదనియు ఆసందర్భముననే ఇండియాలో మొట్ట మొదట అహింసాపూర్వక సత్యాగ్రహోద్యమము జన్మించినదనియు, తత్సాధన మూలముననే ప్రజాసామాన్యములో ప్రబోధము కలిగెననియు అట్టి ప్రబోధమును సవ్యముగ నెదుర్కొనుటకు మారుగ, కొద్ది వేలమంది మాత్రమేగల పరదేశీయులు ప్రభువులై నలుబదికోట్ల భారతీయులను తమ కాళ్ళక్రింద నణగద్రొక్క ప్రయ త్నించి హింసాపూర్వకమైన పశుబలమును ప్రయోగించి విఫలులైరనియు, అయినను ఆసంగతుల నన్నిటిని దానిప్పుడు జ్ఞాపకపరచుటయొక్క యుద్దేశ్యము బ్రిటిషువారి యెడల ద్వేషమును బురిగొల్పుట గాదనియు అట్టి అహింసాపూర్వక సత్యాగ్రహ సాధన ప్రయోగముననే బ్రిటిషు ప్రభుత్వమువా రారోజున నెమ్మదిగా త్వరలో దమ్మువిడిచిపో ప్రయత్నించుచున్నారని దెలుపుటమాత్రమేననియు, ఆయుద్దేశము తోడనే కాబినెటుమంత్రు లీదేశమునకు పనిగట్టుకొని వచ్చిరనియు, వారి సదుద్దేశ్య ములను గురించి తన కెంతమాత్రము అనుమానములేదనియు తన యభిప్రాయమును వ్యక్తపరచెను.

155. కాబినెటు మిషనువారు ఢిల్లీలో గొందరు నాయకులతో బ్రసంగిం చిన పిమ్మట కాశ్మీరమునకుబోయి యక్కడ కతిపయ దివసములు సేదదీర్చికొని ఢిల్లీకి మరలివచ్చిరి. ఏప్రెలు 27వ తేదీన వారినాయకుడు ఇండియామంత్రి కాంగ్రెసు లీగు ప్రెసిడెంట్లకు ఒకే మోస్తరు ఉత్తరము వ్రాయుచు అందులో భారతరాజ్యాంగ మార్పులను గూర్చి కొన్ని సూచనలజేసి వాటిపై తమతమ యభిప్రాయములను దెలుప వలసినదిగా గోరెను. వారాప్రకార మొనరింపగా వారిచ్చిన యభిప్రాయములను విరళ ముగా దమతో గలిసి చర్చించుటకై ఇండియామంత్రి యాతరువాత ఆ ప్రెసిడెంట్ల కిద్దరికిని వేరొక లేఖవ్రాసి ఒక్కొక్కరు ముగ్గురు చొప్పున తమ యనుచరులను దోడ్కొని శిమ్లాకు రావలసినదిగా ఆహ్వానమంపెను. వారావిధమున మేనెల 5 మొదలు 8 వరకు శిమ్లాలో సమావేశమై బ్రిటిషు కాబినెటు మంత్రులతో దీర్ఘ చర్చలుజరిపి తుదకు యేకముఖమునకు రాలేకుండుటచే కాబినెటు మంత్రులా సమా వేశమును 12వ తేదీన ముగించి ఢిల్లీకి తరలివచ్చి ఆ మేనెల 16వ తేదీన తమ స్వంతబాధ్యతమీద భారతరాజ్యాంగ సంస్కరణ పథకము నొకదానిని దయారు చేసి ప్రకటించిరి. అందు తాము దేశమును రెండుగా విభజించుట సరియైన మార్గము కాదని దృఢముగా నమ్మియుండుటచేత దేశమున కంతకును ఒకే కేంద్ర ప్రభుత్వము

నుపపాదించిరి. మరియు, అన్ని రాష్ట్ర శాసన సభలవలన నెన్నుకొనబడిన ప్రతినిధులతో గూడిన యేకైక కన్స్టిట్యూయంటు యస్సెంబ్లీని నిర్మించుటకే నిర్ణయించిరి. అయినను ఆ మంత్రులు జిన్నాను తృప్తిపరుప గోరి యేకైక భారత దేశములో మహమ్మదీయు లెక్కువగా నివసించి యుండిన తూర్పు, పశ్చిమ రాష్ట్రములను రెండు ప్రత్యేక గ్రూపుల క్రిందను మిగిలిన రాష్ట్రముల నన్నిటిని మూడవగ్రూపుకిందను జేర్చి మూడు గ్రూపులేర్పరచి, ఆయాగ్రూపులలోగూడ అవసరమైనచో గ్రూపుశాసననిర్మాణ సభలనుగూడ నిర్మించుకొను నవకాశ మిచ్చిరి. అందువలన రెండు గ్రూపులలో జేర్చబడిన పంజాబు, వాయువ్య, సింధు, బ్రిటిషు బెలూచిస్థాను, రాష్ట్రములకును, బెంగాలు, అస్సాము రాష్ట్రములకును, సంబంధించిన రెండుగ్రూపుల శాసననిర్మాణ సభలలోను ముస్లిము లెక్కువ సంఖ్యాకులుగ నుండగలుగుటచే, ఆరాష్ట్రముల పరిపాలన ముస్లింలీగు అధికారమున నుండును. కాని, అప్పటికింకను అమలులోనున్న 1935 సంవత్సరపు ఇండియా చట్టమనుసరించి రాష్ట్రములకు తమతమ ప్రత్యేక రాజ్యాంగ నిర్మాణ విషయమున స్వాతంత్ర్యముండుటచే దానిని తప్పించుటకు వీలులేక యేరాష్ట్రమైనను తన ఇష్టానిష్టమునుబట్టియే యేగ్రూపులోనైనను జేరుటకుగాని చేరకుండుటకుగాని నిర్ణయించుకొను నధికారమును గలిగినదని ఆ పథకముయొక్క 15 వ పేరాలో స్పష్టముగా ఒప్పుకొనబడినది. అయినను దాని కసందర్భముగ, 19 వ పేరాలో రాష్ట్రములు తమకు ఆ పథకములో నిర్ణయించిన గ్రూపులలో తప్పక ముందుగా జేరి, అనగా, ఆ పథకము ననుసరించి మొదట ఏకైక కంస్టిట్యూయంటు యసెంబ్లీకి వివిధరాష్ట్ర శాసనసభలవలన నెన్నుకొనబడిన ప్రతినిధులే వారివారి ప్రత్యేక రాష్ట్రములకుసంబంధించిన ప్రతినిధులు తమతమరాష్ట్రములకు నిర్ణయింపబడినప్రత్యేక గ్రూపులుగా ముందుగా సమావేశమై తమగ్రూపులకు ప్రత్యేక శాసననిర్మాణసభ అవసరమా, అనవసరమా యని నిర్ణయించుకొనవచ్చునని తెలుపబడెను. ఈ అసందర్భమును తేల్చుకొనకనే కాంగ్రెసు వర్కింగుకమిటీ ముందుగల 15వ పేరా కనుగుణముగాతరువాత 19 వ పేరాను అన్వయించుకొనవలెననియు రాష్ట్రములు తమకు నిర్ణయింపబడిన గ్రూపులలో జేరుటకు ముందుగనే తమ సమ్మతిని గాని అసమ్మతిని గాని వెలిబుచ్చవచ్చుననియు నిశ్చయించుకొని మహాత్ముని సలహాపై మేనెల 20 వ తేదీన సమావేశము కొదలచి బ్రిటిషు మంత్రి వర్గమువారి పథకము నామోదించవలెనని ముందుగా తమలో తాము అనుకొనిరి. ఇంక, ముస్లింలీగు జూను 6 వ తేదీన సమావేశమై కాబినెటు మిషనువారి పథకములోని 19 వ పేరాకు ప్రాముఖ్యత నిచ్చి ఆ ప్రకారము రాష్ట్రములు తమకాపథకములో నిర్ణయింపబడిన గ్రూపులలో మొదట చేర

వలసి యుండునను సూచన కంగీకరించి ఆ పథకమును పూర్తిగా సామోదించెను. ఈ భేదమును స్పష్టముగా గ్రహించుటకు తూర్పు గ్రూపును దీసికొందము. అందు బెంగాలు అస్సాము రాష్ట్రములు గలవు. ఆగ్రూపులో పెద్దదైన మహమ్మదీయు లెక్కువగనున్న బెంగాలు ప్రతినిధు లెక్కువగను చిన్నదై హిందువు లెక్కువగనున్న అస్సాము ప్రతినిధులు తక్కువగను ఉందురు. మరియు బెంగాలుకు నిర్ణయింపబడిన ప్రతినిధులలో ఎక్కుండ్రు మహమ్మదీయులగుటయే గాక గ్రూపుమొత్తము మీద గూడ రెండు రాష్ట్రములు కలిపినచో వారే మెజారిటీగా నుందురు. కావున 15 వ పేరా ప్రకారము అస్సాము ఆ గ్రూపులో చేరదలచుకొనని యెడల తన రాష్ట్రములో తన ప్రజాభిప్రాయము ననుసరించియే తన రాజ్యాంగ ప్రణాళిక నేర్పరచుకొనవచ్చును. కాని 19 వ పేరా ననుసరించి ముందుగా గ్రూపులో జేరవలసియున్న యెడల అస్సాము రాష్ట్ర రాజ్యప్రణాళిక అందలి ప్రజల యిష్టము ననుసరించి గాక ఆగ్రూపులో మెజారిటీగా నున్న బెంగాలు మహమ్మదీయ ప్రతినిధుల యిష్టము ననుసరించి గ్రూపు శాసనసభా నిర్ణయమును బట్టి ఏర్పడవలసియుండును. ఏరాష్ట్రమైనను ఆపై తమ గ్రూపు నుండి విడివడవచ్చు నను అవకాశ మా పథకములోనున్నను గ్రూపుకు సర్వాధికార మిచ్చుటచే అట్టుల విడివడుటకు వీలులేని రాష్ట్ర రాజ్యాంగ ప్రణాళికను ఆ గ్రూపు శాసనసభ విధించునేమోయని గూడ సందేహింప వచ్చును. ఇంతేగాక కాబినెటు మిషనువారు వేరొక మోసమునుగూడ జేసిరి. కాంగ్రెసు కమిటీ మే నెల 20 వ తేదీన కూడి తమ పథకమును పూర్తిగా ఆమోదించదలచి యుండిరని తెలిసికొని ఆవరకు తాము భారతదేశములోని 562 సంస్థానాధీశులతో మే నెల 12 వ తేదీననే రహస్యముగా జేసికొనిన ఒడంబడికను తమ 16 వ తేదీ పథకములో బెలియపర్చక దాచియుంచి ఆ 20వ తేదీ తరువాతనే అనగా కాంగ్రెసా పథకమును ఒప్పుకొన్నదని తెలిసినతర్వాతనే 22వ తేదీన ప్రచురించిరి. ఆ ఒడంబడికలో బ్రిటిషు ప్రభుత్వము ఇండియానుండి వెడలిపోవునపుడు ఆప్రభుత్వమునకు సంస్థానములపైగల సార్వభౌమత్వము, నూతన భారత ప్రభుత్వమునకుగాక ఆ సంస్థానములకే తిరిగి సంక్రమించి అవి స్వతంత్ర రాజ్యములగునని హామీ సూచించబడెను. అయినను కాంగ్రెసు కమిటీవారు ఆ ఒడంబడికలో పేర్కొనబడిన సంస్థాన స్వాతంత్ర్యము అచ్చటి ప్రజలకేగాని సంస్థానాధీశులకు గాదని అర్థముచేసుకొని మిన్నకుండిరి. ఇంక కాబినెటు పథకమును అమలులోబెట్టుటకు ఆపథకములోని 23వ పేరాలో నిర్ణయించినట్టు తాత్కాలిక జాతీయ ప్రభుత్వమునకై వైస్రాయి కార్యనిర్వాహకసభ సభ్యులందరు భారతీయులై యుండవలయును. ఆసభ్యులను నిర్ణయించు పనిని ఆమంత్రులు వైస్రాయికి వదలిపెట్టియుండుటచే ఆయన తన కార్యనిర్వాహక సభలో కాంగ్రెసు

సభ్యులును, ముస్లింలీగు సభ్యులును సమాన సంఖ్యాకులవారై యుండవలయు ననియు, కాంగ్రెసు సభ్యులలో మహమ్మదీయు లెవరును ఉండరాదనియు నిర్ణయించెను. కాంగ్రెసువారంత వరకును తమ మే 20 వ తేదీ నిశ్చితాభిప్రాయమును ప్రభుత్వము నకు తీర్మాన రూపముగా దెలిపియుండ నందున వారు జూను 25 వ తేదీన సమా వేశమై యావద్విషయములను పునర్విమర్శించి కార్యనిర్వాహక సభ్యత్వమును గూర్చి వైస్రాయిచేసిన నిర్ణయము తమ నంగీకార మగుటచే ఆభాగమును త్రోసిపుచ్చి మిగిలిన భాగమగు భారతరాజ్యాంగ నిర్మాణమునకై కంస్టిట్యూయంటు యస్సెంబ్లీ యేర్పా టును గూర్చిన భాగమును మాత్రము అంగీకరించినట్లు తీర్మానించి ఆ బ్రిటిషు మంత్రులకు దెలియబరచిరి. వారు ముగ్గురును తాము కల్పించిన భారతనాటక ప్రద ర్శనమును కన్నులార వీక్షించి, మరి మూడురోజులకు అనగా జూను 28 వ తేదీన లండనుకు దిరిగిపోయిరి.

156. వైస్రాయి నిర్ణయించిన ప్రకారము తన కార్యవర్గములో కాంగ్రెసు చేరుటకు నిరాకరించుటచే కాబినెటుమిషనువారి పథకములో ప్రధానముగా నియ మింపబడిన తాత్కాలిక జాతీయప్రభుత్వ మేర్పడువరకు వైస్రాయి తన తాబేదారు లైన ప్రభుత్వోద్యోగులతోనే కేరుటేకరు గవర్నమెంటు నొకదాని నేర్పరచు కొనెను. అయినను తాత్కాలిక జాతీయప్రభుత్వ విషయమున కాబినెటుమిషనువారి యామోదముపై వైస్రాయి చేసిన సూచనలో కాంగ్రెసు తరఫున మహమ్మదీయసభ్యు లెవరును ఉండరాదనుటచే ఆసూచన తమ కనుకూలముగ నుండుటవలన ముస్లింలీగు వారాభాగము నామోదించుచు దీర్మానించి వెంటనే కాంగ్రెసు సభికులు చేర కున్నను లీగుసభ్యులతో తాత్కాలిక ప్రభుత్వమును స్థాపింపుమని జిన్నా వైస్రాయిని బలవంతపెట్ట నారంభించెను. కాని వైస్రాయి కాబినెటు పథకములో జేర్కొన బడిన తాత్కాలిక జాతీయప్రభుత్వము ఆపథకములో నిర్దేశింపబడిన కంస్టిట్యూ యంటు యస్సెంబ్లీ కార్యనిర్వహణార్థమే గావలసియున్నందునను కావున నాప్రభు త్వములో దేశములోని ముఖ్య రాజకీయవర్గములగు కాంగ్రెసు, లీగు ప్రతినిధులుండుట యవసరమనియు, అదిలేనినాడు వైస్రాయి కార్యవర్గములో మార్పు అనవసరమనియు దెలియబరచెను. అందుకు జిన్నా కుపితుడై జూలై 29 వ తేదీన ముస్లింలీగు కౌన్సిలును సమావేశపరచి లీగావరకు జూను 6 వ తేదిన ఆమోదించియుండిన కాబినెటుపథకమును గూర్చిన తీర్మానమును తరువాత నామోదించియుండిన వైస్రాయియొక్క తాత్కా లిక జాతీయప్రభుత్వ సభ్యుల నిర్ణయమును గూర్చిన తీర్మానమునుగూడ ఉపసంహ రించుకొనునట్లు చేసెను. అంతటితో నూరుకొనక మీదుమిక్కిలి కాబినెటుమిషను

వారికి తానిచ్చిన వాగ్దానమున విరుద్ధముగా దేశవిభజన సిద్ధాంతమును మరల లేవ దీసి యట్టి విభజనకై అహింసకు కట్టుబడని ప్రత్యక్షపోరాటమును దేశములో నా ఆగష్టు 16 వ తేదినుండి సాగించుటకుగూడ నా ముస్లింలీగు సమావేశములో తీర్మాన మొకటి చేయించెను.

157. అయినను లండనులోని బ్రిటిషు ప్రభుత్వము భారతదేశములోనప్పుడు ఆహారలోపమువలన గలుగుచుండిన దుర్భర స్థితిగతులకు భీతిజెంది వాటినెదుర్కొన లేక, ఆవరకు మహాత్ముడు వైస్రాయి అంతరంగిక కార్యదర్శికి ఫిబ్రవరి 11 వ తేదీన ఇచ్చియుండిన సలహాను జ్ఞప్తికిదెచ్చుకొని యెట్లయినను దేశములో బాధ్యతను వహించు జాతీయప్రభుత్వమును సత్వరమున స్థాపింపనిశ్చయించి, ముస్లింలీగు కాబినేటు పథకమును పూర్తిగా ఇటీవలనే నిరాకరించినందున, ఆ పథకమునకు మాత్రము విముఖులుగాని కాంగ్రెసును బతిమాలి, తాత్కాలిక ప్రభుత్వమును నెల కొల్పుటకు బిలువవలయునని వేవెలునకొజ్ఞనంపిరి. అందుపై వైస్రాయి అప్పటి కాంగ్రెసు ప్రెసిడెంటు హోదాలో నుండిన జవహరులాలునెహ్రూతో సంప్రదించ దలచి ఆనాడు వార్ధాలో మహాత్ముని సమక్షమున ఆగస్టు 8 వ తేదీన తిరిగి శాసనో ల్లంఘమున పునరుద్ధరించుటకై గూడిన కాంగ్రెసువర్కింగుకమిటీ సమావేశమందుండిన నెహ్రూ కొక లేఖవ్రాసి యచ్చటి జిల్లామేజస్ట్రేటు ద్వారా యాయన కందించెను. ఆలేఖలో వైస్రాయి, కాంగ్రెసువారే దేశములోని యితర రాజకీయ వర్గ ప్రతినిధు లను గూడ జేర్చుకొని, సంయుక్తజాతీయ ప్రభుత్వమును స్థాపించు బాధ్యతను వహింపవలసినదిగా బ్రిటిషు ప్రభుత్వమువారి యభిమతమయినట్టును అందుకై కాంగ్రెసు వారు నిర్ణయించు సభ్యుల పూర్తిజాబితాతో తనను గలిసికొనవలయుననియు కోర యుండెను. ఆహా! భీకరకేసరియెంతలో బిల్లియయ్యెను !! మహాత్ముని యహింసా మహిమయే దీనికి గారణము.

---

# ముప్పదిరెండవ ప్రకరణము

# తాత్కాలిక ప్రభుత్వ కాలము

## 1946

158. నెహ్రూ, శివాజి రామదాసును దర్శించినట్టు వెంటనే మహాత్ముని దర్శించి యాయన యాశీర్వాదమును బొంది ముందుగా జిన్నాను గలిసికొనుటకై బొంబాయికేగి యాయనను తాత్కాలిక ప్రభుత్వములో జేరుమని ప్రార్థించి విఫల మనోరథుడై ఢిల్లీకివెళ్ళి వైస్రాయిని ఆ ఆగస్టు 18 వ తేదీన సందర్శించి తన తాత్కాలిక ప్రభుత్వ సభ్యుల జాబితానిచ్చెను. ఆ జాబితాను వైస్రాయి బ్రిటీషు ప్రభుత్వము వారికిబంపి వారి అంగీకారమును బొందుటచే నెహ్రూ సెప్టెంబరు 2 వ తేదీన 14 గురు సభ్యవర్గముతోగూడిన తాత్కాలిక ప్రభుత్వమేర్పరచెను. ఆవర్గములో పన్నెండు సీట్లుమాత్రమే ముందుగా నింపబడి మిగిలిన రెండు ఖాళీగా నుంచబడెను. కారణ మేమనగా నెహ్రూ ఆ పదునాలుగు సీట్లలో నాలుగింటిని ఇతర రాజకీయ వర్గ ప్రతినిధులతో నింపి మిగిలిన పది సీట్లను కాంగ్రెసు లీగు ప్రతినిధులకు సమానముగా పంచిపెట్టి లీగు సభ్యులప్పుడు రాకుండుటచే వారి అయిదింటిలో మూటిని మహమ్మదీయ ప్రతినిధులతో టెంపొరరీగా నింపి మిగిలిన రెంటిని లీగు సభ్యులకై రిజర్వు చేసెను. ఆ సెప్టెంబరు 2 వ తేదీన ఢిల్లీలోనున్న మహాత్ముడాసాయంతనపు ప్రార్థనానంతరము ప్రసంగించుచు కాంగ్రెసు నాయకులట్లు బాధ్యతాయుత తాత్కాలిక ప్రభుత్వమను భారమును వహింప సమకట్టుటలో భారత సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనార్థమై భయంకర కంటకావృతమైన కిరీటమును తమ తలపై ధరింపబోవుచున్నారనియు, కావున అందరకును జెందునట్టి యా స్వాతంత్ర్య సంపాదనకై కాంగ్రెసుకు జెందనివారుగూడ నడుము గట్టుకొని కాంగ్రెసు యత్నమునకు సహాయపడుటకై స్వార్థత్యాగము జూపవలెననియు ప్రార్థించెను.

159. ఇంగ్లండులో చర్చిహిలు మొదలగు బ్రిటిషు కన్సర్వేటివుపార్టీ రాజనీతిజ్ఞుల యుద్దేశ్య మెట్టిదైయుండి నను అప్పటి లేబరుపార్టీ గవర్నమెంటు వారు మాత్రము యెప్పుడైనను సాధ్యమైనంత త్వరలో బ్రిటిషు ప్రభుత్వము భారత దేశమును విడువవలసియుండునని దృఢముగా నమ్మియుండిన వారగుటచేత ఆ వరకు ముస్లింలీగు జూలై 29 వ తేదిన చేసియుండిన తీర్మానము ననుసరించి జిన్నా దేశములో అప్పుడు జరుపుచుండిన ప్రత్యక్ష పోరాటోద్యమ సందర్భమున కలకత్తాలోను మరి ఇతర చోట్లను ఏర్పడిన భీకర రగడల మూలమున దేశములో శాంతిభద్రతలకు భంగము కలుగుచుండుటను గుర్తించియు వాటిని ఇదివరకువలె కఠినముగ అణచుటకు గావలసిన

నిర్బంధచర్యలను దీసికొను బాధ్యతను ఇంకను తాము వహించుట కిష్టములేకున్నను తామీ దేశములో నున్నంతకాలమైనను శాంతిని కొంత కాపాడదలచి జిన్నాను దువ్వి, యాయనసెట్లైన బాధ్యతాయుత తాత్కాలిక ప్రభుత్వములో జేర్పింపుమని వైస్రాయి కొన తిచ్చిరి. అందుపై వేవెలు జిన్నాను ఢిల్లీ కి ఆహ్వానించి ఆయనతో సంప్రదించగా ఆయన రెండు షరతుల నడిగెను అవి (1) ముస్లిములీగుకు జెందని మహమ్మదీయు డెవ్వడు ఆ తాత్కాలిక ప్రభుత్వములో నుండరాదు. (2) ఆ తాత్కాలిక ప్రభుత్వములోని సభ్యులకు సంయుక్తబాధ్యత యుండగూడదు. వేవెలాషరతులను మహాత్మునికి దెలిపెను. అనంతర మా సెప్టెంబరు మాసాంతమున ముస్లింలీగును కాంగ్రెసును సంధిగరుపదలచి మధ్యవర్తిత్వమును వహించిన భూపాలునవాబు మహాత్ముని దర్శించి సంభాషించి తదనంతరము జిన్నాను గలిసికొనెను.

160. జిన్నా వేవెలును అక్టోబరు 2 వ తేదీన మరల గలిసికొని మధ్యవర్తియైన భూపాలునవాబు కాంగ్రెసు తన కిచ్చవచ్చిన మహమ్మదీయ కాంగ్రెసేయుని తమతరఫున బ్రతినిధిగా జేర్కొనుట కధికారమును గలిగియున్నదని నిర్ధారించియుండుటచే తాను తన మొదటి షరతు నుపసంహరించుకొనినట్లు ఒప్పుకొనెను. అయినను అందుకు బ్రతిగ ముస్లింలీగుకూడ తన కిచ్చవచ్చిన హిందువును తమతరఫున ప్రతినిధిగా నెన్నుకొని పగదీర్చవచ్చునని లోలోన మురియుచుండెను. ఇంక రెండవవిషయమున ప్రభుత్వసభ్యుల సంయుక్తబాధ్యత అప్పటి కమలులో నుండియున్న 1935 సంవత్సరపు ఇండియా రాజ్యాంగ చట్టము ననుసరించి అసలే లేకుండుటచే దానినిగురించి పట్టుబట్ట నవసరములేదని గ్రహించి తనకోరిక ముందుగనే నెరవేరినందుకు సంతసించెను. కావున ముస్లింలీగు కార్యవర్గము ఆనెల 13 వ తేదీన ఢిల్లీలో సమావేశమై ముస్లిములీగు సభ్యులు తాత్కాలిక ప్రభుత్వములో జేరుటకు తీర్మానించుకొని ఆవిషయమును వైస్రాయికి దెలియబరచెను. ఆయన తాత్కాలిక ప్రభుత్వనాయకుడగు నెహ్రూకా తీర్మానమును వెంటనే దెలిపినందున దానిననుసరించి కాంగ్రెసు పార్లమెంటరీ సబుకమిటీ అమరునాథే మహాత్ముని గలిసికొని ఆముస్లింలీగు కార్యవర్గ తీర్మానము ననుసరించుట కాయన యామోదమును బొందెను. అంత 15 వ తేదీన వైస్రాయి కోరికపై జిన్నా తన ముస్లింలీగు సభ్యుల జాబితాను ఆయన కందజేసెను. ఆజాబితా వెంటనే ప్రచురింపబడెను. ఆజాబితాలో లీగుసభ్యుడు గానటువంటి హరిజనహిందువు పేరుండుటను మహాత్ముడు గమనించి, లీగు సదుద్దేశముతో ప్రభుత్వములో జేరుట లేదని తన భయమును వెలిబుచ్చెను. దీనికితోడు జిన్నా దేశవిభజనకై అనగా పాకీస్తాను స్థాపనకై అవర కారంభించిన ప్రత్యక్షపోరాటోద్యమమును విరమించుకొనక

ఇంకను ముఖ్యముగా బెంగాలులో అల్లరులను సాగించుచుండుటచే అక్కడి హిందూ మహమ్మదీయకలతలతో ముస్లింలీగు కాంగ్రెసుతో తాత్కాలిక ప్రభుత్వములో గలిసికొనుట "చావు కవుగలింపు"వలె నున్నదని మహాత్ముడు తన హరిజనపత్రికలో నా అక్టోబరు 20 వ తేదీన తన విచారమును బ్రకటించెను.

161. తూర్పుబెంగాలులోని ముస్లిము గలాటలవలన బాధనొందిన హిందూ యువకులు గొందరు మహాత్ముని యనుమతిమీదనే ముస్లింలీగు తాత్కాలిక ప్రభుత్వములో జేరగలిగినదని యూహించి యాయనపై క్రోధమువహించి ఢిల్లీకి పనిగట్టుకొని వచ్చి మహాత్ముడున్న హరిజనవాడలో ప్రార్థనాసమయమున అల్లరి నారంభించి, ప్లాకార్డుస్లోగన్సు కోలాహలము చేయుచు బెంగాలులో ముస్లింలీగువా రొనరించిన ఘోరకృత్యములకు లీగునుండి పరిహార మిప్పించవలసినదని మహాత్ముని గగ్గోలుపరచిరి. మహాత్ముడు వారి హృదయవేదనను గ్రహించినవాడై నిజముగా దానప్పుడుండ వలసిన ప్రదేశము బెంగాలేయని యొప్పుకొని త్వరలో దానచ్చటికి బోనున్నాడనని వారికి అభయమిచ్చి ప్రార్థనసమయమున నట్టియల్లరులు చేయుట తగనిపనియని వారికి మెల్లగా బోధపరచి పనిచెను. బెంగాలులో ముఖ్యముగా స్త్రీలు భయాతిరేకముచే ముస్లిము దుండగీళ్ళకు లొంగిపోవుటను విని మహాత్ముడు స్త్రీలు స్వప్రాణరక్షణార్థమై ఇచ్చవచ్చినచో కత్తులను ధరించవచ్చుననియు మానభంగమున కేమాత్రము లొంగక వలసినచో విషమును మ్రింగి ప్రాణత్యాగము చేసికొనుట మంచిదనియు తన హరిజన పత్రికలో తరువాత నొక వ్యాసమును వ్రాసెను. ఆ వ్యాసములో అక్కడ వారలకు రెండే మార్గములు గలవనియు, అందొకటి యెదుటివానిని జంప బ్రయత్నించి తాను తిరుగ వానిచే చంపబడుటకు సంసిద్ధుడై యుండుట; రెండవది యెదుటి వానిని జంప బ్రయత్నింపకయే తానాతనిచే జంపబడుటకు ధైర్యముతో నిలువబడుట యనియు తన యభిప్రాయములో రెండవమార్గమే శ్రేష్ఠమైనదనియు గూడ దెలిపెను. మహాత్ముడు ఢిల్లీనుండి అక్టోబరు 30 వ తేదీని కలకత్తాకుబోయి యచ్చటి నూతన గవర్నరుతో సంభాషించెను.

162. ఆ సంవత్సరము (1946) నవంబరు మొదటి రోజులలో తాత్కాలిక ప్రభుత్వ ఉపనాయకుడగు నెహ్రూ మువ్వురు ప్రభుత్వ సభ్యులతో గూడి బెంగాలులోని స్థితిగతులను స్వయముగా జూచుటకై బోగా నచటికి ఢిల్లీనుండి వైస్రాయిగూడ నప్పుడే వచ్చెను. అచ్చటి ప్రజలింకను పరప్రభువులపై నాధారబడుట మానక వైస్రాయితో దమ ఇక్కట్టులనుగూర్చి మొరబెట్టు కొలదలచియుండగా నా విషయమును గ్రహించిన మహాత్ముడు వారలను మందలించి వారందరు వాంఛించుచున్న

ప్రజాస్వాతంత్ర్య ప్రభుత్వోద్యమమునకు అట్టి పరప్రభుత్వ ప్రాపకాపేక్ష యసమంజసమని వారిని వారించెను. మహాత్ముడు కలకత్తాలో నుండగనే బీహారులోని హిందువులు బెంగాలులోని మహమ్మదీయులపై కసిదీర్చుకొనుటకు బీహారులోని నిరపరాధులగు మహమ్మదీయులను బలవంతముగ బట్టుకొని రెండింతలున జంపుచున్నారని విని దిగ్భ్రమనొంది తానీదేశమునకు మరలివచ్చి మొదట్లో బీహారులోనే యక్కడి చంపరాను రైతుల యిక్కట్టుల దొలగించుట కుద్యమించుటతోనే తన భారత రాజకీయ చరిత్ర నారభించుటను దలపోసి తనపై యారోజులలో నత్యంత ప్రేమవర్షమును గురిపించిన బీహారీయులీరోజున పెత్తితనమును వహించి భారతదేశముయొక్క మంచి పేరుకు కళంకము నాపాదించుచున్నందుకు మిగుల వగచెను. బీహారీయుల దుండగములనుగూర్చి మహాత్ముడు నెహ్రూకొక లేఖ వ్రాయుచు నందులో దనకు పగటిపూట వెలుతురువలె స్పష్టముగా గానవచ్చుచుండిన విషయములను యితరులకు జూపించినను వారు చూడకుండుటవలన తానీ ప్రపంచములో నింక నుండుట కవసరము లేనట్టు దనకు గన్పట్టుచున్నట్టును అందుచే త్వరలో ప్రాయోపవేశ మొనరింప బూనినట్టును దెలియజేసెను. వెంటనే ప్రభుత్వాధికారమందున్న నెహ్రూ తనచేతిలోనున్న పనిని చేయదలచి బీహారు హిందువులట్టి ఘోరచర్యలను గావించుటను కేంద్ర ప్రభుత్వము సహింపజాలదనియు, అట్టివారిపై ప్రభుత్వము మిలిటరీద్వారా విమానములనుండి బాంబులను బ్రయోగించి వారిని హతమార్పదలచినట్టును మహాత్మునికి దెలియబరచెను. మహాత్ముడు నెహ్రూకు బదులు వ్రాయుచు అటుల బాంబులను బ్రయోగించుట పరప్రభుత్వమగు బ్రిటిషువారికి జెల్లినదిగాని ప్రజా ప్రభుత్వానురాగులను కాంగ్రెసు వారుకూడ మిలిటరీసహాయ మపేక్షించి ప్రజలలోని యల్లరి నరిగట్ట దలచుట ప్రజల స్వాతంత్ర్యేచ్ఛను నణగద్రొక్క బ్రయత్నించినట్లగు ననియును, కాంగ్రెసు నాయకులు ప్రజాబాహుళ్యముపై తమకుగల పలుకుబడిని గోలుపోయిన యెడల వారు ప్రభుత్వాధికారమునుండి విరమించుకొనుటయే మంచిదనియు దెలిపెను.

163. మహాత్ముని యభిప్రాయములో అహింస, యొకపవిత్రమైన మానవ ధర్మము. మిలిటరీయొక్క బలవంతపు కార్యమువలన భౌతికముగ ప్రజల చెడు చర్యలలో గొంత మార్పు తప్పక యేర్పడినను ఆకార్య మా ప్రజలలో మానసిక పరివర్తనమును గూడ గలిగించనిచో, వారు సమయ మనుకూలమైనప్పుడు తిరుగ నా చెడుచర్యలనే జేయ నుద్యమింతురు. కావున మహాత్ముడు కాలహరణమైనను, ప్రజలలో నహింసాతత్వము బాగుగా నాటుకొనునట్లు యెడతెగక బ్రయత్నించు టవసరమని పలుమరుద్ఘోషించుచుండెను. మహాత్ముని పావనబోధనలకు శ్రీబుద్ధ

భగవానుని బోధనలకుపవలె శిలాక్షరరూపమును గల్పింపనెంచిన సేత్ సంజీభాయి కాళిదాసను బొంబాయి వణిజశ్రేష్ఠుడు మహాత్ముడు జన్మించి బాల్యమున నడయాడిన పోరుబందరు నందొక యెత్తైన స్తూపమును నిర్మించి యద్దానిపై యాయన బోధనలను లిఖింపించుటకై నవంబరు 24 వ తేదీన ఒకలక్ష యేబదివేల రూపాయిల నిధితో నొక ట్రస్టు నేర్పరుప సంకల్పించెను.

164. ఈ వరకు చెప్పినట్లు ఢిల్లీలో ముస్లిములీగు సభ్యులు తాత్కాలిక ప్రభుత్వములో అక్టోబరు 26 వ తేదీన జేరినవెనుక ఆవరకే అన్నిరాష్ట్ర శాసనసభల వలనను, కాబినెటుమిషను పథకము ననుసరించియే యెన్నుకొనబడియుండిన, ప్రతినిధులతోగూడిన కంస్టిట్యూయంటు యస్సెంబ్లీయొక్క ప్రథమ సమావేశమును ఆసంవత్సరము డిసెంబరు 9 వ తేదీన జరుపుటకు వైస్రాయినిర్ణయించెను. ఆ సమావేశములో కాబినెటు పథకములోని గ్రూపులను గురించిన 15 వ పేరాకు కాంగ్రెసువారిచ్చిన యర్థము ప్రకారము ముందుగా గ్రూపు లేర్పడవేమోనని జిన్నా భయమంది కాలహరణము చేయదలచి దేశములో నప్పుడుగల హిందూమహమ్మదీయ కలతలను సాకుగాదెచ్చి ఆసమావేశమును కొంతకాలము వాయిదావేయుమని వైస్రాయిని గోరెను. అందుకు తన యసమ్మతిని వైస్రాయి నవంబరు 20 తేదీన జిన్నాకు దెలిపెను. జిన్నా, ఆ మరునాడే మొదట కంస్టిట్యూయంటు యస్సెంబ్లీకి యెన్నుకొనబడియుండిన లీగుసభ్యు లెవరును ఆ సమావేశములకు బోరాదని శాశించెను. అసలు లీగు సభ్యులను తాత్కాలిక ప్రభుత్వములో జేర్చుకొనుటకుముందు వైస్రాయి, జిన్నాతో సంప్రదించి ముస్లింలీగు సభ్యులు కాబినెటు పథకమును బూర్తిగ నామోదించి యందు నిర్ణయింపబడిన కంస్టిట్యూయంటు యసెంబ్లీ సమావేశములలో దప్పక బాల్గొందురని హామీనిబొంది నెహ్రూకు దెలిపియుండెను. అందుకు భిన్నముగ జిన్నా యిప్పుడు శాశించుటచే లీగుసభ్యులు తాత్కాలిక ప్రభుత్వమునుండి వైదొలగ వలసియుండునని, ఆ నవంబరునెలలో మీరటులో గూడిన కాంగ్రెసు మహాసభలో దెలుపబడెను. ఈ సంగతుల నన్నిటిని వైస్రాయివలన దెలిసికొనిన బ్రిటిషు ప్రభుత్వమువారు వైస్రాయి వేవెలును తాత్కాలిక ప్రభుత్వమునకు సంబంధించిన కాంగ్రెసు సంస్థ ప్రతినిధుల నిద్దరిని, ముస్లిములీగు సంస్థ ప్రతినిధుల నిద్దరిని, సిక్కు సంస్థ ప్రతినిధి నొకరిని తనవెంట నిడుకొని వెంటనే లండనుకు రావలసినదిగా నాజ్ఞాపించిరి. కాంగ్రెసు తరఫున నెహ్రూయొక్కడే వారితోబోయి అక్కడి బ్రిటిషు ప్రధాని అట్లీ కాబినెటు పథకములోని 15 వ పేరాకు, 19 వ పేరా కనుగుణముగ మొదట గ్రూపులుగా జేరుట ఐచ్ఛికముగాదని యిచ్చిన యర్థమును గ్రహించి ఆయర్థముపై

అవసరమైనచో కాంగ్రెసు ఫిడరలుకోర్టుకు అప్పీలు చేసికొనవచ్చుననిగూడ అట్లీ తెలిపియుండుటచే, మారుమాటాడక లీగు ప్రతినిధులగు జిన్నా లియఖత్ ఖాను లచటవిడిచి తనతో వచ్చిన సిక్కు ప్రతినిధియగు బలదేవ సింగుతో గలిసి వెంటనే ఇండియాకు మరలివచ్చి, మొదట నిర్ణయింపబడిన ప్రకారము కంస్టిట్యూయంటు యసెంబ్లీ ప్రథమసమావేశమును లీగు సభ్యులు రాకున్నను ఆ డిసెంబరు 9 వ తేదీన జరిపించెను. ఆ సమావేశములో కార్యక్రమ నిర్ధారణ మాత్రము చేయబడెను. ఆ కార్యక్రమము ననుసరించి తరువాత సమావేశములో గ్రూపు సమావేశములను జరుపవలసిన సమయమాసన్నమైనప్పుడు హిందువు లెక్కువగనుండి, తూర్పుగ్రూపులో జేరనిచ్చగించని అస్సాము రాష్ట్రము వహించవలసిన పాత్రనుగూర్చి అస్సాము కాంగ్రెసు పార్లమెంటరీ సభాకార్యదర్శి, మహాత్ముని కలకత్తా సమీపముననున్న సిరంపూరులో డిసెంబరు 17 వ తేదీన దర్శించి ప్రశ్నించగా మహాత్ముడు ముందుగా తొందరపడవలదనియు, ఆ సమయమువచ్చినప్పుడు ఆ రాష్ట్రము గ్రూపులో జేరుటకు 15 వ పేరాననుసరించి నిరాకరించవచ్చుననియు సలహానిచ్చెను. ఆ సంగతిని విన్న, ప్రభుత్వపుటుపనాయకుడుగానున్న సుహ్రావా, అప్పుడు కాంగ్రెసు ప్రెసిడెంటుగానున్న కృపలానీ, కాంగ్రెసు జనరలు సెక్రటరీగానున్న శంకరరావు దేవుగారలు ముగ్గురును మహాత్ముని శిరంపూరులో స్వయముగా గలిసికొని కర్తవ్యమును గూర్చి చర్చించుకొని తిరిగి 30 వ తేదీకి ఢిల్లీకి మరలిపోయిరి.

---

## ముప్పది మూడవ ప్రకరణము

# మహాత్ముని 1947 కార్యక్రమము

165. మహాత్ముడు 1947 జనవరి నెలలో శిరంపూరు పరిసరప్రాంతములలో సంచారము చేయుచు, అచ్చటి హిందూమహమ్మదీయులందరి తోడను కలిసి మెలసి తిరిగి, సత్యము అహింసలనుగూర్చి వారలకు బోధించుచు కొరానులోని ఇస్లాం మతము యొక్క అల్లా నిరపాయకుల రక్షకుడనియు అందువలన నవకాళిలో నత్యధిక సంఖ్యాకులుగ నున్న మహమ్మదీయులు అచ్చటి అల్పసంఖ్యాకులై నిరపాయకులుగ నున్న హిందువులను హింసించుట తమ మత గురువగు మహమ్మదు ప్రవక్త యొక్క ప్రవచనములకు విరుద్ధమనియు వారలకు నచ్చజెప్పి, అల్పసంఖ్యాకులగుటచే భయ విహ్వలులైన హిందువుల నుద్దేశించి తాను చిన్నప్పుడు భూతముల భయమునుండి కాపాడుకొనుటకై తన దాయివలన నేర్చుకొనిన రామనామమును వారు సదా భక్తితో పఠించుకొనుచుండవలెనని బోధించెను. భీరువు హిందువుల ప్రతీకార చర్యను నిరసించుచు వారు భీరువులవలె వర్తించిరనియు, నిజముగా ధీరువులే యయి యున్నయడల స్వయముగా నవకాళికేగి తమ సాహసమును జూపి అక్కడ తమ ప్రతీకార చర్యను జూపించవలసి యుండును అని దెలిపెను. మహాత్ముడు తరువాత ఆస్సామునకు బోయి యచట వారము దినములు గడిపి తిరిగి సోడేపూరు ఆశ్రమమునకు మరలివచ్చి పిదప నవకాళిలో కాలినడకను సంచారము సాగించెను. మహాత్ముడు బంగాళా రాష్ట్రములోని నవకాళి తిప్పరా జిల్లాలలో పర్యటించుచు ప్రార్థనానంతర ఉపన్యాసములలో ముఖ్యముగా హిందూ మహమ్మదీయ సఖ్యతావశ్యకతను గూర్చి ముచ్చటించుచుండెను. కేవల అహింస మార్గమున గాక హింసామార్గమున మనము బ్రిటిషు వారిని వెళ్ళగొట్ట బ్రయత్నించుట సాధ్యముకానిపని యని చాల చోట్ల హెచ్చరించుచుండెను. భారతీయ పౌరులలో గొందరిని అస్పృశ్యులనుగా పరిగణించు చున్నంతకాలము దేశమునకు నిజమైన స్వాతంత్ర్యము ఏర్పడజాలదని ఉద్బోధించుచుండెను. మరియు ప్రతి పౌరుడును సాధ్యమైనంతవరకు తన స్వయంకృషిపై ఆధారపడవలయుననియు ఎవరైతే తమకు దామే సహాయమొనర్చు కొందురో అట్టి వారికే భగవంతుడు సహాయమొనర్చుననియు బోధించుచుండెను. ఫిబ్రవరి 26 వ తేదీన ఒక చోట ఒక ప్రశ్నకు సమాధానమిచ్చుచు ప్రకృతి శాస్త్రములో చెప్పబడిన సెంట్రిఫ్యూగలు సెంట్రిపీటలు అనగా ఒక చక్రము యొక్క మధ్యనుండి చుట్టువైపులకు ప్రసరించునట్టియు చుట్టు వైపులనుండి మధ్యకు ప్రసరించునట్టియు శక్తులవలెనే మనదేశములో ప్రభుత్వశక్తులు కేంద్రమునుండి దూరమున నున్న గ్రామ గ్రామములకును గ్రామ గ్రామములనుండి

కేంద్రమునకును అకర్షింప బడవలయుననని నొక్కి చెప్పెను. వేరొక ప్రశ్నకు సమాధాన మిచ్చుచు, ఏమానవుని త్యాగము తన ప్రత్యేక కులబృందము నుండి పైకి పోదో అతడు:తనను మాత్రమే గాక తన కులబృందమును కూడ స్వార్థతతో నింపుననియు కావున ప్రతివ్యక్తియు తనకుసంబంధించిన ప్రత్యేకకులవర్గముయొక్క శ్రేయముకొరకు త్యాగము చేయుచుండినను, ఆ కులవర్గమంతయు తాము నివసించుచున్న జిల్లా మొత్తములోని ప్రజలందరి శ్రేయముకొరకును ఆజిల్లా వారందరు రాష్ట్ర ప్రజానీకమున కంతకును, రాష్ట్రప్రజలందరు భారతజాతి కంతకును, భారతీయులందరు ప్రపంచమంతటికొరకును త్యాగము చేయవలయునని ప్రబోధించెను. ఆ 1947 మార్చి 5 వ తేదీన మహాత్ముడు బీహారు రాష్ట్రములోని పాట్నానగరము జేరెను. ఆరాష్ట్రములో మెజారిటీగానున్న హిందువులు అక్కడ మైనారిటీగానున్న అమాయకులైన ముస్లిములపై, నవకాళిలో మెజారిటీగానుండిన ముస్లిము లొనర్చిన నేరములను సాకుగాగొని పగదీర్చికొను నెపమున ఘోరకృత్యము లొనర్చుచుండిరి. ఆ హిందువులు కాంగ్రెసు సంస్థకు జెందినవారు కారని కొందరు తెలుపగా మహాత్ముడు తాను లండనులో జరిగిన రౌండుటేబిలు కాన్ఫరెన్సులో కాంగ్రెసుసంస్థ భారతీయులందరికిని ప్రతినిధిసంస్థయని పేర్కొనియుంటిననియు, ఆకారణమున కాంగ్రెసుకు విరోధులమనుకొనువారికిని ఆసంస్థ ప్రాతినిధ్యము వహించవలయుననియు భారతదేశ మంతటిని మంచిస్థితిలో నుంచవలసిన బాధ్యత కాంగ్రెసుపై నున్నదనియు స్పష్టముగా విశదీకరించెను. మహాత్ము డట్లు ప్రార్థ నానంతర ఉపన్యాసములను రాజకీయప్రస్తావనలకై ఉపయోగించుటను కొందరు గర్హించగా మానవజీవితము అవిభాజ్యమైన ఏకైక మొత్తమనియు దానినంతను ఏకైకజీవాత్మయే జరుపుటచే దాని వివిధవృత్తులమధ్యగాని, నీతికిని రాజకీయమనకును మధ్యగాని గీతగీయుటకు వీలు లేదని నచ్చచెప్పెను. ఒక వ్యాపారస్తుడు మోసమువలన చాలధన మార్జించి, ఏదో యొక భగవత్సంబంధమైనకార్య మొనరించినంత మాత్రమున అతనిపాపము పోదనియు మానవుని దైనందిన జీవితము తన ఆధ్యాత్మికాభివృద్ధి మార్గ మునుండి ఎన్నడును వేరు పరుపబడజాలదనియు హెచ్చరించెను.

**166.** కాబినెటు పథకములోని గ్రూపులను గురించిన 15 వ పేరాకు బ్రిటిషు ప్రధాని అట్లీ యిచ్చిన యర్థమును ఒప్పుకొన్నట్టు కాంగ్రెసు కమిటీ డిసెంబరు 22 వ తేదీన తీర్మానమును జేసినను కంస్టిట్యూయంటు యస్సెంబ్లీకై ఆపథకమనుసరించియే వివిధ రాష్ట్ర శాసనసభల వలన ఎన్నుకొనబడి యుండిన లీగు ప్రతినిధులెవరును ఆ యస్సెంబ్లీ యొక్క తరువాతి సమావేశమునకైనను హాజరుగాకుండు

టయే గాక జిన్నా ఆ కంస్టిట్యూయంటు యస్సెంబ్లీ యెన్నికలే సరిగావనియు, కావున అట్టిదాని తీర్మానములు అసలే చెల్లవనియు పేచీపెట్టి లీగుచేనొక తీర్మానమును జేయించెను. ఆ తీర్మానముపై మహాత్ముడు ఆ 1947 ఫిబ్రవరి 4 వ తేదీన వ్యాఖ్యానించుచు యెన్నికలు అన్యాయమైనచో కోర్టులద్వారా న్యాయమును బొందవలసినదని దెలియజేసెను. అయినను జిన్నా తన పట్టుదలను విడువకుండుటచే వేసెలు వెలవెల బోయి యేమియుతోచక కాగితములన్నిటిని కట్టగట్టి అట్లీకి బంపగా బ్రిటిషు కాబినెటువారు సమావేశమై తమకాసమయమువ భారతదేశములోని రాజకీయ ప్రతిష్ఠంభనమును ఛేదింప దారిగానమిచే భీతిజెంది యేదోయొక ఫైనలు ప్రకటన త్వరలో గావింప నిశ్చయించుకొనిరి. మహాత్ముడనేకసార్లు దేశములోని వివిధ రాజకీయ వర్గములు యేకీభవించుటకై బ్రిటిషు ప్రభుత్వము ముందుగా బోవలెననిఘోషించి యుండుటచేతను, బ్రిటిషు లేబరుపార్టీ గవర్నమెంటు యెప్పటికైనను ఇండియాకు స్వాతంత్ర్య మివ్వదలచి యుండుటచేతను బ్రిటిషు ప్రభుత్వము వెడలిపోవుట కొక కాలనిర్ణయము చేయదలచిరి. ఆకారణమున బ్రిటిషు గవర్నమెంటువారు తాము 1948 జూను 30 వ తేదీన ఇండియాను పూర్తిగా వదలివేయ నిశ్చయించుకొన్నట్టు 1947 ఫిబ్రవరి 20 వ తేదీన నొక ప్రకటన గావించిరి. మరియు అప్పటికి అనగా 1948 జూను మాసాంతము సరికి కాబినెటు పథకము ననుసరించి యేర్పడిన కంస్టిట్యూయంటు యస్సెంబ్లీ ఆపథకములో నిర్ణయించినట్టు భారతదేశమున కంతకును ఏకైక నూతన రాజ్యాంగమును నెలకొల్పలేక పోయినయెడల అప్పటి రాజకీయ పరిస్థితులనుబట్టి విధిలేక బ్రిటిషు గవర్నమెంటువారు తమ యధికారమునంతను భారతదేశములోని యే ఒక్క రాజకీయ సంస్థకో, లేక పెక్కు రాజకీయ సంస్థలకో వదలివేయ వలసి వచ్చుననియుగూడ ఆ ప్రకటనలో దెలిపిరి. ఆ ప్రకటనను విన్న జిన్నా కడు సంతసించి తాను గోరుకొనుచున్న పాకిస్థానులో చేరవలసినవనుకొనిన రాష్ట్రములన్నింటిలో లీగు మంత్రిత్వములను సుస్థిరముగ స్థాపించుకొన నెంచెను. అయినను చాలమంది హిందువులుండి సంకీర్ణ మంత్రిత్వములను గలిగిన పంజాబు, బెంగాలు రాష్ట్రములలో తానావరకు గావించిన ప్రత్యక్ష పోరాట ఘోర చర్యలవలన తన గోతిని తానే తవ్వుకొనెను. పాకిస్థాను స్థాపనకై జిన్నావాదమంతయు మహమ్మదీయులెక్కువగనున్న ప్రాంతములను మాత్రము వేరుజేసి వాటికి పాకిస్తాను అను పేరుతో నూతన స్వతంత్ర రాజ్యము నేర్పాటు చేయవలయుననుటయే. అట్టి వాదము చేతనే ఆ రెండు రాష్ట్రములలో మహమ్మదీయేతరు లెక్కువగానున్న జిల్లాలను గూడ ఆ రాష్ట్రములనుండి వేరుపరచి పాకిస్థానములో జేరకుండ జేయవలెనని అచ్చటి మహమ్మదీయేతరులు మొరబెట్టుచుండిరి. ఈస్థితిగతుల నన్నిటిని బరిశీలించుచున్న

మహాత్ముడు తాను భారతదేశముయొక్క యెట్టి విభజనకైనను వ్యతిరిక్తుడ ననియు, అయినను బలవంతపు కలయికకుగూడ నదేవిధముగ వ్యతిరిక్తుడననియు, బ్రిటిషు ప్రభుత్వమీ దేశమును త్వరలో విడువనుండుటచే దేశములోని సమాన పౌరులగు హిందూ మహమ్మదీయులు శాంతితోను, సుహృద్భావముతోను కలిసి మెలసియుండు టకు నిశ్చయించుకొన వలసినదనియు, అటులగాదేని దేశములో 'సివిల్ వార్' యేర్పడవచ్చు ననియు, ఆ 1947 మార్చి 23 వ తేదీగల తన హరిజన పత్రికలో వ్రాసెను.

167. మహాత్ముడామార్చినెలలో వార్ధాలోని సేవాగ్రామమునందుండగా ఆంధ్రా ప్రావిన్షలు కాంగ్రెసు తరపున నొక డెప్యుటేషను ఆయనను సందర్శించి ఆంధ్రదేశ సమస్యలనుగూర్చి చర్చించిరి. మహాత్ముడానెలలోనే బీహారుకుబోయి, 18 వ తేదీన 'పస్నా' గ్రామములో నుపన్యసించుచు అచ్చటి స్థానిక హిందువుల నుద్దేశించి వారు అచ్చటి మహమ్మదీయ గృహములనుండి లూటీజేసి తీసికొనిపోయి యుండిన యావదాస్తిని తిరుగ వారికి ఒప్పజెప్పవలసినదనియు మరియు అలూటీల సందర్భమున ధ్వంసముచేయబడిన మహమ్మదీయ గృహములను శుభ్రపరచి ఆమహమ్మ దీయులు తిరిగివచ్చి నివసించుటకు వీలగునట్లుగా జేయవలసినదనియు ప్రార్థించెను 22 వ తేదీన 'ఓక్ర' గ్రామములో మాట్లాడుచు ఆదినముననే వేవెలుకు బదులుగా వచ్చిన నూతన వైస్రాయి మౌంటు బాటను తన ప్రథమప్రకటనలో తాను ఇండి యాకు ఆఖరు వైస్రాయిగా బంపబడినట్టు దెలిపిన విషయమును బురస్కరించుకొని యాప్రకటన ఉద్దేశ్యపూర్వకముగను, బేషరతుగను, అసందిగ్ధముగను చేయబడిన దనియు అయినను బీహారులోని హిందూమహమ్మదీయ కలతలు ఇంకను మిక్కుటముైనచో నక్కడ యిడుములబడుచుండిన ప్రజలు ఇంకను మరికొంతకాలము బ్రిటిషు ప్రభుత్వమే ఇక్కడనుండి వారి మిలిటరీ సహాయముతో దమ్ములను రక్షించవలసిన దిగా వారిని గోరవచ్చుననియు, అందువలన దేశస్వాతంత్ర్యము దూరము కావచ్చు ననియు దెలియబరచెను.

168. మహాత్ముడామార్చినెల 31 వ తేదీన ఢిల్లీకి బోయి నూతన వైస్రా యిని దర్శించెను. ఏప్రెలు మొదటి తేదీన అక్కడ జరిగిన "ఇంటరు ఏషియను కాన్ఫరెన్సు"లో నుపన్యసించుచు ఏకైక ప్రపంచరాజ్యాదర్శనమునకై యాకాన్ఫ రెన్సు పాటుబడవలెనని యాశించుచు స్వతంత్రభారతదేశము ప్రపంచములోని ఇతర దేశములు ఒకదానినొకటి అణగద్రొక్కుటకుజేయు ప్రయత్నములలో సహకారి గా నేరదనియు, అయినను ప్రాగ్దేశములు పశ్చిమదేశములకు తమ సత్య, అహింస,

సందేశములతో తప్పక జయించుననియు దెలియుబరచెను. ఏప్రెలు 4 వ తేదీన వైస్రాయి భవనములో మాంటు బాటను దంపతులమధ్య నిలుచొని యున్నప్పుడు తీయబడిన ఫోటో పత్రికలలో బ్రచురింపబడెను. 9 వ తేదీన ఢిల్లీలోనే ప్రార్థనానంతరమున ప్రసంగించుచు స్వాతంత్ర్య ఇండియను రిపబ్లికు ఏర్పడినప్పుడు దానికి జిన్నా ప్రథమ ప్రెసిడెంటుగా నుండి దేశములోని తగిననాయకులు ఆయనకు సహాయముగా ప్రభుత్వ సభ్యులుగా నేర్పడినచో దాను మిగుల సంతసించెదనని వాక్రుచ్చెను. 15 వ తేదిని జిన్నా వైస్రాయి ప్రోద్బలముపై మహాత్మునితో గలిసి బెంగాలునకు బోయి దేశములోని హిందూ మహమ్మదీయ కలతలను నిరసించుచు జాయంటు యప్పీలు ప్రకటించెను. ఆ అప్పీలును జిన్నా బెంగాలులోని మహమ్మదీయులకే గాక పంజాబులోని మహమ్మదీయులకును గూడ చేసియుండెను. అయినను పంజాబు మహమ్మదీయులు ఆ అప్పీలును లక్ష్యపెట్టక ఆవరకు బీహారులోని హిందువులు అక్కడి మహమ్మదీయులను హింసించియుండెనన్న నెపమును సాకుగా గొని పంజాబులో తమ ప్రతీకారచర్యను మానరైరి. అందుపై జిన్నా తన నిస్సహాయతను మహాత్మునికి తెలియింపగా, ఆయన ఆవిషయమును మే మొదటి తేదీన వైస్రాయి కెఱుకపఱచి ఆయనయే ఒప్పుకొన్నట్లు జిన్నాకు పంజాబు మహమ్మదీయులపైగల పలుకుబడిని గ్రహించకలసినదని హెచ్చరించెను. మరునాడు ఢిల్లీలో సాయంప్రార్థన సమావేశమున అరబ్బీభాషలో కొరానునుండి కొన్నిభగవత్ప్రార్థనలు చదువబడినప్పుడు కొందరు హిందువులందుల కభ్యంతరము దెలుపగా, మహాత్ముడు అట్టి సంకుచిత మానసిక తత్వము ఆర్యబుషుల సంతతివారికి తగదనియు, ఆ ప్రార్థనలలోని యర్థమునే సూచించు మంత్రములు యజుర్వేదమునందును గలవనియు, భాష మనస్సులోని భావములను బయటికి వెలిబుచ్చుటకు సాధనమైన సాంకేతికము మాత్రమే యనియు, కావున కేవల భాషాభేదమునకై పెనగులాడుట వట్టి మూర్ఖతయనియు, మరియు, హిందువుల అష్టోత్తరశతోప నిషత్తులలో భగవంతుని అరబ్బీభాషలో అల్లాయని యనుటచే, అట్టి అల్లానుగూర్చిన అల్లోపనిషదొకటి గలదనియు వాక్రుచ్చెను, ఆ మేనెల 4 వ తేదీ మధ్యాహ్నము తన వాల్మీకి ఆశ్రమములో గూడిన కాంగ్రెసు వర్కింగుకమిటీలో మహాత్ముడు పాల్గొని, సాయంత్రము వైస్రాయి ఆహ్వానముపై ఆయనను గలిసికొని తిరిగి తన బసకువచ్చి, అచ్చటనింకను సభగూడి తన రాకకై వేచియున్న ఆ వర్కింగుకమిటీ సభ్యులతో దీర్ఘసమాలోచనలు జరిపెను వైస్రాయి మహాత్మునితో బ్రిటిషు గవర్నమెంటు ఇండియాలో ఇంకను కొంతకాలము 1948 జూన్ మాసమువరకు ఉండుటనుగూర్చి చర్చించి, ఆయనను బంపివేసినవెనుక జిన్నా లియాఖత్ ఖానులను బిలిచి వారితో రెండున్నర గంటలు ముచ్చటించెను.

169. మహాత్ముడు మరునాడు అనగా మేనెల 5 వ తేదీన పత్రికాప్రతినిధుల గోష్టిలో ప్రసంగించుచు బ్రిటిషు ప్రభుత్వము వారు తామెట్లయినను ఇండియాను వదల నిశ్చయించుకొని నప్పుడు వెంటనే బోక ఇంకను పదమూడు మాసముల గడవుగోరుట తన కర్తముగాకుండుటలేదనియు వారీదేశముననున్న కొద్ది, దేశములోని వివిధరాజకీయ వర్గములలో గొందరు వారి ప్రాపకము నపేక్షించుచు తమ దుర్నయములను గొనసాగించుకొను చుందురనియు, బ్రిటిషుప్రభుత్వమును మనము ఆయుధబలము చేతగాక నైతికశక్తి చేతనే జయించి యుంటిమనియు, అందువలన వారింకను పదమూడు నెలలుండవలసిన యవసరము లేదనియు, బ్రిటిషువారు వెంటనే వెడలిపోయినచో దేశములో భీషణకల్లోల జ్వాలలొకవేళ వ్యాపించినను వాటిలో మనము పుటము పెట్టబడి పునీతులము కాగలమని తెలియబరచెను. మహాత్ముడు మరునాడు సాయంత్రము అయిదున్నర గంటలకు జిన్నాను కలిసికొని రాత్రి ఎనిమిది గంటల పావువరకు దీర్ఘచర్చలు జరిపెను. ఆ చర్చలను గూర్చి పత్రికావిలేఖరులు జిన్నాను ప్రశ్నింపగా ఆయన తామిరువురును రెండు విషయములను గూర్చి మాత్రమే చర్చించి యుంటిమనియు అందొకటి ఇండియాను పాకిస్తాను హిందూస్తాను అను రెండు భాగములుగ విభజించుటనుగూర్చియు; రెండవది, దేశములోని ఇరుకక్షులవారికిని మైత్రిని సమకూర్చి, శాంతిని నెలకొల్పుటకై తామిరువురివరకు జేసిన జాయంట్ అప్పీలు విషయములో నెక్కువ శ్రద్ధను బూనుకొనవలసిన యవసరమును గూర్చియు, నని దెలిపెను. మరియు మొదటి విషయమునకు మహాత్ముడు విముఖుడైయుండెననియు, రెండవ విషయమును మాత్రమే ఒప్పుకొనియుండెననియు విశదపరచెను. ఈ విషయములను దెలిసికొనిన నెహ్రూ పటేలు గారలు, ఊవరకట్టి జాయంటు అప్పీలువలన నెట్టిప్రయోజనము ఏర్పడియుండకుండుటను గ్రహించిన వారలగుటచే, ప్రధాన కర్తవ్యమైన ఏకైక భారతరాజ్యాంగ నిర్మాణార్థము నిర్ణయింపబడిన కంస్టిట్యూయంటు యస్సెంబ్లీ సమావేశములో లీగు సభ్యులు హాజరు కాకుండుటవలన బ్రిటిషు ప్రభుత్వమువారు ఫిబ్రవరి 20 వ తేదీని చేసిన ప్రకటననుసరించి ఏకైక భారత రాజ్యాంగ మేర్పడుట అసంభవమగుటచే గత్యంతరములేక వైస్రాయి సలహాననుసరించి దేశ విభజనకు ఒప్పుకొనవలసివచ్చినది.

170. అంతకుముందు అనగా మేనెల 8 వ తేదీన మహాత్ముడు వైస్రాయికి ఒకలేఖను వ్రాసెను. అందులోఈ క్రిందివిషయములు గలవు:—

(1) బ్రిటిషు ప్రభుత్వము భారతదేశమును విభజించు విషయములో ఎట్టి జోక్యమును కలిగించుకొన గూడదు. విభజన మవసరమైనచో అది బ్రిటిషు వారు వెడలిపోయిన తరువాతనే ఇరుపార్టీల వారి సఖ్యతమీదనో లేక

అవసరమైతే సాయుధ పోరాటము మీదనో సాధించుకోబడనిమ్ము, అట్టి పోరాటమున కవసరముండదని జిన్నా హామీ ఇచ్చుచున్నాడు.

(2) బ్రిటిషు వారు వెడలిపోక పూర్వము వారేర్పరచిన తాత్కాలిక ప్రభుత్వములో పూర్తిగా కాంగ్రెసుకు జెందినవారు గాని లేక పూర్తిగా ముస్లిము లీగుకు జెందినవారుగాని మాత్రమే యుండవలయును. ప్రస్తుతపు కాంగ్రెసు లీగు ద్వంద్వప్రభుత్వము హానికరము. అది ఉద్యోగస్తులలో అవినీతిని పెంపొందించి సరియైన ప్రభుత్వమునకు అవసరమైన న్యాయశీలతను ఆ ఉద్యోగస్థులలో అంతరింపజేయును.

(3) బ్రిటిషు ప్రభుత్వము ఈదేశమును అల్లకల్లోలములో ముంచియుంచి పోదలచని యెడల దేశపరిపాలనమంతను స్వదేశసంస్థానములతో సహా ఒకే పార్టీకి వప్పజెప్పి వెళ్ళవలెను.

(4) స్వదేశసంస్థానముల పేరమూంసీఅధికారములు ఇతరులకు బదిలీచేయబడవనుట విషపూరిత సిద్ధాంతము. బ్రిటిషువారు ఈదేశములో సాగించుచున్న అధికార మంతయు పూర్తిగా స్వతసిద్ధముగా ఆప్రభుత్వపు ఉత్తరాధికారులకు సంక్రమింపవలెను. స్వదేశసంస్థానములలోని ప్రజలు బ్రిటిషు రాష్ట్రములలోని ప్రజలవలె స్వతంత్రభారత ప్రజల భాగములే అనగా సంస్థానాధీశుల శక్తులు ఇండియను రిపబ్లికు వశమై భారతీయులందరి యొక్క శ్రేయమునకై ఉపయోగింపబడవలెను.

(5) సివిలు సర్వీసు ఉద్యోగస్తులు తాము ఇప్పటినుండియు నూతన ప్రభుత్వమునకు అలవాటు పడునట్టు నేర్పబడవలయును. వారిలో సంకుచిత కుల దురభిమానములున్నచో వాటిని నిర్మొహమాటముగా త్రుంచివేయవలెను. ఆంగ్లేయ ఉద్యోగస్తులు ఈ వరకువలె బ్రిటనుకు గాక నూతన భారత ప్రభుత్వమునకు జెందినవారుగా గ్రహించునట్లు చేయబడవలెను. ఆ ఉద్యోగస్థు లెవరును తామింతవరకు అనుకొనుచుండినట్లు పాలకవర్గమునకు జెందినవారుగా గాక ప్రజాసేవకులని యనుకొనునట్లు జేయబడవలెను. ఆ తరువాత వైస్రాయి వెంటనే అనగా ఆ మేనెల 18వ తేదీన బ్రిటిష్ మంత్రివర్గముతో సంప్రదించుటకై లండను కేగెను.

171. మహాత్ముడా మేనెల 26 వ తేదీన తన సాయంప్రార్థనానంతరోపన్యాసములో ముచ్చటించుచు, మనకు స్వాతంత్ర్యము ప్రసాదించుట బ్రిటిషు ప్రభుత్వమువారి పనిగాదనియు, వారు మన వీపులమీదనుండి వైదొలగుట మాత్రమే

వారి పనియనియు, వారీదేశములో నున్నంతకాలము వారేదోమనకు జేయవలెనను భ్రమతో వారిపై నాధారపడనుద్యమింతుమనియు, బ్రిటిషు కాబినెటుమిషనువారి 1946 మే 16 వ తేదీ పథకముననుసరించి, కంస్టిట్యూయంటు యస్సెంబ్లీని నెల కొల్పిన తరువాత, వారీ దేశములోని స్థితిగతులతో సంబంధ మేమాత్రమును గలిగి యుండక, శీఘ్రముగ వెడలిపోవుట యుక్తమనియు యుద్ఘాటించెను. 29 వ తేదీన మరల నా విషయమునుగూర్చి ముచ్చటించుచు, బ్రిటిషుప్రభుత్వమువారు తమ యధి కారమును ఏకైక రాజ్యాంగ మేర్పడువరకు వేచియుండక, తా మేర్పరచిన కన్‌స్టిట్యూయంటుయస్సెంబ్లీకే వప్పగించి వెళ్ళవచ్చుననియు, ఆ యస్సెంబ్లీయే ఇండి యాను ఏకముగనుంచుటయో లేక విభజించుటయో తేల్చుకొనవచ్చునని దెలిపెను.

172. ఆ మరునాడు అనగా మే 30 వ తేదీ శుక్రవారము వైస్రాయి మౌంటుబాటను లండనునుండి మరలివచ్చి మొదట మహాత్మునితోడను, జిన్నాతోడను, తరువాత నెహ్రూ మొదలగు ఇతర నాయకుల తోడను సంప్రదించెను. మరునాడు శనివారమున కాంగ్రెసు వర్కింగు కమిటీయును, ఆదివారమున ముస్లింలీగు కమిటీ యును సమావేశములై మౌంటుబాటను తెచ్చిన బ్రిటిషు గవర్నమెంటువారి సూచన లను చర్చించి, తీర్మానములనుజేసి వాటిని వైస్రాయికి జూను 2 వ తేదీన దెలియ బరు పగా అయన మరునాడు 3 వ తేదీన రేడియోలో నొక ప్రకటన జేసెను. ఆ ప్రకట నలో జిన్నా 1940 లో గోరిన పాకిస్థాను పూర్తిప్రదేశమునకు భిన్నముగా పంజాబు, బెంగాలు రాష్ట్రములు విభజింపబడి వాటిలో మహమ్మదీయేతరు లెక్కువగా నున్న జిల్లాలు, తాలూకాలు వేరుచేయ బడుటయు, కాంగ్రెసు ఆదర్శమైన యేకైక భారతమునకు భిన్నముగా దేశము విభజింప బడుటయు జరుగునని తెలుపబడెను. మరియు ఆపరతుపై బ్రిటిషు గవర్నమెంటు ఆవరకు దెలిపినట్లు 1948 జూను మాసాం తమునగాక అంతకు ముందుగనే అనగా 1947 ఆగస్టు 15 వ తేదీననే తమ అధికార మును ఆరెండు భాగములకును వదలివేసి వెళ్ళిపో నిశ్చయించినట్టును గూడ ఆ ప్రక టనలోనే దెలుపబడెను. మరునాడు (4-6-47) మహాత్ముడు ప్రార్థనానంతరమున బ్రసంగించుచు ఆ ప్రకటన వలన యెవరును నిరుత్సాహులు గాగూడదనియు, అట్టి భారతదేశ విభజన చాలకాలము నిలువదనియు, త్వరలో ఆ రెండు భాగములును మరల గలిసికొని పోవుననియు తనకు గట్టినమ్మక మున్నట్టు తెలియబరచెను; మరియు జిన్నా తాను కోరుకొనియున్న ప్రత్యేక పాకిస్తాను ప్రభుత్వము తనకు లభించుటచే నికనైన దేశములోని యితర రాజకీయ పార్టీలతో గలిసి దేశములో శాంతిని నెల కొల్పుటకు సహాయపడుగాక యని యాశించెను. మహాత్ముడు 5 వ తేదీన మరల నా విషయమును గూర్చి ముచ్చటించుచు, దేశవిభజనకు మొదటినుండియు గాఢ ప్రతి

కూలుడై యుండియుండిన తాను మౌంటుబాటను ప్రకటనలోని దేశవిభజన సూచనకు ప్రాయోపవేశ మేల చేయలేదని తన ననేకులు ప్రశ్నించిరనియు అయినను కాంగ్రెసు ప్రజాసంస్థగా నున్నంతకాలము దానికి వ్యతిరేకముగ దాను దానిపై దిరుగబాటొనరించదలచలేదని వ్యక్తపరచెను. తరువాత జరుగబోవు ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సమావేశములో కొందరు కాంగ్రెసు మెంబర్లు తిరుగుబాటొనరింప దలచియుండుటచే మహాత్ముడు 17 వ తేదీన తిరిగి ఆదేవిషయమును గూర్చి మాట్లాడుచు కాంగ్రెసు తరఫున తగిన యధికారమును బొందియుండిన కాంగ్రెసు కార్యవర్గము సంగతి సందర్భములను బాగుగాయోచించి సదుద్దేశ్యముతో బ్రిటిషుమంత్రివర్గ సూచనలను ఆమోదించుచు తీర్మానించియుండుటచే ఆ తీర్మానమును ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీవారు తప్పక ఆమోదించుట న్యాయమనియు, ఒకవేళ కార్యవర్గ తీర్మానము సరిగాదని తమకు తోచినయెడల ఆ తీర్మానమునప్పుడు మార్చుటకు వీలులేని సందర్భము లేర్పడియుండుటచే దానికి బద్ధులై ఆ కార్య నిర్వాహక సభ్యుల యెడల తమకుగల అపనమ్మకమును సూచించుటకై వారినివెంటనే మార్చి వేరొక కార్య నిర్వాహక వర్గమును నిర్మించుకొన వచ్చుననియు వారికి నచ్చజెప్పెను. మరియు ప్రభుత్వమువారి ప్రకటనలో భారతదేశములోని రెండు భాగములును రెండు పూర్తి స్వతంత్ర రాజ్యములుగాగాక డుమినియనుగా మాత్రము యేర్పడుననికూడ దెలుపబడియుండుటచే మహాత్ముడు దానిని సమర్థించుచు ప్రస్తుతపు పరిస్థితులలో అధికార బదలాయింపు డుమినియను స్టేటసు పద్ధతి మీదనే జరుగవలసి యున్నందున అటుల గావింబడెననియు, కావున దానినిగూర్చి ప్రస్తుతమున తగాదాబడుట తగదనియు హెచ్చరించెను. 12 వ తేదీన మరల నా విషయమునుగూర్చియే ప్రసంగించుచు భారతదేశములోని ముస్లిములు కొందరు తాము ప్రత్యేకజాతికి జెందినవారమని భ్రమించి తాము సాధించిన ప్రదేశమును పాకిస్తాను అని పిలుచుకొనినను, హిందువులు మాత్రము ఆవాదమున కొప్పుకొనక భారతదేశమంతయు నొకటేయని దృఢముగా నమ్మియుండుటచేత తమ భాగమును ప్రత్యేకించి పాకిస్తానుకు ప్రతిగా హిందూస్తానమని వేరు పేరు పెట్టుకొనరాదనికూడ హెచ్చరించెను.

178. మహాత్ముడు ఆ 1947 జూను 13 వ తారీఖున స్వదేశసంస్థానములను గూర్చి ప్రస్తావించుచు బ్రిటిషు ప్రభుత్వము ఈదేశమునుండి వెడలినవెంటనే సంస్థానాధీశులు తాము స్వతంత్రుల మగుదుమనుకొనుట పొరబాటని మందలించెను. 14 వ తేదీన జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సమావేశములో నలుబది నిముషములు ప్రసంగించి, కాంగ్రెసు వర్కింగుకమిటీ ముందుగా ఆమోదించి తీర్మానించినమీదటనే వైస్రాయి జూను 3 వ తేదీన దేశవిభజన ప్రకటన జేసెననియు కావున వారు వర్కింగుకమిటీ తీర్మానము నామోదింపవలయునని గట్టిగా వాదించెను. ఆసందర్భము

ననే దశరథుని తప్పుకై రాము డడవికి బోవలసివచ్చినను ఆట్టిపోక రావణదుష్కార్య మను వేరొక తప్పును దిద్దుటగా సంభవించి తుదకు ఒప్పుగానే పరిణమించెననియు దెలుపుచు అదేవిధముగా గత్యంతరములేని దేశవిభజన తప్పువలన భగవన్నిర్ణయమును బట్టి యెప్పుడైన నొకప్పుడు ఒప్పు కలుగవచ్చునని ఆసభికులకు నచ్చజెప్పి ఆ తీర్మానము నామోదింపజేసెను. 17 వ తేదీన మహాత్ముడు వైస్రాయిని గలిసికొని అంతవరకు కాంగ్రెసు మంత్రివర్గమును గలిగియుండిన వాయవ్యరాష్ట్రము నప్పుడు పాకీస్తానులో జేర్చుటకు ముందుగా అచ్చటి ప్రజల అభిప్రాయమును కనుగొందుమని బ్రిటిషు ప్రభుత్వమువారు చేసియుండిన సూచన సరిగా నమలుజరుపబడునట్లు చూడవలయునని హెచ్చరించెను. మరునాడు మరల నావిషయమును గూర్చియే మహాత్ముడు మొదట జిన్నా, గఫరుఖానులతో గలిసి వైస్రాయిని సందర్శించి ఆపైని రాత్రి మరల జిన్నాను ప్రత్యేకముగా ఆయనబసకు బోయి కలిసికొని గంటన్నరసేపు సంప్రదించెను. తిరిగి 26 వ తేదీన మహాత్ముడు వైస్రాయిని గలిసికొని ఫ్రాంటియరు రెఫరెండముతో బాటు, పంజాబులో పాకీస్తాను స్థాపనసందర్భమున అక్కడి ప్రజలలో గలుగబోవు అందోళననుగూడ జాగ్రత్తగా గమనించి సరియైనమార్గ మవలంబింపవలయునని కోరెను. జూలై 7 వ తేదీన ప్రార్థనానంతర ప్రసంగములో మాట్లాడుచు అంతవరకు ఏకమైత్రతతోనున్న భారతసేనను విభజించి రెండుడుమినియనులకు బంచుటవలన ఆ డుమినియనుల గల భేదముల ననుసరించి, భారత సైన్యములో విభేదములేర్పడి, మొత్తముమీద దేశమునకు ఉపద్రవము వాటిల్లవచ్చునని హెచ్చరించెను. మరియు, బ్రిటిషు గవర్నమెంటువారి జూను 3 వ తేదీ ప్రకటన ననుసరించి ఇండియాలోని రెండుభాగములును, తమతమ క్రొత్త స్వంత రాజ్యాంగముల నేర్పాటుజేసికొనునంత వరకు రెండు బ్రిటిషుడుమినియనులుగా నుండవలసి వచ్చుటచే డుమినియను సిద్ధాంతము ననుసరించి, నిజమైన యధికారము ప్రజలకందరకు సంక్రమించినను, నామమాత్రమున బ్రిటిషుచక్రవర్తిచే నియమింపబడిన గవర్నరు జనరలొకడు యుండవలసియున్నందున రెండు డుమినియనులకుగూడ ఒక్కడే, అప్పటి వైస్రాయి మౌంటుబాటనే గవర్నరు జనరలుగా తాత్కాలికముగ నుండవచ్చునని, మహాత్మునితోబాటు జిన్నాగూడ మొదట నొప్పుకొనెను. తరువాత జిన్నా వెనుదీసి, తానే పాకీస్తానుకు గవర్నరుజనరలుగా నుండవలయునని పట్టుబట్టుటను అసందర్భమని మహాత్ముడు జూలై 12 వ తేదీన తన అభిప్రాయమును వెలిబుచ్చెను. జూలై 14వ తేదీన బ్రిటిషుపార్లమెంటు ఇండియను ఇండెపెండెన్సు బిల్లునుదెచ్చి, చర్చించి 18 వ తేదీన దానిని చట్టముగా జేసెను. ఆ చట్టములో 1947 ఆగష్టు 15 వ తేదీన భారతదేశమున బ్రిటిషుఅధికార ధూర్త భానుడస్తమించి, ప్రజాస్వాతంత్ర్యాధికార శాంతిచంద్రోదయము చేకూరగలదని దెలుపబడెను.

—

ముప్పది నాల్గవ ప్రకరణము

# భారత స్వాతంత్ర్యానంతరము

## 1947-48

174. మహాత్ముడు కాంగ్రెసు ఆశయమైన భారత స్వాతంత్ర్యసిద్ధి యేర్పడిన వెనుక కాంగ్రెసుసంస్థ భవిష్యత్తులో నిర్వహింపవలసిన కార్యమునుగూర్చి 1947 జూలై తె 28 దిని ఢిల్లీలోనే మాట్లాడుచు కొన్ని సలహాలనిచ్చి యుండెను. కాంగ్రెసుసంస్థ భారతదేశములోని సర్వప్రజల తరపునను యేర్పడిన సంస్థ యగుటచే అనగా యేదోయొక వర్గమునకు మాత్రమే జెందియుండక హిందూ, మహమ్మదీయ, శిక్కు, క్రైస్తవ, పారశీకాది సమస్త వర్గములకును జెంది భారత పౌరు లందరకును సంబంధించి యుండుటచే దేశము రెండుగా విభజింపబడినను ఆసంస్థ మాత్రము రెండుగా విభజింపబడ జాలదనియు, కాంగ్రెసు కమిటీలన్నియు యికముందు సర్వోదయ సంస్థలుగామారి సర్వపౌరుల సర్వతోముఖాభి వృద్ధికై సర్వకాలము ఇంకను యెక్కువగా కృషిచేయ వలసిన యవసరము యేర్పడునని హెచ్చరించెను. ఆవరకే 1930 లోనే భారత స్వాతంత్ర్యసిద్ధి యనంతరము కాంగ్రెసు కమిటీల సభ్యులెవరును ప్రభుత్వము క్రింద నెట్టి జీత భత్యములను కోరి మంత్రిత్వ యుద్యోగములు చేయరాదనియు అట్టి ఉద్యోగము గోరునాతడు కాంగ్రెసుకమిటీ సభ్యత్వమును గలిగియుండరాదనియు మహాత్ముడు తెలిపియే యుండెను. దీనికి కారణము లార్డు అక్టను చెప్పియుండినట్టు "అధికారము మానవుని చెఱచును" అను న్యాయమే. భారత పౌరు లందరును సర్వపౌరుల శ్రేయస్సు నాదర్శముగాగల కాంగ్రెసేయనబడదగి యుండినను, అధికారమునుబూని స్వతంత్రించి తమకు న్యాయమనితోచిన పద్ధతిని అవలంబించువారలు సహజముగా శాసన సభలలో వేరు దృక్పథమును గలిగి వేరు పద్ధతిని అవలంబించదలచు వారలతో ఢీకొనవలసి యుండును. అట్టి యధికారులు యేమాత్రము ఒడుదుడుకు లుండగూడని నూతన సర్వోదయ సంస్థలో సభ్యులుగా నుండజాలరని మహాత్ముని అభిప్రాయమైయుండెను. మహాత్ముని నూతన సర్వోదయ సంస్థ కేవలము సర్వప్రాణుల యున్నతికి అవసరమైన యాదర్శములను ప్రచారముచేసి ఆచరించిచూపుచూ అధికారవాంఛలేని స్వార్థత్యాగులగు నిత్యసత్యవ్రతుల కూటముగా నేర్పడుటయే మహాత్ముని యాశయమైనట్టు ఊహింపనగును. మహాత్ముడు 1930 సంవత్సరములోనే ప్రజాస్వాతంత్ర్య లక్షణమగు ప్రజాస్వామికము అనగా డెమోక్రసీ పద్ధతినిగూర్చి ముచ్చటించుచు కేవల మెజారిటీ వోటుమీదనే ఆధారపడిన పాశ్చాత్య

ప్రజాస్వామికము యిదివరకే వ్యర్థమయ్యెననియు ఆపద్ధతి యిప్పుడు పంచాగ్ని హోత్రములమధ్యనున్నదనియు, పాశ్చాత్యదేశమునకు ఆ పద్ధతివలన అవినీతి, మోసము మిక్కుటమయ్యెననియు భారతపుణ్యభూమిలో యదార్థ ప్రజాస్వామ్య శాస్త్రము వెలుగొందవలయుననియు ప్రజాప్రభుత్వములో సహజముగా అధికారమును బొందు ఏకొద్దిమందియో తాము ప్రజల యొక్క ప్రతినిధులగుటచే తమ ప్రభుత్వము ఆ ప్రజల ఆదర్శములను ఆశయములను ప్రతిబింబింప జేయవలయుననియు, అట్టిదియే యదార్థ ప్రజాస్వామికము లేక నిజమైన డెమోక్రసీ అనియు అట్టిది ఆ యధికారుల త్యాగశీలత మీదను, సేవానురక్తిమీదను నిర్మింపబడునని తెలియబరచి యుండెను. ఆనిజమైన డెమోక్రసీకే మహాత్ముడు సర్వోదయమని పేరుపెట్టెను. అనగా సర్వపౌరుల యొక్క ఉదయమును అనగా సౌఖ్యమును లేక ఉన్నతిని కలిగించుట, మహాత్ముడు 1947 జూలై తె 28 దిని చెప్పిన వాక్యముల భావములను పూర్తిగా అర్థము చేసికొనని కొందరు కాంగ్రెశీయులే 1947 సంవత్సరము ఆగస్టు 11 తేదిని అలహాబాదులో గూడిన ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ సభలో భారతస్వాతంత్ర్యానంతరము కాంగ్రెసు సంస్థ రద్దుకావలెనని మహాత్ముని అభిప్రాయమై యుండినట్లు నెహూౄకు దెలిపిరి. కాని నెహూౄ వారికి జబాబిచ్చుచు అటుల జరిగెనేని దేశములో నావరకే తల లెత్తుచున్న వివిధ విచ్ఛేదక శక్తులు మితిమీరి విజృంభించి దేశము నధోగతి పాలుచేయునని హెచ్చరించెను. ఆ కారణమున మహాత్ముడు 1948 సంవత్సరము జనవరి తె 29 దిన అనగా తాను చనిపోవుటకు ముందురోజున సర్వోదయ ప్రస్థావనను మరలదెచ్చి ఆ సిద్ధాంత ప్రకారము కాంగ్రెసు మంత్రులు జరిగించవలసిన పరిపాలనా ప్రణాళికను గూర్చి తాను ఫిబ్రవరి మొదటివారములో వార్ధాకు బోయి తన పత్రికలో వివరముగా దెలిపెదనని జెప్పెను. కాని దైవఘటన వేరువిధమయ్యెను.

175. మహాత్ముడు ఇండియను ఇండెపిండెన్సు చట్టమేర్పడినతరువాత 1947 జూలై 29 వ తేదీన కాశ్మీరు స్థితిగతులనుగూర్చి వైస్రాయితో చర్చించగోరి, పటేలు, నెహ్రూలతోగలిసి ఆయనకడకేగి, కొంతతడవు సంప్రదించి ఆ మరునాడు విమానముపై రావల్పిండిగుండ కాశ్మీరమునకేగి, మరలివచ్చి తూర్పుబంగాళములోని నవకాళికి పోదలచి కలకత్తాలో దిగెను. ఆ పట్టణములో అధిక సంఖ్యాకులుగనుండిన హిందువులను జూచి భయపడుచుండిన కొందరు మహమ్మదీయుల కోరికపై కొన్ని దినము లచ్చట నుండవలసివచ్చుటచే మహాత్ముడు ఆగష్టు 15 వ తేదీన ఢిల్లీలో జరిగిన భారతస్వాతంత్ర్యోత్సవములో బాల్గొనుటకు నిరాకరించవలసివచ్చెను. మహాత్ముని మహాత్మ్యమువలన ఆగష్టు 18 వ తేదీన కలకత్తాలో నొక వింత మార్పు కలిగెను. ఆవరకు 1946 ఆగష్టు 16వ తేదీన బెంగాలు ముస్లిములీగు గవర్నమెంటుకు ప్రధానిగా

నుండి, జిన్నా యీదేశముపై పాకీస్థానుస్థాపన ప్రయత్న సందర్భమున కలకత్తాలో బ్రిటిషు అధికారులమద్దతను ఊతగాగొని ప్రత్యక్షపోరాటోద్యమముపక్రమించి, ఘోరదారుణ చర్యలను గావించియుండిన సుహారవార్దిపశ్చాత్తప్తుడై మహాత్ముని యొక్క చేలాయగుట మాత్రమేగాక హిందూమహమ్మదీయైక్యతకై బాటుపడెను. మరిరెండు రోజులైనవెనుక, అనగా 1947 ఆగష్టు 20 వ తేదీన విరివియైన వర్తక వ్యాపారిముచే చాల రద్దీగానున్న మార్కెటు ప్రక్కనగల నొక మైదానములో మహాత్మునకు ప్రార్థనానంతర ప్రసంగమున నుపన్యసించుచు అచ్చటజేరిన వేలకొలది హిందూమహమ్మదీయ చూపరులను ఉద్దేశించి వారలందరటుల క్షీరోదకన్యాయమున గలిమెలసియుండుటకు గడు సంతసించెను. మరియు పరస్పర కలహకారణమున ఏకభారతజాతిలో నేర్పడియుండిన రెండు డుమినియనులును, అట్టి ఏకజాతిలోని పరస్పర కలహకారణముననే ఏర్పడియుండిన అమెరికా ఇంగ్లాండుదేశములవలె పరస్పరమైత్రితో గలిసియుండి వారలవలెనే తమతమ ప్రత్యేకజాతీయ పతాకములను ప్రక్కప్రక్కనే యెగురవేసుకొనుచు వందేమాతరం అల్లాహూ అక్బరు అను తమ తమ ప్రత్యేక నినాదములను ఐక్యకంఠములో జేయుచు ప్రజాశ్రేయస్సును గోరుచు, మెలగవలయునని ఆశీర్వదించెను. ఆగష్టు 28 వ తేదీన మహాత్ముడు నిరుద్యోగులై తనను సమీపించిన ఇండియను నేషనలు ఆర్మీ సైనికుల నుద్దేశించి వారు గ్రామములకు బోయి పొలములను సేద్యముచేసి, ప్రజలకు నాహారమొసగూర్పవలసినదని సలహా నిచ్చెను. 30 వ తేదీన బ్రిటిషు మాజీప్రధాని చర్చిలు కుమారుడు మహాత్ముని కలకత్తాలో నతిగౌరవపూర్వకముగా సందర్శించి ఆయనతోబాటు నేలనున్న చాపపై చతికిలబడి యనేక ప్రపంచ వ్యవహారములనుగూర్చి చాలసేపు మాటలాడెను. ఆ రోజులలోనే మరల మత కలహములు కలకత్తాలో చెలరేగనున్నట్లు సూచనలు గానబడుటచే మహాత్ముడవి చల్లారువరకు తాను ప్రాయోపవేశ మొనరించదలచినట్లు సెప్టెంబరు మొదటి తేదీన వెల్లడించి వెంటనే ఉపవాస మారంభించెను. మూడు దినముల తరువాత నాపట్టణమున నద్భుతమైన మార్పుగలిగ ఇరుమతములకు జెందిన వారందరును పశ్చాత్తప్తులరై తామట్టి పరస్పరకలహములకిక ముందుగడంగమని మహాత్మునికి వాగ్దానమిచ్చుటచే ఆయన 4 వ తేదీన రాత్రి 9 గంటలకు తన ఉపవాసము నాపివేసెను. నూటికి 23 మంది మాత్రమే మహమ్మదీయులున్న కలకత్తాలో వారు శాంతియుతముగా జీవించుటకై మహాత్ముడు తన ప్రాణముల నర్పింప సమకట్టినందుకు కృతజ్ఞతను దెలుపుచు నచ్చటి మహమ్మదీయ పక్షపత్రికయగు "మార్నింగుపోస్టు" మహాత్ముని మిగుల గొనియాడెను.

176. మహాత్ముడు ఆ సెప్టెంబరు 7 వ తేదీన ఢిల్లీకి పోయెను. అప్పుడు తానావరకు బసచేసియుండిన హరిజనవాడలో కాందిశీకులుండుటచే అచ్చటి కాంగ్రెసు నాయకులాయనను బిర్లాభవనమునకు గొనిపోయి అందు విడిచిరి. ఢిల్లీలో ఆయన ప్రథమ ప్రార్థన దినమున నుపన్యసించుచు పాకిస్తానులో నిబ్బందుల ననుభవించి క్రోధ మానసములతో ఢిల్లీకి పారిపోయివచ్చిన హిందూ కాందిశీకులు తమ పగను యేపాప మెరుగని ఢిల్లీలోని మహమ్మదీయులపైన దీర్చుకొనుచుండుటను జూచి మహాత్ముడు మిగుల వగచెను. వారట్లు భీరువులై రావల్పిండిలోని తమతమ నివాసములను త్యజించి పారిపోయి వచ్చుటకన్న అచ్చటనే చావుకైనను తెగించి ధైర్యముతో నిలువవలసి యుండెనని హెచ్చరించెను. అక్టోబరు రెండవ తేదీన మహాత్ముడు తన జన్మదినోత్సవసందర్భమున దేశదేశములలోని ప్రఖ్యాత పురుషులు తనకంపిన యభివందనముల నందుకొని తన హృదయములో నాసమయమున దేశమునందుగల హిందూ మహమ్మదీయ కలతల సంబంధమైన దుర్భర అశాంతి వేదన దప్ప వేరొండు ఆలోచన లేదని వారలకు నమ్రతతో కృతజ్ఞతా పూర్వక జవాబుల నంపెను. మహాత్ముడు నవంబరు 13 వ తేదీన ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశమునకు హాజరై దేశములో అప్పుడున్న ఆహారదినుసుల కంట్రోలు, రేషనింగు పద్ధతులవలన ప్రబలుచుండిన అవినీతి, లంచగొండితనమును నిరసించుచు ప్రభుత్వమువారి చర్యను ఖండించెను. కారణమేమనగా యేప్రభుత్వము ప్రజల ప్రత్యేక విషయములలో తక్కువ జోక్యమును కలిగించుకొని పరిపాలించునో అట్టి ప్రభుత్వమే శ్రేష్ఠమైనదను న్యాయమునందు మహాత్మునికి నమ్మకము గలదు. అనగా ప్రజలు ప్రభుత్వమువారుబెట్టు భయమునుబట్టి గాక, స్వతహాగా మంచిమార్గ మవలంబించుటను అభ్యసింపవలయుననియు, ప్రజలు ప్రభుత్వమునకుగాక తోడిప్రజలకే భయపడి వారలయెడ అవినీతి ప్రవర్తనకు దిగకుండ నుండవలయుననియు మహాత్ముని యభిప్రాయము. అందువలన ప్రభుత్వము వారు తమ కంట్రోళ్ళను దీసివేసి, దేశములోగల ఆహారకొరతను ప్రజలే గ్రహించునట్లుజేసి స్వార్థ ప్రయోజనపరుల చర్యలవలన దేశములో కొంత కల్లోల మేర్పడినను, వారంతటవారే తోడిప్రజల నైతిక ఒత్తిడివలన తెలివి దెచ్చుకొని జాగ్రత్తగా ప్రవర్తించుటకు అవకాశమును గల్పింపవలయునని మహాత్ముని ఆశయము. నవంబరు 24 వ తేదీన ప్రార్థనానంతరమున ప్రసంగించుచు, కడచిన దినమున కొందరు హిందూ కాందిశీకులు ఒక మహమ్మదీయుని భయపెట్టి వాని గృహము నాక్రమించుటచే మొదట నేర్పడిన చిరుకలహము క్రమముగా పెద్దదై అనవసరహత్య లేర్పడుటను గర్హించెను. డిసెంబరు మొదటి రోజులలో ఢిల్లీకివచ్చిన బర్మా ప్రధాని మహాత్మునికి ఆదేశపు వ్యవసాయకూలీలు ధరించు ఆకుల టోపీని కానుకగా సమర్పించెను. దానిని

ఆయన ధరించిన వింతదృశ్యము పత్రికలలో ప్రదర్శింపబడెను. ఆ నెల 24 వ తేదీన క్రిస్టమసు పండుగ సందర్భమున మహాత్ముడు ప్రపంచములోని క్రైస్తవ సోదరుల నుద్దేశించి వారందరు జీససుక్రీస్తు బోధనలను తమ జీవితములలో ననుసరింతురుగాక యని దానాశించుచున్నట్లు సందేశ మంపెను.

177. నూతన సంవత్సరము 1948 జనవరి 4 వ తేదీ ఆదివారము సాయం ప్రార్థ నానంతరము మహాత్ముడు ప్రసంగించుచు, అప్పుడచ్చట గురియుచున్న వానను లక్ష్యము చేయక చాలమంది చేరియున్నందున తన సంతసమును వెలిబుచ్చెను. ఆప్ర సంగములోనే కాశ్మీరు విషయమున పాకిస్తానుపై ఇండియను యూనియను యునై టెడ్ నేషన్సు ఆర్గానిజేషనుకు ఆర్బిట్రేషనుకై ఫిర్యాదు చేయుటను సమర్థించెను. మరల 7 వ తేదీన ప్రసంగించుచు పాకిస్తానులోని కరాచిలో ఆ రోజులలో మహామ్మ దీయులు హిందువులను హింసించుచుండగా పాకిస్తాను ప్రభుత్వము వారు ఆకలతల నాపుటకై కృషిచేసి విఫలులగుటనుజూచి విస్మయమంది, చేతగాని అట్టి ప్రభుత్వము రిజైను చేయుట మంచిదని మహాత్ముడు వాక్రుచ్చెను. 8 వ తేదీన ప్రసంగించుచు దేశములో పలుచోట్ల విద్యార్థులు అనవసరముగ సమ్మెలను జేయుటను విని చాల దుఃఖించెను. వారు విద్యనర్థించి తమంతట తాము వచ్చిన వారలగుటచే కళాశాలల నియమములకు కట్టుబడి యుండవలెనని ఆయన యభిప్రాయము. 12 వ తేదీన ప్రసం గించుచు ఢిల్లీలోని హిందూకాందిశీకులు అక్కడి మహమ్మదీయులతో కలతలు పెట్టుకొనకుండ ప్రభుత్వము వారి మిలిటరీ పోలీసుబలముచే నాపబడి పైకి శాంతి వాతావరణము ఏర్పడినట్లు కనబడినను, వారి వారి మనస్సులు మారకుండుటచే సమయ మనుకూలమైనప్పుడు మనస్సులలోని క్రోధాగ్నిమంటలు ఘోరజ్వాలల రూపమున పైకి ఉబుకు సూచనలు తనకు కను పట్టుచుండెననియు ఆ కారణమున తాను కాల నియ మము లేని యనంతయుపవాసమొనరింప నుద్యుక్తుడైనట్లు అకస్మాత్తుగా దెలిపి అమరునాడే ఉదయమున అతిత్వరితముగ మేల్కాంచి భగవత్ప్రార్థనలు సలిపి కాల కృత్యములను దీర్చికొని ఉదయస్నానమును ముగించి ముఖ్యమైనకొగితములను పరిశీలించి 11 గంటలయిన వెనుక హిందూమహమ్మదీయ క్రైస్తవ ప్రార్థనలతో నారంభించి తరువాత తనకు ప్రియమైన 'వైష్ణవజనతో' 'రామధను' పాటలను తన యనుచరులు పాడుచుండగా ప్రాయోపవేశ మారంభించెను.ఆప్రాయోపవేశములోనే 14 వ తేదీన ప్రార్థ నానంతరము మాట్లాడుచు పాకిస్థానమునకు జెందిన ఫ్రాంటియరు రాష్ట్రము నుండి భయపడి వెడలి రాదలచిన హిందూ శిక్కు కాందిశీకులను పాకిస్థాను ప్రభు త్వము వారే ప్రత్యేక రైలుమీద సదుపాయములతో ఢిల్లీకి బంపుచుండగా మధ్య

స్టేషనులో ముస్లిము దుండగీడులు కొందరు ఆ రైలు నాపి లోనున్న కాందిశీకులను కొందరిని బలవంతముగ హత్యచేసినట్టు విని దానికి బాధ్యులు పాకిస్తాను ప్రభుత్వ మనియూ, జిన్నా వాడియుండిన పాకిస్తాను పదముయొక్క నిజమైన యర్థము పాక్ + ఇస్తాను అనగా పవిత్ర స్థలము లేక స్వర్గము అయియుండుటచే అందలి పౌరులందరికిని సమానముగా ఆ పాకిస్తానము స్వర్గతుల్యమై సౌఖ్యదాయకమై యుండవలయునని జిన్నాకు హెచ్చరించెను, 15 వ తేదీన మహాత్ముని శరీరస్థితి క్షీణింపసాగుటచే డాక్టర్లు బిధాన చంద్రరాయి, జీవరాజ మెహతా, సుశీలానయరు గారలు ఆయనను పరీక్షించిరి. ఆదినముననే కేంద్రప్రభుత్వ మంత్రులగు నెహ్రూ అమృతకౌరు గారలు కూడ మహాత్ముని దర్శించి ఆయనతో మాటలాడుచుండగా బయట కొందరు హిందూ కాందిశీకులు చాల అల్లరి నారంభించిరి. వారు తమను మహాత్ముడు తామక్కడికి మహమ్మదీయులపై తీసుకొనియుండిన ప్రతీకార చర్యకు చివాట్లు పెట్టియుండుటచే మహాత్ముడు ఆ ఉపవాసములో చచ్చుటయే మేలని బిగ్గరగా నినాదములు చేయుచుండిరి, ఆనినాదములను విన్న నెహ్రూ యుద్ధండుడై బయటికి వచ్చిన వెంటనే వారందరు పారిపోవుచుండిరి. ఆయన వారి నుద్దేశించి అట్టి నీచనినాదముల జేయుటకెట్లు సాహసించిరోయని యుటకించి వారుముందుగా తనను చంపవలసినదని బెదరించెను,

178. మహాత్ముని యాయన ఘోరప్రాయోపవేశమునుండి మరలించుటకై ఢిల్లీలోని వివిధమతవర్గములకు జెందిన నాయకులు వెంటనే సమావేశమై 'శాంతి కమిటీ'గా నేర్పడి ప్రజలకు మతసహనప్రబోధ మొనరించుచుండిరి. ఆ 'శాంతికమిటీ' తరఫున ఆ జనవరి 15 వ తేదీన జరిగిన బహిరంగసభలో పదివేలమంది సమకూడిరి. నెహ్రూ వారలను సంబోధించుచు, మహాత్ముడు భారతదేశముయొక్క ఆధ్యాత్మిక శక్తి యనియు ఆయనను మనము కోల్పోవుట యనగా భారతదేశము తన ఆత్మను గోలుపోవుటయేయనియు ఘంటాపథముగా చాటెను. మరియు దేశవిభజనకాలమున రెండు డొమినియనులకును ఆస్తిపాస్తుల పంపకమునుబట్టి పాకిస్తానుకు ఇండియను యూనియనులోనుండిన బ్యాంకులనుంచి ఇంకను చెల్లించవలసియుండిన 55 కోట్ల రూపాయిలను పాకిస్తాను పంపకానంతరమున తెచ్చిన కాశ్మీరుతగాదా తీరువరకు ఇవ్వ గూడదని యూనియను కాబినెటు మొదట నిర్ణయించియుండినను, మహాత్ముని అహింసాబోధనల కౌసమయమున సానుభూతి సూచకముగ వెంటనే ఇచ్చివేయుట కప్పుడు తీర్మానించినట్లు గూడ నెహ్రూ ప్రకటించెను. యూనియను కాబినెటు యొక్క మొదటి నిర్ణయమును మహాత్ముడు తా నుపవాస మారంభించిన తరువాతనే

తెలిసికొనెను. వెంటనే ఆయన అప్పటి కాబినెటులోని ఆర్థికమంత్రియగు షణ్ముఖం చెట్టిగారిని తనవద్దకు బిలిపించుకొని సెహార్రి పటేలుల సమక్షమున ఆవిషయమును గూర్చి చర్చించి దేశవిభజనకాలమున మొట్టమొదట నిర్ణయించుకొన్న ప్రకారము బాకీసొమ్మును పాకీస్థానుకు ఇచ్చివేయుటను కొంతకాలము ఆపుచేయవలయుననుట భారతదేశపు అహింసా ధర్మసిద్ధాంతమునకు విరుద్ధమని బోధపరచెను. అందువలన కాబినెటు మరల సమావేశమై ఆషైకమును వెంటనే చెల్లించుటకు తీర్మానించెను. మహాత్ముడు మరునాడు యూనియను గవర్నమెంటువారి యౌదార్యమును గొని యాడుచు, పాకీస్థాను గవర్నమెంటుకూడ యూనియను గవర్నమెంటు ననుకరించి పరస్పర తగాదాలను సులభముగా బరిష్కరించు కొందురుగాక యని తన యాశను వెల్లడించెను.

179. ఢిల్లీలోని కాందిశీకుల యల్లరులు చాలవరకు చల్లారుటచే మహాత్ముడిక తన ఉపవాసము నుపశమింపుకొనునని కేంద్రప్రభుత్వ విద్యాశాఖమంత్రి అబ్దుల్ కలాము అజదు, మరికొందరు నాయకులు 17 వ తేదీ మధ్యాహ్నము మహాత్ముని వేడుకొనగా ఆయన సప్తవరములను గోరెను. అవి :

(1) కొద్దిరోజులలో రానున్న యొక మహమ్మదీయ పండుగలో మహమ్మదీయు లందరు నిర్భయముగా బాల్గొనుట కెవరును అభ్యంతరము పెట్టకుండుట.

(2) ఢిల్లీలో సామధ్య జరిగిన యల్లరుల సందర్భమున హిందూ కాందిశీకులు మహమ్మదీయుల 107 మసీదులను తమ దేవాలయములుగను, నివాసగృహ ములుగను మార్చుకొని యున్నందున వాటినన్నిటిని తిరుగ మసీదులనుగా మార్పించుట.

(3) ఢిల్లీలో నావరకు హిందూ కాందిశీకులచే తమ గృహములనుండి తరిమి వేయబడిన మహమ్మదీయులు తిరుగ తమ నివాసములకు స్వేచ్ఛగా వచ్చి విహరింపనిచ్చుట.

(4) ఢిల్లీని వదలి భయముచే పాకీస్థానుకు పారిపోయిన ముస్లిములు తిరిగి రాదల చినచో వారిరాకను నిర్బంధించకుండుట.

(5) ముస్లిములు ఢిల్లీస్టేషనుకు నిర్భయముగా వచ్చి రైలుప్రయాణము చేయ గలుగ నిచ్చుట.

(6) ఢిల్లీలో ముస్లిములను ఆర్థికముగా బహిష్కరించకుండుట.

(7) ఢిల్లీలో ముస్లిము లెక్కువగానున్న ప్రదేశములలో ముస్లిమేతరులు నివ సించు విషయమును నిర్ణయించుట అచ్చటి నివాసుల ఇష్టమునకు వదలిపెట్ట బడవలయును.

ఈపై షరతుల నమలులోనికి దెచ్చుట కచ్చటి నాయకుల తరఫున అజదంగీకరించి వెంటనే బహుజనులతోగూడిన పెద్ద 'శాంతిసభ' నొకదానిని గావించి, అందుగల మహమ్మదీయుల నుద్దేశించి పాకీస్తానులో మహమ్మదీయ దుర్భరదురంతములకులోనయి యుండుచున్న మనస్సులతో ఢిల్లీకి పారివచ్చిన హిందువుల మన స్తత్వములను బాగుగా గ్రహింపుడని వారిని గోరెను. మరియు ఆసభలోనున్న హిందూ కాందిశీకుల నుద్దేశించి, వారు తాము పాకీస్తానులో ననుభవించిన కష్టములకు ఢిల్లీలోని మహమ్మదీయులను బాధ్యులనుగాజేసి వారిపై ప్రతీకారచర్యను దీసికొనుట పాపకార్యమని వారించెను. అంతట నచ్చటి సభికులందరు ఆసభలోనే ప్రసంగించిన అప్పటి కాంగ్రెసు ప్రెసిడెంటు రాజేంద్రప్రసాదు సలహా ననుసరించి, బిర్లా భవనమునకుబోయి మహాత్ముని తన ఉపవాసముపసంహరించుకొనుమని వేడగా, ఆయన 'భగవదుద్దేశము నెరవేరునుగాక' యని వచించి, ఉభయ డొమినియనులు మైత్రితో మెలగవలెనని యాశించి తానొకరిపై కోపముచేసికొని ఉపవాస ముపక్రమింపలేదనియు, తన యాత్మ పారిశుధ్యమునకే అనగా తనఆత్మ పారిశుధ్యమువలన ఒరులమనసు కరగునట్లు బోధింపగల ఆత్మశక్తిని సంపాదించుటకే తానుపవాస మొనరించితిననియు దెలియజెప్పి, మరునాడు కొంచెము పండురసము ద్రాగి ఉపవాస ముపశమించెను. మహాత్ముని సప్తవరములతో గూడిన శాంతి వాగ్దానపత్రముపై ఢిల్లీలోని వివిధవర్గ నాయకులు సంతకములు చేసిరి.

---

ముప్పదియైదవ ప్రకరణము

# మహాత్ముని చివర పదిరోజులు

## 1948

180. ఆ సంవత్సరము 1948 జనవరి 20 వ తేదీన మహాత్ముడు యధాప్రకారము బిర్లాభవన యావరణలో సాయంకాల మైదుగంటలకు ప్రార్థనానంతర ముపన్యసించుచుండగా ఆయనకు 15 గజముల దూరమున నొక బాంబు ప్రేలెను. అయినను మహాత్ముడానినదమును లక్ష్యముచేయక ప్రసంగించుచునేయుండెను. చదువురాని ఒక బీద ఆడమనిషి ఆ బాంబుప్రేల్చినవానిని గుర్తించి, ఆచూకీ ఇచ్చుటచే నచ్చటి పోలీసులాతనిని బట్టుకొనిరి. ఆతడు పాకీస్తానులోని పశ్చిమ పంజాబునుండి ఢిల్లీకి పారివచ్చిన ఇరువదియేండ్ల హిందూకాందిశీకుడనియు, అతని పేరు మదనలాలు అనియు తరువాత తెలియవచ్చెను. ఆ సాయంత్రము చాలసేపు వరకు తన ప్రభుత్వ ఆఫీసుపనిలో నిమగ్నుడైయుండిన భారత ప్రధాని నెహ్రూ యావార్తను విన్నతక్షణమే ఎక్కడికాగితము లక్కడ విడిచి హడావిడిని బిరాన బయలుదేరి బిర్లాభవనములో శాంతిమూర్తియైయున్న మహాత్మునిదర్శించి ఇరువది నిముషములు గడిపెను. ఆ తరువాత ఆరోగ్యశాఖామంత్రి రాజకుమారి అమృతకౌరు మహాత్ముని దర్శించెను. శాంతిభద్రతల శాఖామంత్రి సర్దారు పటేలాదినమున బొంబాయిలో పనిమీద నుండవలసి వచ్చెను. ఈ సందర్భమున మహాత్మునిపై పదునాలుగు సంవత్సరముల క్రితము యాయన హరిజనోద్యమమునకు విముఖుడైయుండిన యొక పూర్వాచారపరాయణుడు పూనానగరమున బాంబువేయ ప్రయత్నించినప్పుడు కొంచెములో తప్పిపోయిన సంగతి జ్ఞాపకమురావచ్చును. ఆ సమయమున మహాత్ముడు ఆబాంబు ప్రేలుడు తన నెంతమాత్రము కలవరపరచలేదనియు, తనశరీరమను ఉపాధిని భగవంతుడు తనసృష్టి పరిణామములో ఈ ప్రపంచమున నెంతకాల ముపయోగింపదలచెనో అంతకాలము తనకేమియు ప్రాణభంగము వాటిల్లదని తన నిశ్చితాభిప్రాయమైనట్లు వెలిబుచ్చియుండెను. అట్టిజవాబే మహాత్ముడు ప్రస్తుతమునగూడ నిచ్చెను.

181. మహాత్ముడు కోరియుండినసప్తషరతుల నమలులో బెట్టుటకై ఢిల్లీలోని శాంతిసభాసభ్యులు ప్రయత్నించుచుండగా ఆల్ ఇండియా హిందూమహాసభ జనరలు కార్యదర్శియగు అషుతోషలాహిరీ మహాత్ముని ప్రార్థనసభలో బాంబుప్రేలిన ఆ 20 వ తేదీననే నొక ప్రకటన జేయుచు, అందులో హిందూమహాసభ మహాత్ముని షరతుల కొప్పుకొనలేదనియు, కావున వాటినమలులో బెట్టుబాధ్యత తమకేమాత్రము లేదనియు ముస్లిములకై మహాత్ముడొనరించిన అప్పటి ఉపవాసమువలన హిందువుల

స్థితి కడుబలహీనమయ్యెననియు, ఇండియనుయూనియను పాకిస్తానుకు బాకీయుండినను అప్పటిలో చెల్లించుటవలన హిందువులలో క్రోధాగ్ని రగులుచున్నదనియు, పాకిస్తానులో మహమ్మదీయులు అక్కడి హిందువులయెడ నన్యాయముగ బ్రవర్తించినను ఇండియను యూనియనులోని హిందువులుమాత్రము ఇక్కడి మహమ్మదీయులయెడ న్యాయముగా బ్రవర్తిపవలయునన్న మహాత్ముని మూల సిద్ధాంతమును తామెంతమాత్ర మొప్పుకొన జాలమనియు స్పష్టముగా దెలియబరిచెను. దీనినిబట్టి మహాత్ముని హిందూ మత దృష్టికిని, హిందూమహాసభవారి హిందూమత దృష్టికిని గల దృక్పథభేదము గమనించదగిన విషయము.

182. మహాత్ముడు మరునాటి (21-1-48) ప్రార్థనానంతర ప్రసంగములో క్రిందటి దినమున జరిగిన బాంబుప్రేలుడు నుద్దేశించి యాబాంబు వేసినవానిని ప్రజలు దయతోజూచి అపకారమేమియు జేయక అతనికి జ్ఞానతేజస్సు గలిగించునట్లు భగవంతుని బ్రార్థించవలసినదని కోరెను. అతడు తనను జంపుటవలన హిందూమత ముద్ధరింపబడ గలుగునని నమ్మినట్లు పోలీసులతో జెప్పియుండెననియు, అది అజ్ఞానముచే నన్న మాటయనియు, నిజముగా భగవంతుడు హిందూ మతోద్ధారణకై యెవరినైన నియమించ దలచిన యెడల తప్పక తననే నియమించి యుండునని మహాత్ముడు తెలిపెను. మరియు ఆబాంబు వేసిన హిందూ కాందిశీకుడు మదనలాలు అవరకు ఢిల్లీలో తనకు సరియైన నివాసస్థలము దొరకమిచే నన్యాయముగా నొక మహమ్మదీయ మసీదు నాక్రమించుకొని యుండెననియు, పోలీసులాతని నామసీదునుండి తరిమివేయుటచే వారిపై కినుక వహించి పోలీసులట్లు జేయుటకు గారణము మహాత్ముడే అవరకట్టి అన్యాయపు ఆక్రమణలను నిరసించి యుండుటయే యగుటచే, మదనలాలు కోపము మహాత్మునిపై బారెననియు, ఆకారణమున పాపము మదనలాలు మహాత్ముని హిందూ మతమునకు విరోధిగాదలచి యుండెననియు మహాత్ముడే ఆ ప్రసంగములో దెలిపెను.

183. మహాత్ముడు తన యుపవాసానంతరము శక్తిహీనతచే ఒక కుర్చీమీద ప్రార్థనాస్థలమునకు దేబడుచుండినను, 22వ తేదీన మొదటిసారి నడిచివచ్చి, ఢిల్లీలోని కొందరు కాందిశీకులకు, వారి కుటుంబములకు నెహ్రూ మొదలగు భారత మంత్రులు తమ యిండ్లలో బసలనిచ్చి కాపాడుచున్నందుకు తన ఉపన్యాసములో తన సంతసమును వెలిబుచ్చి, వారియౌదార్యమును తదితర గృహస్థులుగూడ వీలైనంత వరకు అనుకరించి, కాందిశీకుల సమస్యను కొంతవరకైనను పరిష్కరించ గలుగుదురు గాక యని వాంఛించెను. జనవరి 23వ తేదీ ప్రార్థనానంత రోపన్యాసములో ఆదినము దేశభక్త నేతాజీ సుభాసుచంద్ర బోసు జన్మదినమగుటచే ఆయన యెడల

తనకుగల విశేష గౌరవమును వెల్లడించి, ఆయన స్థాపించిన ఇండియను నేషనలు ఆర్మీ యేవిధముగా జాతి, మత వివక్షతలను విస్మరించి ఐకమత్యముతో మెలగియుండిరో, ఆమార్గమును మనమందర మనుకరింతుముగాక యని హెచ్చరించెను.

184. మరునాడు అనగా 24 వ తేదీ సాయంకాలము కర్నాటక నాయకులు కొందరు మహాత్ముని దర్శించి, కర్నాటక భాషారాష్ట్ర నిర్మాణమునుగూర్చి చర్చించిరి. ఆమరునాడు మధ్యాహ్నము వారు కాంగ్రెసు వర్కింగు కమిటీవద్దకు రాయబారము పోయి ఒక మెమోరాండమును సమర్పించిరి. మహాత్ముడా సమయమున నక్కడ యుండి యుండుటచే వారి వాదమును వినియుండెను. ఆరాయబారము వెడలి పోయిన వెనుక మహాత్ముడు తనప్రక్కనున్న పట్టాభిగారిని పలుకరించి "చూడుము, పట్టాభీ, ఆంధ్రరాష్ట్రం వెంటనే యేర్పడవలెనని నీఉద్దేశము అయినచో యీరోజున ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము క్రిందనున్న ప్రదేశములలో తగాదాలేని భాగములను ప్రత్యేకించి ఆవిధముగా ఖాయమైన ప్రాంతములతో ఆంధ్రరాష్ట్రమును ముందుగా యేర్పరచుకొనుము. మిగతా ప్రాంతములకొరకు మూడు నాలుగేండ్లయిన తరువాత బౌండరీ కమిషనును యేర్పరచుమని ప్రభుత్వమును అడుగుము" అని చెప్పెను. కాని ఆ సాయంత్రము మహాత్ముడు ప్రార్థన సభలోకూడ భాషాప్రయుక్త రాష్ట్ర ప్రశంసను తెచ్చి యీవిధముగా ఉపన్యసించెను.

"కాంగ్రెసు వర్కింగు కమిటీవారు గత రెండుదినములుగ సమావేశమై భాషాప్రయుక్తరాష్ట్ర విభజననుగూర్చి చర్చించుచున్నారు. ఆసమావేశములో నెహ్రూ, పటేలులుగూడ నుండిరి. కాంగ్రెసు యీవరకే 1920 వ సంవత్సరములో అట్టి విభజన సిద్ధాంతమును భాషారాష్ట్ర కాంగ్రెసు సంఘ నిర్మాణముల ద్వారా అమలులో పెట్టినది. కాంగ్రెసు అధికారములోనికి వచ్చిన వెనుక పరిపాలన విషయములోగూడ ఆసిద్ధాంతమును చట్టరీత్యా అమలు జరిపెదనని యీవరకే హామీయిచ్చియుండెను. భాషలనుబట్టి రాష్ట్ర విభజన చేసినయెడల మనదేశములోని ప్రజలందరకును విజ్ఞానాభివృద్ధికలుగును. అయితే అటువంటి విభజన భారతదేశము యొక్క నిజమైన ఐక్యతకు భంగకరమైన శక్తులను రేకెత్తించరాదు. కాంగ్రెసు దృష్టిలో భారత స్వాతంత్ర్య స్వభావము అందలి గ్రామ స్వాతంత్ర్యము మీద ఆధారపడి యున్నది. అయినను గ్రామములనుండి ఏవిధముగా కేంద్రమునకు శక్తి, అధికారము సంక్రమించుచున్నదో, అదేవిధముగా గ్రామములును కేంద్రమువలన జవసత్వములను పొందవలెను. భాషారాష్ట్ర విభజనవలన సంకుచిత రాష్ట్రీయ

తత్వ మేర్పడి పరస్పరవైషమ్యములు పోటీలు ఏర్పడేయెడల అట్టి స్థితి దేశమునకు ఉపద్రవకారియగును. మచ్చుకు ఆంధ్ర-తమిళ, బొంబాయి-కర్నాటక మొదలైన తగాదాలు గలవు. రాష్ట్రభాష సంపూర్ణ ఔన్నత్యమును పొందగలయున్న భాషాప్రయుక్త రాష్ట్ర విభజనమవసరము. అయినను భారతదేశమంతయు నైజముగా ఒకటే అను భావమును పెంపొందించుటకు దేశమునకంతకును ఏకభాష కూడ అవసరము. బయటి ప్రపంచములో మనలను భారతీయులని యెరుగుదురు. కాని ఆంధ్రులు, తమిళులు, మహారాష్ట్రులు, కన్నడులు అని యెరుగరు కావున విభేదముల వైఖరుల నన్నిటిని కఠినముగా త్రోసిపుచ్చి మనమందరమును భారతీయులమని భావించి వ్యవహరించవలెను. ఈ ప్రాముఖ్య విషయము మరుగుపడకుండా భాషా ప్రయుక్తరాష్ట్రములు ఏర్పడి దేశములో విద్యకు, వర్తకమునకు తగినప్రోత్సాహమును కలిగించవలెను. ఈ నూతన దృక్పథముతో సరిహద్దులను పునర్నిర్మించుటకుగాను బౌండరీ కమిషను అవసరముండదు. (మధ్యాహ్నము పట్టాభితో మాట్లాడినప్పుడు బౌండరీ కమీషను అవసరమని చెప్పి సాయంత్రము పునరాలోచన వలన మహాత్ముని మనస్సు మారిపోయెను) ఈ నూతన దృక్పథముతో పరస్పరము సమాధానపడి వివాదగ్రస్తులు తమకు తామే సరిహద్దులను నిర్ణయించుకొనుటయు, అనిర్ణయమును ప్రధానమంత్రి యెదుట అధికారముద్ర వేయుటకై ఉంచుటయే ఉత్తమోత్తమమైన కార్యము. అదియే నిజమైన స్వాతంత్ర్యమగును. వివాదమును పరిష్కరించుమని బౌండరీ కమిషను రూపములో నుండు మూడవపార్టీయెదుట నిలుచుట స్వాతంత్ర్య ఆభాసము. అటుల గాక పరస్పరఆశ్రయమును ఒండొరుల సహకారమును పెంపొందించుకొనవలయును. శ్రీ ప్రకాశంగారు కూడా ఆ 48 సంవత్సరము మార్చి 23 వ తేదీన మద్రాసు ఎస్సెంబ్లీలో మాట్లాడుచూ ఈలా అన్నారు.

"నేను జనవరి 28 వ తేదీన గాంధీజీని చూచాను. ఆయన నాతో ఇట్లు అన్నారు. "ప్రకాశం, మీలో చీలికలు కూడదీసుకో బౌండరీ కమీషను ఏర్పాటువల్ల గాక సమాధానమువల్ల సమకూరేటట్లు చూడు"-అలా చేస్తానని మహాత్మునికి వాగ్దత్తం చేశాను.

185. మహాత్ముడు మరునాడు అనగా జనవరి 26 వ తేదీన ప్రార్థనానంతరోపన్యాసములో, ఆదినము భారతస్వాతంత్ర్య దీక్షాదినమగుట దలపోసి, అప్పటికి భారతదేశమునకు స్వాతంత్ర్య మొచ్చియుండుటచే నికముం దాదినమును మరియొకవిధ

ముగా నుపయోగించవలసినదని ఎఱుకపరచెను. అవిధమేమనగా భారతస్వాతంత్ర్యము పట్టణములలోని విద్యార్థులకు మాత్రమేగాక, పల్లెలయందుగల సర్వపౌరులకును గలిగినదనియు, కావున ఆపల్లెవాసు లంతవరకును గలిగియున్న మానసిక బానిసత్వమును వీడి ధైర్యముతో తమవృద్ధికై సర్వవిధముల బ్రయత్నింపగలుగునట్లు సరియైన అవకాశములను గల్పించుటయేయని దెలియబరచెను. భారతస్వాతంత్ర్యముయొక్క లాభములను పల్లెలలోని కార్మికులకు, కర్షకులకు జెందకుండునట్లు జేయుట నిజమైన భారతస్వాతంత్ర్య మనబడజాలదనియు, అందుకుగాను ధనికులగు పెట్టుబడిదారులు నూతన దృక్పథమును అలవరచుకొనవలయుననియు హెచ్చరించెను. వస్తుయుత్పత్తిదారులగు కార్మికులు, కర్షకులు తమదేశక్షేమ మపేక్షించి పరప్రభుత్వములోవలె చీటికిమాటికి సమ్మెలకు దిగక, ఉత్పత్తి నధికపరచుటయందే మనస్సులను లగ్నపరచవలయుననికూడ మహాత్ముడు పేర్కొనెను. 27 వ తేదీ యుపన్యాసములో ఢిల్లీలోని హిందూ కాంగ్రెసికుల చర్యలను విమర్శించుచు తానా యుదయమున నొక మహమ్మదీయుల దర్గాలో జరిగిన ఉరుసు ఉత్సవమునకుబోయి అదర్గాకు హిందూ కాంగ్రెసికు లావరకు గావించియుండిన అమితనష్టమును గాంచినప్పుడు తనకు గలిగిన విషాదము నాసభికుల కెరింగించెను. ఆసభికులలో గొందరు పాకిస్తానులో అక్కడి మహమ్మదీయులు అక్కడి హిందూదేవాలయములకు అంతకన్న నెక్కువ నష్టము నాపాదించియుండిరని దెలుపగా మహాత్ముడు తప్పులను జేయుటలో నొకరి నొకరు మించవలయునని బ్రయత్నించుట మంచిదిగాదని వారలకు బోధపరచెను.

186. మహాత్ముని దైనందిన బహిరంగప్రార్థనసభలలో ముందుగా బౌద్ధ, పారసీక, క్రైస్తవ, మహమ్మదీయ పవిత్రగ్రంథములలోని భాగములతోబాటు ఉపనిషద్భాగములును, మోక్షార్హుడైన స్థితప్రజ్ఞుని లక్షణములనుగూర్చిన భగవద్గీతా ద్వితీయాధ్యాయములోని చివరి పందొమ్మిది శ్లోకములును పఠింపబడి రామధూనుభజన చేయబడుచుండెను. మహాత్ముడా 27 వ తేదీన బహిరంగసభానంతరము బిర్లాభవనములోని తనగదికి బోయినవెనుక అమెరికానుండి క్రొత్తగా వచ్చిన విం సెంటు షీయరు దొరగారితో అనేక తత్వవిషయములనుగూర్చి చాలసేపు సంభాషణను సాగించెను. మరునాడుగూడ ఆయనతో మరికొంత సంభాషణను జరిపెను. తిరిగి మూడవదినమునగూడ రమ్మనగా, ఆదొరగారు తాను నెహ్రూతో గలిసి 29 వ తేదీన అమృతసరమునకు బోయి ఆయనతో 30 వ తేదీన తిరిగి వత్తునని దెలుపగా మహాత్ముడు వల్లెయని యాయనకు సెలవొసంగెను.

187. ఆ 1948 జనవరి 30 వ తేదీ శుక్రవారమున మహాత్ముడుదయాత్పూర్వమే మేల్కాంచి, తన అంతరంగిక భృత్యుడగు విశ్వనుని బిలిచి, తనకొరకు

వచ్చియున్న లేఖలనన్నిటిని సేకరించి తెమ్మని తానా దినమున వాటికన్నిటికి జవాబులను వ్రాయవలసియున్నదనియు, మరునా డుండుదునో లేదోయని అసందిగ్ధముగా బలికెను. ఆసాయంత్రము యథాప్రకారము 5 గంట లయినవెనుక, 12 నిముషము లాలస్యముగా బిర్లాభవనమునుండి బయటికివచ్చి తన ఇద్దరు మనుమరాండ్రగు ఆవాగాంధి, మనుగాంధిగారల భుజములపై చేతులుమోపి మామూలుగాబోవు పొదరింటి పందిరిక్రిందనుండిగాక, ప్రక్కనున్న గడ్డితోనున్న బాటపైనడచి, ప్రార్థనప్రదేశగద్దె మెట్లపై నెక్కుచు తన చేతులను జోడించి సభికులకు నమస్కరించుచుండెను. వెంటనే ఆసభికుల నడుమనుండి యువకుడొకడు తొందరగ ముందుకు దోసికొనివచ్చి మహాత్ముని కాళ్ళకు నమస్కరించు వడువున వంగబోగా మనుగాంధి, ఆవఱకే ఆలస్యమైనది గావున ఆయనను ఆపగూడదని చెప్పుచు, ఆతనిచేతిని బట్టుకొనెను. ఆతడామెచేతిని విదలించుటచే ఆమె రెండవచేతిలోనున్న భజనావళిగ్రంథము, పీకుదాను, జపమాల క్రిందపడెను. వాటిని దీసికొనుటకు ఆమె క్రిందికి వంగగా ఆతడు మహాత్ముని బట్టుకొనిన ఆవాగాంధిని అవతలకునెట్టి మహాత్ముని కడుపుపై తనచేతి పిస్తోలులో నొకగుండును గాల్చెను. వెంటనే మహాత్ముడు 'హే రామా' యని యరచుచుండగనే నాయువకుడు మరిరెండుగుండ్లను వెంటవెంటనే నొకత్రుటిలో ఆయనరొమ్ముపై ప్రేల్చెను. తత్క్షణమే మహాత్ముడు వెనుకనున్న మనుమరాలిపై ఒరిగి పడుటచే, ఆయన కళ్ళకు దగిలించుకొనిన కళ్ళజోడు, కాళ్ళకు దగిలించుకొనిన కాళ్ళజోడు సడలి యూడలబడెను. ఆగుండ్లదెబ్బలచే మహాత్మునికి కడుపునుండియు, రొమ్మునుండియు రక్తము పొంగి పొరలుచుండెను. వెంటనే అక్కడివారాయనను బిర్లాభవనములోని ఆయనగదికి మోసికొనిపోవుచుండగా దోవలోనే ఆయనకు స్మారకము తప్పిపోయెను. మహాత్ముని హత్యజరుగునపుడు వింసెంటు షియారుదొరగారా సభలోనే దూరముగా నుండిరి. అప్పుడు మహాత్ముని చుట్టు చాలమంది మూగియుండుటచే ఆయన గుండ్లధ్వనిని మాత్రము వినెనుగాని హత్యను గాంచలేదు. అయినను ఆయన కుడిచేతి రెండువేళ్లు అకస్మాత్తుగా మండుటచే వాటిని నోటిలోతడిపి బయటికితీసి చూచుకొనగా, బొబ్బలేర్పడియుండుటకు ఆశ్చర్యపడుచుండెను. అంతలో తానావర కారునెలలక్రిందట అమెరికాలో నొకరాత్రి మహాత్ముని నెవరో గుండ్లువేసి చంప బ్రయత్నించుచుండినట్టును, తానాయనను రక్షించదలచి మధ్యకుబోయి చేతులు కాల్చుకొనినట్టును గనిన కల జ్ఞప్తికివచ్చి, తన కప్పటిబొబ్బలకు కారణము 'సైకో సొమాటిక ఫినామినా' యని తరువాత తన గ్రంథములో వ్రాసుకొనెను.

188. మహాత్ముని పేల్చిన యా హంతకుడు వెంటనే, చైనానుండి అప్పుడే క్రొత్తగా ఆ సభకువచ్చిన అమెరికను యువకునిచేబట్టుకొనబడి పోలీసుల కప్పగింప

బడెను. ఆ హంతకుడు హిందూమహాసభకును, రాష్ట్రీయ స్వయంసేవకసంఘము నకును జెందినవాడనియు, పూనాలో 'హిందూరాష్ట్ర'మను మహారాష్ట్ర దైనిక పత్రికకు సంపాదకుడనియు, నాథూరాంవినాయక్ గాడ్సే యను పేరుగల మహారాష్ట్ర బ్రాహ్మణుడనియు ఆ తరువాత తెలియవచ్చెను. మహాత్ముడు బిర్లాభవనములోని తన గదికి దీసికొని పోబడి పరుండబెట్టబడినతరువాతగూడ కొనయూపిరితోనున్నను కొంతసేపటికాయన పవిత్రాత్మ భౌతికబంధములనుండి విడివడెను. మహాత్ముని మరణ వార్త వెంటనే రేడియోద్వారా వాయువేగమున దిగంతములకు వ్యాపించి ఎందరినో దుర్భరదుఃఖమహార్ణవమున ముంచివేసినది. ఢిల్లీలోని ప్రభుత్వమంత్రులందరు వెంటనే బిర్లాభవనమునకేగి, రెప్పపాటులేక మహాత్ముని కళేబరమును జూచి లోలోన దుఃఖించుచుండిరి. ధీరుడైన జవహారులాలుసైతము బేలయై మహాత్ముని కళేబరమున బడి ఆయనపైనున్న బట్టలో తనతలను దూర్చి వెక్కివెక్కి యేడ్చుచుండెను. తెల్లవార్లు ప్రక్కనున్న మహాత్ముని అనుచరులు జీవములేని రాతిబొమ్మలవలె నిశ్చేష్టితులై యుండిరి. ఒకమూల రామధ్వనినిరంతరము ఆలాపింపబడుచుండెను. మరునా డుదయమున మహాత్ముని కళేబరమును నెహ్రూ, పటేలు ప్రభృతులు అతిగౌరవముతో అయిదుగంటలూరేగించి హిందూ ఆచారమననుసరించి ఢిల్లీలోని యమునానదీతీరమున రాజఘాటునందు అగ్నిదేవునికాహుతిజేసి, తరువాత అస్థులను సేకరించి అలహాబాదులోని త్రివేణిసంగమమునకు పదమూడవదివసమగు ఫిబ్రవరి 12 వ తేదీన గొనిపోయి జాహ్నవీనదియొక్క పావనతోయములలో శ్రద్ధాభక్తిపూర్వకముగా లీనమొనరించిరి.

---

# ముప్పదియారవ ప్రకరణము

## మహాత్ముని నూతన సందేశములు

189. నిజముగా మహాత్ముని సందేశములు నూతనములుగాక, ఆర్యఋషుల నేకవేల యేండ్లక్రిందటనే బోధించినవే. మహాత్ముడెక్కువగా ఒత్తిచెప్పుచుండిన అహింసా, సత్యసిద్ధాంతములు, ''అహింసా పరమోధర్మః'' 'సత్యాన్నాస్తి పరోధర్మః' యను పురాతన ధర్మసూత్రములనుబట్టి, సనాతన శాశ్వత ధర్మములని బోధపడగలవు. అట్టి శాశ్వత ధర్మములగు అహింస, సత్యములయొక్క ఔన్నత్యమును మన పూర్వులే ప్రత్యేక మానవ చర్యలద్వారా బోధించియుండిరి. అవి: ప్రహ్లాద చరిత్రము, హరిశ్చంద్ర చరిత్రము. ఆనాటక ప్రదర్శనములను మహాత్ముడు చిరుప్రాయముననే వీక్షించిననాట నుండియు అహింసా, సత్య బీజములు ఆయన మానసిక క్షేత్రమందు లోతుగా పాతుకొని ఆయన పావన జీవితమునందు మొలకలెత్తి పుష్ప ఫల సమన్విత వృక్షములై, తమ సౌరభములను, కాంతులను నలుగడల వ్యాపింపజేసెను. మరియు,

'అహింసా ప్రథమం పుష్పం, పుష్పమింద్రియ నిగ్రహః,
సర్వభూత దయాపుష్పం, క్షమాపుష్పం విశేషతః,
శాంతిపుష్పం, తపః పుష్పం, ధ్యానం పుష్పం దశైవచ,
సత్యమష్ట విధం పుష్పం, విష్ణోః ప్రీతికరంభవేత్'

అను నార్యోక్తి ననుసరించి మహాత్ముడా అష్టవిధ పుష్పములను సదాధరించి వాటితోడనే తనజీవితమునంతను భగవంతునికి ప్రీతికరముగ సర్పించెను.

190. భగవంతుడు మానవులను స్వేచ్ఛతో సృష్టించుటకు పూర్వమే, వారు ప్రపంచమున ననుసరింపవలసిన సరియైన జీవనపద్ధతులను బోధించు వేదములను ముందుగనే గల్పించెననియు, కాలగతినిబట్టి మానవులు తమ స్వేచ్ఛేచ్ఛను దురుపయోగముచేసికొని, ఆ బోధనలను మరచిపోయినప్పుడు, దయార్ద్రహృదయుడగు నా భగవంతుడు మానవరూపమున నవతరించి ఆయాకాలముల కనుగుణముగ, తన నడవడికచేతను, బోధనలచేతను, తనతోడి మానవులకు ఆదర్శప్రాయుడై చరించుననను నమ్మకము హిందువులలో కలదు. అటుల ఆయాకాలముల పరిస్థితుల ననుసరించి, మానవులుగా జనించి, చరించియుండిన శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీబుద్ధభగవానులు ముప్పరునుభగవంతుని అవతారములలో చేర్పబడిరి. అయినను ఆ ముగ్గురి యెడలనుభక్తి, విశ్వాసములను కలిగిన విమర్శకులు కొందరు వారివారి

చరిత్రలలో, వారివారి చరిత్రకారులు ఒక్కొక్క లోపమునుగూడ చిత్రించి కనుగొనిరి. ఆలోపములు: శ్రీరాముని చరిత్రలో ఆయన చెట్టుచాటున నుండియుండిని వాలిని కూలనేయుట, శ్రీకృష్ణుని చరిత్రలో ఆయన ధర్మరాజుకు 'ప్రాణ రక్షణ సమయమున అసత్యదోషములేదు' అని చెప్పుట, శ్రీ బుద్ధునిచరిలో ఆయన సృష్టికర్తయను భగవంతునిగురించి మూకీభావమును వహించియుండుట. ఈ లోపము లను మన పూర్వులే యొప్పుకొనియుండి, తాము వ్రాసియుండిన గ్రంథములలో, శ్రీరాముడే, తాను అధర్మముగ చాటుననుండి బాణము వేసిన తనచేతిని, ఒకానొక సందర్భమున నిందించుకొనినట్లును మరియు, కర్మసిద్ధాంతము ననుసరించి తానును, తన మరుజన్మమున, అనగా కృష్ణావతారములో చాటుననున్న ఒకబోయవాని బాణ ముచే గూలవలసివచ్చెననియు, శ్రీకృష్ణుని సలహాపై అబద్ధమాడినట్లు తెలుపబడిన ధర్మరాజు మరణానంతరమున నరకముగుండ గొనిపోబడినట్లును, శ్రీబుద్ధుడు ఆకాలము నకు అవసరముగా గనుపించిన ధర్మబోధమాత్రమే చేసి, ధర్మమునకు ఆధారమైన భగవంతు నుపేక్షించెననియు, తెలిపియుండిరి. ఆ అవతారము లట్టి లోపభూయిష్ట ములై యుండి యుండుటచే కాబోలును, ఆలోపములను గూడ సవరింపనెంచి, ఆభగవంతుడే మహాత్ముని పావనజీవితముద్వారా వ్యక్తుడై రహస్యసమర నిరసన, అసత్య సర్వకాలదూషణ, నిరంతర భగవత్ప్రార్థనల నాచరించి, బోధించి, మాన వాభ్యుదయమునకు మార్గదర్శకుడుగ అవతరించినట్లు గన్పట్టును. ఈ సందర్భములో సత్యానుసరణ విషయమున సత్యహరిశ్చంద్ర చరిత్రలోని, 'తుద కసింగొని ప్రాణము తీయవచ్చినన్ బలుకగరాదుసూవె యణుమాత్ర మసత్య మెప్పుడున్' అను పూర్వ న్యాయమే స్మరణకు రావచ్చును. సత్యమును ఎల్లప్పుడును బలుక నవసరములేదని వాదించువారు రెండుకారికలను జూపుదురు. అందొకటి భాగవతములోని 'వారి జాక్షులందు' అనుపద్యము. శ్రద్ధగా బరిశీలించినచో, అది బలిచక్రవర్తికి ఇవ్వబడిన చెడ్డసలహాయనియు, దానిని ఆయనచే, తృణీకరింపజేయుటచే, అది ఆచరణ యోగ్యము కాదనియు, భాగవతకారుని అభిమతమైనట్లు స్పష్టముగా తెలియును. ఇంక రెండవది. మనుస్మృతిలోని శ్లోకములో నొకభాగమగు "నబ్రూయాత్ సత్యమప్రియం" వారు ఆ శ్లోకములోని చివరిభాగమగు "ప్రియంచ నానృతం బ్రూయాత్" ను విస్మరింతురు. వీటినిగూర్చి మహాత్ముడొకతూరి వ్యాఖ్యానించుచు, 'సత్యమును అప్రియోద్దేశముతో చెప్పకుము', 'ప్రియముగా నుండునని అసత్యమును చెప్పకుము," యని తన అర్థమును విశదీకరించెను. మహాత్ముని ఇతరబోధనలు నూతన దృక్పథమును సూచించుచు సామాన్యజనుల అభిప్రాయములకు భిన్నముగ నుండును. అవి.

(1) ఎదుట ననలేనిమాటను వెనుకననకు.

(2) ఫలితమేదైనను, ప్రయత్న పవిత్రతయే గణనీయము.

(3) ఆర్థికాభివృద్ధికన్న నైతికాభివృద్ధి అత్యంతప్రాముఖ్యము.

(4) ప్రతీకారచర్య విషచక్రమగు 'బూమరాంగు' వలె ; వెనుకకు మరలి శాశ్వతఫలము నివ్వనేరదు.

(5) సాధింపదగిన విషయమెంత మంచిదైనను, సాధనమార్గము గూడ నీతివంతమై యుండవలయును,

191. భాగవతములోని సప్తమస్కంధమున దెలుపబడిన కథయందు భగవంతుడు, ప్రపంచమావర కెరుగని నూతనమార్గమును గనిపెట్టి చూపించినట్లు, మహాత్ముడును ఒక నూతన మార్గమును గనిపెట్టి మన కందజేసెను. ఆవరకుగల అనుభవ జ్ఞానమునుబట్టి హిరణ్యకసిపుడు తాను మరణించుటకు రెండే మార్గములు కలవనియు, అవి: మనిషిచేతనో, మృగముచేతనో; పగటి వేళనో, రాత్రి వేళనో; భూమిమీదనో, ఆకాశములోనో; మాత్రమేయని తలచి అటులు గాకుండుటకై బ్రహ్మనుండి వరములను బొందెను. మూడవ మార్గము కలదని తెలిసిన భగవంతుడు నరసింహావతారమై సంధ్యవేళ తనతొడపై అతనిని సంహరించి చూపించిన మూడవ మార్గమువలెనే మహాత్ముడును మన దేశములో నంతవరకు పర ప్రభుత్వము నెడల ననుసరింప బడుచుండిన అహింసాపూర్వక అర్జీలు హింసాపూర్వకమైన తెగువ అను రెండు మార్గములను సమన్వయపరచి, మొదటిదానిలోని అర్జీలను రెండవదానిలోని హింసను దిగవిడచి "అహింసా పూర్వకమైన తెగువ" అను మూడవ మార్గమునుకూడ కనిపెట్టెను. అదియే మహాత్ముని సత్యాగ్రహోద్యమము. దానిని స్వయముగా నాచరించియే ప్రపంచమున నిదివరకెన్నడును కని, విని యెరుగని తెరగున, శత్రు ప్రభుత్వమును మిత్రరూపమున తొలగింపజేసి, భారతదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును సమకూర్ప గలిగెను. మహాత్ముడా కారణమున కారణజన్ముడు. సృష్టి పరిణామములో కనుగొనబడిన యీ నూతన సాధనమును ప్రపంచములోని యితర దేశములవారును ఉపయోగించుకొని సాఫల్యము నొందుదురుగాక యని మహాత్ముడాశించి యుండెను. గీతకు పూర్వపు గ్రంథములలో యెక్కువగా బొగడబడిన ధ్యానయోగ సాధనమేగాక, ముక్తికి కర్మయోగమను వేరొక సాధనముగూడ గలదని శ్రీకృష్ణు డెంత బోధించినను, మనమింతవరకు దానియౌన్నత్యమును పూర్తిగా గ్రహించ జాలకున్నాము. అట్టితరి యుద్ధముకన్న దేశస్వాతంత్ర్య సాధనకై సత్యాగ్రహమను వేరొక సాధనమున్నదన్న మహాత్ముని బోధను ప్రపంచము పూర్తిగా గ్రహించుటకు

చాలకాలము పట్టవచ్చును. మరియు, ప్రాక్పశ్చిమ ఖండములలో స్వార్థపరులైన పెట్టుబడిదారులపై అసూయాపరులైన కమ్యూనిస్టులు కత్తిగట్టి, వారితోడ, తమ ఆర్థిక జీవ లక్షణ సమానత్వ సాధనమే యేకైక లక్ష్యముగా బెట్టుకొని, వర్గపోరాటమును సాగించి, లోకమును చీకాకు పరచుచుండిన పైనమును గమనించిన మహాత్ముడు, వారిరువురును తమ నైతిక జీవిత లక్షణమును పెంపొందించుకొనుటకు ప్రయత్నించినచో నిజమైన సామరస్య మేర్పడగలదని వాంఛించెను.

192. ఆర్యఋషుల హిందూ మతమునుగూర్చి ప్రొఫెసరు మాక్సుముల్లరు దెలిపిన నిర్వచనమే మహాత్ముని యభిప్రాయము. అది: ఆమతమున విధులు అను 'ధర్మము' లేకాని, భారతీయభాష కాని 'హక్కు'లు అనున వేవియులేవు అనుటయే. పాశ్చాత్య దేశమున అవలంబింపబడుచున్న కారల్ మార్క్సు సిద్ధాంతము ననుసరించి, హక్కులకు ప్రాధాన్య మివ్వబడుటచే, సంఘమునందు హింస, తద్వారా అశాంతి యేర్పడుచున్నది. ఆ సిద్ధాంతానుసారులే కమ్యూనిస్టులు, సోషలిస్టులు. ఎవరి ధర్మములను వారు అనుసరించనిచో మానవజీవితాదగ్యమైన వారి వారి ఆత్మోన్నతికే భంగము కలుగును. వారివారి ధర్మములను బట్టియే యితరులకు కొన్ని హక్కులుగా పరిణమించినట్లు కనబడినను ఆ యితరులు తమంతతాము చర్య తీసికొనగూడదను అను సిద్ధాంతము వలననే సంఘములో శాంతి యేర్పడును. లేకున్న, వర్గపోరాట మేర్పడి అశాంతి విజృంభించును. ఉదాహరణకు: హిందూధర్మము ననుసరించి, సంసారియగు గృహస్థుడు అపరిగ్రహాసను భావములను కలిగి సన్యాసిని పోషింపవలయుననుధర్మము గలదు. మరియు, అటుల గృహస్థున కేర్పడిన ధర్మము వలన, సన్యాసికి హక్కు కలుగునట్లు కనబడినను, ఆసన్యాసి ఆహక్కును ఆధారము జేసికొని గృహస్థుని హింసాపూర్వకముగ బలవంతపరచకూడదని కూడ అతనికి ధర్మముగా విధింపబడినది. అట్టి ఆర్యఋషుల సిద్ధాంతమునకు విరుద్ధముగ యేర్పడిన పాశ్చాత్య దేశములలోని కమ్యూనిస్టు సిద్ధాంతమువలన ఆదేశములలో అశాంతి ప్రబలుచున్నది. పాశ్చాత్య సంపర్కమువలన మనదేశములో గూడ ఆసిద్ధాంతము వ్యాపించుచున్నది. భారతీయ ఆత్మశాంతి సిద్ధాంతమును మరచిపోయిన అమాయకులగు పెక్కు బీదలకు వీరిప్రకృతి క్రాంతివాదము నచ్చవచ్చును.

193. ఈసందర్భమున కమ్యూనిస్టుల ప్రకృతి క్రాంతివాదమును గూర్చి కొంచెముగా దెలిసికొందము. ప్రపంచములోని ప్రతిమానవుడును కోరునది సౌఖ్యము. "మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనునట్లు మనస్సునుబట్టియే సుఖ దుఃఖముల అనుభవము కలుగును. మనస్సు అనునది ప్రకృతిసంబంధమైనదనుటవలన ప్రకృతిపరిస్థితులనుబట్టియే సౌఖ్య మేర్పడగలదని కమ్యూనిస్టుల సిద్ధాంతము. అనగా

బాహ్యసంబంధమైన ఆర్థికపరిస్థితులలో అందరకును సమానత్వ మేర్పరచినయెడల సౌఖ్య మొనగూడునని తలచి ఎక్కువ ధనధాన్యములను కలిగినవారినుండి బలవంతముగ లాగికొని బీదలకు పంచిపెట్టవలయుననుచున్నారు. అట్టి బలవంతమువలన బీదలకు సౌఖ్యము లభించుననుకొన్నను ఆ ధనికులలో క్రోధ మేర్పడును. క్రమేపి సంఘములో అశాంతి పెరుగుచుండును. శాంతి లేక సౌఖ్యము కలుగదని త్యాగరాజు చెప్పినట్లు కమ్యూనిష్టులు కోరిన సౌఖ్యము శాశ్వతముగా చేకూరనేరదు. ప్రపంచమున శాంతిని నెలకొల్పుటకై ప్రత్యేకముగ అవతరించిన మహాత్ముడు కేవలప్రకృతి పైననే ఆధారపడి కమ్యూనిష్టు సిద్ధాంతమును నిరసించెను. మానవుడు ప్రకృతిసంబంధమైన శరీరధారియైనను ముఖ్యముగా అసలు ఆత్మసంబంధీయుడు. అతడాత్మద్వారానే మనస్సుకు శాశ్వతసౌఖ్యమును కలిగించుకొనును. ప్రకృతిపరిస్థితులు కొంత సాయపడవచ్చునుగాని సౌఖ్యమునకు పునాదియైనశాంతి ఆత్మసంబంధమైనది. కావున మానవునికి ప్రపంచజీవితమునకు గావలసిన ఆర్థికసమానత్వము ఆత్మద్వారా మనస్సులో మార్పును కలిగించుటవలన కలుగునుగాని కేవల ప్రకృతిద్వారా అనగా బలవంతపు పంపకమువలన కలుగనేరదు అని మహాత్ముని బోధ. అందువలననే మహాత్ముడు ఈశోపనిషత్తులోని ప్రథమశ్లోకమగు "ఈశావాస్య మిదం సర్వం। యత్కించ జగత్యాం జగత్। తేనత్యక్తేన భుంజీథా। మాగృధః కస్యసిద్ధనం" అనుదానిని ఆధారముగా గొని అందు చెప్పినట్లు ఈ ప్రపంచములోని సమస్తమును భగవంతునిది, అనగా అందరిది. కావున ఏదియు ప్రత్యేకముగా నీదికాదని గ్రహించి నీకు అవసరమైనదానినే స్వీకరింపుము. మిగిలినదంతయు ఇతరులకొఱకగుటవలన దానిని ఆశించకుము. ఇందులో ధర్మకర్తృత్వసిద్ధాంత మున్నట్లు మహాత్ముడు కనిపెట్టెను. అనగా ఒకవేళ నీకు కావలసినదానికన్న ఎక్కువది నీకు లభించినయెడల దానికి నీవు ధర్మకర్తవుగ మాత్రమే యుండి, అవసరమైనవారికి వినియోగింపుము. సంఘక్షేమముకై ఆర్య ఋషులు ఏర్పరచిన ఈ సిద్ధాంతమును మనము నిర్లక్ష్యముచేయుటవలననే కమ్యూనిష్టు సిద్ధాంతమునకు అవకాశము కలిగినది. అయినను కమ్యూనిష్టు సిద్ధాంతము హింసాత్మకమగుటచే నిజమైన శాంతిని తద్వారా సౌఖ్యమును కలుగజేయనేరదు గాన మన భారతీయ అహింసా సిద్ధాంతమును తిరిగి వాడుకలోనికి దేవలయునని మహాత్ముడు పునరుద్ఘాటించెను. కఠోపనిషత్తులో దెలిపినట్టు "తమాత్మస్థం ఏనుపశ్యంతి ధీరాః తేషాం శాంతిః, నేతరేషాం"

194. మహాత్ముడు మనకు ప్రసాదించిపెట్టిన నూతనస్వతంత్ర భారతములో, అదివరకెవరెరుగని రెండునూతన దృక్పథములు గలవు. పూర్వము మన దేశములో, రాజు, ప్రజ, అను వేరువేరు వర్గములుండుటచే, వారికి వేరువేరు బాధ్యతలుండెను,

నూతన స్వతంత్ర భారతములో రాజు లేనందున అతని బాధ్యత ప్రజలకే సంక్రమించెను. అనగా సంఘమును ధర్మమార్గమున నడిపింపవలసిన రాజుబాధ్యత, ప్రజలపై బడినది. ఇంతేకాదు, ప్రజలు, స్వాతంత్ర్యమును బొందినవెనుక, పంజరముననుండి స్వాతంత్ర్యమును బొందిన చిలుకవలె, వేరొకరిపై ఆధారపడక, తమంతట తామే శ్రమపడి తమ ఆహారమును సంపాదించుకొనుటకు ప్రయత్నించవలసిన బాధ్యతను బొందిరి. మరియు, పూర్వము ఆధ్యాత్మికముగను, వైజ్ఞానికముగను, భారతదేశమంతయు ఏకదేశముగా బరిగణింపబడినను, రాజకీయముగ, అనేకరాజ్యములేర్పడి ప్రజలు ప్రత్యేక ప్రాంతీయ అభిమానములను పెంచుకొని, పరస్పర పోరాటములను జరుపుకొనుచుండిరి. మహాత్ముని నూతన స్వతంత్ర భారతములో అట్టివాటికి చోటులేక, భారతదేశమంతయు, అందలి అందరి పౌరులదిగా ఏర్పడినది కావున, ఆయా ప్రదేశములలోని ప్రజలు పూర్వమువలె, తమ ప్రత్యేక ప్రదేశము నేగాక, భారతదేశమంతయు తమదిగా భావించుకొని, భారతీయులందరి కష్టసుఖములు తమవిగా భావించుకొనవలసిన నూతన బాధ్యత ఏర్పడినది.

195. మరియు ప్రపంచమున నీవరకనుసరింపబడుచుండిన హింసాయుతమైన యుద్ధమార్గమునగాక, అహింసాయుతమైన అసహాయోద్యమ మార్గమను నూతన మార్గమున స్వతంత్ర భారతమును సంపాదించక బూర్వమే, అట్టి రాబోవు నూతన భారతస్వరూపము ఏవిధముగ నుండవలయునో ముందుగనే నిర్ణయించుకొని, అట్టి భారత నిర్మాణ విధానముకొరకు మాత్రమే మహాత్ముడు కృషిచేసెను. ఆయన ఒక ప్రత్యేక ఉద్దేశ్యముతో శ్రమపడిసంపాదించిన భారతనిర్మాణము, మరొకమోస్తరుగా నుండవలయునని ఇప్పుడు ప్రతిపాదించుట ఆయనయెడల కృతఘ్నతను చూపుటగాదా?

196. ఇంగ్లండు మొదలగు పాశ్చాత్యదేశములలో ప్రజాస్వామ్య ప్రభుత్వ సంపాదనానంతరమే అట్టి ప్రభుత్వమే తీరుననుండవలయునో యనునది నిర్ణయింపబడవలసి వచ్చెను. అందువలన నక్కడి విభిన్న ఆదర్శములు గల విభిన్న ప్రజలు విభిన్న పార్టీలుగా నేర్పడి వారి వారి విభిన్నకోరికలను బట్టి ప్రభుత్వరూపమును తర్చు మార్చుకొనుచుండవలసి వచ్చుచున్నది. మహాత్ముడు ముందుగనే ఊహించి అందుకొరకే తరువాత సంపాదించి పెట్టిన భారత ప్రజాస్వామ్యస్వరూపమును మార్చుటకు వీలులేదు. అందువలన మనదేశములో పాశ్చాత్యదేశములలోవలె భిన్న ఆదర్శములు గల భిన్నపార్టీలకు చోటులేదు. మరియు పాశ్చాత్యదేశములలో ప్రజాస్వామ్యమనగా తిర్చు మారుచుండునట్టి శ్రేయములు గల వివిధ ప్రజలలోని మెజారిటీ యొక్క శ్రేయముల ప్రకారము జరుపబడు ప్రభుత్వము. మహాత్ముని భారత ప్రజాస్వామ్యము అటుల

గాక కఠోపనిషత్తులో దెలుపబడిన, సర్వపౌరుల శాశ్వతశ్రేయము కొరకు జరుపబడు ప్రభుత్వము. అందువలననే మహాత్ముడు లండనులో రెండవరౌండు సమావేశములో ప్రసంగించుచు భారతదేశములో తాను గోరిన వయోజనవోటింగు హక్కు అవకాశము నిరక్షరాస్యులై అజ్ఞానులుగ నుండిన పెక్కుమంది ప్రజలు తమ శాశ్వతమైన శ్రేయముము గుర్తించు కొనగలుగునట్లు చేయుటకే మొదట ఉపయోగింప బడునని ప్రభుత్వము వారి ప్రశ్నకు సమాధానమిచ్చెను. అనగా డెమొక్రసీ రాజ్యాంగపద్ధతిలో మెజారిటీకి ఎక్కువ ప్రాధాన్యమియ్యవలసి వచ్చుటచే అట్టి మెజారిటి కేవలము 'బ్రూటు' మెజారిటీగా గాక 'ఎన్‌లైటెండు' మెజారిటీగా నుండవలయు ననుటయే.

197. ఇంతేగాదు దక్షిణాఫ్రికాలో మహాత్ముడు తన నూతనపద్ధతిద్వారా అక్కడి భారతీయులకు సాధించిపెట్టిన సదుపాయములు ఇప్పుడు వమ్మైపోవుటకు కారణము, అక్కడి భారతీయులు తిరిగి పాతమార్గము నవలంబించుట వలననేయని మహాత్ముడే 1927 లో చెప్పియుండెను. అదే విధముగా ఇచ్చటి భారతీయులును మహాత్ముని నూతనమార్గము ననుసరించుట మానినయెడల తిరిగి భారతదేశస్థితి కూడ పూర్వపు అస్వతంత్రస్థితికే పోవచ్చును. మహాత్ముని నూతన భారతస్వరూపము ఆయన భారతస్వాతంత్ర్య పోరాటసమయములోనే మొదలుపెట్టిన పదునెనిమిది అంగములు గల నిర్మాణ కార్యక్రమమే. దానిసంపూర్ణ ఫలప్రయత్నమే స్వతంత్ర భారత ప్రభుత్వము నిర్వహింపవలసిన కార్యము. దానిలోనే సర్వసౌభాగ్యము కలదు.

198. మహాత్ముడు, కాంగ్రెసు, దేశస్వతంత్ర సంపాదనానంతరము సర్వోదయ సమాజమనుపేర లోకసేవక సంఘముగా నేర్పడవలయునని ఆశించియుండెను. ఎందువలననగా, కాంగ్రెసు, ప్రభుత్వాధికారములోకన్న, ప్రజాసేవ సంఘముగానే, సంఘములోని లోపములను ఎక్కువ బాగుగాదిద్ది, సంఘక్షేమనిర్వహణకొరకు మాత్రమే ఏర్పడు ప్రభుత్వమునకు సహకరించవలయుననుటయే మహాత్ముని నూతన పద్ధతి. ఉదహారణకు: ప్రజ అనుపేరుతో ఒకేకుటుంబమునకు జెందిన నలుగురన్నదమ్ములలో, ఒకడు ప్రభుత్వోద్యోగిగను, వేరొకడు రైతుగను, మరియొకడు వర్తకుడుగను ఇంకొకడు ప్రజాసేవకుడుగను ఉన్నప్పుడు, వారిఅందరకును సంబంధించిన సంఘక్షేమమునకై, సంఘవిద్రోహక చర్యలను, లంచగొండితనమును, పండినపంటలో కొంతభాగమును ఇంటియజమానికిచ్చి, మిగిలినదానిని దాచుకొని, స్వంతసొమ్ముగా జేసికొనుటను, ప్రజల కత్యవసరమైన తిండిపంటను పండించక, స్వార్థముచే ఇతర పైరులను వేసికొనుటను, నల్లబజారులో అధికధరలకు అమ్ముటను నిరసించుచు ఆప్రజాసేవకసోదరుడు ప్రేమపూర్వకముగా, వారివారి మనోమయకోశముద్వారా బోధించుట

వలన కలుగు శాశ్వతప్రయోజనము, పైనున్న ప్రభుత్వాధికారులు వారివారి అస్త్రమయకోశముద్వారా శిక్షించెదమని భయపెట్టుటవలన కలుగదని మహాత్ముడు గ్రహించెను. మరియు, ఏప్రభుత్వమూ ప్రజలను ఎంత తక్కువగ పరిపాలించునో అదియే శ్రేష్టతరమైన ప్రభుత్వమను న్యాయమునందు మహాత్మునికి నమ్మకముగలదు

199. కావున మహాత్ముని ఆదేశములే తిరిగి మరియొక అవతారము వచ్చువరకు భగవన్నిర్మిత మానవాభివృద్ధికి సాధనమగుటచే వరవడివలె ఆదర్శముగా నెంచబడి, వాటిననుసరించుటకై అవశ్యము ప్రయత్నించవలసి యున్నది. అందువలననే, ప్రపంచమందలి సకలప్రజానీక యుపయోగార్థమై అనేక ధర్మసూత్రములను విశదీకరించి, తానాచరించి చూపించి, మార్గదర్శకుడైన మహాత్ముని ఆదర్శచరిత్రమును సాకల్యముగా, మనము కృతజ్ఞతా పూర్వకముగా సదా స్మరించుకొనుచుండవలయును.

కాకినాడ : మాస్టర్‌మన్ ముద్రాశాల యందు ముద్రింపబడియె.

ఈ గ్రంథకర్తచే రచింపబడిన

# భారత స్వరాజ్య సమర చరిత్ర

---

మహాత్ము డెవిధముగా స్వరాజ్యమును సంపాదించిపెట్టినది వివరముగా దెలుపబడినది.

విజయవాడ రేడియోవారి గ్రంథవిమర్శకునిచేతను, ప్రముఖ పత్రికలచేతను మిగుల శ్లాఘింపబడినది. మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారిచే అప్రూవు కాబడినది.

## INDIAN EXPRESS.

The author gives a moving account of the History of the Congress and its constant fight till at last India achieved Freedom.

## INDIAN REPUBLIC.

Chronological, informative and comprehensive, the author has spared no pains to make the book interesting and to bring the subject within the reach of all.

## ఆంధ్ర పత్రిక.

చర్చలు, ఉపన్యాసాలు, తీర్మానాలతో హడలెత్తిపోయే సామాన్య పాఠకులకు ఏ విషయానికి ఆ విషయం తుంచినట్లుగా క్లుప్తంగా చెప్పయత్నించిన ఈ పుస్తకం ఆకర్షణీయంగా ఉంటుందని చెప్పవచ్చును.

## విజయవాణి.

ఈ చిన్న పుస్తకములో భారత జాతీయోద్యమము ఏ విధంగా అభివృద్ధి చెంది, దాస్యశృంఖలాలను త్రెంచుకొని, స్వాతంత్ర్యము నార్జించినదో, రచయిత తన నిశిత విమర్శనా దృష్టితో పరిశీలించియున్నాడు.

వెల : రు. 0-12-0

# గ్రంధకర్తచే రచియింపబడి ముద్రితమైన గ్రంథములు.

---

1. రామమోహన, విద్యాసాగర, చరిత్రోపన్యాసములు.
(బరంపురమున నివ్వబడినవి.)
2. బ్రాహ్మమతోద్దేశము. (రాజమండ్రి మానవసేవా గ్రంథమాల)
3. మహాత్ముని ఆరోగ్యమార్గము. ఆంధ్రానువాదము.
(గుడివాడ - గూడూరి రామచంద్రరావుచే ప్రకటితము)
4. భారత స్వరాజ్య సమరచరిత్ర ; అనుబంధము : మహాత్ముడు నూతన దృక్పథ బోధకుడు. (విజయవాడ కవితిలక గ్రంథమాల)
(మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారిచే అప్రూవు కాబడినది.)
5 హిందూధర్మము - గాంధీజీ.
6. భారత రాజ్యాంగము - స్వదేశ సంస్థానములు.
(5, 6 : లింగమూర్తి గ్రంథమాల, అనకాపల్లి)
7. మహాత్ముని చరిత్ర చివరి (ముప్పది యారవ) ప్రకరణము : మహాత్ముని నూతన సందేశములు.
8. మహాత్ముని నూతన స్వతంత్ర భారత లక్ష్యములు - ఆంధ్ర రాష్ట్రోద్యమము - కరపత్రము.
9. భగవద్గీతోపదేశములు.
(తిరుపతి శ్రీ వెంకటేశ్వర ఓరియంటలు ఇంస్టిట్యూటు జర్నలులో ప్రచురింపబడినది)
10. శ్రీ నెహ్రూ (షష్టిపూర్తి) చరిత్ర.

---

గ్రంథకర్త చిరునామా :—
వెలిదండ శ్రీనివాసరావు.
రిటైర్డు హెడ్ క్లార్కు, ఆంధ్రా మెడికల్ కాలేజి,
14 363 కాదంబరివారి వీధి, చెంగలరావుపేట,
విశాఖపట్టణము.

# గాంధిమహాత్ముని సమగ్ర చరిత్ర

## అనుబంధము

### కొన్ని ముఖ్యవిషయముల సూచిక

గ్రంథకర్త:
**వెలిదండ శ్రీనివాసరావు**
కాదంబరివారి వీధి, చెంగల్రావుపేట, విశాఖపట్టణము

సమగ్ర చరిత్ర
వెల 6 రూపాయలు

అనుబంధ[illegible]
25 నయా పై[illegible]

# గాంధీమహాత్ముని సమగ్ర చరిత్ర

## కొన్ని ముఖ్య విషయములు

### 1. బాల్యము, విద్య, వివాహము, ఉద్యోగము

పేరా 1. 1869 అక్టోబరు 2 : పోరుబందరులో జననము - తల్లిదండ్రులు. 1876 : రాజకోటలో విద్య - వివాహ ప్రధానము.

1881-82 : హైస్కూలుచదువు - పరీక్షలో కాపీకొట్టుటకు నిరాకరించుట.

2. 1882-86 : వివాహము - చెడ్డపనులు - తండ్రి మరణము.

3. 1887 : అహమ్మదాబాదులో మెట్రిక్యులేషను - భావనగరములో కాలేజి చదువు - మావుజీదవే సలహా - మకారత్రియము - తల్లికి వాగ్దానము.

4. 1888 సెప్టెంబరు 4 : లండనుకు ప్రయాణము - త్ర్యంబకరావు మజుందారు - లండనులో డాక్టరు మెహతా సలహా - శాకాహారము.

5. 1888 నవంబరు 6 : బారిష్టరుకు చదువు - లండన్ మెట్రిక్యులేషను.

1889 : ఇతర వ్యాసంగములు - థియసాఫికలు మీటింగు - భగవద్గీత.

6. 1891 జూన్ 10 : బారిష్టరుపట్టా - హైకోర్టులో రిజిష్టరు - జూన్ 12 : ఇండియాకు తిరుగు ప్రయాణము - సెప్టెంబరులో బొంబాయి చేరుట - అమ్మ చావును వినుట - స్నానము - రామచంద్రికవితోటి పరిచయము - రాజకోటలో కుల బహిష్కారము - బొంబాయిలో ప్రాక్టీసు - రాజకోట పొలిటికలు ఏజెంటు వలన అవమానము.

### 2. దక్షిణాఫ్రికాలో వృత్తి

7. 1893 ఏప్రిలు : అబ్దుల్లాసేటు దావా - దక్షిణాఫ్రికాకు ప్రయాణము - లామూరేవు - మే నెలలో దర్బానురేవు చేరుట.

8. దర్బాను మేజస్ట్రేటు కోర్టులో తలపాగా తగాదా - ఇండెంచర్డుకూలీలు.

9. జూను నెలలో 'ప్రిటోరియా' కు ప్రయాణము - రైలులో అవమానము.

10. అబ్దుల్లావకీలు బేకరు దొరగారితో క్రైస్తవమత చర్చ - అక్కడి భారతీయ వర్తకులకు బోధ - వారల దురవస్థ పోలీసుఉద్యోగి గాంధీజీని అన్యాయముగ తన్నుట - తన స్వంత విషయములో కోర్టుకు ఎక్కననుట.

11. అబ్దుల్లా దావా రాజీ - లాయర్ల స్వభావము - క్రైస్తవ, మహమ్మదీయ, హిందూమత గ్రంథపఠనము.

12. 1893 డిసెంబరు : ఇండియాకు పోవుటకై ప్రిటోరియానుండి దర్బానుకు రాక - వీడ్కోలు విందు - సెటాలు ఇండియను ఫ్రాంచైజుబిల్లును ప్రతిఘటించు ప్రయత్నము - ప్రజాసేవ కార్యములో ధనము స్వీకరింపగూడదనుట.

13. డర్బాను సూప్రీము కోర్టులో అడ్వొకేటుగా చేరుట - తలపాగాను గురించిన 'అసందర్భమును' సమర్థించుట.

## 3. తిరిగి ఇండియాలో

14. 1896 జూను : కలకత్తాకుబోవు స్టీమరులో ఇండియాకు ప్రయాణము - బొంబాయికి రైలుప్రయాణము - దోవలో అలహాబాదు, అలహాబాదులో 'పయొనీరు' పత్రికాధిపతితో సంభాషణ - దక్షిణాఫ్రికా భారతీయుల ఇక్కట్టులనుగూర్చి ప్రచారము - రూటరు సంగ్రహవార్త - నెటాలు తెల్లదొరలు గాంధీజీపై దురభిప్రాయము లను కలిగియుండుట.

15. ఇండియాలో పలుచోట్ల గాంధీజీ ఉపన్యాసములు - దర్బానునుంచి కేబిలుగ్రాము - నవంబరు 28 : దక్షిణాఫ్రికాకు ప్రయాణము.

## 4. తిరిగి దక్షిణాఫ్రికాలో రెండవసారి

16. డిసెంబరు 18 : స్టీమరు దర్బాను రేవుకు దూరముగా లంగరువేయుట - రేవులో తెల్లదుండగుల కోలాహలము.

1897 జనవరి 4 : దర్బాను టౌనుహాలులో తెల్లదొరల సభ - గాంధీజీపై హింసాయుతచర్య తీర్మానము - జనవరి 13 : స్టీమరు రేవులోనికి వచ్చుట - గాంధీజీ తన భార్యను, పిల్లలను ముందుగా అక్కడికి తనస్నేహితుని ఇంటికి బండిమీద పంపుట - తానొక ఇంగ్లీషు స్నేహితునితో కలిసి నడిచిపోవుట - తెల్లదుండగులు బడితెలతో బాదుట - పోలీసుస్టేషనులో మారువేషముతో దాగికొనుట - తన విపరీత చర్యను తర్కించుకొనుట - మానవుడుచేయు ప్రతికార్యమునకును మూడు విభాజకములు.

17. గాంధీజీని హింసించిన తెల్లదుండగులను శిక్షించవలసినదని నెటాలు ప్రభుత్వమునకు బ్రిటిషు ప్రభుత్వ ఆజ్ఞ-గాంధీజీ వాంగ్మూలము - ఆ తెల్లదొరలు అబద్ధపు వార్తలనునమ్మి అట్లుచేసిరనియు, నిజముతెలిసిన కనుక పశ్చాత్తప్తులయ్యెదర నియు, కావున వారిని శిక్షింపగూడదనియు తెలుపుట. తానావరకు దర్బానులో స్థాపించియుండిన 'నెటాలు ఇండియను కాంగ్రెసు' స్థితినిగూర్చి విచారించుట.

18. దక్షిణాఫ్రికా భారతీయుల ఇక్కట్టులను తొలగించుటకు లండను పార్లమెంటులో చర్యతీసికొనవలసియుండుట - బోయరుల తిరుగుబాటులో ఆంగ్లేయులకు సహాయము - కస్తూరిబాయి ప్రసవవేదన - బ్రహ్మచర్య వ్రతదీక్ష - ఇండియాకు తిరిగిపోదలచుట - వీడ్కోలుసభ - విలువైన కానుకల 'ట్రస్టుఫండు.'

## 5. తిరిగి ఇండియాలో రెండవసారి

19. 1901 డిసెంబరు : ఇండియాకు వచ్చుట - కలకత్తా కాంగ్రెసు - వాలంటీరు గుమాస్తా పనిచేయుట.

20. 1902 కలకత్తా పెద్ద ప్రముఖుల దర్శనము - బర్మాకు బోవుట - కాశీలో అనిబిసెంటమ్మతో ప్రసంగము - బొంబాయిలో ప్రాక్టీసు - మణిలాలుకు తొట్టి వైద్యము - దక్షిణాఫ్రికానుండి తంతి - గాంధీజీ గ్రహించిన ఆధ్యాత్మిక సత్యము.

## 6. తిరిగి దక్షిణాఫ్రికాలో మూడవసారి

21. 1903 ట్రాన్స్వాలు రాష్ట్రము-చేంబర్లేనుకు మెమొరాండము-ఏషియాటిక్ డిపార్టుమెంటు - జోహాన్సుబర్గు కోర్టులో ప్రాక్టీసు - బ్రిటిషు ఇండియను అసోసియేషను స్థాపన.

22. మత వ్యాసంగము - అధాలో బ్రహ్మజిజ్ఞాస - ఇన్సురెన్సుపాలిసీరద్దు-రస్కినువ్రాసిన "అన్టూ దిస్ లాస్టు" గ్రంథావలోకన ఫలితము - ఫీనిక్సు వ్యవసాయ ఫారము స్థాపన.

23. 1906 ఆగస్టు 22 : భారతీయవర్తకులపై పన్నుతగ్గింపు - ఏషియాటిక్ ఆర్డినెన్సుబిల్లు - చట్టము - ప్రతిఘటన ప్రయత్నము.

24. సెప్టెంబరు 11 : పాసివురెసిస్టెన్సు - ఇంగ్లండులోని పార్లమెంటుకు డెప్యుటేషను తీర్మానము - అక్టోబరు 10 : గాంధీజీ లండనుచేరుట - నవంబరు 8 : లార్డు ఎల్జిను, లార్డు మార్లిగార్లకు మెమొరాండము - ఇండియను సేవనలు బ్రిటిషు కమిటీ అధికారుల సందర్శనము - దక్షిణాఫ్రికా బ్రిటిషు ఇండియను కమిటీ స్థాపన.

25. గాంధీజీ లండనునుండి దక్షిణాఫ్రికాకు తిరిగి ప్రయాణము - లార్డు ఎల్జిను మోసము.

1907 మార్చి 21 : ఏషియాటిక్ రిజిస్ట్రేషను ఆక్టు - పాసివు రెజిస్టెన్సు అసోసియేషను స్థాపన - సత్యాగ్రహనిర్వచనము — మనోమయకోశముద్వారా మార్పు.

## 7. దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహ విజయము

26. రిజిస్ట్రేషను ఆక్టుననుసరించి కొందరు పర్మిట్లనుపొందుట - ఇతరులకు జైలుశిక్ష - రామసుందరం క్షమాపణ. డిసెంబరు 28 : గాంధీజీకి జోహాన్సుబర్గు మేజిస్ట్రేటు నోటీసు—

1908 జనవరి 10 : ట్రాన్సువాలును విడిచిపోవలెనని ఆజ్ఞ - తిరస్కారము - రెండునెలల ఖైదు - అప్పటిజైలు టోపీయే తరువాతి గాంధీటోపీయగుట - ట్రాన్సువాలు 'లీడరు' పత్రికా సంపాదకుడు గాంధీజీని జైలులో దర్శించి సలహానిచ్చుట - జనవరి 30 : పోలీసుసూపరింటెండెంటు గాంధీజీని ప్రిటోరియాలోని 'స్మట్సు' వద్దకు గొనిపోయి విడుచుట, స్మట్సు గౌరవము- స్వతంత్రుడుగా తిరిగిపోవుట.

27. 1908 జనవరి 30 : రాత్రి 9 గంటలకు ఇంటికిచేరిన వెంటనే భారతీయుల సభ - స్మట్సు, గాంధీ ఒడంబడిక- సత్యాగ్రహిధర్మము-గాంధీజీపై లంచము ఆరోపణ - తెగటార్పు బెదిరింపు—

28. ఫిబ్రవరి 10 : గాంధీజీ రిజిస్ట్రేషను ఆఫీసుకుబోవుట - మీర్ ఆలం ఘోరకృత్యము - డాక్టర్ సలహా - రిజిస్ట్రేషను ఆఫీసరురాక.

29. సెటూలుకు బోవుట- సత్యాగ్రహము. పశుశక్తి ప్రయోగము పాత అలవాటు-తిరిగి జోహాన్సుబర్గుకు బోవుట.

30. స్మట్సు తనమొండి చేతిని బయటపెట్టుట-సత్యాగ్రహ కమిటీ పునరుద్ధరణ. ఆగస్టు 16 : నల్లచట్టము - పర్మిట్లదహనము - మీర్ ఆలం వింతచర్య.

31. అక్టోబరు 15 : గాంధీజీ అరెస్టు – శిక్ష.

డిసెంబరు 13 : జైలు విడుదల – దక్షిణాఫ్రికా పరిపాలనలో మార్పు.

1919 జూన్ 23 : లండనుకు డెప్యుటేషను – లార్డు ఆమ్ప్థిలును కలిసికొనుట.

32. లండనులో భారత విద్యార్థులవిందు–డాక్టరు రాజునుగారు వైద్య విద్యార్థి.

33. 1909 నవంబరు 13 : దక్షిణాఫ్రికాకు ప్రయాణము – 'హింద్ స్వరాజ్' గ్రంథ రచన – టాల్‌స్టాయి ఫారమును నిర్మించుట.

1912 అక్టోబరు 22 : గోఖలే రాక – జనరలు బోథా, స్మట్సులనుండి హామీ–తరువాత నిరుపయోగమగుట.

34. సెటాలులో సత్యాగ్రహము – నూతన సందర్భము యేర్పడుట.

1913 మార్చి 14 : రిజిష్టరుకాని హైందవ వివాహములు ఆఫ్రికాలో చెల్లవని సూప్రీముకోర్టు తీర్పు – స్త్రీల సత్యాగ్రహము – కస్తూరిబాయి పాల్గొనుట. సెప్టెంబరు 23 : స్త్రీ సత్యాగ్రహుల అరెస్టు శిక్షలు – న్యూకాసిలులోని ప్రభుత్వగనుల కూలీల సమ్మె – సత్యాగ్రహోద్యమముయొక్క మూలాధారమునుగూర్చి ప్రశంస.

35. 1913 అక్టోబరు 28 : సెటాలు బొగ్గుగనుల కూలీలతోకలిసి గాంధీజీ ట్రాన్సువాలుకు ఎనిమిది మజిలీలలో ప్రయాణము – అనేక వింతసంగతులు.

36. పోలకును ఇండియాకు బంపవలసినదిగా గోఖలే తంతి – గాంధీజీ విచారణ, శిక్ష – డిసెంబరులో : వైస్రాయి తీవ్రఖండన – గాంధీజీ తనలో తాను తర్కించుకొని మహత్తర సత్యమును కనుగొనుట.

37. దక్షిణాఫ్రికాకు భారతీయులను ఇండెంచెర్డు కూలీలనుగా బంపిన ఇండియా గవర్నమెంటు తమ బాధ్యతను గుర్తింప నారంభించుట. హార్డింజి ప్రభువు స్మట్సుకు లేఖ. డిసెంబరు 18 : గాంధీజీ జైలునుండి బేషరతువిడుదల – దర్బానుకు బోవుట. డిసెంబరు 21 : స్మట్సుకు లేఖ – అసంతృప్తి జవాబు.

1914 జనవరి 1 : తిరిగి సత్యాగ్రహమారంభింపదలచుట – స్మట్సు ఆహ్వానము – ప్రిటోరియాకు బోవుట.

38. 1914 జనవరి : ప్రభుత్వముపై యూరపియను రైల్వేపనివాళలసమ్మె–ప్రభుత్వపు యిబ్బందిసమయమును సత్యాగ్రహి అవకాశముగా తీసికొనగూడదనుట–స్మట్సు కృతజ్ఞత– కావేషముతో పగసాధింప బూనుట సత్యాగ్రహికి తగనిపని–ఇండియనురిలీఫు బిల్లు– చట్టము.

## 8. ఇండియాకు ప్రయాణము–ఇంగ్లాండులో యుద్ధారంభము

39. 1914 జూలై 18 : గాంధీజీ ఇండియాకు పోదలచుట– గోఖలేవద్దనుండి కేబిలు గ్రామ. ఆగస్టు 6: గాంధీజీ ఇంగ్లాండు చేరుట– యిరోపాయుద్ధారంభము– బ్రిటిషు గవర్నమెంటు చావుబ్రతుకులస్థితి– గవర్నమెంటుకు సహాయముచేయు సంసిద్ధత.

40. ఇంగ్లాండులో భారతీయుల సమావేశము. ఇంగ్లాండుయొక్క అవసరము ఇండియాయొక్క అవకాశముగా దీసికొనగూడదనుట. ఆగస్టు 14 సరోజినిదేవి జీవరాజ మెహతా మొదలగువారితోగూడి గవర్నమెంటుకు సహాయము చేయదలచిన

హామీపత్రము- గాంధీజీ ఘనమైన కీర్తినిపొందుట. పార్శ్వశూల. డిసెంబరు 19: గాంధీజీ ఇండియాకు ప్రయాణము.

## 9. ఇండియాలో తుదిసారి: ఆరంభ దినములు

41. 1915 జనవరి 9: బొంబాయి చేరుట- దేశములో పెక్కునాయకులు జైళ్ళలో మ్రగ్గియుండుట- గవర్నరైన విల్లింగ్టనును కలిసికొనుట. జనవరి 18: పూనాలో గోఖలేను దర్శించుట - రాజకోటకు పోవుట - ఫిబ్రవరిలో రవీంద్రుని ఆహ్వానముపై శాంతినికేతనమునకేగదలచుట- 'మహాత్మా' బిరుదు. ఫిబ్రవరి 17: గాంధీజీ భార్యాసమేతుడై బోల్పూరు చేరుట. 19వ తేదీన గోఖలే మరణవార్తవినుట 22వ తేదీన పూనాకు చేరుట- ఒక సంవత్సరము పాదరక్షలను ధరించనను దీక్ష- సర్వెంట్ ఆఫ్ ఇండియాసొసైటీయొక్క పాత కాన్‌స్టిట్యూషనలు పద్ధతికిని, గాంధీజీ నూతన సత్యాగ్రహ పద్ధతికిని తారతమ్యము. ఆనెలాంతమున రంగూను పోదలచి కలకత్తాలో దిగి అచ్చటి విప్లవ పద్ధతులను నిరసించుట.

42. 1915 మార్చి 6 : రంగూనునుంచి కలకత్తాకు తిరిగివచ్చి శాంతినికేతనమునకేగుట- ప్రయాగ, హరిద్వారము, హృషీకేశములకు పోవుట.

43. ఏప్రిలులో 'లా' డిన్నరు. హిందూమతమునుగూర్చిన ప్రొఫెసరు మాక్సుముల్లరు నిర్వచనము- బ్రిటిషు సామ్రాజ్యపౌరుల సమానస్థాయి.

44. మే నెల 22: మాయవరములో అస్పృశ్యతనుగూర్చి ప్రసంగము- బెంగుళూరులో గోఖలే చిత్రపట ఆవిష్కరణ.

45. మే నెల 25 : అహమ్మదాబాదులో సత్యాగ్రహ ఆశ్రమస్థాపన - వల్లభభాయి పటేలులో మార్పు.

## 10. కాంగ్రెసుతో సంబంధము, మహాత్ముని విజయము

46. 1915 డిసెంబరు : బొంబాయి కాంగ్రెసు - డెలిగేట్ల అర్హతలలో మార్పు.

47. 1916 ఫిబ్రవరి 4 : కాశీ హిందూ విశ్వవిద్యాలయములో ఉపన్యాసము- అనిబిసెంటు ఆగ్రహము - మే నెల 1 : బెల్గాము పొలిటికలు కాన్ఫరెన్సు.

48. 1916 డిసెంబరు 22 : అలహాబాదులో ఉపన్యాసము - లక్నో కాంగ్రెసు - జవహరుతో ప్రథమ పరిచయము.

1917 ఫిబ్రవరి : కేంద్ర శాసనసభలో మాళవ్యాజీ తీర్మానమునుసరించి గాంధీజీ వైస్రాయితో సంప్రదింపు - ఇంపీరియలు సిటిజనుషిప్పు అసోసియేషను సభ తీర్మానము. ఏప్రిలు 10 : పాట్నాలో రాజేంద్రప్రసాదుతో ప్రథమ పరిచయము - మోతీహారికు ఏనుగుపై ప్రయాణము - ప్రభుత్వ ఉత్తరువుకు ప్రథమ నిరాకరణ - ఆంగ్లేయ మేజస్ట్రేటు దిగ్భ్రమ.

49. ఆ ఏప్రిలు నెలలో అహమ్మదాబాదులో ప్లేగు - సత్యాగ్రహాశ్రమమును సబర్మతీ తీరమునకు మార్చుట - నవంబరులో కాంగ్రెసు లీగు స్కీము.

50. 1917 నవంబరు 3: గుజరాతు రాజకీయ కాన్ఫరెన్సు అధ్యక్షోపన్యాసము — స్వేచ్ఛ, స్వాతంత్ర్యముల భేదము — స్వరాజ్యమనగా స్వార్థముపైన రాజ్యము - సోషలు సర్వీసు లీగు - సాంఘిక సేవ.

1918 ఫిబ్రవరి: అహమ్మదాబాదులో ఆర్బిట్రేషను కమిటీ—

51. మార్చిలో కైరాలో భూమిపన్ను సత్యాగ్రహము. ఏప్రిలు 27: ఢిల్లీలో ఆర్మీరిక్రూటింగు సమావేశమునకు వైస్రాయి ఆహ్వానము - అనారోగ్యము - మేక (గోట్) పాలు స్వీకరణ.

## 11. దేశములో నూతన పరిస్థితులు

52. 1918 జూలై: మాంటేగు - చేమ్సుఫర్డు రిపోర్టు. ఆగస్టు 9: బొంబాయిలో స్పెషలు కాంగ్రెసు - నవంబరు 11: యుద్ధపరిసమాప్తి- ఆర్మిస్టీసు - యుద్ధములో పాల్గొనిరి. బ్రిటిషు సామ్రాజ్య రాజ్యములకు స్వయంనిర్ణయాధికార వాగ్దానము. డిసెంబరులో ఢిల్లీ కాంగ్రెసు తీర్మానము.

## 12. పంజాబు దురంతములు

53. యుద్ధమధ్యమున (20-8-1917) యుద్ధానంతరమున డొమినియను స్టేటసు వాగ్దానము - మాటదబ్బరవలన బ్రిటిషు గవర్నమెంటుకు నైతిక బలహీనత యేర్పడుట—

54. 1919 జనవరి: రౌలటు రిపోర్టు-శాసనము-బొంబాయిలో సత్యాగ్రహసభ - ఫిబ్రవరి 28: సత్యాగ్రహోద్యమ ప్రకటన- జవహరు కుతూహలత- మద్రాసులో మహాత్మునికి కల - మార్చి 23: మహాత్ముని సందేశము- మార్చి 30: కొన్ని చోట్ల మాత్రము హర్తాల్. ఏప్రిలు 6: అమృతసరములో హరితాళము-మార్షలులా మహాత్ముని ఉపవాసము - 'ప్రాయశ్చిత్తము', 'ఉపవాసము'ల నిర్వచనము.

55. అమృతసరులో కాంగ్రెసునాయకుల నిర్బంధము- ఏప్రిలు 6 బహిరంగ సభ తీర్మానము- ఏప్రిలు 9: శ్రీరామనవమి మహోత్సవము హిందూ మహమ్మదీయుల ఊరేగింపు- సత్యపాలు కిచ్లూల రహస్యనిర్బంధము- ఏప్రిలు 10: విద్యార్థులు డెప్యూటీ కమీషనరు సదనమునకరుగుట - వారి వీపులపై తుపాకి కాల్పులు- ఆవేశపరులైన సామాన్యప్రజల దుష్కృత్యములు- ఆసుపత్రిదొరసాని హేళన. ఏప్రిలు 11: అమృతసరమున మార్షలులా.

56. 1919 ఏప్రిలు 13 మొదలు జూను 11 వరకు జలియనువాలా బాగుఘోర దురంతములు- అక్టోబరు 8 న మహాత్ముని "యంగు ఇండియా" పత్రిక ప్రథమ సంచిక- ప్రాంతీయభాషలో ప్రాంతీయ శాసనసభాప్రసంగముల యావశ్యకతను గురించి వ్యాసము- హంటరుకమిటీ, కాంగ్రెసు కమిటీలు- పంజాబుప్రజల అష్టకష్టములు.

## 13. కాంగ్రెసు చర్చలో మొదటసారి పాల్గొనుట

57. 1919 నవంబరు 26: ఢిల్లీలో ఆలిండియా ఖిలాఫతు కాన్ఫరెన్సు - అజాదుతో తొలిపరిచయము. డిసెంబరులో అమృతసరు కాంగ్రెసు- బ్రిటిషు పార్లమెం

టులో ప్యాసు అగుట. ఇండియా రాజ్యాంగచట్టమును గూర్చి చర్చ- అలహాబాదులో చింతామణిగారి ఇంట్లో వింత ప్రవర్తన.

## 14. మహాత్మునిలో మార్పు

58. మహమ్మదీయుల మతపీఠము- లాయిడు జార్జిహామీ- మాటదబ్బర- మహాత్ముని నిస్సహాయత.

1920 ఫిబ్రవరి: పంజాబు దురంతములను గూర్చి కాంగ్రెసు రిపోర్టు-హంటరు కమిటీ రిపోర్టు అబద్ధపు వ్రాతలు- జాతీయవారము- ఏప్రిలు నెలలో హోంరూలు లీగుకు ప్రెసిడెండుషిప్పు స్వీకారము- నూతనప్రణాళిక- దేశములు పరిపాలన సరిహద్దులు.

59. 1920 మే 10: యుద్ధానంతర సంధిషరతులు ఖిలాఫతుకమిటీ- అసహాయోద్యమము- వైస్రాయికి లేఖ- జాతీయ కాంగ్రెసు ఆమోదము- జూలై 31: అసహాయోద్యమ ప్రణాళిక- ఉపవాసము- కేసరిహింద్ గోల్డుమెడలు వాపసు.

60. మహాత్ముని దేశప్రచారము- 'యంగుఇండియా' వ్యాసములు.

## 15. మహాత్ముని అసహాయోద్యమము, రామరాజ్యము, త్రివర్ణపతాకము

61. 1920 నవంబరు 4: కలకత్తా స్పెషలు కాంగ్రెసు- స్వరాజ్యసభ నిర్మాణము-తిలకు స్వరాజ్యఫండు.

62. జాతీయ విద్యాశాలలస్థాపన- నవంబరు 26 కాశీలో కాలేజీల బాయికాటు- మహాత్ముని ఉపన్యాసము- అంతరాత్మ బోధ స్వార్థత్యాగులకు మాత్రమే వినిపించుననుట. ఆచార్య కృపలానీతో పరిచయము.

63. డిసెంబరు నెలలో నాగపూరు కాంగ్రెసు - మహాత్ముని స్వరాజ్యసభ కాంగ్రెసుతో లీనమగుట- రామరాజ్య నిర్వచనము.

64. 1921 జనవరి: బొంబాయిలో ఖద్దరుభాండారము-ఫిబ్రవరి4: కలకత్తాలో నేషనలు కాలేజి. మార్చి 31: ఆంధ్రదేశ సంచారము- విజయవాడలో కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశము- ఏప్రిలు 13 న: త్రివర్ణపతాకసమర్పణ.

## 16. అలీసోదరుల అసహాయోద్యమము

65. 1921 ఏప్రిలు : నూతన వైస్రాయి లార్డు రీడింగుతో సంప్రదింపులు. అలీసోదరుల సంతాపము.

66. జూలై 8 : కరాచీలో ఆలిండియా ఖిలాఫతు కాన్ఫరెన్సు- మహమ్మదాలీ ప్రసంగము. జూలై 28 వ తేదీన బొంబాయిలో ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ- యువరాజా గమన బహిష్కార తీర్మానము. ఆగస్టు 1: మహాత్ముని ఆదేశమున విదేశ వస్త్రదహనము.

67. ఆగస్టు 9 వ తేదీన మహాత్ముడు అలహాబాదులోని కృష్ణదాసును వెంట నుంచుకొనుట- సెప్టెంబరు 4 వ తేదీన కలకత్తా, మిదనపూరు, ఖర్గపూరులకు

బోవుట. ఆనెల 14 వ తేదీన మద్రాసునకుబోవునప్పుడు వాల్తేరులో వెంటనున్న మహమ్మదాలీ అరెస్టు- 19 వ తేదీన తిరుచినాపల్లిలో ఒక ప్రకటన చేయుట.

68. 1921 సెప్టెంబరు 21 : మధురకుబోయి "యంగు ఇండియా" పత్రికకు ఒక వ్యాసము వ్రాయుట- కొల్లాయిధారణ శపథము.

69. తిరునల్వేలిలో ఉపన్యాసములు- అచ్చటి పంచమునితో సంభాషణ.

70. దక్షిణదేశయాత్ర ముగింపు- కృష్ణదాసుకు భగవద్గీతబోధ.

71. ఆ సెప్టెంబరు 28 వ తేదీన దత్తమండల ప్రయాణము- తిరుపతిలో దిగుట - కర్నూలులో కూలీలస్థితి- బళ్ళారి రైలుస్టేషనులో నిశిథమున కటిక నేలపై పడక- మహాత్మునికి అరెస్టు వారంటు వదంతి- కొండా వెంకటప్పయ్యగారికి మహాత్ముని సలహా.

72. అక్టోబరు 4: బొంబాయిలో కాంగ్రెసు వర్కింగుకమిటీసమావేశములో పాల్గొనుట. ఆనెల 16 వ తేదీన పరప్రభుత్వపు కొలువులో భారతీయులు చేరకూడదను తీర్మానము. నవంబరు 8 న విశాఖపట్టణము మెడికలు స్కూలు విద్యార్థులు ఖద్దరుటోపీని ధరించుటను ప్రశంసించుట.

## 17. శాసనోల్లంఘనోద్యమము

73. 1921 నవంబరు 5 : ఢిల్లీలో అ. ఇం. కాంగ్రెసు కమిటీ సమావేశము- సమిష్టి శాసనోల్లంఘన తీర్మానము - 17 వ తేదీన యువరాజు బొంబాయిలో దిగుట సామాన్య ప్రజల అల్లరులు - 19 వ నాలుగురోజులు ఉపవాసము - వారమునకొక రోజున మౌనవ్రతారంభము - బార్డోలీలో సాత్వికనిరోధోద్యమ ప్రయత్నమును ఆపుట. 23 వ తేదీన బొంబాయిలో కాంగ్రెసు వర్కింగుకమిటీ మహాత్ముని చర్యను ఆమోదించుట - దేశములో కొన్ని కాంగ్రెసు ఖిలాఫతు సంస్థలు అక్రమసంస్థలుగా ప్రకటింపబడుట - దేశనాయకుల అరెస్టు - మాలవ్యాజీ వైస్రాయితో రాజీ ప్రయత్న విఫలత. అసహాయోద్యమము, యుద్ధముల తారతమ్యము.

74. డిసెంబరు : అహమ్మదాబాదులో కాంగ్రెసు మహాసభ - శాసనోల్లంఘనోద్యమమును నడిపించు బాధ్యతను మహాత్మునొక్కనిపై బెట్టుట - మహాత్ముని వాగ్దాన విఫలతనుగూర్చి అనిబిసెంటు హేళన - మహాత్ముని సమాధానము.

1922 జనవరి 12 : గుంటూరు మండలములో పన్నుల నిరాకరణ. ఫిబ్రవరి 1 న వైస్రాయికి బహిరంగలేఖ - వైస్రాయి తబ్బిబ్బు.

75. ఫిబ్రవరి 5 : చౌరీ చౌరా దురంతములు - శాసనోల్లంఘనోద్యమ విరమణ- 5 దినములు ఉపవాసము - ఆ నెల 24 వ తేదీన మూంజే మహాత్మునిపై విశ్వాస రాహిత్య తీర్మానము దెచ్చుట - వ్యక్తిశాసనోల్లంఘన తీర్మాన ఆమోదము - ముస్లిముల నిరాశ - ఖిలాఫతు సమస్య కవకాశములేకుండుట - పాకిస్థాను ఉద్యమమునకు పునాది.

76. చౌరీచౌరా దురంతములవలన వైస్రాయి తబ్బిబ్బు అగుట - బ్రిటిషు గవర్నమెంటుతో సమాలోచనలు - యంగు ఇండియా పత్రికలో మహాత్ముని వ్యాసములు.

## 18. రాజద్రోహనేరము, శిక్ష, విడుదల

77. 1922 మార్చి 9 : 'యంగు ఇండియా'లో మహాత్ముని వ్యాసము - మరునాడు రాత్రి 10½ గంటలకు అరెస్టు - 15 వ తేదీన విచారణ, ఆరు సంవత్సరాల కారాగారశిక్ష - మహాత్ముని స్టేటుమెంటు - జైలులో ఆత్మకథను నాగపూరు కాంగ్రెసువరకు జరిగినదానిని వ్రాయుట - ఆ సంవత్సరాంతమున జరిగిన "గయా" కాంగ్రెసులో రాజాజీ తీర్మానము.

1923 సెప్టెంబరు : ఢిల్లీ స్పెషలు కాంగ్రెసు - నోఛేంజర్సు, ప్రోఛేంజర్సు పార్టీలు.

78. 1923 సంవత్సరాంతమున కాకినాడ కాంగ్రెసు - కౌన్సిలు బహిష్కరణ నిర్ధారణ.

1924 జనవరి 12 : మహాత్మునికి అప్పెండిసైటిసు ఆపరేషను - ఫిబ్రవరి 5 : బేషరతు విడుదల. జూహూలో విశ్రాంతి - ఏప్రిలు నెలలో 'యంగు ఇండియా'లో తన ఆపరేషను సమర్థన - ఆర్యసామాజికుల 'అఖాడా' ఉద్యమ నిరసన.

78-ఎ కాంగ్రెసులోని ఇరు పార్టీలవారికిని సఖ్యతను సమకూర్చుట తన కర్తవ్యమునుగూర్చి ఒక స్టేటుమెంటును ప్రకటించుట - మోతీలాలులో గొప్ప మార్పు.

## 19. హిందూముస్లిము కలతలు, కాంగ్రెసు అధ్యక్షత, గౌహతి కాంగ్రెసు

79. 1924 సెప్టెంబరు 18 : ఢిల్లీలో మహమ్మదాలీ ఇంట్లో బస-కోహాటులో హిందూ మహమ్మదీయ కలతలు - 21 దినముల ఉపవాసము.

80. ఆ సెప్టెంబరు 26 న ఢిల్లీలో ఐక్యపార్టీ సమావేశము - మహాత్ముని ఉపవాసదీక్షోద్దేశము.

81. ఆ నవంబరు 26 న బొంబాయిలో ఆల్ పార్టీసు కాన్ఫరెన్సు - బెల్గాము కాంగ్రెసుకు అధ్యక్షత - 1925 ఆరంభమున దేశ పర్యటన.

82. 1925 మార్చి, ఏప్రిలు మాసములలో దక్షిణదేశ సంచారము - వైకాములో అస్పృశ్యతా సత్యాగ్రహము.

83. ఆంధ్రదేశ పర్యటన - మే నెల 24 : శాంతినికేతనములో టాగూరును దర్శించుట - జూను 9 న డార్జిలింగులో చిత్తరంజనదాసును కలిసికొనుట - ఆ నెల 16 వ తేదీన దాసుమరణవార్త - 18 వ తేదీన కలకత్తాకు తేబడిన దాసు శవము వకు అజాదుతో గలసి శవవాహకుడగుట.

84. 1925 సెప్టెంబరు 22 : ఆల్ ఇండియా స్పిన్నర్సు అసోసియేషను స్థాపన.

85. డిసెంబరు మాసాంతమున కాన్పూరు కాంగ్రెసు - మహాత్ముడు తాత్కాలికముగ కాంగ్రెసునుండి వైదొలగుట.

86. బ్రహ్మచర్యమునుగూర్చి ప్రసంగము.

87. స్వరాజ్యపార్టీలో చీలికలు.

88. 1926 డిసెంబరులో గౌహతి కాంగ్రెసు - మహాత్ముడు కాంగ్రెసుతో తిరిగి జోక్యము - సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మాన ప్రతిఘటన.

## 20. ఇర్విను ఆహ్వానము-సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము

89. 1927 ఫిబ్రవరి మొదటివారము ఓటమాలులో కమ్యూనిస్టు శకలువాలాతో ప్రసంగము - రెండవవారము మహారాష్ట్ర సంచారము - మార్చి 23 న బొంబాయికి బోవుట - ఏప్రిలు ఆఖరు వారము - నందికొండ. జూను మధ్య బెంగుళూరు - జూలై 3 న ఖాదీ ఎగ్జిబిషను - 12 వ తేదీన బెంగుళూరు విద్యార్థులకు సలహా - త్రాగుడుపన్ను - ఆగస్టు మధ్య దేవగిరి హరిహరమూర్తిని గూర్చి ప్రసంగము - ఆగస్టు 24 న తమిళనాడు సంచారము - 27 వ తేదీన మద్రాసులో త్రాగుడును గూర్చి ప్రసంగము - సెప్టెంబరు 9 న చిదంబరములో నందనారుని గూర్చి ఉపన్యాసము, కడలూరులో - బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సమస్య.

90. 1927 నవంబరు 5: మంగళూరులోనుండి ఇర్విను ఆహ్వానలేఖ - ఢిల్లీ నుండి తిరిగివచ్చి తిరుచినాపల్లి, సిలోనులకుబోవుట, డిసెంబరు నెలాఖరున మద్రాసు కాంగ్రెసుకు హాజరగుట - సైమను కమీషను బహిష్కరణ తీర్మానము- జవహరు, సుభాసుల సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము - అధినివేశ రాజ్యాంగ ప్రణాళిక తీర్మానము.

91. బార్డోలీలో పన్నుల నిరాకరణ - 1928 ఆగస్టు 2: లక్నోలో ఆల్ పార్టీసు కాన్ఫరెన్సు - డిశంబరులో కలకత్తా కాంగ్రెసు - జిన్నాలో మార్పు.

92. బ్రిటను గవర్నమెంటు గాభరా - కార్మికనాయకుల అరెస్టు-1929మార్చి 20 - మీరటులో విచారణ-కలకత్తాలో విదేశవస్త్రదహనము - మహాత్మునికిజాల్మానారంగూనులో క్రైస్తవసభలో త్రాగుడునుగూర్చి ఉపన్యాసము - ఆంధ్రదేశ సంచారము - బొంబాయిలో ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ మీటింగు - మహాత్ముడు ఆంధ్ర నాయకులను తన ఆశ్రమమునకు ఆహ్వానించి సత్కరించుట.

93. 1929 మే నెలలో బ్రిటిషు పార్లమెంటు ఎలక్షనులు - మేక్డనాల్డుహామీ- ఇర్వినును లండనుకు పిలిపించుకొనుట - అక్టోబరు 31 న ఇర్విను రౌండుటేబిలు సమావేశము ఏర్పాటునుగురించి సందేశము - జవహరు సుభాసులు కాంగ్రెసునుండి రాజీనామా.

94. 1929 డిసెంబరు 23: మహాత్మాజీ వైస్రాయిని కలిసికొనుట- వైస్రాయి నిర్వాచీ జవాబు - ఆ డిసెంబరు 31 రాత్రి 12 గంటల 5 నిముషములకు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము.

## 21. సంపూర్ణస్వాతంత్ర్య ప్రయత్నము

95. 1930 జనవరి 2: వర్కింగు కమిటీ మీటింగు - ఆ నెల 26 వ తేదీన సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనా ప్రయత్న ప్రమాణ స్వీకరణ - 31 వ తేదీన 11 రాజకీయ సంస్కరణముల కోరికను వెలిబుచ్చుట - ఫిబ్రవరి 14 న మహాత్ముని నాయకత్వమున శాసనోల్లంఘనోద్యమముప్రక్రమింప తీర్మానము.

96. శాసనోల్లంఘనోద్దేశ్యము - ఉప్పు పన్ను శాసనధిక్కారము - మార్చి 2 న రెజినాల్డుద్వారా వైస్రాయికి నోటీసు - ఆ మార్చి నెల 12 వ తేదీన ఆశ్రమము నుండి బయలుదేరుట - ఏప్రిలు 5 న దండిగ్రామముచేరుట - మరునాడు పిడికిటితో సముద్రతీరముననున్న ఉప్పుగు పట్టుకొనుట.

97. బయటి ఉప్పును పిడికిటితో పట్టుకొన్న పెక్కు కాంగ్రెసు నాయకు లకు శిక్షలు - అధికారుల చట్టవిరుద్ధపు చర్యలు.

98. ఆ 1930 ఏప్రిలు నెలలో బెంగాలు ఆర్డినెన్సు ప్రెస్సు ఆర్డినెన్సులను గూర్చి మహాత్ముడు వ్యాఖ్యానించుట - యంగు ఇండియా పత్రికను ఆపుకొనుట.

99. సూరతు స్త్రీ సమాజములో ప్రసంగము - మే 4 వ తేదీ రాత్రి వైస్రాయికి బంపుట కొక లేఖ వ్రాసి తలక్రింద బెట్టుకొనుట - సి. ఐ. డి. వలన సమాచారమును తెలిసికొనిన గవర్నమెంటు ఆరాత్రియే 12 గంటల 45 నిముషములకు నిద్రలేపి అరెస్టుచేసి యరవాడ జైలుకు బంపుట.

100. మహాత్ముని నిర్బంధమును భరించలేక ఒడలుమరచిన ప్రజల ఘోరకృత్యములు - లక్షమందికిపైగా శిక్షలు - ఇండియాలో బ్రిటిషు గవర్నమెంటు ఆటకట్టు సూచనలు. జార్జి స్లోకోంబు మహాత్ముని జైలులో సందర్శించుట - మహాత్ముని మూడు షరతులు.

101. సప్రూ జయకరులు మహాత్మునితో జైలులో ప్రసంగించుట - ఆగస్టు 4 వ తేదీన కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశములో మరిమూడు షరతులు.

102. ప్రథమ రౌండుటేబిలు కాన్ఫరెన్సును కాంగ్రెసు బహిష్కరించుట.

1931 జనవరి 21 : అలహాబాదులో జైలుకుబోని కాంగ్రెసుకమిటీ మెంబర్ల సమావేశము - సప్రూ జయకరుల కేబిల్ గ్రాము.

## 22. రౌండుటేబిలు కాన్ఫరెన్సులు

103. 1931 జనవరి 26 : మహాత్మునితోబాటు కాంగ్రెసు నాయకుల విడుదల - ఫిబ్రవరి 17 న ఢిల్లీలో వైస్రాయితో సంప్రదింపులు - చర్చలు పరిహాసము - మార్చి 5 న గాంధీ - ఇర్విను ఒడంబడిక.

104. మార్చి 25 వ కరాచి కాంగ్రెసు- భగత్ సింగుకు ఉరిశిక్ష - దోవలో మహాత్మునికి నల్లజెండాలు.

105. ఏప్రిలు 18 : విల్లింగ్టను నూతన వైస్రాయిగా వచ్చుట - రౌండుటేబిలు కాన్ఫరెన్సుకు కాంగ్రెసు తరఫున మహాత్ముడు ఏకైకప్రతినిధి - గుంటూరులో, వాడపల్లిలో పోలీసు కాల్పులు - వైస్రాయికి లేఖ - వైస్రాయిపై బ్రిటీషు గవర్నమెంటు ఒత్తిడి - ఆగస్టు 29 : గవర్నమెంటు స్పెషలు రైలుపై మహాత్ముడు బొంబాయికి ప్రయాణం - సెప్టెంబరు 11 న స్టీమరుమీద మార్సెలిసు రేవుచేరుట - అక్కడనుండి కొంతరైలుమీద కొంతస్టీమరుమీద ఇంగ్లండు చేరుట.

106. సెప్టెంబరు 12 : ఫ్రెండ్సు మీటింగు హౌసులో ప్రతికా విలేఖరులతో ప్రసంగము- ఈస్టుయెండులోని కింగ్సిలీ హాలులో బస - సెప్టెంబరు 13 : అమెరికాకు రేడియో ప్రసంగము. మరునాడు రౌండుటేబిలు కాన్ఫరెన్సు సమావేశం

107. ఇండియాలో జరుపదలచిన వర్గూజన వోటింగు పద్ధతిపై ప్రసంగము - అక్టోబరు 8 : మైనారిటీ కమిటీ సమావేశము - కప్పలతక్కెడ - డిశంబరు 1 : రౌండుటేబిలు కాన్ఫరెన్సు సమాప్తము - మదరు ఇండియా గ్రంథముపై మహాత్ముని అభిప్రాయము.

108. డిశంబరు 5 : ఇండియాకు బయలుదేరి, దోవలో రోమేను రోలండును మునులోనిని కలిసికొనుట.

109. డిశంబరు 28 ; బొంబాయి చేరుట - ఇండియాలోని స్థితిగతులు.

110. 1932 జనవరి 4 ; కాంగ్రెసు ప్రసిడెంటు పటేలు అరెస్టు - ఆరాత్రియే మహాత్ముని అరెస్టు - కమ్యూనలు అవార్డు - సెప్టెంబరు 20 : మహాత్ముని ప్రాయోపవేశ నిర్ణయము.

1913. ఫిబ్రవరి : హరిజన పత్రికస్థాపన - మే నెల 8 నుండి ప్రాయోపవేశము - జైలునుండి బేషరతు విముక్తి.

111. కాంగ్రెసు అక్టింగు ప్రెసిడెంటు మాధవరావు అనే ప్రకటన- ప్రభుత్వపు అనవసరపు ప్రకటన - వియన్నాలోని విఠలభాయి సుభాసుల కేబిలుగ్రాము- జూలై 12 న పూనాలో కాంగ్రెసు వర్కర్ల సమావేశము - సమిష్టి సత్యాగ్రహ విరమణ - వ్యష్టి సత్యాగ్రహ నిర్ణయము.

## 23. వ్యక్తి సత్యాగ్రహము

112. జులై 26 న సబర్మతీవాసులతో మహాత్ముని ప్రయాణ ప్రయత్నము. ఆగస్టు 1 : రాస్ గ్రామమునకు పోదలచుట - ఆ క్రిందటి రాత్రియే నిశీథంబున మహాత్ముని అరెస్టు - 4 వ తేదీ విడుదల - తిరిగి అరెస్టు - కారాగారశిక్ష - ఆగస్టు 16 న తిరిగి ప్రాయోపయోవేశము - ఆరోగ్యము సన్నగిలుట - బేషరుతు విడుదల - వార్ధాలో ఆశ్రమము - 1934 జనవరి 15 : బీహారులో భూకంపము - మానవుల పాపకార్యఫలితము - మహాత్మునికి రవీంద్రుని లేఖ - మహాత్ముని జవాబు- మే 18: పాట్నాలో కాంగ్రెసు కమిటీ సమావేశము - స్వరాజ్యపార్టీ కాంగ్రెసులో లీనమగుట.

113. జూను 25 : పూనాలో మహాత్మునిపై బాంబు విసరుట - హరిజనోద్ధరణకనుకూలుని ప్రతీకారచర్య-మహాత్ముని మందలింపు - వారము దినము లుపవాసము - వికేరియను పనిష్మెంటు సమర్థన - అక్టోబరు 24 : బొంబాయి కాంగ్రెసు - తన 4 అణాల సభ్యత్వమును మానుకొనుటకు కారణము.

## 24. మహాత్ముని ఇతర వ్యాపకములు

114. 1985 ఫిబ్రవరి మొదటివారము వార్ధాలో ఆల్ ఇండియా విలేజి ఇండస్ట్రీసు అసోసియేషను స్థాపన - మహాత్ముడు అంట్లుతోముట - కస్తూరిబాయి చివాట్లు - సాత్వికాహారమునుగూర్చి వ్యాసములు - మార్చి 10 : గ్రామపునస్థాపనము- 4 మాసములు మౌనవ్రతము- ఇండూరులో హిందీ సాహిత్య సమ్మేళనము-

అక్టోబరు 11 : ఆల్ ఇండియా స్పిన్నర్సు అసోసియేషను - 22 న సేవాగ్రామ కుటీరమును నెలకొల్పుట.

115. 1936 జనవరి 25 : ఇద్దరు జపాను నాయకులు మహాత్ముని కలసికొనుట- 26 వ తేదీన ఒక దొరసాని బర్తుకంట్రోలుగూర్చి ప్రసంగించుట - మార్చి నెలలో గాంధీ సేవాసంఘముయొక్క ద్వితీయవార్షికోత్సవము - ఏప్రిలు నెలలో నాగపూరు లిటరరీ కాన్ఫరెన్సు - మే నెలలో కాంగ్రెసు వర్కర్ల ట్రైనింగుస్కూలు స్థాపన. ఆగస్టు నెలలో శాసనసభల ఎన్నికల మానిఫెస్టో - అక్టోబరు నెలలో నేషనలు ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్సు.

116. ఇండియా రాజ్యాంగచట్టముపై వ్యాఖ్య - వర్ణాశ్రమధర్మమునుగూర్చి మహాత్ముని అభిప్రాయము - లక్నో కాంగ్రెసుకు నెహ్రూకు అధ్యక్షపదవిని కట్టించుట - ఫైజపూరు కాంగ్రెసు - శాసనసభ ఎన్నికలలో పాల్గొనవచ్చుననుట.

117. రాష్ట్రశాసనసభలలో మంత్రిత్వాధికారములను స్వీకరించవచ్చుననుట- మంత్రులు నిర్వహించవలసిన విధులు.

118. 1937 జులై 7 : కాంగ్రెసు మంత్రివర్గములు - అక్టోబరు నెలాఖరున కలకత్తాలో సుబాసునింట బస - వార్ధాలో ఎడ్యుకేషనలు కాన్ఫరెన్సు - నవంబరు 20 న కాంగ్రెసు మంత్రుల చర్యల విమర్శించుట - డిశంబరులో జుహూకు బోవుట.

## 25. కాంగ్రెసు మంత్రిత్వముల కాలము

119. 1938 లో బీహారు సంయుక్తరాష్ట్ర గవర్నర్ల చర్యలను ఖండించుట - ఏప్రిల్‌లో పశ్చిమోత్తర పరగణాలలోని స్థితిగతులను తెలిసికొనుట-మే నెల15న ఖాను సాహేబుతో పర్యటన - మధ్యపరగణాలో 'ఖరే' విషయము - జులై 9 న స్వదేశ సంస్థానముల ప్రశంస - మద్యపాన నిషేధముల రహస్యము - శుక్రాచార్యుల సురసేవ ఆర్డినెన్సు - ఏషియా ఫర్ ఏషియాటిక్సు సిద్ధాంతఖండన-

120. 1939 సంవత్సరారంభమున రెండు వింత సంగతులు - రాజకోట వ్యవహారము- కాంగ్రెస్ ప్రెసిడెంటుషిప్పు.

121 మే నెల 7 వ తేదీన బృందావనమున మహాత్ముని ఉపన్యాసము - జులై 18 న సుబాసును మందలించుట - సెప్టెంబరు నెలాఖరున సరిహద్దురాష్ట్ర పర్యటన ఖుదైఖిద్‌మత్‌గార్ల దశ - ప్రతిజ్ఞలు.

122. 1939 ఆబరుక్టో 23 న హిట్లరుకు లేఖ - ఇంగ్లండు ఫ్రాన్సుల ఓటమి. ఇండియా స్వాతంత్ర్యము- ప్రపంచశాంతి ఆదర్శము.

## 26. యుద్ధము - ప్రభుత్వముతో సంప్రదింపులు

123 ద్వితీయ ఐరోపా సంగ్రామ సందర్భమున వైస్రాయి ఇండియాప్రజలకు హెచ్చరిక - వైస్రాయి మహాత్మునితో మంతనములు - కాంగ్రెసు వర్కింగుకమిటీ మీటింగు- జిన్నాకు ప్రత్యేక ఆహ్వానము - జిన్నా నిరాకరణ - యుద్ధోపసంఘమునకు నెహ్రూ నాయకుడు - పార్లమెంటులో జట్లండు ప్రసంగము- అక్టోబరు

17 వ వైస్రాయి ప్రకటన - మహాత్ముని జవాబు - కాంగ్రెసు మంత్రులకు ఆదేశము - వైస్రాయి దేశ నాయకులతో సంప్రదింపుల నిష్ఫలత - నూతన సమస్యల ఉద్భవము.

124. యుద్ధవిషయమున కాంగ్రెసు వర్కింగుకమిటీయొక్క అయిదుకోరికలు- వైస్రాయి నూతన ధోరణి - నవంబరు 5 న వైస్రాయి రేడియో ప్రకటన.

125. వైస్రాయి ప్రకటనపై మహాత్ముని వ్యాఖ్య.

126. 1939 నవంబరు 19 : అలహాబాదులో అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశము కన్‌స్టిట్యూయెంటు అసెంబ్లీ నిర్మాణ తీర్మానము-అనవంబరు22 : ముస్లిముల మోక్షదినమని జిన్నా ప్రకటించుట - డిశంబరు 14 న పార్లమెంటులో జట్లండు ప్రకటన - నెహ్రూ జవాబు.

127. 1940 ఫిబ్రవరి 5 : మహాత్ముడు వైస్రాయిని దర్శించి విఫలుడగుట - 17 వ తేదీన భార్యతోగలసి శాంతినికేతనమున కేగుట - 21 వ తేదీన ఆండ్రూసును కలిసికొనుట - మార్చి 5 : సేవాగ్రామము చేరుట - 19వ తేదీన రాంఘరు కాంగ్రెసులో ఉపన్యసించుట - జూను 17 : రాజాజీ సలహాపై కాంగ్రెసు క్రొత్తత్రోవ త్రొక్కుట - జూలై 2 న మహాత్ముడు బ్రిటిషు పౌరులకొక లేఖను ప్రచురించుట.

128. 1940. ఆగష్టు 8: వైస్రాయి ప్రకటన - 18 వ తేదీన కాంగ్రెసు యుద్ధసహాయమును మానుకొని, మహాత్ముని యాజమాన్యమును ఒప్పుకొనుట - అక్టోబరు 11 : వాక్స్వాతంత్ర్య తీర్మానము - వినోబాభావే బహిరంగ ప్రమాణము - 22 వ తేదీన అరెస్టు శిక్ష - మహాత్ముడు తన హరిజనపత్రికను చాలించుట.

129. క్రిస్టమసులో క్రైస్తవుల గౌరవార్థమై వాక్స్వాతంత్ర్య ఉద్యమమును సస్పెండుచేయుట - ఆ సత్యాగ్రహోద్యమ సందర్భమున 20 వేల మందికి శిక్షలు 6 లక్షల రూపాయల జుల్మానాలు.

1941 డిసెంబరు 3 : గవర్నమెంటువారు నిరాశాపూరితులై జైలులోని సత్యాగ్రహులను త్వరితముగ విడుదల చేయదలచుట - మహాత్ముని వ్యాఖ్యానము - డిసెంబరు 7 : జపాను ఇంగ్లీషువారి పెరలుహార్బరును ముట్టడించుట - డిసెంబరు 28 : కాంగ్రెసు ఇంగ్లీషువారికి యుద్ధములో సహాయముచేయ దలచుట - మహాత్ముని బాధ్యతను తప్పించుట.

1942 జనవరి 15 : వాలంటీరు శాంతిదళ నిర్మాణము నంగీకరించుట-నెహ్రూ తనకు రాజకీయ వారసుడని మహాత్ముడు వాక్కొనుట-18 వ తేదీన తన హరిజన పత్రికను పునరుద్ధరించుట - 21 వ తేదీన బెనారసులో హిందూ యూనివర్సిటీ విద్యార్థుల సభలో ఉపన్యాసము - ఫిబ్రవరి 18 : చాంగైషేకు దంపతులను కలకత్తాలో కలిసికొనుట.

## 27. క్రిప్సు రాయబారము-ఆగష్టు తీర్మానము-నిర్బంధము

130. 1942 మార్చి 7 : జపాను సేనలకు రంగూను వశమగుట - 11 వ తేదీన చర్చిలు క్రిప్సు రాయబారమునుగూర్చి ప్రకటన - 22 వ తేదీన రాయబారము కరాచీ చేరుట - 27 న మహాత్ముని కలిసికొనుట - మహాత్ముని అభిప్రాయము

పోస్టుడేటెడు చెక్కు - రాయబార వివరములు - ఏప్రిలు 12 వ తేదీన రాయబారము వెడలిపోవుట -

131. ఏప్రిలు 19 వ తేదీన ప్రభుత్వ సూచనల అనంగీకారమును తెలుపుట- 28 వ తేదీన అలహాబాదులో జరిపిన కాంగ్రెసు వర్కింగుకమిటీకి చిత్తు తీర్మానము బంపుట - దానినిగూర్చి స్వేచ్ఛగా వెలిబుచ్చిన అనుమాన భావములను అసందర్భముగా సభికుడు ఒకరు వ్రాసికొని యుంచుట- సర్కారువారు కాంగ్రెసు భవనముపై దండెత్తి ఆ వ్రాత కాగితములను వశము చేసికొనుట - మే నెల 24 : అమెరికను జర్నలిస్టుతో మహాత్ముని సంభాషణ - లూయీ ఫిషరు మహాత్మునితో వారము దినములు గడుపుట - జూలై 6 వ తేదీన వార్ధాలో "క్విట్ ఇండియా" తీర్మానము- 14 వ తేదీన ఆ తీర్మానము బహిరంగపరుపబడుట - ఆగస్టు రెండవ తేదిన కాంగ్రెసు ప్రెసిడెంటు ప్రసంగము ఆగస్టు 5 వ తేదీన బొంబాయిలో కాంగ్రెసు కార్యవర్గ తీర్మానము.

132. 1942 ఆగస్టు 8 వ తేదీ : బొంబాయిలో ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ తీర్మానము - మహాత్ముని ఉపన్యాసము - కాంగ్రెసు నాయకుల అరెస్టు - జైలులో మహాదేవదేశాయి మరణము - 14 వ తేదీన మహాత్ముడు జైలునుండి వైస్రాయి కొకలేఖ - నవంబరు 12 న మహాత్ముని కలిసికొనదలచిన రాజాజీ కోరిక నిరాకరణ.

1943 జనవరి : భారతీయ పత్రికల హారటాళము - ఫిబ్రవరి 10 : మహాత్ముని మూడువారముల ప్రాయోపవేశము - 13 వ తేదీన టాటనుహాము ఆరోపణల ప్రచురణ.

133. ఆ ఫిబ్రవరి 17 వ తేదీన మహాత్ముని శరీరస్థితి హీనమగుట - వైస్రాయి కౌన్సిలు ముగ్గురుసభ్యుల రాజీనామా - 21 వ తేదీన మహాత్ముని జీవితమునుగూర్చి నిరాశ - ఇండియా ప్రభుత్వ విపరీత వైఖరినిగూర్చి ఫిలిప్సు చాహాటు ప్రకటన- వైస్రాయి మొండితనమునకు అసలుకారణము - మహాత్ముని ఆగస్టు 8 వ తేదీ ఉపన్యాసము తెలిసికొనలేక ఆయనపై చర్యతీసికొనుట - ఆంధ్రా సర్క్యులరులోలేని క్రొత్తవిషయమును చొప్పించి అబద్ధప్రచారముచేయుట.

134. 1943 మే నెల 28 : మహాత్ముడు జైలులోనుండి జిన్నాకు బంపిన ఉత్తరమును ప్రభుత్వము ఆయనకు అందజేయకుండుట - జూను 18 వ తేదీన వేవెలు నూతన వైస్రాయిగావచ్చుట.

135. 1943 అక్టోబరు2వ తేదీ మహాత్ముని పుట్టినదిన మహోత్సవ సందర్భమున సుభాసుబోసు బాలకులకు బాంకాకునగరమున మహాత్ముని శ్లాఘించుచు రేడియో ప్రసంగముచేయుట - ఆ అక్టోబరు 21 వ తేదీన సుభాసు సింగపూరులో స్వతంత్ర భారతప్రభుత్వ సంస్థను స్థాపించుట.

## 28. కస్తూరిబాయి అస్తమయము, మహాత్ముని విడుదల జిన్నాతో సంభాషణ

136. 1944 ఫిబ్రవరి 22 : జైలులో కస్తూరిబాయి అస్తమయము - మహాత్మాజీ దీనాననము — ఏప్రిలు 6 వ తేదీన బొంబాయి గవర్నమెంటు

మహాత్ముని ఆరోగ్యమునుగూర్చి ప్రకటన - 28 వ తేదీ మరియొక ప్రకటన - మే నెల 3 తేదీన డాక్టరు విధాన చంద్రరాయి మహాత్ముని పరీక్షించుట - మే నెల 6 వ తేదీన మహాత్ముని బేషరతు విడుదల - 21 వ తేదీన జుహూలో సినిమాను మొదటిసారి వీక్షించుట-31 వ తేదీన మహాత్ముడావరకు జయకరుకు వ్రాసియుండిన ఉత్తరమును ప్రకటించుట - జూను 15 వ తేదీన పూనాలో జల చికిత్స వైద్యశాలలో జేరుట - జూలై 2 వ తేదీన రాజాజీ మహాత్ముని కలిసికొని తన కాంగ్రెసు లీగు సెటిల్‌మెంటు ప్రణాళికనుగూర్చి ముచ్చటించుట - 12 వ తేదీన మహాత్ముడు న్యూస్‌క్రానికలు ఇండియను రిప్రెజెంటేటివునకు ఇచ్చిన సందేశము ప్రకటింపబడుట - 25 వ తేదీన లార్డ్సుసభలో మన్స్టరుప్రభువు ప్రసంగము - 28 వ తేదీన కామన్సు సభలో యెమరీ ఏకరువుపెట్టుట - మహాత్ముని వ్యాఖ్యానము.

137. 1944 మే 18 : మహాత్ముడు జైలునుండి జిన్నాకువ్రాసియుండిన లేఖను బైటబెట్టుట - జూలై 29 : ముస్లిములీగు సమావేశమై జిన్నాకు మహాత్మునితో ప్రసంగించుటకు అనుజ్ఞ ఇచ్చుట - ఆగస్టు 5 : జిన్నా పత్రికా ప్రతినిధులతో ముందుగా ప్రసంగించి 17 వ తేదీన మహాత్మునికి తంతినిచ్చుట - మహాత్ముడు జిన్నాను బొంబాయిలోని ఆయన ఇంటిలోగలిసికొని సంప్రదించుట - ఈ సంగతిని పత్రికలద్వారా తెలిసికొనిన క్రిప్సు గాభరాపడి ఈర్ష్యావేశమున కడుపుబ్బగముతో తబ్బిబ్బగుట - మహాత్ముని జిన్నాతో సంప్రదింపులు విఫలమగుట.

## 29. వేవెలుతో వ్యవహారము

138. మహాత్ముడు పూనాలో లండను డైలీ వర్కరు పత్రికా విలేఖరితో ప్రసంగించుట. సేవాగ్రామములో కాపురమనుచున్న కస్తూరిబాయి కుటీరమును దర్శించి దుఃఖాతిరేకమున స్తబ్ధుడగుట.

139. 1944 ఆగస్టు 18 : మహాత్ముడావరకు వేవెలుతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరములను గవర్నమెంటువారు ప్రకటించుట. వెంటనే మహాత్ముని వ్యాఖ్యానము.

140. ఆ సంవత్సరము అక్టోబరు రెండవ తేదీన మహాత్ముని జన్మదిన సందర్భమున పై దేశములనుండి ధన్యవాద సందేశములను బొందుట. కొలంబోలో మాధవ రావు అనే మహాత్మునిగూర్చి ప్రశంసించుట - నవంబరు 18 : బీహారు కాంగ్రెసు వర్కర్లకు సలహా.

141. 1945 జనవరి మొదటి తేది బుల్లభాయి లియాఖతుల సంయుక్త ప్రణాళిక మార్చి 20 : బొంబాయిలోని పత్రికావిలేఖరితో మహాత్ముని ప్రసంగము. లండనులోని బ్రిటీషు అధికారులు వైస్రాయిని పిలిపించుకొనుట - వేవెలు తిరిగివచ్చి ఒక ప్రకటన చేయుట. కాంగ్రెసు లీగు నాయకులకు ఆహ్వానము - జిన్నా విపరీత వాదము.

142. 1945 జూలై : లండనులో లేబరుపార్టీ విజయము. ఆగస్టు నెలలో అకస్మాత్తుగా జపాను యుద్ధము అంతరించుట. వేవెలు లండనుకుపోయి తిరిగివచ్చి ఒక ప్రకటన చేయుట.

## 30. మహాత్ముని దేశ సంచారము

143. 1945 సెప్టెంబరు 14 ; పూనాలో కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశములో మహాత్ముని ఉపన్యాసము – అక్టోబరు 2 న జరిగిన 77 వ జన్మదినోత్సవము సరికి మహాత్ముడు 13 భాషలలో వ్రాయను, చదువను, చతురతను సంపాదించి యుండెను. డెండూల్కరు వివాహ సందర్భమున ఇచ్చియుండిన సలహాలను ప్రకటించుట – పట్టుబడిన సుభాసు సేనలు ఆర్మీ ఆఫీసరులనుగూర్చి వైస్రాయికి రెండు లేఖలు.

144. 1945 నవంబరు 21 : సేవాగ్రామములోని సమగ్ర గ్రామసేవా విద్యాలయములో ఉపన్యసించుట.

145. ఆ డిసెంబరు మొదటితేదీన కలకత్తాకేగి బెంగాలు గవర్నరుతో ప్రసంగించుట. సోదేపూరు ఆశ్రమములో నాలుగడుగుల నల్లత్రాచు పడగవిప్పి మహాత్ముని కెదురుగా నిలుచుట.

146. డిసెంబరు 22 : ఇండియన్ నేషనలు ఆర్మీలోని సైనికులకు సలహా.

147. డిసెంబరు 26 : బెంగాలు పల్లెగ్రామములనుండి హరిజన ఫండుకు చిన్న చిన్న విరాళాలు – డిసెంబరు 28 న సింధు హైదరాబాదులో జరిగిన ఆల్ ఇండియా విమెన్సు కాన్ఫరెన్సుకు సందేశమంపుట.

148. 1946 జనవరి 5 : కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమును గూర్చి పదునెనిమిది సూచనలు – అస్సాము సంచారము. సుభాసు ప్రస్తావన – దండంలో సెక్యూరిటీ ఖైదీలను కలిసికొనుట.

149. జనవరి 20 : మద్రాసుకుబోవుచు వాల్తేరులో ఆగి రైల్వే గ్రౌండ్సులో ఉపన్యసించుట – మద్రాసు సమీపమున ఒక చిన్న స్టేషనులో దిగుట. బ్రిటిషు పార్లమెంటరీ డెలిగేషనువారితో సంప్రదింపులు.

150. పార్లమెంటరీ డెలిగేషను ఇండియాకు వచ్చుటకు గారణము – వారు ఇండియాలోని పలు ప్రదేశముల సంచారము.

151. మద్రాసులోని దక్షిణ ఇండియా హిందీ ప్రచారసభ జూబిలీ ఉత్సవములో పాల్గొని అనేక ముఖ్య విషయములను గూర్చి ముచ్చటించుట. వైస్రాయి మహాత్మునివద్దకు తన ఆంతరంగిక కార్యదర్శిని పంపుట – మహాత్ముని సలహా – అరుణను శరణతో బలుకరించుట.

152. 1946 ఫిబ్రవరి 17 . పళనికోని రైల్వే కార్మికుల వినతి పత్రమునకు జవాబు – 24 వ తేదీన పూనాలో కాంగ్రెసు లీగు సఖ్యతను గూర్చి ఆగాఖాను, భోపాలం నవాబులతో ముచ్చటలు.

## 31. కాబినెటు మిషను.

153. ఫిబ్రవరి 19 : బ్రిటిషు గవర్నమెంటు ప్రకటన– మార్చి 19 : బ్రిటిషు కాబినెటు మిషను ఇండియాకు బయలుదేరి, 23 వ తేదిన కరాచీలో దిగుట – 30 వ తేదిన మహాత్ముని ఢిల్లీకి పిలిపించుకొనుట.

154 మహాత్ముడు హరిజనవాడలో బసచేయుట - ఏప్రిలు 1 వ తేదీన క్రిప్సు మహాత్ముని దర్శించి, తనవెంట ఇండియా మంత్రి విడిదికి గొనిపోవుట - మహాత్ముడు 'క్విటు ఇండియా' నినాదముయొక్క అంతరార్థమును వివరించుట.

155. ఏప్రిలు 27 : ఇండియామంత్రి కాంగ్రెసు లీగు ప్రసిడెంట్లకు ఒకే మోస్తరు జాబులు వ్రాయుట - మే నెల 5 : మొదలు 8 వరకు సిమ్లాలో సమావేశములు - కాబినెటు మంత్రులు ఢిల్లీనుండి ఆనెల 16 తేదీన భారత రాజ్యాంగ సంస్కరణ ప్రణాళికను తయారు చేసి ప్రకటించుట - కాంగ్రెసు లీగుల వ్యాఖ్యానము.

156. కేరుటేకరు గవర్నమెంటు - జిన్నా బలవంతము - దేశ విభజనకై ప్రత్యక్ష పోరాటమును ఆగస్టు 16 నుండి ఆరంభింపదలచుట.

157. లండనులోని బ్రిటిషు గవర్నమెంటు ఇండియాలోని వైస్రాయికి ఆజ్ఞ - వైస్రాయి జిల్లా మేజస్ట్రీటుద్వారా కాంగ్రెసు ప్రసిడెంటు నెహ్రూకు లేఖ - భీకరకేసరి మెల్లనిపిల్లియగుట.

## 32. తాత్కాలిక ప్రభుత్వ కాలము

158. నెహ్రూ మహాత్ముని సలహాపై జిన్నాను కలిసికొనుట - ఆగష్టు 13 : నెహ్రూ వైస్రాయికి తాత్కాలిక ప్రభుత్వమంత్రుల జాబితానిచ్చుట - సెప్టెంబరు 2 : తాత్కాలిక ప్రభుత్వ స్థాపన.

159. జిన్నాను దువ్వి అతని అల్లరిసాపుటకు బ్రిటిషు ప్రభుత్వము వైస్రాయికి తాఖీదు.

160. అక్టోబరు 2 : జిన్నా వేవెలును కలిసికొనుట - 13 వ తేదీన ముస్లిము లీగు మంత్రులజాబితా - అందులో హిందూ హరిజనుడుండుటను గమనించిన మహాత్ముని అనుమానము - మంత్రివర్గములో కాంగ్రెసు లీగు కలయిక చావుకౌగలింపు వంటిదని మహాత్ముని విచారము.

161. ఢిల్లీలోని మహాత్మునిపై బెంగాలు హిందూయువకులు ప్లాకార్డు స్లోగనులు - బెంగాలు స్త్రీలకు మహాత్ముని సలహా.

162. 1946 నవంబరు మొదటివారము : తాత్కాలిక ప్రభుత్వ ఉపనాయకుడు నెహ్రూ, వైస్రాయి వేవెలు బెంగాలునకేగుట - అచ్చటి ప్రజలకు మహాత్ముని సలహా.

163. అహింసనుగూర్చి మహాత్ముని నిశ్చితాభిప్రాయము - నవంబరు 24 : పోరుబందరునందు మహాత్ముని స్మారకస్థూప నిర్మాణమునకు భూరి విరాళ వాగ్దానము.

164. డిసెంబరు 9 వ తేదీన కంస్టిట్యూయంటు అసెంబ్లీ ప్రథమ సమావేశమును జరుపుటకు వైస్రాయి నిర్ణయించుట. జిన్నా ప్రతికూల్యత - బ్రిటిషు ప్రభుత్వము వైస్రాయికి ఆజ్ఞ — కాంగ్రెసు లీగు ప్రతినిధులు లండనుకు పోయి వచ్చుట.

## 33. మహాత్ముని 1947 కార్యక్రమము

165. 1947 జనవరి : మహాత్ముడు శిరంపూరాడ పరిసర ప్రాంతములలో పర్యటించుట - నవకాళీలో కాలినడక ప్రయాణము - ఫిబ్రవరి 26 న ప్రకృతిశాస్త్రము లోని "సెంట్రిప్యూగలు, సెంట్రిపీటలు" శక్తులనుగూర్చి వివరీకరించుట - మార్చి 5 న పాట్నాకుబోయి కాంగ్రెసు బాధ్యతనుగూర్చి బోధించుట - నీతికిని రాజకీయమునకును మధ్య గీతగీయుటకు వీలులేదనుట.

166. కంస్టిట్యూయంటు యసెంబ్లీ సమావేశములకు లీగు ఎవ్వరును హాజరుకాకుండుట - లీగు తీర్మానము, మహాత్ముని వ్యాఖ్యానము - వేవెలు వెలవెల - ఫిబ్రవరి 20 : బ్రిటిషు ప్రభుత్వ ప్రకటన - జిన్నా సంతసము - తన గోతినితానే త్రవ్వుకొనుట - మార్చి 28 : మహాత్ముని ప్రకటన.

167. ఆ మార్చి నెల 7 న ఆంధ్రాప్రొవిన్షలు కాంగ్రెసు డెప్యుటేషను - 18 న పస్నా గ్రామములో ఉపన్యాసము - 22 న ఓకారి గ్రామములో ఆవరకు నూతన వైస్రాయి మౌంటుబాటును ప్రకటించియుండిన సందేశమును గూర్చి ముచ్చటించుట.

168. మార్చి 31 న ఢిల్లీకిబోయి నూతన వైస్రాయిని దర్శించుట - ఏప్రిలు 1 వ తేదీన 'ఇంటరు ఏషియాటిక్ కాన్ఫరెన్సు' లో ఉపన్యసించుట - 4 వ తేదీన మౌంటుబాటును దంపతులమధ్య నిలుచుకొనియున్న ఫోటో ప్రచురణ - 2 వ తేదీన మాట్లాడుచు స్వాతంత్ర్య ఇండియను రిపబ్లికు ఏర్పడినపుడు జిన్నా ప్రథమ ప్రసిడెంటుగా నుండవలయునని కోరుట - 18 వ తేదీన జిన్నా మహాత్మునితో కలిసి భారత ప్రజలకు జాయింటు అప్పీలును ప్రకటించుట- మహాత్ముడు బహిరంగ ప్రార్థన సభలలో కొరానునుండి చదివిన భాగములు యజుర్వేద మంత్రముల అర్థమే నని తెలియబరచుట - భావమయొక్క ఉద్దేశ్యమును బోధపరచుట.

169. 1947 మే నెల 5 వ తేది : పత్రికా ప్రతినిధుల సభలో ప్రసంగించుట - మరునాడు జిన్నాతో దీర్ఘచర్చలు - జవహర్లాలు పటేలు వైస్రాయి స హాపై దేశవిభజనకు ఒప్పుకొనవలసివచ్చుట.

170. ఆ మే నెల 8 న మహాత్ముడు వైస్రాయికి లేఖ-18 వ తేదీన వైస్రాయి లండనుకేగుట.

171. ఆ నెల 26 వ తేదీన "భారతస్వాతంత్ర్యము"ను గూర్చి మహాత్ముని ప్రస్తావన.

172. ఆ మే నెల 30 : వైస్రాయి తిరిగివచ్చి దేశనాయకులతో సంప్రదించుట - జూను 3 : వైస్రాయి రేడియో ప్రకటన.

173. జూను13: స్వదేశ సంస్థానములనుగూర్చి మహాత్ముని ప్రసంగము-గత్యంతరములేని దేశవిభజన తప్పు, భగవన్నిర్ణయమునుబట్టి, దశరథునితప్పువలన శ్రీరాముడు అడవికేగవలసినను తుదకు రావణ సంహారమువంటి ఒప్పుగా పరిణమించినట్లు, ఎప్పుడైనను ఒప్పుగా పరిణమించవచ్చునను తన నమ్మకమును వెలిబుచ్చుట - రెండు డొమినియనులకును మొదట ఒకే గవర్నరుజనరలు ఉండవలెనని జిన్నా మొట్టమొదట

ఒప్పుకొనినను, చిట్టచివరకు వెనుదీసి పాకిస్థాను డొమినియనుకు తానే గవర్నరు జనరలుగానుండగోరుట - జులై 14 వ తేదీన బ్రిటిషు పార్లమెంటులో "ఇండియన్ ఇండిపెండెన్సు" బిల్లుతేబడి 18 వ తేదీన చట్టమగుట - ఆ చట్టముననుసరించియే, 1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశమునకు బ్రిటిషు అధికార సూర్యుడస్తమించి, ప్రజాస్వాతంత్ర్య కాంతిచంద్రోదయము చేకూరగలిగెను.

## 34. భారత స్వాతంత్ర్యానంతరము

**174. 1947** జూలై **28 :** కాంగ్రెసు భవిష్యత్తునుగూర్చి మహాత్ముని సలహాల కాంగ్రెసు కమిటీలు సర్వోదయ సంస్థలుగా వికసించి, సర్వమానవుల సర్వతోముఖాభివృద్ధిపై, సదా ఇంకను ఎక్కువగా కృషిచేయవలెననుట - పాశ్చాత్య ప్రజాస్వామ్యపద్ధతిని నిరసించుట - నిజమైన డెమాక్రసీకే సర్వోదయమను మారుపేర ఉద్ఘాటించుట - మహాత్ముని అభిప్రాయమును సరిగా అర్థముచేసికొనని కొందరు కాంగ్రెసీయుల వాదమును నెహ్రూజీ త్రోసిపుచ్చుట.

**175.** జూలై **29 :** మహాత్ముడు కాశ్మీరు స్థితిగతులను తెలిసికొనుటకై ముందుగా వైస్రాయితో ముచ్చటించి, అచ్చటకు కరిగి, తిరిగి నవకాళికి పోదలచి, కలకత్తాలో దిగుట - ఆగస్టు 18 న అక్కడి మహమ్మదీయ నాయకులలో మార్పు - 30 వ తేదీ చర్చిలు కుమారుడు మహాత్ముని దర్శించి నేలపై కూర్చొనుట.

**176. 1947** సెప్టెంబరు **7** న ఢిల్లీకిపోయి బిర్లా భవనములో బసచేయుట - నవంబరు 13 న కాంగ్రెసు కార్యవర్గ సమావేశములో ముచ్చటించుచు, ఏ ప్రభుత్వము ప్రజల ప్రత్యేకవిషయములలో ఎంత తక్కువగా జోక్యము కలిగించుకొనునో ఆ ప్రభుత్వమే శ్రేష్ఠమైనదను న్యాయమును కాంగ్రెసు ప్రభుత్వమునకు జ్ఞాపకము తెచ్చెను - డిసెంబరు మొదటి రోజులలో బర్మాప్రధాని మహాత్మునికి ఆశపు వ్యవసాయ కూలీలు ధరించు అకటోపీని కానుకగా సమర్పించుట.

**177. 1948** జనవరి **4:** ప్రార్థనానంతర ప్రసంగములో కాశ్మీరు ప్రస్తావన - పాకిస్థానుపై ఇండియను కాంగ్రెసు గవర్నమెంటు, యునైటెడ్ నేషన్సు ఆర్గానిజేషన్సు ఫిర్యాదుచేయుటను సమర్థించుట - 8 వ తేదీ ప్రసంగములో విద్య అర్థించి తనవంత రాము వచ్చిన విద్యార్థుల సమ్మెలను విని చాల దుఃఖించెను - హిందూ కాందిశీకు ప్రతీకార చర్యలకు మనోవేదన పొంది కాల నిర్ణయమునకని యుపవాస మొనరింప నుద్యుక్తుడగుట - బిర్లా భవనముఎదుట కాందిశీకుల అల్లరి - నెహ్రూజీ సాహసము.

**178.** ఢిల్లీలో శాంతికమిటీ ఏర్పడుట - నెహ్రూ ఉపన్యాసము.

**179.** మహాత్ముడు సప్తవరములను కోరుట - కాంగ్రెసు ప్రెసిడెంటు రాజేంద్రప్రసాదు సలహాపై "భగవదుద్దేశ్యము నెరవేరునుగాక" యని సమాధానపడి ఉపవాస దీక్షను విరమించుట.

## 35. మహాత్ముని చివరి 10 రోజులు

180. 1948 జనవరి 20 : బిర్లాభవన ఆవరణలో మహాత్మునికి 10 గజముల దూరములో బాంబు పేలుట - ప్రధాని నెహ్రూ హడావిడిగా పరుగెత్తుకొనివచ్చి మహాత్ముని జూచుట - మహాత్ముని నిశ్చితాభిప్రాయము.

181. హిందూ మహాసభ కార్యదర్శి ప్రకటన - మహాత్ముని హిందూమత దృష్టికిని, హిందూమహాసభవారి హిందూమత దృష్టికిని తారతమ్యములు.

182. జనవరి 21 న మహాత్ముడు, ఆ బాంబువేసినవానికి జ్ఞానతేజస్సును గలిగించుగాకయని ప్రార్థించవలయునని ఉద్బోధ - బాంబువేసిన హిందూ కాందిశీకుని గురించి ప్రసంగము.

183. జనవరి 22 : కాందిశీకుల సమస్యనుగూర్చి ముచ్చటించుట - 23 వ తేదీన సుభాసు జననదిన సందర్భమున ఆయనయెడల తనకుగల విశేష గౌరవమును వెల్లడించుట.

184. జనవరి 24: ఉదయము కర్నాటక నాయకులతో చర్చ-మధ్యాహ్నము ఆంధ్రరాష్ట్ర నిర్మాణముగూర్చి పట్టాభికి సలహా - ఆసాయంత్రము ప్రార్థనానంతర ఉపన్యాసములో బౌండరీ కమీషనును గురించి పట్టాభికిచ్చిన సలహాలో మార్పు - 28 న ప్రకాశంగారు మహాత్ముని సలహాను పొందుట.

185. 1948 జనవరి 26 : భారత స్వాతంత్ర్య దీక్షాదినము జరుపవలసిన నూతన విధానమునుగూర్చి ముచ్చటించుట - 27 న హిందూ కాందిశీకుల చర్యలను విమర్శించుట.

186. మహాత్ముని దైనందిన బహిరంగ ప్రార్థనసభలలో జరుపబడు విధానము ఆ జనవరి 27 విన్సెంటుషీయను దొరగారితో తత్వవిషయ సంభాషణ - 29 న ఆ దొరగారు నెహ్రూతో గలసి అమృతసరమునకు బోయి 30 వ తేదీకి తిరిగివత్తునని సెలవు గైకొనుట.

187. 1948 జనవరి 30 : మహాత్ముడు ఉదయాత్పూర్వమే నిదురలేచి తన కావరకు వచ్చియుండిన లేఖలకన్నింటికిని జవాబులు వ్రాయుట-మరునాడు యున్నో లేదో యని అనుమానముగా పలుకుట - ఆ సాయంతనమున మామూలుకన్న 15 నిమిషములు ఆలస్యముగా బిర్లాభవన ఆవరణములోని ప్రార్థనా స్థలమునకు, మామూలు త్రోవనుగాక వేరొక త్రోవనబోయి ఆలస్యమునకు క్షమించవలయునని సభికులకు నమస్కరించుచు సభావేదిక నెక్కబోవుచుండగా నొకసభికుడు ముందుకువచ్చి ఆయనకు నమస్కరించు నెపమున సమీపించి పిస్తోలుతో కొట్టుట - ఆ దృశ్యవర్ణన - ఆ సభలో దూరముననుండిన షీయనుదొరగారి యనుభవము.

188. పిస్తోలుపేల్చిన యాతడు, అక్కడకు క్రొత్తగావచ్చిన అమెరికను యువకునిచే బట్టుకొనబడుట - ఆ హంతకుని పుట్టుపూర్వోత్తరములు - ధీరుడైన జవహరు మహాత్ముని కళేబరముపైనున్న ఉత్తరీయములో తలదూర్చి వెక్కివెక్కి యేడ్చుట - మహాత్ముని శవమును యమునా తీరమున రాజఘాటునందు అగ్నిదేవునికి

ఆహుతిచేయుట - ఫిబ్రవరి 12 న ఆయన అస్థికలు త్రివేణి సంగమమున, జాహ్నవీ నదీతోయములలో విలీనము చేయబడుట.

## 36. మహాత్ముని నూతన సందేశములు

189. మహాత్ముని ఉపదేశములు నూతనములుగాక అనేక వేల సంవత్సరముల క్రిందట ఆర్యఋషులు బోధించిన సంసార ధర్మములను జ్ఞాపకము పరచుటయే.

190. శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీ బుద్ధ అవతారములు మానవపరిణామ సౌధపు మెట్లను దగినట్లు సంచరించినట్లే శ్రీ గాంధి అవతారము తన పై మెట్టును అవసరమైన సంచరణను స్వయముగా జేసి మానవుల జీవిత నూతన లక్ష్యమార్గమును జూపుటయే.

191. హిరణ్యకశిపునికి తెలిసిన రెండు మార్గములకన్న వేరొక మూడవ మార్గమున్నదని నరసింహావతారము తెలిపినట్లే, మనకింతవరకు తెలిసి ఉపయోగింపబడిన "అహింసాపూర్వక అర్జీలు, హింసాపూర్వక తెగువ" అను రెండు మార్గములకన్న మిన్నయైన అహింసాపూర్వక తెగువ అను మూడవమార్గము కనిపెట్టి, తానాచరించి, సఫలత నొంది, మనకు లక్ష్యముగా బోధించిన అవతారమే గాంధి అవతారము.

192. ఆర్యఋషుల వేదములను బాగుగా పరిశీలించిన ప్రొఫెసరు మాక్సుముల్లరుయొక్క హిందూమత నిర్వచనముతో మహాత్ముడేకీభవించుట - కమ్యూనిస్టు, సోషలిస్టు సిద్ధాంతముల విమర్శ.

193. శాంతములేక సౌఖ్యమురాదను భక్తత్యాగరాజు బోధ - మహాత్ముని ధర్మకర్తృత్వ సిద్ధాంతము.

194. మహాత్ముని నూతన స్వతంత్ర భారతమునకు రెండు నూతన దృక్పథములు.

195. హింసాయుతమైన యుద్ధమునకుబదులుగా అహింసాయుతమైన అసహాయోద్యమము.

196. పాశ్చాత్యదేశములలోని పాత ప్రజాప్రభుత్వ సిద్ధాంతమునకును, భారతదేశములో నూతన ప్రభుత్వ సిద్ధాంతమునకును గల భేదము.

197. మహాత్ముని నూతన భారత ప్రభుత్వమునకు, పదునెనిమిది అంగములు గల నిర్మాణ కార్యక్రమము.

198. కాంగ్రెసు సర్వోదయ సమాజముగా అనగా లోకసేవక సంఘముగా పరిణమించవలయుననుట.

199. శ్రీ గాంధి అవతార ఆదేశములు మరియొక అవతారము వచ్చువరకు అవశ్య అనుసరణీయములు.

---

సర్వోదయప్రెస్, పటమటలంక.

# అభిప్రాయములు

## 1. DR. BHOGARAJU PATTABHI SITARAMAYYA, Ex-Governor of Madhya Pradesh.

"గాంధీ మహాత్ముని 'సమగ్రచరిత్ర' వాస్తవముగా సంపూర్ణ చరిత్రయని చెప్పవచ్చును. ఇంతటి సమగ్ర, సంపూర్ణ చరిత్రను సంక్షిప్తముగ 200 పుటలలో వ్రాయగలిగియుండుట ఎంతయు సంస్తవనీయము. కాంగ్రెసుతో మహాత్ముని సంబంధము వున్నంతవరకు నేను కూడ ఆయా సందర్భములనెల్ల నెరిగియున్న వాడనయ్యు, ఈ పుస్తకములో నిమడ్చబడ్డ వివరములు చూడగా నాకెంతో ఆశ్చర్యము కలిగినది. ఏలయన - వివరములు - ఎచ్చటను, తు-చ-తప్పకుండా భ్రమ ప్రమాద దోషములు లేకుండా తెలుపబడ్డవి. అందుచేత నాకు కలిగిన ఒకటి రెండు సందేహములు తీర్చుకొనుటకు ఆయా సందర్భములనుగూర్చి వ్రాయబడ్డ వివరములు చదువగా నట్టి సందేహ నివారణ పూర్తిగా లభించినది. కావున గ్రంథకర్తకు నా యభివందనములు ఇందుమూలముగా దెలుపుచూ, ఈ పుస్తకము కాలేజీ క్లాసులలో పఠనీయ గ్రంథముగ విశ్వవిద్యాలయములు నియమించెదరుగాక యని కోరుచున్నాను."

## కేరళ ప్రదేశ గవర్నరు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు:

"శ్రీ వెలిదండ శ్రీనివాసరావుగారు తమ చిరకాల సాహిత్య సేవమూలముగ ఆంధ్రలోకమునకు సుపరిచితులు. వారి 'భారత స్వరాజ్య సమరచరిత్ర' 1949 లో వెలువడి, యంతకు పూర్వమునుండియే, వారు ప్రచురించుచుండిన, గాంధీ సాహిత్యమునకు అనుబంధమై, ఆంధ్రావళి కామోదమును గూర్చినది. ఈ 'గాంధీ మహాత్ముని సమగ్రచరిత్ర' వారి గాంధీభక్తిద్యోతకమే గాక, బహు గ్రంథావలోకన ఫలితము. యుగపురుషుడౌ గాంధీగారి విపుల జీవితమును సమగ్రముగా 200 పేజీలలో గ్రంథిక మొనర్చుట మిగుల క్లిష్టమైన కార్యము. ఈ ప్రయత్నమునందు వారు సఫలులైనందుకు హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను."

## విజయవాడ రేడియోకేంద్ర గ్రంథ సమీక్షకుని విమర్శ:

"గాంధీజీ జననమొందినది మొదలు నిర్యాణమువరకు ప్రతిఘట్టమూ, అతి యోక్తులులేకుండా వాస్తవదృష్టితో వర్ణింపబడినది. ఆయన అనుష్ఠించిన సాధన వ్యక్తిగతంగా ప్రారంభమై, సమాజగతంగా పరిణమించి, లోకసంగ్రహానికి సేతువు యతారకోపాయముగా గ్రహింపబడుచున్నది. ఈ గ్రంథములో గాంధీజీ జీవితా కిన్నీ, భారత స్వాతంత్ర్య సిద్ధికిన్నీ, సంబంధించిన సర్వవిషయం సమగ్రంగాను విశ్వసనీయంగాను పాఠకులకు అందించిన గ్రంథకర్త చరితార్థులని ఘంటాపథంగా చెప్పవచ్చు."

# Author's other Books

1912 1. "రామమోహన విద్యాసాగర చరిత్రకోపన్యాసములు"- శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారికి అంకితము యివ్వబడినది.

1913 2. బ్రాహ్మమతోద్దేశము (రాజమండ్రి మానవసేవా గ్రంథమాలచే ప్రచురింపబడినది.)

1921 3. మహాత్ముని ఆరోగ్య మార్గము - మహాత్ముని Guide to Health అను ఆంగ్లేయ గ్రంథమునకు ఆంధ్రానువాదము, (గుడివాడ-గూడూరి రామచంద్రరావుగారిచే బ్రకటితము)

1949 4. భారత స్వరాజ్య సమర చరిత్ర-అనుబంధము, మహాత్ముడు నూతన దృక్పథ బోధకుడు (గాంధీ మహాత్ముని పవిత్రాత్మకు భక్తిపూర్వకముగా నంకిత మొనర్పబడినది.) విజయవాడ రేడియోవారి గ్రంథ విమర్శకునిచేతను, ప్రముఖ పత్రికలచేతను మిగుల శ్లాఘింపబడినది. మద్రాసు టెక్స్టు బుక్కు కమిటీవారిచే అప్రూవు కాబడినది.

1951 5. హిందూ ధర్మము - గాంధీజీ.

1951 6. భారత రాజ్యాంగము-స్వదేశ సంస్థానములు. (5,6. లింగమూర్తి గ్రంథమాల, అనకాపల్లివారిచే ప్రచురితము).

1952 7. మహాత్ముని నూతన స్వతంత్ర భారత లక్ష్యములు — ఆంధ్ర రాష్ట్రోద్యమము.

1952 8. భగవద్గీతోపదేశములు. (తిరుపతి శ్రీ వెంకటేశ్వర ఓరియంటలు ఇన్స్టిట్యూటు జర్నలులో ప్రచురించబడినది.)

1954 9. శ్రీ నెహ్రూ (షష్టిపూర్తి) చరిత్ర-భారత ఉప రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారికి అంకితమీయబడినది.

1957 10. మహాత్ముని స్వతంత్ర భారత సమస్యల నూతన దృక్పథములు - చంద్ర సూర్య సంభాషణ - "ధర్మజ్యోతి" నుండి పునర్ముద్రితము.

1958 11. Gandhiji and the congress. One hundred statements from 1919 to 1948.

1958 12. Land Marks in the Inner History of the Andhra Medical College. Hard struggle for recognition. An amazing Revelation.

చెను. ఈలోపున బీహారుగవర్నరు నీలిమందురైతుల ఇడుమలను విచారించుటకై ఏర్పరచిన విచారణ సంఘములో గాంధీజీనికూడ ఒక మెంబరుగాజేర్చియుండుటచే, ఆయన అక్కడికేగి, తనపనిని నిర్వర్తించి అక్టోబరు 3వ తేదీన ఆసంఘపు రిపోర్టును గవర్నరున కందజేసెను. ఆరిపోర్టననుసరించి నవంబరు నెలలో ప్రభుత్వచట్టమొకటి చేయబడుటచే ఆరైతుల ఇక్కట్టులు చాలవరకు తొలగిపోయెను.

50. ఆ 1917 నవంబరు 3 వ తేదీన మహాత్ముడు తిరిగి గుజరాతున కరిగి అచట జరిగిన మొదటి రాజకీయ కాన్ఫరెన్సున కధ్యక్షత వహించెను. తన అధ్యక్షోపన్యాసములో భారతదేశముయొక్క రాజకీయ ఆదర్శము, పశ్చిమదేశముల రాజకీయ ఆదర్శముకన్న మిగుల భిన్నమైనదని విన్నవించెను. ఆ పశ్చిమదేశముల ఆదర్శము 'స్వేచ్ఛ' అయి యుండగా భారతదేశముయొక్క ఆదర్శము 'స్వాతంత్ర్యము' అయి యున్నదని దెలియబరచెను. 'స్వేచ్ఛ' పదములోని 'స్వ' 'అహము' యొక్క ఇచ్ఛతోగూడిన ప్రకృతిసంబంధమైనదనియు, స్వాతంత్ర్యపదములోని 'స్వ' అందరి యందును వ్యాపించిన ఏకైక ఆత్మస్వభావ సంబంధమైనదనియు దేటబరచెను. స్వాతంత్ర్యములో ఇతరులతో సామరస్యముండును; స్వేచ్ఛలో అట్టిదుండదు. మరియు మనముకోరు 'స్వరాజ్యము' యొక్క అర్థము 'స్వార్థముయొక్క రాజ్యము' కాక 'స్వార్థముపైన' రాజ్యము అని బోధించెను. మహాత్ముడాతరువాత డిశెంబరు నెలలో కలకత్తాలో కాంగ్రెసు మహాసభతో పాటు జరిగిన 'సోషలు సర్వీసులీగు' సమావేశమునకు అధ్యక్షుడై సాంఘిక సేవయొక్క యావశ్యకతను గూర్చి చక్కని యుపన్యాస మిచ్చెను. మరు సంవత్సరము అనగా 1918 ఫిబ్రవరి నెలలో అహమ్మదాబాదులోని మిల్లుయజమానులకును అందలి కూలీలకును మధ్య ఏర్పడిన జీతపుతగాదాను బరిష్కరించుటకై యచటి కేగెను. ఆఫిబ్రవరి 22 వ తేదీన ఆ వివాదవిచారణకై మిల్లు యజమానుల అంగీకారముతో ఆర్బిట్రేషను కమిటీ నొకదానిని నెలకొల్పెను. ఆకమిటీ కూడు లోపలనే ఆమిల్లు యజమానులు అకస్మాత్తుగా, కొలది రోజులు 'లాకవుటు' ను డిక్లేరుచేసిరి. కావున గత్యంతరము లేక మహాత్ముడా కూలీలకు సమ్మె చేయవచ్చునని, సలహానిచ్చెను అటుల సమ్మె నారంభించిన కొలది రోజులకే వారిలో కొందరు మిల్లుపనిలో జేరిపోవుటచే ఆసమ్మె సన్నగిల్లెను. అయినను వారందరు అసంతృప్తితోడనే యుండిరి. అందుపై మహాత్ముడు వారు తిరిగి పట్టుబట్టి తమ తగాదాను ఆ ఆర్బిట్రేషను కమిటీ పరిష్కరించువరకు సమ్మెను సాగించవలెనని చెప్పి వారికి తన సానుభూతిని ప్రదర్శించుటకై అంతవరకు తన ఆహారమును తగ్గించుకొనుటకు దీక్షబూనెను. ఆసమ్మెను వారు తిరుగ నారంభించిన కొన్ని రోజు